Telugu Classics - Popular Edition Series.



# ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము

గణపవరపు వెంకటకవి
ప్రణీతము

సంపాదకుడు :
వేదము వేంకటరాయశాస్త్రి, ఎమ్.ఏ.




ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాదు, హైదరాబాదు-500004.

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ మాజీమంత్రివర్యులు శ్రీ యం. ఆర్. అప్పారావుగారు చేసిన సూచన ననుసరించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ తెలుగు భాషలోని ప్రాచీనసాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటింపవలెనని నిశ్చయించినది. తెలుగుభాషలోని పూర్వగ్రంథసముదాయము యీనాడు పాఠకునకు సక్రమముగా సరసమైన ధరకు లభ్యమగుటలేదు. ఈలోటును తీర్చి ప్రాచీన గ్రంథసంచయమును విడివిడిగా ప్రకటించుటకు సాహిత్యఅకాడమీ ఒక ప్రణాళిక సిద్ధము చేసినది ఈ ప్రణాళిక ప్రకారము యీ కార్యక్రమము మూడు తరగతులుగా విభజించనైనది. మొదటిది ప్రాచీన ప్రబంధాల ప్రకటన; రెండవది మహాభారతము ప్రచురణ; మూడవది హరివంశము, భాస్కరరామాయణము, బసవపురాణము, భోజరాజీయములను సంగ్రహించి ప్రకటించుట. పై ప్రణాళిక ప్రకారము ప్రచురించుబడు ప్రతిగ్రంథములో గ్రంథకర్తను గూర్చి, గ్రంథ ప్రాశస్త్యమును గూర్చి వివరించు సుమారు 40 పేజీల పీఠికను చేర్చవలెనని నిశ్చయించనైనది.

ఈవరుసలో ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసమును పరిష్కరించి పీఠిక వెలయించి మాకందజేసిన ప్రసిద్ధ విద్వాంసులు, పరిశోధక పండితులైన వేదం వేంకటరాయశాస్త్రిగారికి అకాడమీ పక్షాన అనేక ధన్యవాదాలు.

పైన పేర్కొనిన గ్రంథసంపుటాల వ్రాతప్రతులను సిద్ధముచేసి ముద్రించుటకు అవసరమైన డబ్బును పూర్తిగా అకాడమీకి యిచ్చుటకు కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు, వాగ్దానము గావించి అందులో చాలామట్టుకు డబ్బును విడుదల కూడ చేసినవి. అందుకు అకాడమీ పక్షాన కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలకు ధన్యవాదాలు.

హైదరాబాదు
1. 1. 1977

**దేవులపల్లి రామానుజరావు**
కార్యదర్శి

# ఉపోద్ఘాతము

ఆంధ్ర వాఙ్మయపరిణామమును బట్టి విమర్శకులు దాక్షిణాత్యాంధ్ర వాఙ్మయకాలమును క్షీణయుగ మనిరి గాని వాస్తవముగా మధుర తంజావూరు పుదుక్కోట మొదలైన ప్రదేశములలో తెలుగు పలుపలు విధముల వర్ధిల్లినది. ఆంధ్రభాషావధూటికి అలంకారప్రాయములైన అమూల్యాభరణములవంటి ప్రబంధరాజములను ప్రసాదించినది. అట్టి మహాకావ్యములలో నీ ప్రబంధరాజ వేంకటేశ్వరవిజయ విలాసమొకటి. భాషావధూటికి వట్టి అలంకారప్రాయము మాత్రమేగాదు శబ్దాలంకార అర్థాలంకార వాఙ్మయమునకు ఆదర్శప్రాయమై శిఖరమును తాకినది. చతుర్విధకవితలను గుఱించి ఎందఱో చెప్పియున్నారు. చేసినవారు చాల తక్కువ. వారి రచనలన్నియు మనకు దక్కనులేదు కాని ఇతఁడు చేసినంత గ్రంథము మఱియొకటి మనకు లభింపలేదు. చిత్రకవిత్వములో ఇంతటి కావ్యముగాని దీనికి ఇంచుమించు దగ్గరదిగానో రెండవదిగానో చెప్ప దగిన కావ్యము గాని లేదు. తమ తమ కావ్యములలో ఎక్కడనో చిత్రబంధ కవిత్వములను రుచి చూపినవారున్నారుగాని ఈ విధముగా ఆంధ్రభాషలోనే ఆలంకారికులు చెప్పిన లక్షణములు కన్నిటికిని లక్ష్యసాగరముగా నొక కావ్య మును వ్రాసినవాడు ఇంకొకఁడు లేఁడు.

ఈ యపూర్వకావ్యమును నేటికి 88 సంవత్సరముల క్రింద నెల్లూరి శ్రీపూండ్లరామకృష్ణయ్యగారు సంపాదించి ఐదాఱు ప్రతులు తెప్పించి పరి శోధించి చక్కని పీఠికతో ప్రకటించినారు. ఆ ప్రతులు ఇప్పుడు దొరకవు సరిగదా అక్కడక్కడ మిగిలియుండు ఒకటిరెండు ప్రతులుకూడా తాకిన పొడి పొడియై పోవు స్థితిలో నున్నందున ఇప్పుడు నా కోరికను మన్నించి ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారు దీని పునర్ముద్రణమునకు ఉద్యుక్తులగుటయేగాక ఆ సంపాదకకార్యమును కూడ నాకే అప్పగించినందున వారికి కృతజ్ఞుఁడను. ప్రౌఢమును అలంకారభూయిష్ఠమును అపూర్వపదప్రయోగభూయిష్ఠమునైన యీ ప్రబంధమునకు చక్కని వ్యాఖ్యయు చిత్రబంధాదులకు కావలసిన చిత్ర

పటములు అత్యంతావశ్యకములేగాని ఆ పని వట్టి ధనమాత్రసాధ్యముకాదు. పాండిత్యమును కాలమును పరిశ్రమయు ఆవశ్యకములు. కాఁబట్టి ప్రస్తుతము అకాడమీవారు తమ సార్వజనీన ప్రచురణములలో (Popular edition series) నొకటిగా ఈ గ్రంథము యొక్క ప్రతులు లభ్యము లగునట్లుగా దీనిని వెలువరించుట ముదావహము. ఇందువలన ఒక కొఱత తీరి సవ్యాఖ్యాముద్రణ భాగ్యము గ్రంథమునకు మున్ముందు కలుగునుగాక.

## 1. కవియొక్కకాలము

ఈకవియొక్క కాలము ఇప్పుడు చక్కఁగా క్రీ. శ. 1620 నుండి 1660 నడుమనని తేలియున్నది. ఇదివరలో చరిత్రకారులు పరి పరి విధముల నిర్ణయించినారు. (వివరములకు చూ. నేలటూరి వెంకటరమణయ్యగారి దాక్షిణాత్యాంధ్ర సాహిత్యము ద్వితీయ ముద్రణము పుట 54-61). (1) దీనిని మొదట ప్రకటించిన శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు ఇతనిని శ్రీకృష్ణరాయలకును అప్పకవి ఇతనిని ఉదాహరింపనందున అప్పకవికిని (1650) యీవలివాడని తలఁచిరి. (2) కందుకూరి వీరేశలింగముపంతులుగారు పదునేడవ శతాబ్దమునకు లోపలివాఁడు కాఁడనియు మఱికొన్ని యుదాహరణములచేత 17వ శతాబ్దమునకును పదునెనిమిదవ శతాబ్దమునకును కొనిపోయిరి. (3) క్రొత్తపల్లి సూర్యారావుగారు 18వ, శతాబ్ద మనియు కూచిమంచి తిమ్మకవికి సమకాలికుఁడనియు 'కర్ణాటతుండీర చోళపాండ్యమండల ప్రముఖాఖిల...' ఇత్యాదికములచే నిర్ణయించినారు. వీనినెల్ల విమర్శించి శ్రీనేలటూరి వెంకటరమణయ్యగారు చారిత్రకాధారములచేత ఈకవి కర్ణాటతుండీరమండలేశ్వరులచేత సత్కారము పొందినది క్రీ. శ. 1643-9 లకు ముందై యుండవలెననియు అందులకు సాక్ష్యము ఇతని చండవిద్యాపతిదండకరాజమనియు తేల్చినారు. ఈ దండకము క్రీ. శ. 1673లో తంజాపురిని పాలించుచుండిన ముద్దళగిరిమీఁద చెప్పఁబడినది. తుండీర ప్రభువులలో వరదప్పనాయకుఁడు విద్యాప్రియుఁడు విద్యాపోషకుఁడు. కర్ణాటక రాజులలో పెదవేంకటపతిరాయలు 1630-1642 కవిజనాశ్రయుఁడు. "కావున గణపవరపు వేంకటకవిని సమ్మానించిన కర్ణాటక తుండీరప్రభువులు పెదవేంకటపతి దేవమహారాయలును చెంజివరదప్పనాయకుఁడునై యుందురు. అగునేని యితఁడు క్రీ. శ. 1620 మొదలు 1660వఱకును వర్ధిల్లెనని చెప్పవచ్చును."

అని నిర్ణయించినారు. ఇందులకు ప్రబలకారణము కర్ణాటతుండీర మండలములలో క్రీ. శ. 1648–9నాటికి హిందూరాజ్యములు పోయి మహమ్మదీయ రాజ్యములు వచ్చినవి. ఈ యభిప్రాయమునే పూర్తిగా వెలిబుచ్చుచు శ్రీఆరుద్ర గారు తమ సమగ్రాంధ్ర సాహిత్యములో(xiభా.పు165)" క్రీ.శ. 1659నుండి1682 దాకా మధురరాజ్యాన్ని చొక్కనాథనాయకుఁడు పాలించేవాఁడు. అతనికి ముద్దు అళగిరి అనే సవతి తమ్ముడు ఉండేవాఁడు......వెంకటకవిని పోషించాడు". అని వ్రాసినారు. కాని వెంకటరమణయ్యగారు వ్రాసినట్లు క్రీ. శ. 1673 నాటికి ముద్దుఅళగిరి, చోళమండలము నాక్రమించుకొన్నందునను వెంకటకవిని చోళ రాజులును పోషించి యుండినందున 1673 నాటికి ముందేయై యుండవలెను. ఆరుద్రగారి యభిప్రాయము ఇదియే, 'ఈ విద్యావతీ దండకం అంతకుముందు వ్రాసినదే అవుతుంది'–అని (చూ సమగ్రాం. xi పు 167).

## 2. కవియొక్క ఊరు_వంశము

గణపవరపు వేంకటకవియొక్క తండ్రి అప్పయార్యుఁడు. తల్లి మంగమ్మ; నందవరీకశాఖకు చెందిన యమాత్యుఁడు. అలసాని పెద్దన తాళ్ల పాకవారు మున్నగువారందఱు నందవరీకులే పెద్దన తండ్రి చొక్కయామాత్యుఁడు నియోగులలో ఆఱువేల ప్రాజ్ఞాటి వారేగాక నందవరీకులు నుండిరి కవి వసిష్ఠ గోత్రుఁడు. ఆశ్వలాయన సూత్రుఁడు. ఇతని యూరేదో తెలియదు. గణపవరము ఒకప్పుడు ఊరుగానుండి ఇంటిపేరుగా మాఱియుండును. అవతారిక 41వ పద్యములో 'కాలెపల్లీ ముఖ్య గణపవరగ్రామశేఖర' అని చెప్పుకొన్నాడు. శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు ఇట్లు వ్రాసియున్నారు 'కాలెపల్లీమజరా గ్రామమగు గణపవర మితని స్వగ్రామమని యేర్పడుచున్నది ఈ గణపవర మెచ్చటనున్న దని విచారింపఁగా నీమండలములో (నెల్లూరు) నుదయగిరి తాలూకాలో నున్నట్లును నచ్చటఁ బూర్వము కవులెవ్వరో నుండినట్లు కొందఱు బ్రాహ్మణులు చెప్పెదరేగాని యిక్కవి యచ్చట జీవించియున్నట్టు వారు చెప్పుటఁగానము. ఇంతియగాక కొన్ని తాళపత్రప్రతులయందు 'గామెపలి ముఖ్యగణపవరగ్రామ' మని వ్రాసియున్నది. ఆపక్షమునఁ గామెపలియనుగ్రామము అప్పకవి నివాస గ్రామమై యున్నది. ఇది మా మండలములోని కందుకూరు తాలూకాలోనిది. ఇందైనను నిక్కవివృత్తాంతముఁ జెప్పువారు లేరు వెండియు గోదావరిజిల్లా తణుకు పీరవాసరమునందు గణపవరమని యొక గ్రామమున్నదిగాని యచ్చటను

నివృత్తాంతమెమియుఁ జిక్కినదిగాదు. బట్టు రామరాజభూషణకవి వసుచరిత్ర యందు దనవృత్తాంతమును వ్రాయక హరిశ్చంద్ర నళోపాఖ్యానమున వ్రాసినట్టుగా నిక్కవియుఁ దక్కిన తన గ్రంథముల యందుఁ దన యుదంతమేమైన వ్రాసియుండునో విచారించుఁడు." ఆరుద్రగారికిని ఎక్కువ దొరకలేదు "ఈఊరు ఎక్కడుఁదో సరిగ్గా చెప్పలేం. కామేపల్లినే పొరపాటున లేఖకులు కాటేపల్లి అని వ్రాసుకొని ఉంటారు. గుంటూరు జిల్లా నరసారావుపేట తాలూకాలో కామేపల్లి గణపవరాలు ఉన్నాయి. కవి బహుశా అక్కడివాఁడే కావచ్చు." ఇటీవల కందుకూరు శ్రీవిద్వాన్ కే. రామానుజాచార్యులను నాంధ్రపండితులు ఈకావ్యముపై నాసక్తి గలవారు ఈ గణపవరము చిలకలూరిపేట కడ నుండు గణపవరమని తమ యాశయమని తెలిపిరి. ఇతర ప్రమాణములు దొరకునంతవఱకు ఇది ఇంతే. ఇతఁడు గణపవరమువాఁడు. 'గణప' శబ్దముచే నిది కాకతీయ గణపతి చక్రవర్తి యిచ్చిన యగ్రహారమేమో! కాని తాను జీతమును గడపినదంతయు దక్షిణదేశమునగదా చూడుఁడు——

"ఇది శ్రీమత్పెరుంబూదూరి యతిరాజాచార్యవర్య కరుణాకటాక్ష సంప్రాప్తాంధ్రకవితా సామ్రాజ్యధురంధర నీతియుగంధర నందవరకుల కలశ జలధి పూర్ణిమాచంద్ర సత్యహరిశ్చంద్ర వాసిష్ఠ గోత్ర పవిత్రస్తాశ్వలాయ సూత్ర కార్యఖడ్గప్రవీణ కామినీజన పంచబాణ కర్ణాట తుండీర పాండ్యమండలాధీశ ప్రముఖాఖిల మహీమండలాఖండలదత్త మత్తసింధుర సైంధవాందోళికా చిరత్నరత్నాంబరాదివస్తు ప్రశస్తమందిర నిరంతరవసంతేందిందిర సకల కలావిచక్షణ నిఖిలశుభలక్షణ లక్షణకవి వేంకటపత్యమాత్యవర విరచితంబును మంగమాంబాసమేత గణపరాప్పయమంత్రిమణి విఖ్యాతమజ్జనకరూ పాల్మేల్ మంగాసనాథ తిరువేంగళనాథాంకితంబును నగు వేంకటేశ్వర నిఘంటువు"

అని యున్నదానిని శ్రీపూండ్లవారు ఉదాహరించిరిగాని వ్యాఖ్యానింపలేదు. ఆరుద్రగారు దీనిని ఉదాహరింపనేలేదు. కాని దీనిని అరసిచూడఁగా నీతఁడు తనకాలములోనో తండ్రికాలములోనో మదరాసు ప్రాంతమునకు వచ్చియుండవలయును. మొదటివిషయము చరిత్రకారుని దృష్టినాకర్షించునది 'నీతియుగంధర' 'అమాత్య' 'మంత్రి' శబ్దములును 'కార్యఖడ్గప్రవీణ' యనునది. మొన్నమొన్నటివఱకును ఆంధ్రకవివరు లందఱును నియోగులే, రాజామాత్యులే. వారు ఎంతటి సాహితీసార్వభౌములో అంతటి సమరాంగణసార్వభౌములునుగా

నుండిరి శ్రీకృష్ణరాయలవలె నన్నయభట్టుకాదుగదా తత్పూర్వ మెంత కాలము నుండియో కొందఱు బ్రాహ్మణులు రాజమంత్రులుగానుండి అమాత్య శబ్దవాచ్యులై యుద్ధవీరులై తమ రాజులను దేశములను రక్షించుచుండిరి. ఈ 'కార్యఖడ్గ ప్రవీణ' శబ్దమునకు ఇదే యర్థము. తిక్కనామాత్యుని వంటివారు. ఈ విషయమునే మాతాతగారు తమ తిక్కనసోమయాజివిజయమను నుపన్యాసమున నిట్లువ్రాసియున్నారు. (పుటలే) 'కవులు రాజామాత్యులైన నియోగి బ్రాహ్మణులయందు క్షత్రియవీరోచితములయిన బలనీతి పరాక్రమ వైరిజయ శస్త్రాస్త్రప్రయోగ ప్రావీణ్యాది గుణవిశేషము లెల్లను విప్రోచితములైన వేదాది విద్యాధనత్వ కర్మఠత్వాది ప్రభావముం గూడను వర్ణింతురు'. ఇది వట్టి వర్ణన మాత్రము కాదనియు ఎందఱో నియోగులు యుద్ధవీరులై రణమరణము నంది యుండిరనియు నేటి చరిత్రపరిశోధనచే తెలియుచున్నది. ఖడ్గతిక్కన మనకు తెలిసినవాఁడే. ఆట్టివారెందఱో. పైగా వైదికుల కవిత బాగుండదను నభిప్రాయము గలవాఁడీకవి యనుట 'శ్రోత్రియుని తెలుఁగుకవిత' నీతడు నిరసించుటచే తెలియఁగలదు. (ప్రబం. 752)

కాని ఈ వేంకటకవి గాని, అతని తండ్రి అప్పయ మంత్రిగాని ఎవరి మంత్రులుగా నుండిరో తెలియదు వీరు నందవరీకులు. నియోగులలో ఆఱువేలవారు, ప్రాఁజ్ఞాటి (పాకనాటి) వారు మాత్రమేగాక నఁదవరీకులును నున్నారు. అల్లసాని పెద్దన చొక్కయామాత్యుని పుత్రుఁడు. కాఁబట్టి వేంకటకవి కుటుంబమువారు ఎప్పుడో గణపరము వదలి రాజామాత్యులై మదరాసు ప్రాంతమునకు వచ్చియుండవలెను.

నాఁడు ఇంత పెద్ద మదరాసు లేదు. 1640 ప్రాంతములో ఇంగ్లీషువార ప్పుడప్పుడే కోటను కట్టుకొని పైకి వచ్చుటకు ప్రయత్నించుచుండిరి. అందువలన నేటి మదరాసు ప్రాంతము నాటి తుండీర మండలము (తొండై మండలము) అనఁగా చెంజి రాజ్యము. దాని పాలకుఁడు చెంజివరదప్ప నాయకుఁడనియు నాతని కాలము క్రి. శ. 1620—1660 ప్రాంతమని ముందుదాహరించితినిగదా. అతనికడ మంత్రులలో నొకఁడుగా నుండి యుండవలయును గణపవరపు అప్పయామాత్యుఁడు.

ఇందుల కనుగుణముగా వేంకటపతి యొక్క గురువు యతిరాజ వర్యుఁడు శ్రీమత్పెరుంబూదూరివాఁడు. ఈ యూరు మదరాసునకును కంచికిని

నడుమ నుండు శ్రీ పెరుంబూదూరు. వైష్ణవులకు ఉనికిపట్టు, శ్రీమద్రామానుజాచార్యులవారు జన్మించినచోటు; చెంజి (తుండీర) రాజ్యములోనిది. అంతటి అమాత్యుని కుమారుఁడు తమ రాజధానికి సమీపపుటూరిలోని సుప్రసిద్ధ పండితునికడ వట్టి విద్యాభ్యాసమే గాదు 'ఆంధ్ర కవిత'ను నేర్చుకొనుట ఏమాశ్చర్యము. పైగా నీతడు 'కర్ణాట తుండీర పాండ్యమండలాధీశ ప్రముఖాఖిల మహీమండలాఖండల దత్త వస్తు'వులు గలవాఁడు. అనఁగా పూర్తిగా మదరాసు నుండి రామేశ్వరము వఱకు నీతని విహారభూమి. రాజభోగములలో తేలుచుండినవాఁడు గాని సామాన్య గృహస్థుడుగాఁడు. కవిత చెప్పి ధనార్జన కుపక్రమింపవలసిన గ్రహచార మీతనికి లేదు. ఈతఁడు కరణము (అనఁగా నియోగి.) కవిత్వ మీతనికొక ఉపకరణము. రాచకార్యములకు రాజులు ఇట్టి వారినే రాయబారులుగా, సాంధివిగ్రహికులుగా పంపెడివారు. శ్రీనాథుఁడు అట్టివాఁడే. ఈతని తిరుపతి వేంకటేశ్వర భక్తి ఆప్రాంతవర్ణనయు ఈ ప్రాంతము తోడి సన్నిహిత సంబంధమునకు మఱియొక సాక్ష్యము. ఇదంతయు చూడగా, నీ కవి యొక్క పెద్దలు ఎక్కడివారై యుండినను, ఇతడు మాత్రము దాక్షిణాత్యుఁడనియే చెప్పవలెను.

## 3. ఈ కవి రచనలు

ఈ కవి, శ్రీనాథుఁడు ఆత్మస్తుతి చేసికొనినట్లుగా, తన రచనలనిట్లు పేర్కొన్నాఁడు. 'శ్రీకరంబుగఁ బదిరెండవయేట' సీసపద్యము చూడఁదగును. దీనినెల్ల సంగ్రహించి శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు ఇట్లు వ్రాసినారు. 'ఈ కవి గ్రామణి తన పదిరెండవయేట దారావళులు, మునిముని మీసంబు మొనయునేట యమశతకము, యిరువదవయేట శృంగార రసమంజరి, యిరువది యేనవయేటఁ గృష్ణమల్లకథ, యౌవనమందు బాల రామాయణ ద్విపదము, చాటు పద్యములు, పాణిని లింగానుశాసనము, రామకవి లింగనిర్ణయము*ను జేర్చి యొక గ్రంథము, తెలుగు ప్రతాపరుద్రీయము, తెలుఁగు రసమంజరి, అభినవాంధ్ర నిఘంటువు,(యిదే వేంకటేశ్వర నిఘంటువు)

* ఇది శ్రీ పూండ్లవారి యుపోద్ఘాతము పుట 1 లో రామలింగకవి నిర్ణయము' అని పొరపాటున పడినది. గ్రంథములో సరిగానే యున్నది. వీరి తప్పొప్పుల పట్టిక సమగ్రము కాదు.

ఆంధ్రకౌముది, గణ యతి ప్రాస లక్షణ సీసమాలిక, ఆంధ్రప్రయోగ రత్నాకరము, రేఫఱకార నిర్ణయపద్ధతి, షట్ప్రత్యయముల ప్రస్తారసరణి, యిర్వదాఱు ఛందముల వచనము, అలంకార సారము, పరమ భాగవత చరిత్రము, ఆంధ్ర ద్విరూపకోశము కల్పితకల్పలత, తెలుఁగు వసంతతిలకభాణము, కఠినప్రాస శతకరాజము, ఆంధ్రప్రక్రియా కౌముది, జాంబవతీ విలాసమను చిత్రకావ్యము, చండవిద్యావతీదండకరాజము, చక్రతారావళి, పురాణసారమను పేర్లంబరఁగు (25) నిరువదియైదు గ్రంథముల రచియించినట్టును, యిట్టి గ్రంథరచనవలనఁ దన జిహ్వాంచలంబు తనవినొందదను కారణమునఁ గులదేవతావతంసమగు వేంకటేశ్వర చరణారవింద మహిమ నవనావోన్మేష వర్ణనలచేనొప్పు నీ ప్రబంధ రాజ వేంకటేశ్వరవిజయవిలాసమును రచియించినట్టుగా నవతారికా పద్యముల యందు వ్రాయబడి యున్నది. ఇక్కవికృతులలో నొక్క వేంకటేశ్వర నిఘంటువు తప్పఁ దక్కిన గ్రంథములు నామావశిష్టములై యున్నవి. ఈ కవిచే రచియింపఁబడిన గ్రంథజాలమునకై ప్రయత్నించఁగా వేంకటేశ్వర నిఘంటువు మాత్రము లభించినదిగాని తక్కిన ప్రబంధములు 'ప్రాచ్యభాషా లిఖితగ్రంథ సరస్వతీ భండారము' (ఓరియంటల్ లైబ్రరీ) లోఁ గూడా నేత్రముల కగోచరములై యున్నవి. నేత్రగోచరమైన వేంకటేశ్వర నిఘంటువును జూడఁగా నీ ప్రబంధరాజమున నవతారిక యందలి 49 వ పద్యమునఁ జెప్పియుండురీతి 'బిరుదుగద్య' ఆ నిఘంటు కడపట నివ్విధముగా వ్రాయబడియున్నది" అని బిరుదుగద్య, 'ఇది శ్రీమత్పెరుంబూదూరు' ఇత్యాది ఉదాహరించినారు ఇది ముందే ఇందుదాహృతము.

పై గ్రంథముల గూర్చి ఇంతకన్న నెక్కువ తెలియరాదు. "నన్నయ పెద్దన, యెఱ్ఱన, తిక్కన, పీరన, తిమ్మన, పెద్దనాదులవలె* నిక్కవిరాజాశ్ర యుండై తన గ్రంథముల నరాంకితములు జేయక నారాయణాంకితములుగాఁజేసి మనిన ధన్యుండు" అని వ్రాసి 'ఇమ్మనుజేశ్వరాధముల' 'బాలరసాలసాల' పద్య

---

* పెద్దనలను ఇరువురను పేర్కొనుచున్నారు శ్రీపూండ్లవారు. వరుసయు వ్యత్యస్తముగా తిక్కనకు ముందు ఎఱ్ఱనను పేర్కొనుచున్నారు. మొదట పెద్దన కావ్యాలంకారచూడామణికారుఁడు ప్రాచీనుఁడను నభిప్రాయము కాఁబోలు వారి కాలమునకు చరిత్ర చక్కఁగా తెలియదు గదా. కాని ఎఱ్ఱన తిక్కనల పౌర్వాపర్యమో! ఏదో అచాలోచితముగా వ్రాసినారేమో!

ముల నుదాహరించి పోతనయొక్క భోగినీ దండకమును ఉదాహరించి 'యిక్కవి తన గ్రంథముల నన్నిటిని వేంకటేశ్వరస్వామికి నర్పించిన మహాపురుషుండు' అని వ్రాసినారు. వీరి కాలమునకు 'చండ విద్యావతీ దండకము' (పుష్పకోదండము) వెలువడలేదుగాన నిట్లు వ్రాసినారు గాని ఇతఁడును భోగినీ దండక రచయిత వలెనే, ఆ ఫక్కిలోనే తన దండకమును వ్రాసిన విషయము శ్రీ ఆరుద్రగారు విశదీకరించినారు. (చూ. సమ. సా. XI 166—7) ఈ కవి ఏ యే గ్రంథములను ఎవరెవరికిచ్చినాఁడో ఆ గ్రంథములు దొరకినగదా తెలియును. రాజాశ్రయము చేయనివాఁడుగాఁడు. వారివలన నెంతో ఐశ్వర్యమును పొందినాడు. పోతన కూడ సర్వజ్ఞ సింగమనాయని ఆశ్రితుఁడే ! మనఁకు నాఁటి చరిత్ర చక్కఁగా తెలియరాలేదు గాని సింగమనాయుఁడు (మూఁడవవాఁడు) తుది దినములలో చాలా బాధలుపడి ఓరుగల్లు తెలంగాణ ప్రాంతములను వదలి గుంటూరుసీమకు వచ్చినట్లున్నాఁడు. ఆతని మరణానంతరమే పోతరాజు భాగవతమును రచించియుండును. భాగవతాంకితమును గూర్చిన కథలన్నియు పుక్కిడి పురాణములుగా తర్వాతివారు కల్పించి యుందురు. వాస్తవమునకు 'బాల రసాల' పద్యము మంచన కేయూరబాహు చరిత్రలో (క్రీ శ. 1300), పోతన్నకు దాదాపు రెండువందల యేండ్లకు ముందుండియు, కనఁబడుచున్నది. 'ఇమ్మనుజేశ్వరాధముల' పద్యము కూడ ఎవరిదో ! 'కాటుక కంటినీరు' పద్యము కూడ సందేహాస్పదమే. సింగమనాయఁడు కర్ణాటకుఁడా ! పైగా సర్వజ్ఞ బిరుదాంచితుఁడు అట్లు వ్యవహరించునా ? ఈ రాజాంకిత నరాంకితాది విషయకమై పండితులు పరిశోధింప వలయును. త్యాగరాజు వంటివాఁడు మాత్రము కాఁడు. అట్లు చూచిన వీరెవరును కారు.

గణపవరపు వేంకటకవి తన కైశ్వర్యమబ్బిన విధమును స్పష్టీకరించినాఁడుగదా. 'తానోకార్యఖడ్గప్రవీణుఁడు' కార్యఖడ్గ పటిమధురీణుండును. మంత్రి అనఁగా ఉద్యోగస్థుఁడు, రాజనియోగి. పరంపరగా రాజుల నాశ్రయించు వంశమువాఁడు. పైగా 'కామినీపంచబాణుఁడు' శ్రోత్రియుఁడుగాఁడు. 'కర్ణాట తుండీర పాండ్యమండలాధీశ ప్రముఖాఖిల మహీమండలాఖండలదత్త మత్త సింధురసైంధవాందోళికా చిరత్న రత్నాంబరాదివస్తు ప్రశస్త మందిరుఁడు.' మఱి వారినిగుఱించి ఒక మంచిమాటయైనను చెప్పక 'ఇమ్మనుజేశ్వరాధములు' అని నీతీరున నుండిన త్యాగరాజువంటివానికి ఈ యైశ్వర్యమంతయు ఆ యా రాజులవలన అబ్బునా?. తన యైశ్వర్యానుభవమును ఎంతో గొప్పగా చెప్పు

కొన్నాఁడు గదా. (27వ వచనము.) శ్రీవేంకటేశ్వర చరణారవింద మహిమను వర్ణింపఁ దలంచుచుండ 'నొక్కనాఁడు' అని మరల (శ్రీ పెరుంబూదూరు - ఇత్యాది వంటి వచనమునే ఇంక కొంతమార్చి పెంచి) వ్రాసినాడు. 'కర్ణాట తుండీర చోళపాండ్య దేశాధీశముఖ నిఖిల ధరణీవరమణిదత్త మత్తేభ ఖత్తుఁగాణిక పల్యాంకి కాందోళికాది చిరత్నరత్నఖచిత రుచిరాభరణగణ ప్రకాశిత విభవుండును, సద్గుణప్రభవుండును, కార్యఖడ్గ పటిమధురీణుండును చతుష్షష్టి విద్యాప్రవీణుండును, సనక్షత్రా త్రినేత్రోద్భవోపమానాచ్ఛ ముక్తా గుళుచ్ఛచ్ఛవి సంకీర్ణ కర్ణ భూషా విశేష వదనుండును, దిగంతాయాత విద్వత్కవి వ్రాతబంధుజనావన సదనుండును.........ప్రభుసందేశ సకల లోకోపకార కృత్ప్రచారుండును, ......... అసాధారణ మేధా ఘటిత మంత్ర తంత్ర సంధానా బంధన గంధవాహ బాంధవ నిర్గంధిత గంధాంధ దండనాథ యూథ స్కంధాపార పారావారుండును, ...... *పరస్త్రీ పరధన పరాఙ్ముఖశీలుండును, ......నగునేను బహువిధభోజ నామూల్య జాంబూనదాంబర సార గంధసార రుచిర విచికిల ఘనసార తాంబూల ప్రియకామినీ సంగీత గోష్ఠి సుమశయ్యావ్యాప్త భోగాభోగ సంగతుండనై, హంసతూలికా తల్పంబున వేకువఁ దేకువ సుఖసుప్తినున్న సమయంబున" ఇదంతయు రాజాశ్రయము చేతను 'నరస్తుతి' వలనను వచ్చినదే.

అట్లనుటచేత దైవభక్తిలో ఎవరికిని తీసి పోయినవారు కారు కవులైన రాజామాత్యులు. ఈ వెంకటకవియు వేంకటేశ భక్తుఁడు. పైన చెప్పుకొన్న విధముగా నీతఁడు 'సుఖసుప్తి నున్న సమయంబున వేకువజామువేళ బాలవేంకటశౌరి ప్రత్యక్షమై' ప్రబంధరాజమును అంకితము కోరినట్లును ఈతఁడు పరమానందభరితుఁడై అట్లే యొనరించినట్లును కలదు. తిక్కన మొదలు నేటివరకు కూడ మన యాంధ్రకవులకు ఇట్టి స్వప్నములు క్రొత్తకాదు. దీనిపై వ్యాఖ్యానవసరము. మన కవులలో భక్తులు లేరాయేమి?

---

* ముందు 'కామినీజన పంచ బాణుఁడ'ని చెప్పు కొన్నాఁడేయన్న, ఆకామినులు ఇందుచేత కులస్త్రీలు కారనియు, భోగకాంతలనియు, ఈయన ధూర్జటివంటి వాఁడనియు, వేశ్యా సంపర్కము శ్రోత్రియునికి నిషిద్ధమే గాని అమాత్యునికి కాఁదనియు ఒక రహస్యము తోఁచుచున్నది.

## 4. కావ్యస్వరూపము - ఇందలికథ

ఇది ఏకాశ్వాస ప్రబంధము. సాధారణముగా కావ్యములు ఆశ్వాసములుగా విభక్తములగు చుండ నిది మాత్రమిట్లు వ్రాయఁబడుట. అందును 882 పద్యములను ఒక్క గుక్కలో చెప్పుట, ఆలోచింపఁ దగినదే. శ్రీ పూండ్లవారు "ఈ కావ్యమువలె నేకాశ్వాసముగా విరచింపఁ బడినది యిదివఱకు దృష్టిగోచరముగా లేదు...విభజించి వ్రాసియుండిన జదువువారలకుఁ గొంత క్రుగుక్కఁ ద్రిప్పుటకు వసతిగల్గి యుండును ...... కారణమెయ్యదియో విచారించు కొనుఁడు" అని వ్రాసిరి. ఆరుద్రగారు ఏమియు వ్రాయలేదు వారికెట్టి శంకయు పొడమలేదు. కాని నాకిట్లు తోచుచున్నది. ఈయన కాలమున యక్షగానములు బహుళప్రచారమునకు వచ్చినవి. వానిలో, అవి ప్రదర్శన యోగ్యములైనను, అంక విభజన లేదు. పాత్ర ప్రవేశ నిర్గమనాదుల వలన కథజరిగి పోవుచుండును. రాత్రియంతయు నాటకమాడువారు. ఈయన కావ్యములో యక్షగాన రచనా ప్రక్రియలు చాలా గలవు. పట్టికావ్యముగాక, చిత్రకావ్యమునుగాక, సంగీత కావ్యముగా కూడ దీనిని గ్రహింపవలసియున్నది. కాఁగా, వానివలెనే, కవి దీనిని ఏకశ్వాసముగా వ్రాసెనేమో. ఇది నృత్యనాటికగా కూడ కొద్దిమార్పులతో ఆడదగినదిగా కనఁబడుచున్నది. హరికథా కాలక్షేపమునకు చాల తగియున్నది. సంగీతవిషయముల నెన్నిటినో కవియిందు చేర్చియున్నాడు.

పైగా పూండ్లవారు ఆశ్వాసాంతమున, అనగా నిచ్చట గ్రంథాంతమున గద్యవ్రాయక పద్యమే వ్రాసినాడు. ఇందులకు ఇతనికి మార్గదర్శకము ఆముక్తమాల్యదయనియు, ఆధునికులలో మందపాకవారొకరట్లు వ్రాసిరనియు తెలిసిరి. కాని వీరి కందఱికిని గురువు నైషధకావ్యకర్త, భట్ట శ్రీహర్షుఁడేల కారాదు? ఆతఁడు ప్రతియాశ్వాసముతుదను ఆముక్తమాల్యద పద్యములవంటి శ్లోకములు వ్రాసినాఁడు పైగా నాటకములలో భరతవాక్యము శ్లోకమేగావున ఆస్వరూపము కలుగుటకు కూడ కవి యిట్లొనరించి యుండును. ఈ భావముననే కాఁబోలు ఇట్లు భగవంతుని యాజ్ఞగా చెప్పుకొన్నాఁడు.

ప.౮౩. 'మునుపు నిపుడుఁ గవులొనర్చు ననువుఁ దెనుఁగుఁ
గబ్బములలోనఁ దెరనాటకంబు లెస్స
గా వినికి సేయుగతి నలంకార సరణి
వెలయ రచియించు యప్పయ వెంకటార్య'

ఇది 'వినికిసేయు' నాటకమా?

ఇందలికథ :— "ఈ గ్రంథము కథాప్రారంభము మొదట కొని వేంకటాచల పట్టణవర్ణనము. నలిబిలిగోపురాది వర్ణనము, స్వామిపుష్కరిణి వర్ణనము, బయకానికోన పాండుతీర్థాకాశగంగాదుల వర్ణనము, వేంకటశైల వర్ణనము, శ్రీవేంకటేశ్వరస్వామి వర్ణనమును, శ్రీవారి వాహ్యాళి వర్ణనము, తిరు నాళ్ల మహోత్సవాది వర్ణనమును, మొదటి 58 పద్యములవఱకు వ్రాయబడి యున్నది. అది మొదలు సాయంతనవర్ణనాదులు, జాతివార్తలు, స్వామివారి యెదుట జరుగు సంగీతమేళముల వర్ణనములు, లోనగు వృత్తాంతములు 112 పద్యముల వఱకు వ్రాయఁబడియున్నవి అవ్వల శ్రీవారి కేలిదేగ ఆకాశ రాజ చంద్రుని సుతయగు నాంచారుదేవి యుపవనమున వ్రాలుటయుఁ దోడ్తోన శ్రీవా రచ్చటికి మంత్రి సహితుండై విచ్చేసి యవ్వెలంది యుదంత మరయుటకు మం త్రిం బంపఁగా, నతనివలన దానామె వృత్తాంతము విని యవ్వెలఁదినిఁ జూచి వర్ణించుటయుఁ, దర్వాత నాకాశరాజు మంత్రివలన వేంకటేశ్వర స్వామివారి యభిప్రాయ మెఱింగి తనసుతనిచ్చి వివాహంబొనర్చి స్వగృహమునకు నగ తనయయగు దన తనయను బంపునపుడు త్రోవలో స్వామివారికిని, నాగదత్తుఁ డను చోరునకును యుద్ధము సంప్రాప్త మగుటయుఁ జోరవ్రజంబు స్వామి పుష్కరిణింబడి సారూప్యం బందుటయు, నష్టదిక్పాలకులు శ్రీ వేంకటేశ్వర స్వామిని స్తుతించుటలోనగు పద్యములచేఁ దక్కిన గ్రంథంబంతయు నొప్పు చున్నది. ఈ గ్రంథమునందుఁ గథ విశేషముగ వ్రాయఁబడి యుండలేదు. అయి నను తన నేర్పఱితనమును లోకమునకుఁ దెలుపుటకై కవియిది యొక వ్యాజము గల్పించుకొని యిట్టి లక్ష్యగ్రంథమును వ్రాసియున్నాఁడు" (పూ.రా).

నాగదత్తునికథ :— స్వామివారి కథకన్న పెద్దది, స్వారస్యమైనది. ఇతఁడు కందుకూరి రుద్రకవి యొక్క నిరంకుశునికి, తెనాలి రామకృష్ణయ్య నిగమశర్మకును అపరావతారము. ఏ మాత్రము మార్పులేదు. — తిరుపతి పుర ములో మాధవుఁడనెడు శ్రోత్రియుఁడు సకలశాస్త్రవేది యుండెను. ఆతనికి బహు కాలమునకు గలిగిన పుణ్యపు పంట నాగదత్తుఁడు బాల్యములో చక్కగా చదివి, "తండ్రికన్నను నెఱవాది తనము మంచితనము గ్రామణితనము వర్తనముగలిగి... కీర్తనీయుఁడై" యుండెను. వివాహము కూడనైనది. కాని యింతలో 'ఆళ్వారు తీర్థము చెంతఁ గొంతకాలంబు' ... 'పీతాచారుఁడు దుర్మదాంధుఁ డగుచున్ వేశ్యాంగనావాటులన్...చేతోజాత వశం వశంవదుండయి జరించెన్'. 'దుర్వృత్తి

నభిగమించి ... విటవిద్యకు బిరుదవేసి' జూదమునేర్చి, 'తీంద్రవయసెచ్చఁ జే కత్తిగాండ్రఁ గూడి ...' చరించుచు 'ఒక వెల యాలిమీఁద నిలుపోపని కూరిమి గల్గి, యుండ,' ఆజవ్వనియు 'యెవ్వని నిచ్చమెచ్చకే' యితని తోడనే 'మారక, తన చాతురి న్నిలువరమ్ముగ గూడి చెలంగె నయ్యెడన్.' అది చూచి, వేశ్యా వృత్తి కిది పనికిరాదని వేశ్యమాతయు, కుమార్తెకు హిత ముపదేశించి, దానిమనసుమార్చి నాగదత్తుని ధనమంతయు నపహరించి, వెడలఁ గొట్టించినది. ఇంటికి మరలి వచ్చిన నాగదత్తునికి మర్యాద యెక్కడిది. అందఱును చీదరించుకున్న వారే. తల్లికి మాత్ర మట్లుండునా ? ప్రేమతో, వచ్చినదే చాలునని, పిలుచుకొనిపోయి, సకలోపచారములు వాని భార్యచేత చేయించి, ఎంతోబుద్ధి చెప్పినది. కాని ఆతఁడు చలింపలేదు, ఒక్కమాట బదులాడలేదు. తల్లి చాల దుఃఖించినది. అది చూచి తాను మారి నట్లభినయించినాడు. తల్లి ఉబ్బిపోయినది. తన సొమ్ముల నన్నిటిని కోడలికి పెట్టి శృంగారించి కుమారుని పడుక టింటికి పంపినది. పాపము, మోస పోయినది. ఆ కుమారుఁడు ఆనగల నన్నిటిని దోచుకొనిపోయి, రాత్రికి రాత్రియే, ఆ వెలయాలికి సమర్పించినాఁడు. త్వరలోనే ఆ సొమ్మంతయు బపోగా, వేశ్య మరల ఉద్వాసనము చెప్పగా, దారి దోపిడితనమునకు దిగి—

'ఆయన సేయనిపాతక
మేయనువున లేకఁ బురికి నెడయై జని దా
బోయల గూడుగ దెఱువుల
నాయకు లేతేర తాను నడుమ నడచుచున్'

........ రాజుల నగరములు జొచ్చిరాయిడి, జేయుచున్' ... 'తిరిగి తిరిగి యున్మత్తుఁడై నాగదత్తుఁడు ......... తద్భటులంతరంగంబున...... తుందుడుకు సామిసొమ్ము దోచు' టకు బొక్కసమును దోఁచగా హరిభటులుపై కొని యుద్ధమాయెను. దొంగలగుంపు ఓడిపోయి స్వామిపుష్కరిణి లోఁబడి మరణింపగా వారికి, అందువలన, మోక్షమబ్బి దివ్యవిమానములు వచ్చి, కొని పోగా, వారందఱు 'విధునిపదముల కరిగిరి' అటు తర్వాతి గ్రంథమంతయు దేవతలు వేంకటేశ్వరస్వామిని స్తుతించుటతో సరిపోయినది.

ఈ విధముగా తక్కువకథతో కవి తన కావ్యమున తన పాండి త్యమును, లోకజ్ఞానమును, చిత్రకవిత్వ బంధకవిత్వాది సాముగరిడీల ప్రదర్శనమును, ఆంధ్రవాఙ్మయములోనే ఎవరును చేయని విధముగా చేసినాడు.

## 5. ఈ కవియొక్క లాక్షణికత

శ్రీ పూండ్లవారి వ్రాత—"ఇక్కవి గొప్పలాక్షణికుఁడు, తాను నేర్చిన లక్షణముల కన్నింటికి లక్ష్యముల నీ గ్రంథమునం దుదాహరించియున్నాఁడు. ఆంధ్రభాషలో లక్ష్యలక్షణములను దెలుపు గ్రంథము లొండురెండుగాని విశేషములు లేవు. అవి యనఁగా కావ్యాలంకార చూడామణియు, నరస భూపాలీయము అనునవి. ఇందు మొదటిగ్రంథమును విశ్వేశ్వరుఁడను ప్రభువుపై విన్నకోటపెద్దనయను మహాకవి యంకితం బిచ్చియున్నాఁడు. ఇది బహు పురాతన గ్రంథము. ఇయ్యది పోతన శ్రీనాథుల కాలమునకు శ్రీకృష్ణరాయల వారి కాలమునకుఁ బూర్వము వ్రాయఁబడినది*. ఇందు వ్యాకరణ విషయము, అలంకార విషయము, ఛందశ్శాస్త్రవిషయము, కావ్యలక్షణము, నాయకనాయికాది గుణములు, బంధకవిత్వ గర్భకవిత్వ చిత్రకవిత్వాది విషయములు వ్రాయఁబడి యున్నవి—ఇఁక రెండవ గ్రంథము నరసభూపాలీయము. ఇప్పుడు ముద్రితమై యున్నదిగాన దీనిని గుఱించి మేము విశేషముగ వ్రాయఁ బనిలేదు. ఈ రెండు లక్షణ గ్రంథములును నరాంకితము లగుటచే నిక్కవి తానొక లక్షణగ్రంథమును వ్రాయఁ దలపెట్టియు నిదివఱకే యిద్దఱు లాక్షణికులు లక్ష్యలక్షణములు వ్రాసి యున్న లక్ష్యములగు పద్దియములు నరస్తుతులు యెంచి వానిని నోరఁగుచ్చ మనసురాక తాను మరలఁ గ్రొత్త లక్ష్యములగు పద్యములను మాత్రము వ్రాసి వానిని శ్రీవేంకటేశ్వర స్వామికి నంకితంబిచ్చి యీగ్రంథమును వ్రాసి యున్నాఁడు. ఇది కవి యభిప్రాయము గానినాఁడు తాఁదిరుగ లక్షణమును గ్రంథమునందు వ్రాసియే యుండును. కాఁబట్టి యీగ్రంథమందుండు లక్ష్యము లగు పద్యముల కన్నిటికి లక్షణమిదియని కవియే వ్రాసియున్నాఁడుగాని, యా లక్షణములను వివరించియుండలేదు. కావున మఱియొక గ్రంథమునుండి లక్షణములను దెలిసికొని యిందలి లక్ష్యములను గ్రహించ వలయును."

---

*ఇది చరిత్ర తెలియని ఆనాటి వారి యభిప్రాయము. విన్నకోట పెద్దన శ్రీనాథునికి సమకాలికుఁడుగా నుండి క్రీ శ. 1402లో చిత్రభాను దీనిని వ్రాసినట్లు చరిత్రకారుని నిర్ణయము. ఈతఁడు విశాఖపట్టణ మండలమువాఁడు. విశ్వేశ్వరుఁడు, అక్కడి యొక చాళుక్య శాఖకు చెందిన రాజు. ఈ కవియే 'అల విన్నకోట పెద్దన' అను పద్యములో పెద్దనను నన్నయకు ముందుపెట్టుటయే ఈ భ్రమకు కారణముగా నుండును. చూ. నా కావ్యాలంకార చూడామణ్యుపోద్ఘాతము.

"ఈ గ్రంథమునందు గర్భ చిత్రకవిత్వము విశేషముగ వ్రాయబడి యున్నది. ఆంధ్రగ్రంథములలో నీ కవిత్వసంబంధమగు పద్యము లనేకములు వ్రాయఁబడియున్నవిగాని వానికన్నింటికి లక్షణమెచ్చటను గానఁబడదు. కావ్యాలంకార చూడామణియందుఁ గొన్ని బంధములకు లక్షణము వ్రాయఁబడి యున్నది. ఈ గ్రంథమిప్పటికి* నముద్రితమగుటచే దీనియందలి విషయములు లోకమున కందనిమ్రానిపండ్లై యున్నయవి. ఇఁక ముద్రింపఁబడియుండు నరస భూపాలీయమునందైనను నాలవ యాశ్వాసమునందు 'అష్టదళపద్మ బంధ చక్రబంధములకుఁ దప్పఁ దక్కిన బంధములకు లక్షణమెచ్చటను గనుపడదు. ఈ ప్రబంధరాజమునందు బంధములన్నియు నరువదికి మించి (60) యున్న యవి. ఈ బంధములనన్నిటిని యీకవి వానివాని స్వస్వరూపములతో, లిఖించియున్నాఁడు. అయ్యవి ముందు బ్రకటింపఁ బడు......మనుచరిత్ర యందు అల్లసానిపెద్దనగారు గద్యమునందు "చతుర్విధకవితామతల్లి కాల్లసాని చొక్కయామాత్య పుత్ర పెద్దనార్యప్రణీతము" అనియు, వసుచరిత్రమునందు రామరాజభూషణకవి 'సంస్కృతాంధ్రభాషాసామ్రాజ్య సర్వంకష చతుర్విధ కవితా నిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజ భూషణ ప్రణీతము' అనియు వ్రాసికొన్నారేగాని వారు వారివారి గ్రంథములందొక్కరైనను బంధకవిత్వ గర్భకవిత్వములను గూర్చి యొక పద్యమైనను వ్రాసియుండరైరి. ఇందుకుఁ గారణము విచారించుకొనునది."

ఇదంతయు దాదాపు 85 సంవత్సరముల క్రింది పండితాభిప్రాయము. ఆంధ్రవాఙ్మయ చరిత్రకారులెవ్వరును ఆంధ్రవాఙ్మయ పరిణామమును గుఱించి గాని, అందులో చిత్రబంధ కవిత్వాదుల చరిత్రలను గుఱించిగాని నేటివఱకును వ్రాయలేదు. ఒక్కవంగూరి సుబ్బారావుగారు 1920 ప్రాంతములలో కొంత ప్రయత్నించిరిగాని తర్వాతి వారు, శ్రీ వీరేశలింగము పంతులు వారిని గూర్చి శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు చెప్పినట్లు, 'తెలుఁగుకవుల జాతకములనే వ్రాసిరి. కవివెనుక కవి, ఆయా కవుల గ్రంథములనే జాపితాలుగా వ్రాయించుటయేగాని భావములలో మార్పు, ఆంధ్రవాఙ్మయములో రచనా ప్రక్రియలలో

---

*కావ్యాలంకార చూడామణి నాటికి ముద్రణము కాలేదు. ఆ సంవత్సర మే 1892లో మా తాతగారు మొదటి ఏడుల్లాసములు దొరకఁగా ముద్రించిరి. తర్వాతిరెండుల్లాసములను నేను 1980లో చేర్చితిని.

క్రొత్త పోకడలు, కావ్యనిర్మాణాలంకారాదిక రచనలలో నూతన వర్ణనా విధానములు, ఇత్యాదులను తలపెట్టిన వారేలేరు, 'గతానుగతికోలోక' కాఁబట్టి తెలుఁగులో చిత్రబంధకవిత్వాదుల చరిత్రను చూచుట యుక్తము.

అలంకారముల పెంపకము

## 6. తెలుఁగులో చిత్రబంధకవిత్వాదులు

వీని చరిత్రమును నేను నా నన్నెచోడుని కవిత్వ విమర్శలోను (1958) శృంగారనైషధ ద్వితీయ ముద్రణావతారికలోను (1961) చాలవఱకు వ్రాసియున్నాను. మరల సంగ్రహముగా వ్రాసెదను. నన్నయ వ్రాయలేదు. ఆయనది కథాకథన మార్గము. 'ప్రసన్న కథాకవితార్థయుక్తి, అక్షరరమ్యత' తాను 'నానారుచిరార్థ సూక్తినిధి.' తిక్కనయు అంతే. కథాకథన కుశలుఁడు 'రసాభ్యుచితబంధముగ' వ్రాసినవాఁడు. నన్నయ్య చతుర్విధ కవితలను ప్రస్తావించినాఁడని కొందఱు పెద్దలు తలంచి, నన్నయ భారతావతారికలో 'మృదుమధుర చిత్రవిస్తర నవరస భావభాసుర రచనా విశారదులైన మహాకవులు' అను పాఠ ముదాహరించిరి. (ఆ1-8) అట్లే శ్రీనాథునిలో 'మృదు మధుర చిత్రవిస్తరకవితా విలాస వాగీశ్వరులగు కవీశ్వరులును' అను వాక్యములకు మాతాతగారు నైషధవ్యాఖ్యలో చతుర్విధ కవితలపరముగా అర్థము చెప్పక వానిని విశేషణములుగా గ్రహింపఁగా, ఆక్షేపించిరి. దీనికి నేను సమాధానము వ్రాసితిని. నన్నయవాక్యములు -'అఖిలజలధి వేలావలయిత ... మృదు మధుర రసభావభాసురనవార్థ వచనరచనా విశారదులైన మహాకవులును? ఈపాఠమునే వంగూరి సుబ్బారావుగారు గ్రహించినారు. వారు 'మృదుమధుర చిత్ర విస్తర' పాఠమును సూచింపనైనలేదు. ఈకవులెవ్వరని శ్రీసుబ్బారావుగారు తర్కించి 'తెలుఁగు కవులే' యని తేల్చినారు. 'అయినచో వారు వ్రాసిన కావ్యములెవ్వి? కానఁబడవు' అనియు వ్రాసినారు. (చూ. వారి ఆంధ్రవాఙ్మయ చరిత్రము.) అప్పకవి (క్రీ. శ. 1656) నాటినుండియు వీనికి ఆశుబంధ గర్భ చిత్రకవిత్వములను మత మేర్పడినది. నన్నయ శ్రీనాథు లిరువురును ఆశువునకు 'మృదు' వని వాడియున్నారు. మధురమో? ఆశువే మృదుమధురమై తర్వాత బంధకవిత్వమాంధ్రకవితా వధూటికొక బంధమైనదా? చూతము.

నన్నయ తర్వాత తిక్కన కేతన మారన మంచనలలో ఈ రీతులు కానరావు. శివకవులైన పండితారాధ్య పాల్కురికి సోమనాథాదులలో లేదు.

శ్రీవంగూరి సుబ్బారావుగారి యాంధ్రవాఙ్మయ చరిత్రను పునర్ముద్రించుచు శ్రీనిడుదవోలు వెంకటరావుగారే ఇట్లు వ్రాసిరి. "చిత్రబంధకవిత్వము నన్నె చోడుని నాటినుండియు వెలసినది భారతకవులు- శ్రీనాథయుగమునాటి కవులు దీనిని చేపట్టలేదు. క్రీ శ. 16వ శతాబ్దినుండియు విస్తరిల్లినది." వావిళ్లవారి నన్నెచోడ కుమారసంభవ ద్వితీయముద్రణమున "వాఙ్మయమున దొలుత బంధకవితను, గర్భకవితను, చిత్రకవితను ప్రవేశపెట్టినవాఁడు నన్నెచోడుఁడు" అనియు, "కావ్యాలంకార చూడామణి, కావ్యాలంకార సంగ్రహము, అప్ప కవీయము, మొదలగు నాలంకారిక గ్రంథముల యందీ బంధకవిత్వ ప్రస్తావ మున్నది. తరువాతి ప్రబంధకవులు దీని నభివృద్ధిచేసిరి." అనియు వ్రాసిరి.

ఆంధ్రవాఙ్మయమున చాల తర్వాత వెలసినది ఈ చిత్రబంధకవిత్వ పద్ధతి. నన్నెచోడుఁడు ప్రాచీనుఁడని భ్రమపడి నన్నయకు ముందుండియు నీ మార్గమున్నదని తలంచి ఎందుచేతనో ప్రాచీనులు చేపట్టలేదని మనవారు తలఁచినారు, నన్నెచోడుఁడు ప్రాచీనుఁడు కాఁడని తిక్కనకు తర్వాతి వాఁడని నేను నిర్ణయించితిని. ప్రాచీనులెవరును 'చేపట్టని' చిత్రబంధ కవితా రీతులను చేపట్టుట యొకటియే చాలును ఈతఁడు అర్వాచీనుండనుటకు, మిగిలిన యుపపత్తుల నటుంచి.

క్రీ. శ. 1402లో (శ్రీనాథుఁడు కొండవీటిలో విద్యాధికారియైన సంవత్సరము) వ్రాయఁబడిన కావ్యాలంకార చూడామణిలో కొంతలక్షణమున్నది. అంతకుముం దే కవియు వ్రాసిన జాడలేదు. జయదేవ గోకర్ణాదుల ఛందో గ్రంథములు కనఁబడవు. కవి జనాశ్రయము వట్టి సాఫీకవిత్వమునకు మాత్రమే. కావ్యాలంకార చూడామణికారుఁడు 'లవి నన్యోన్యముఖావలోకనము లీలంజేయఁగా లేని యా విలసత్కావ్యకళా చతుష్టములోలిం బర్వనేకస్థ లింబరఁగిం'చినాడు. లక్ష్యములనుఁ బట్టి లక్షణము లేర్పఁడుననుట పరిణామ మార్గము, లోక స్వభావము. కాని తెనుఁగునకు మాత్రమట్లుకాదు. కావ్యప్రక్రియలనన్నిటిని మనవారు సంస్కృతమునుండియే గ్రహించినందున ఆంధ్రవాఙ్మయ చరిత్ర యంతయు సంస్కృత మర్యాదలను మనము తెచ్చుకొన్న విధవు చరిత్రయే. తెలుఁగులో మొదట మొదట పద్యరచనకు వలయు ఛందశ్శాస్త్ర గ్రంథములు, తర్వాతవ్యాకరణము- కేతన యొక్క ఆంధ్రభాషాభూషణము మొదటిది-అటువెనుక అలంకార గ్రంథములు, తర్వాత భావరసాదులు, చిట్టచివర చిత్రబంధాది

కవితలు, ఇవన్నియు కొంత కుదురుపాటునకు వచ్చునప్పటికి ఆంధ్రాలంకార గ్రంథములు వచ్చినవి గాని అంతవఱకు సంస్కృతలక్షణ గ్రంథములే యాధారములు. తెలుఁగురచనలు అంకితమిచ్చి ధనము సంపాదించుటకేగాని సందేహములు తీర్చుటకు సంస్కృత గ్రంథములే. ఉదా- ధర్మశాస్త్ర వైద్య శాస్త్రాదులకు తెలుఁగు గ్రంథములు కలవా? ఆంధ్రులైన విద్యానాథామృతానందాదులు సంస్కృతమునందే వ్రాసిరి.

కాఁగా – ఆంధ్రవాఙ్మయ ప్రారంభ యుగపు కవులందఱును పౌరాణికులు, కథకులు, వారిది పురాణకథన శైలి. తమంతట దొరలిన యలంకారములేగాని ప్రయత్నపూర్వకముగా కూర్చుట కానరాదు. విన్నకోట పెద్దన లక్షణము వ్రాసినను సమకాలికాంధ్రరచన కానరాదు. తన లక్షణములకు లక్ష్యములను తానే కల్పింపవలసివచ్చినది. ఆతఁడు అలంకార ప్రకరణములో అర్థాలంకార శబ్దాలంకారములతోనే చిత్రబంధ కవిత్వమును కలిపినాఁడు.

కం. "శ్రీలింపవలయుమది శ
బ్దాలంకారంబులైన యమకాది విచి
త్రాలిఖిత బంధభేదము
లోలిన యొక కొన్ని వాని నొనరింతుఁదగన్."

అని చిత్రబంధ కవిత్వములను ప్రత్యేకింపక ఒకటిగానే చెప్పినాడు. కవితారీతుల భేదములలో చతుర్విధములనిగాని మృదుమధుర చిత్రవిస్తరములని వ్రాయలేదు. కారణము నాటికి లేనందుననే.

*"మనతెలుఁగు ప్రబంధములలో మొట్టమొదట ఇట్టి విచిత్ర రచన చేసినవాడుగా ప్రసిద్ధుఁడు జక్కనతాత పెద్దయ. ఈతని రచన లేవియు కానరావు గాని ఈతనిం గూర్చి జక్కనయే తన విక్రమార్క చరిత్రమున నిట్లు వ్రాసినాఁడు. (సీసమాలిక)

సంస్కృత ప్రాకృత శౌరసేన్యాదుల। ఘటికలో నొకశతకంబుఁజెప్ప,
బ్రహసన ప్రకరణ భాణాదిబహువిధ। రూపకంబులయందు రూఢిమెఱయఁ,
జక్ర చతర్ఛద్ర చతురుత్త రాధిక। క్షుద్రకావ్యములు పెక్కులు రచింప,
నాంధ్ర కవిత్వంబునందుఁ బ్రబంధంబు। మేలునాదజ్ఞులు మెచ్చఁజెప్ప,

---

*చూ. నా నన్నెచోడుని కవిత్వము.

నిమ్మల నేరీతి నే ధాతువులనేమి। రసమునన్నైన వర్ణనము సేయ,
సరియేకసంధా, ద్విసంధా త్రిసంధల। దొడరినఁ బొరిఁబొరిఁగడవఁజదువ,
నెవ్వఁడేయవధాన మెఱుఁగు నయ్యవధాన। మునవాని కించుముల్లు సూప,
వృత్తకందముఁ గందవృత్తంబునుఁజతు। ష్కందంబు మొదలు గాఁగలుగుగర్భ
కావ్యవర్గముఁ జెప్పఁగాఁ బ్రబంధంబులు। గ్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁ
గా, నక్షరచ్యుతకంబు మాత్రాచ్యుత। కంబుబంధచ్యుతకంబు నామ
గోప్యఁబులుం గ్రియా గోప్యంబులును భావ। గోప్యంబులుం జెప్పగోష్ఠియందుఁ
బద్యంబుగీతి కార్భటి నొగిఁజదువంగ। నెల్లవిద్యల నంచులెఱుఁగనేర్చు,
తే. ననుచు నెల్లూరి తిరుకాళమనుజ విభుని। సమ్ముఖమ్మున సాహిత్య సరణిమెరసి,
మహిమగాంచిన పెద్దయామాత్యసుకవి। మనుమఁడవు నీ వంశమహిమయొప్ప."

ఈ పెద్దయ కాలమును శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమ రెడ్డిరాజుల చరిత్రమున (History of the Reddy Kingdoms Andhra University) చక్కఁగా నిర్ణయించినారు. పెద్దయామాత్యుఁడు నెల్లూరి తిరు కాళమనుజ విభుని సమ్ముఖమ్మున నుండినవాఁడు. తిరుకాళరాజులు ఇరువు రుండిరి. మొదటివాఁడు తిక్కనకు ప్రభువైన రెండవ మనుమసిద్ధికి తండ్రి చోడతిక్కరాజు, రెండవవాఁడు ఈ రెండవమనుమసిద్ధి కొమారుఁడు. మొదటి చోడతిక్కరాజునకు మనుమఁడు. ఈతఁడు పదమూఁడవ శతాబ్ది చివరి కాలమువాఁడు. జక్కన తాతయైన పెద్దయామాత్యుఁడు ఈ రెండవ తిక్కరాజు కాలమువాఁడని శ్రీ శర్మగారి యభిప్రాయము. క్రీ. శ. 1285 ప్రాంతము లేదా 1281.

దాదాపు 13వ. శతాబ్ది చివరికాలమున, గ్రంథస్థములు కాకపోయినను, కవితాగోష్ఠులలో బంధకవిత్వ చిత్రకవిత్వాదులుండినవని నిశ్చయింపనగును. మఱి పెద్దయ తెనుఁగునందా లేక సంస్కృతమందా తన కవితాశక్తిని చూపినది అను శంకకు అవకాశమే లేకుండునట్లు జక్కనయే 'ఆంధ్రకవిత్వంబునందు' అనిచెప్పినాఁడు. అప్పటి కింకను తిక్కనగతించి చాలకాలమై యుండదు. కవిత్రయమునందలి కవిద్వయమే వెలసియుండినది. ఆరణ్యపర్వశేషమును ఎఱ్ఱన యింకను పూరింపలేదు. అదియింకను పురాణకవిత్వములకాలమే. అట్టి కాలమున జక్కనతాత పెద్దయ 'ఆంధ్రకవిత్వంబునందుఁ బ్రబంధంబు, మేలునాఁదజ్ఞులు మెచ్చఁజెప్ప ... గర్భకావ్యవర్గముఁజెప్పఁగాఁ బ్రబంధంబులు

గ్రొత్తలు పుట్టించుకొని లిఖింపఁగా...మహిమగాంచి' యుండెను. సమకాలిక రాజస్థానములలో కవితా గోష్ఠులలో ప్రసిద్ధములగు నూతన కవితా రీతులు దేశమందు పర్యటకు ఒక్కొక్కప్పుడు చాలకాలము పట్టదు. ఆంధ్రకవిత క్రొత్త పోకడలు పోవుకాలమది. తిక్కనవంటివాఁడే కేతన సాహచర్యముచే షష్ఠ్యంత ములను గ్రహించి వానికొక నూతన స్థానమేర్పఱచిపోయినాఁడు. అంకితముల పద్ధతియు మారినది. అప్పుడే కాకతీయ రాజధానియందు కవులును ఆలంకారి కులును సంస్కృత మర్యాదల ననుసరించి అష్టాదశవర్ణనలను పేర్కొనిరి. నానారాజ సందర్శనము చేయు నమాత్యులకు కవిత్వమొక వినోదకరణము.

'అని మీతండ్రి మహత్త్వము । జనవినుత రసప్రసంగ సంగతకవితా
ఘనతేజులు కవిరాజులు । గొనియాడుదు రఖిలరాజకుంజర సభలన్'

అని జక్కన తండ్రినే పొగుడువారు. తాతను పొగడకుందురా? తెనుఁ గున ప్రబంధ పద్ధతి కీతఁడే జనకుఁడేమో: నాటి కాకతీయ శాసన వాఙ్మయ మీ విషయమును ఊర్జితము సేయుచున్నది.

సమకాలిక కాకతీయ సామ్రాజ్యమందలి శాసనకవులలో క్రీ.శ.1277 నాటికి ఈశ్వరభట్టోపాధ్యాయుఁడు లేక ఈశ్వర సూరి యనునాఁతడు చిత్ర బంధాదికవి కనఁబడుచున్నాఁడు. ఈయన రచించిన శాసనములు మూఁడు, క్రీ. శ. 1259, 1272, 1279 నాటివి మల్యాల వంశస్థులవి. బూదపూరు, (మహబూబునగరు) లో దొరికినవి. (Hyderabad Archaeological Series No 13-Inscriptions no 52, 51, 50).

'...మల్యాల గుండదండాధీశ్వరుండు మంత్రిపురోహిత సేనాపతి దేవారిక మహాప్రధానానంతసుభట విషవిదూషక పాఠక పీఠమర్దనట నర్తక రసిక రంజక కవిగమకి వాది వాగ్మి వందివైతాళిక హావకభావక గాయకాద్యనేక విద్వజ్జనంబులుం గొలువ సుఖోపవిష్టుండై యిష్ట కథావినోదంబులనుండి పాణి నీయ వ్యాకరణ విచిత్రకవిత్వతత్త్వజ్ఞుండును పదక్రమయుత యజుర్వేద పార గుండును నాత్రేయగోత్ర పవిత్రుండును మయూరార్య పుత్రుండును నైన యీశ్వరసూరిం గారుణ్యదృష్టిం జూచి...'

శాసనమేమో తెనుఁగే శ్లోకములు మాత్రము సంస్కృతము. చిత్ర కవిత. ఈ శ్లోకములకు ముందు ఇట్లు నిర్దేశించినాఁడు —'నిర్దంతము-ఆర్యా గర్భము-క్రియా పదభ్రమకము, పునరుక్తాభాస, పాదాదియమకము, క్రియా

పద త్రయ గోపకము, ఇందు విభాషపదాలు ఆఱు, స్తబకావళి, మిథునావళి, నిరోష్ఠము, అక్షరముష్టిక నిర్మూర్ధనము, అపశబ్దాబాష అనావృతాక్షరము, ఈపద్మబంధమునందు శ్రీగుండయ అనేది నామమున్నది. ఈశ్లోకము రెండు గోమూత్రికలు. ఈ రెండుంగూడ జాలబంధము, ఈ పద్మవృత్తమునందు వ్రాసినది గూఢ చతుర్థమైన పద్మవృత్తము. ఇది చదివేక్రమము ప్ర మొదలుగాను రేకులు తుదల మొదలిఅక్షరాలు పాదము, ద్వి మొదలైన మొదలి అక్షరాలు రెండువపాదము, వి మొదలైన రెండవ అక్షరాలు మూడవ పాదము, నాల్గవపాదము ఈ మూఁడు పాదాలందునున్నది, ఈపాదము లరిత కౌతుక రసప్రభతోషిత కాచకమ్ ... 'చక్రబంధము.'

ఒక చిత్రమేమనఁగా పెద్దయామాత్యుఁడును ఈశ్వరభట్టో పాధ్యాయులును సమకాలికు లగుచున్నారు. ఏక కాలమున దేశమందు ఈ చిత్ర బంధకవిత్వాదుల స్ఫురణమును విచిత్రమే. ఇట్లు తిక్కన చేయని, ఆయన శిష్యులును చేయని, యీచిత్రకవిత్వమును తిక్కనకు తర్వాత అచిరకాలములోనే తెనుఁగున కొందఱును, సంస్కృతమున సరే ఎట్లును పూర్వమార్గము ననుసరించిన కొందఱును చేయుచుండిరనఁగా నిదిదేశమందు కలిగినదే. సామ ర్థ్యముపై నాధారపడినందున అంతవ్యాప్తికి రాలేదని తెలియుచున్నది. జక్కన కాలము సుమారు క్రీ. శ. 1375. ఎఱ్ఱన కించు సమకాలికుఁడు, శ్రీనాథుని కన్నను పెద్దవాఁడు, తనకాలవు కవితారీతుల నిట్లు చెప్పినాఁడు.

"ప్రతిభాగుణధురీణ పౌరాణికత్రాణ, సకలపురాణశాస్త్రములయందు,
బరమార్థ చరితార్థ భారత రామాయణాది ప్రబంధకావ్యములయందు,
గల్పాంతరస్థాయి గద్యపద్యపాయకమనీయ చిత్రకావ్యములయందు,
రసికజనానంద రససుధానిష్యంద విలసిత నాటకావలులయందు.

సకల దేశభాషా విశేషములయందు,
వ౦ సఁ బ్రఖ్యాత మనఁగ నుత్పాద్యమనఁగ
మిశ్రమననొప్పు సత్కథామేళనంబు
లెన్ని యన్నియువిన్నాఁడ బిన్ననాఁడ."

ఇవన్నియు సిద్ధయామాత్యుఁడు చెప్పినట్లు జక్కన వ్రాసినాఁడు. తెలుఁగునఁగూర్చియా సంస్కృతమును గూర్చియా? తెలుఁగులో నాటకము లేవియుండినవి, నాఁడు లేవే? సంస్కృతాంధ్రములు రెంటిని కలిపి

ఉమ్మడిగా చెప్పుటయూ, రాజరాజ నరేంద్రుఁడు నన్నయ్యతో 'విమలమతింబురా ణములు వింటి ననేకములు...ఉదాత్తరసాన్వితమైన కావ్యనాటక క్రమములు పెక్కుచూచితి...' నని చెప్పినది తెలుఁగునుగూర్చి యుండదు. ఏలన నాటికి ఆంధ్రమహాభారతమే యింకను పుట్టలేదు. సంస్కృతమును గూర్చిచెప్పినదే. జక్కనదిగూడ గీతమునుండి 'సకలదేశభాషా' ఇత్యాది తెలుఁగును గుఱించినదిగా గ్రహింపవచ్చును. కాని క్రీ. శ. 1800కు చాల ముందుండియు ఇట్టి వాఙ్మయము ఆంధ్రదేశమందు (భారతదేశమందే) అభివృద్ధియగుచు వచ్చినది. వాఙ్మయ మందు కావ్యము ప్రఖ్యాతము ఉత్పాద్యము మిశ్రము అని మూఁడుతెగలుగా విభక్తమైనది. ఇదికూడ తెనుఁగును గుఱించియా సంస్కృతమును గుఱించియా? చిత్రకావ్యములును గుఱించికూడ ప్రస్తావించియున్నాఁడుగదా, అవేవీ? ఏ వాఙ్మయములో, మఱి 1300 నాటికే ఇవి ఆంధ్రవాఙ్మయమున నుండి యుండినయెడల కవిత్రయమువారిని వదిలిన నను, శ్రీనాథ పోతనాదులు కూడ దీనిని చేపట్టక తర్వాతికవులే ఎక్కువగా చిత్రకవిత్వమందు విజృం భించినది పరిశోధనీయముగాదా?

జక్కనకు, ఎఱ్ఱనకును ముందువాఁడు మడికిసింగన సకలనీతి సమ్మతమున, తన నీతి తారావళినుండి యీక్రింది పద్యము నుదాహరించినాఁడు.

'పలుకుల తీపును సరసము
చెలువము నడఁబెడఁగు బంధచిత్రముసొబగుల్
గలకలనఁ జూపవలదే
కలకంఠియుఁ బోలెఁగవిత కందనమంత్రీ.'

మఱితానేమి 'బంధచిత్రము' వ్రాసినాఁడు? కానరాదు.

ఎఱ్ఱననుగూర్చి జక్కన – 'ఈత్రయిఁదాఁ బ్రబంధపరమేశ్వరుఁడై... ఆచిత్రకవిత్వ వాగ్విభవజృంభితుఁ గొల్చెద'నని వ్రాసినాఁడుగదా, బంధచిత్ర కవిత్వ మీతని రచనలో లేనందున వట్టి రచనాధోరణినిగూర్చినదిగా తోఁచు చున్నది. తన నృసింహ పురాణము ప్రబంధమని చెప్పుకొన్నాఁడుగాని మను చరిత్రవంటిదా ? కాదు. 'చిత్రకవిత్వ' మనఁగా అర్థాలంకార శబ్దాలంకారములను పూర్వులకన్న నెక్కువగా వాడినాఁడనియే భావము.

మనకు మూలాధారమైన సంస్కృతవాఙ్మయమందన్ననో శిశుపాల వధాది కావ్యములయందు కనఁబడుచుండుటచేత మాఘుని కాలముననే అనఁగా

క్రీ.శ. 700 ప్రాంతముగాన ఎనిమిదవ శతాబ్దమునకే చిత్రబంధరచన ప్రాముఖ్యమునకు వచ్చినది. ఇందులో సంప్రదాయభేదములు కవుల ప్రతిభచేతనో లేక దేశకాల వ్యత్యాసములచేతనో కనఁబడుచున్నవి. చక్రబంధములు ఆంధ్రమున చాలవఱకు కొక్కతీయుఁగా నున్నవిగాని ఇటీవలివాడైన వావిలాల వాసుదేవశాస్త్రిగారు తామే మార్చిరో లేక ఏదైన సంప్రదాయ మనుసరించిరో తెలియదు. (చూ. ముందు)

అందరిని మించి మనకింకను చిక్కులు పెట్టుటకు నన్నెచోడుఁడు తన చక్రబంధమున కృతిపతి కృతికర్తృ నామములు వచ్చునట్లు వ్రాయలేదు. వలయమునందు మూఁడవ యక్షరములను చేర్చిన 'ములకం సేమైక' అనియు, ఆఱవ యక్షరములను చేర్చి చదివిన 'నామమందై దేవ' అనియు నగుచున్నవి. అర్థమేమో తెలియుటలేదు. ఇది నన్నెచోడును ప్రాచీనత కొక కారణము.... ఈవిధముగానే కవి రాజమార్గమను ప్రాచీన తమ కావ్యములో నీ నియతి కానరాదు. ఈ మర్యాద యిటీవల బుట్టెనని తోఁచుచున్నది' అని శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు 1914 లో (కు. సం. ద్వి. భాగ. పీఠిక) వ్రాసినారు. ఒకవిధముగా ప్రాచీనతను సూచించుట వాస్తవమేగాని ఏ కాలమును? ఈశ్వరభట్టోపాధ్యాయుని చక్రబంధమున కవియొక్కయు కృతిపతియొక్కయు నామములు గలవు. కాని శ్లోకమది. సంస్కృతము. శాసనముయొక్క తారీఖు క్రీ.శ. 1259 దీనినిబట్టి నన్నెచోడుడు సంప్రదాయమును ఎఱుగఁడని చెప్పవలయును. అట్లైన 1259కి ముందువాఁడగును అది కుదురదు. 1259 నాటి తిక్కన యున్నాడు. షష్ఠ్యంత సప్తసంతాన కృతిప్రారంభకర్త వ్యాద్యనేకవిషయములచేత ఇఁతడు తిక్కనకు తర్వాతివాఁడుగాని ముందువాఁడు కానేరడు. కాఁబట్టి ఈతఁడు భిన్నసంప్రదాయమైనను అనుసరించి యుండవలెను, లేదా ఈశ్వరభట్టుని సంప్రదాయ మింకను ఆంధ్రకవిత్వములోనికి ప్రవేశింపలేదని యైనను చెప్పుకొనవలయును కావ్యాలంకార చూడామణిలో ఈశ్వరసూరి పద్ధతియే యున్నది విద్యానాథుని లక్షణ లక్ష్యములలో ఈశ్వరసూరి పద్ధతి వచ్చిన తర్వాతనే ఆంధ్రకవు లీమార్గమును గ్రహించిరేమో ; ఇందువలన నొక విషయము తెలియుచున్నది. గీర్వాణాలంకారికుల పద్ధతులు ఒక వాహినిగా ఒక్కుమ్మడిగా ప్రవేశింపలేదని నన్నెచోడు డిందువలన ఈశ్వరసూరి విద్యానాధుల నడిమివాఁడు కాఁదగును.

శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారు ఈ కవియొక్క బంధగర్భ చిత్ర కవిత్వాదులను గుఱించి చాల వ్రాసియున్నారు. వీరియుపోద్ఘాతముకూడ మరల

నెప్పటికి పునర్ముద్రణభాగ్యము నొందునో తెలియదుగాన అందలి ప్రధానాంశ ములునైనను ఇచ్చట తెలుపుట మంచిదని వ్రాయుచున్నాను. —"ఈ గ్రంథము నందు బంధకవిత్వ గర్భకవిత్వ చిత్రకవిత్వములు విశేషముగ వ్రాయబడి యున్నవి. ఇందుదహరింపఁబడిన గర్భకవిత్వ చిత్రకవిత్వ బంధకవిత్వములలో 808 వ సీసపద్యమును బోలిన పద్యమిదివఱకు నాంధ్రగ్రంథములలో నెచ్చటను వ్రాయబడియుండలేదు. ఈపద్యమునందు గర్భితములన్నియు నఱువదికిఁ బయిగా నున్నయవి. ఈ యఱువది గర్భితములును రకారప్రాసఘటితములై యున్న యవి. ఇందుఁ గంధములుఁ తేటగీతులు, ఆటవెలదులు శోభాన మంగళారతులు శ్లోకములు, చౌపదములు, వృత్తములు, అష్టకములు ధవళములు, అర్ధ చంద్రికలు, ఉత్కళికలు రగడలు, దరువులు, ఉభయభాషాకందములు లోనగు గర్భితములు వ్రాయబడియున్నవి. ఇంతియగాక యీ సీస తేటగీతి యంతయుసర్వలఘువులతో గూర్పబడిఁ యున్నది. వెండియు సీసములలోనుండి వింశతిబంధకందము కూడ వ్రాయబడియున్నది. ముంజేతి కడియమున కద్దమేలః ఇప్పుడీ పద్యము ముద్రింపబఁడి మీ యెదుటఁ బెట్టబడియున్నదిగాన మేము విశేషము దీనింగుఱించి వ్రాయఁబనిలేదు.

"ఇట్టిపద్యమిదివరకుఁ దెలుగు గబ్బములలో నెవ్వరును వ్రాసియుండ లేదు...807, 809, 810, 817, 818. 821, 822 825, 826, 827, 831. 832, 847, 850, 863, 870 లో నగు పద్యములు గర్భితములచే వెలయుట చూడగా నిక్కవిని జతుర్విధ కవితా నిర్వాహకుండని చెప్పుటకు నించుకయైనను సందియములేదు. బంధ కవిత్వ చిత్రకవిత్వాదులకుఁ గొన్ని లక్షణములగపడు చున్నవిగాని గర్భకవిత్వాదులకు లక్షణములు బొత్తుగఁ గనిపింపవు. అప్పకవి గర్భకవిత్వమునకు లక్షణమును వ్రాయకనే తాను కొన్ని గర్భితవృత్తములు వ్రాసియున్నాఁడు. ఒక్క చతుర్విధ కందమునకుఁదప్ప మఱి దేనికిని నప్పకవీ యమునందు లక్షణమగపడదు గర్భకవిత్వ చిత్రకవిత్వములు కవియొక్క పాండిత్యాతిశయముపై నెక్కొనినట్లున్నయవి. అట్లుగానిచో పై నుదాహరించిన సంఖ్యగల యీ గ్రంథములోని గర్భిత పద్యములు వ్రాయుట కీకవికి లక్షణ మెట్లుండునని యూహజేయగలము. అఱువదినాల్గు గర్భితములు మాత్రము వ్రాయవలసినట్టు లక్షణముండునా? ఉండదు కాబట్టి వారివారి పాండిత్య ప్రగల్భత ననుసరించి గర్భకవిత్వమును వ్రాయవచ్చునని యూహజేయుచున్నారము.

"ఇఁక చిత్రకవిత్వ విధమెట్టిదనఁగా ననులోమ విలోమమము, ఓష్ఠ నిరోష్ఠ్యము, తలకట్టులు, గుడులు, శృంగములు, అక్షరవిలోమము, పద్యభ్రమకము, ఏకపది,ద్విపద, త్రిఁపది, యేకాక్షరి, ద్వ్యక్షరి, నిస్తాలవ్యము, నిష్కంఠ్యము, నిర్దంత్యము, నిర్మూర్ధన్యము, నిరంతస్థము, నిర్మూష్మకాదులచేఁ బద్యములు వ్రాసి రేని యది చిత్రకవిత్వమనిపించుకొనును. ఈ చిత్రకవిత్వమును నిక్కవియు నీగ్రంథమునందు 75, 214, 221, 222, 230, 366, 392, 807, 808, 832 శో 1, 2, 849, 877, 878 యీ పద్యములలో వ్రాసియున్నాఁడు. వీనికి లక్షణములు అప్పకవీయాది తెలుగుగ్రంథములయందుండును సాహిత్య రత్నాకరము లోనగు సంస్కృత గ్రంథములయందును వ్రాయఁబడియున్నవి.

"ఈ గ్రంథమునందు గోమూత్రికాబంధము, ఛత్రబంధము, నాగబంధము, ఖడ్గబంధము, చక్రబంధము, గుచ్ఛ బంధము, హలబంధము, అష్టదళ పద్మబంధము, రథబంధము, పట్టిసబంధము, త్రిశూలబంధము, పాదకాబంధము, చతుర్దళగర్భితద్వాదశ దళపద్మబంధము, పుష్పమాలికా బంధము, మహా నాగ బంధము, లో నగు బంధములు వ్రాయబడియన్నవి. ఈ బంధగ్రంథగ్రంథములు వ్రాయబడిన తాళదళసంపుటములు మాకు హస్తగతమై, బంధస్వరూపములు తెలిసినను బంధ లక్షణములు తెలిసికొనుటకు ప్రయత్నించగా కావ్యాలంకార చూడామణీ నరసభూపాలీయములయందుఁ గొన్ని బంధములకు మాత్రము ఈ క్రింద వ్రాయబడిన విధముగ లక్షణము వివరించి యున్నది.

(a) కావ్యాలంకార చూడామణియందు......

(చూ. కావ్యా. 'వలయదళంబు' నర. భూ. పదిచుట్లు నాఱు రేకులు...

"...పైలక్షణకారుల పద్యములు చక్రస్వరూపమును తెలిసికొనుటకు చాలదని విచారించి సాహిత్యరత్నాకరమును చూడఁగాఁదద్వ్యాఖ్యాన కర్తయగు బ్రహ్మశ్రీమల్లాది లక్ష్మణసూరి విరచితమగు మందరమను పేరుగల వ్యాఖ్యానము నందు నీ క్రింది లక్షణము శ్లోకరూపముగ వ్రాసియున్నది.

శ్లో॥ బధ్యతే షడరం చక్రం ప్రత్యరం తన్నవాక్షరం
త్రయాణామపి పాదానాం దశమం కర్ణికాక్షరం
ఆదితస్స్వస్వతుర్యాదై స్త్రయః పాదాశ్చతుర్థగాః
వర్ణాఃషష్ఠాణంత్యమారభ్య సంవదంతేంతి మాక్షరైః
మధ్యేద్వౌద్వౌవిసంవాదౌ షడరేషు క్రమాద్భవేత్
చతుర్థేసప్తమైర్వర్ణైర్వర్ణనం కవివర్ణ్యయోః"

అని వ్రాసియుండుటవలనఁ జక్రబంధమునకు లక్షణము పూర్ణముగాఁ దెలిసినది. బంధములలోఁ గృతిపతిపేరు, కృతికర్తపేరు నిమిడియుండు బంధమిది యొకటి గాని మఱి గనుపడవు. బంధస్వరూపమునందెన్ని నియమములగుపడుచున్నవో యవి యన్నియు శ్లోకమునఁ గూర్పబడియున్నవి. ఈ చక్రబంధమునందు శార్దూలవృత్తము ప్రాయికము...ఈ విధి ప్రకారము వ్రాసి చదివినయెడల మూఁడవవలయమునఁ గవిపేరును, ఆఱవవలయమునఁ గృతిపతిపేరును గోచరించును. ఈ నియమము మఱికొన్ని చక్రబంధములలో మఱియొక విధముగా గనుపించుచున్నదిగాని నాల్గవ వలయమునందెక్కడను గృతిపతి పేరగుపడదు. ఇది బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిలు బి.ఎ గారు విరచించిన "ఆంధ్ర రఘువంశము"లో ముద్రింపఁబడియుండు చక్రబంధమునందు 'గ్రిగ్గుదొరపతి' యని నాలవ వలయమున నగపడుచున్నది" తర్వాత వీరు ఆంధ్రవాఙ్మయము నందలి లెక్కలేని ప్రబంధములయందుండి ఉదాహరణములు చూపి... "నాలవ వలయమున నెవ్వరును వ్రాసియుండలేదు... పైన వ్రాయఁబడిన చక్రబంధ పద్యములయం దన్నిటను 3-6 వలయములయందు కవి కృతిపతుల పేళ్లగుపడు చున్నవి. వాసుదేవ శాస్త్రిలవారి చక్రబంధమునందు నాఱవ వలయమునఁ గవి పేరగుపడుచున్నను...ఏలకో...'వాసుదేవకృతి' యని తమపేర ప్రదక్షిణంబు గను బంధమున నెలకొల్పియున్నారు ఇది. చింత్యము"

ఈ ప్రబంధరాజములోని 861 వ పద్యమగు చక్రబంధమునందు మూడవ వలయమున 'కవి వేంకటాద్రి' యనియు, నాఱవ వలయమున 'ప్రబంధ రాజము' అనియు వ్రాసియున్నది. ఇట్లు వ్రాయుటకుఁ గారణ మూహించునది. సాహిత్యరత్నాకరములోని ఈ క్రింద నుదాహరించిన చక్రబంధ శ్లోకమున మూఁడవ వలయమునందు 'ధర్మసూరికృతిః' అనియు, ఆఱవవలయమున 'రామ గుణ నుతిః' యనియు, 'రథపదబంధ' మనియు వ్రాయబడియున్నది. ఇది చూడగా నీ చక్రబంధము నేర్పఱచుటయందుఁ బాండిత్యము ననుసరించి చిత్రముగాఁ గవి తన కిచ్చవచ్చినట్టు నేర్పఱుపవచ్చునని తోఁచుచున్నది.

"ఇఁక సాహిత్యరత్నాకరములోని చక్రబంధ శ్లోకమున చూడుడు

శ్లో॥ "దర్పాంధ ప్రసరాసురస్థిరమద ప్రాణప్రహారక్రియో<br>విష్ణుర్మన్మథ మన్మథస్థిరశివం భానుక్షపాకృత్ప్రభాం<br>దత్తాం సూనృత గుర్విపద్ధర విధస్ఫాతిః ప్రహేతిః పరం<br>రమ్యోమే దయయా విరాధదమనో యోగీంద్ర భావ్యశ్చిరం.

అత్ర తృతీయవలయే 'ధర్మసూరి కృతిః' షష్ఠే 'రామగుణనుతిః' అష్టమే 'రథపదబంధః' ఇతిచ ప్రతీయతే, బవయో రభేదాత్॥" అని సాహిత్యరత్నాకరములో వ్రాయఁబడియున్నది.

"ఈ చక్రబంధమును 'షడరచక్రబంధము' అని మఱియొక నామమున బిలుచుచున్నారు. 808వ సీసపద్యములోని వింశతిభేద బంధకందము చక్రబంధముతో నిమిడ్చి వ్రాసియున్నది. ఇందులకుఁ గారణము మృగ్యము. వెండియు ద్విచతుష్క చక్రబంధమనియు, చతురస్ర చక్రబంధమనియు, గరుడగతి చక్రబంధ మనియు అష్టాక్షర చక్రబంధమనియు నీ పేర్లం బరగు కొన్ని బంధములను వానివాని స్వరూపములను బళ్లారి జిల్లాలోని చినబల్లాపుర వాస్తవ్యులగు శ్రీమాన్ గోపాలాచార్యులవారు గురుమూర్తి నాయనింగూర్చి వ్రాసియున్నారు ఈ బంధభేదములకు లక్షణమువిచారించునది. శ్రీమాన్ గోపాలాచార్యులు విరచించిన బంధములన్నియు వాని నిజరూపములతో 1872 సంవత్సరమునందు ముద్రింపబడియున్నవి గాన వాని స్వరూపముల నాపటములందుఁ జూచుకొనునది.

(b) ఇఁక గోమూత్రికాబంధ లక్షణము కావ్యాలంకార చూడామణియందు నివ్విధముగా వ్రాసియున్నది.

20. తే. "వర్ణములుమూఁడు పంక్తుల వరుసవ్రాసి
మూలలం దోలి గోమూత్రలీలఁ జదువ
నుక్త్య పద్యంబు దానగు చుండెనేనిఁ
దనరు గోమూత్రికాఖ్య బంధంబుననగ."

ఈ గోమూత్రికాబంధనమునకు లక్షణ మితర గ్రంథములయం దగుపడదు. సాహిత్యరత్నాకరమునందు గోమూత్రికాబంధ, చక్రబంధ, మురజబంధ అష్టదళపద్మబంధ, ఛురికాబంధ, సర్వతోభద్రబంధ, ఖడ్గబంధ, హలబంధ, చాపబంధ, గుచ్ఛబంధ, మత్స్యబంధములు వ్రాయబడియున్నవిగాని వ్యాఖ్యానమునందు లక్ష్మణసూరిగారు అష్టదళపద్మబంధ, నాగబంధ, చక్రబంధములకు దప్పఁ దక్కిన బంధములకు లక్షణము వ్రాయరైరి. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానమునందును నిమ్మూటికి మాత్రమే లక్షణము వ్రాయఁబడియున్నది.

(c) ఇఁక అష్టదళ పద్మబంధమునకు నరసభూపాలీయమున నివ్విధముగ లక్షణము వ్రాయఁబడియున్నది.

౨౧ చ. "కనుఁగొన తేకు లెన్మిదియుఁ
గర్ణిక చుట్టిడి స్రగ్ధరాంఘ్రుల
న్మనుపటి యేడువర్ణములు
నుంగడ యేడుఁ బ్రవేశనిర్గతు
ల్పనుపడ నాల్గు దిగ్దళము
లన్నిఖియించి విదిగ్దళంబులం
దెనయఁగఁ బాదమధ్యగము
లేడును వ్రాయఁగఁ బద్మబంధమౌ.''

ఇందుకు సమమగు శ్లోకము సాహిత్యరత్నాకర వ్యాఖ్యానమునందు నివ్విధముగ వ్రాయబడియున్నది.

శ్లో॥ కర్ణికాది విభేద్వరాన్ క్రమాద్దిక్షు విదిక్షు చ
సకర్ణికాంత్సప్తదిక్షు విదితక్షుతువికర్ణికాన్
ప్రవేశనిర్గమాఖ్యాంచ దిక్షుతేస్యు శ్చతుర్దశ
వ్యవధానేన తానాద్యే దశేవ్యత్రత్వనంతరాన్.

నరసభూపాలీయము దీనిని స్రగ్ధరావృత్తముతో వ్రాయవలయునని విధించినను కావ్యప్రకాశికయందు నీ యష్టదళపద్మబంధము స్రగ్ధరావృత్తముతో వ్రాయఁబడక అనుష్టుప్ శ్లోకముతో నివ్విధముగ వ్రాయబడియున్నది ఎట్లనగా—

శ్లో॥ ''భాసతే ప్రతిభాసార । రసాభాతా హతావిభా
భావితాత్మ శుభావాదే । దేవా భావ తతేసభా''

సాహిత్యరత్నాకర ప్రతాపరుద్రీయముల యందు స్రగ్ధరలతోఁ గూర్చబడియే యున్నది,

(d) ఇఁక సాహిత్యరత్నాకర వ్యాఖ్యానమందు నాగబంధ లక్షణము

శ్లో॥ రేఖాభ్యాం చతురశ్రాణి చతుష్కోష్ఠాని కల్పయేత్
రేఖా ద్వయాంతరాళే స్యాద్యథాకోష్ఠే గృహాష్టకం
విదిక్షు కుండలీకూర్యా త్తద్రేఖాగ్రైర్యథాక్రమం
దిగ్రేఖాగ్రాణి బాహ్యాని యోజయే ద్దిక్త్రియేమిథః.

శ్లో॥ ఏకత్రతు ఫణ పుచ్ఛమేళనం కల్పయేత్తథా
అంతరాణ్యక్షయీ కుర్యాత్సం దంశాన్స్వ్య ర్యథామిథః
వర్ణావృత్తిస్థలాన్యత్ర కోష్ఠకోణాని షోడశ
సందంశానాం చతుష్కంచ కంఠశ్చేత్యేకవింశతిః.

శ్లో॥ ఆవృత్తిద్వ్యగ్మ వర్ణానాం నేతరేషా మిహక్వచిత్
అర్కేశానదశ బ్రహ్మ వర్ణాః పాదచతుష్కగాః
ఆవర్తైరన్నైర్‌ఋతాది కుండలేష్వ ప్రదక్షిణం
యద్వైవంస్యాత్తథావర్ణా స్ఫణాతో విన్యసేత్క్రమాత్.

శ్లో॥ త్రింశదష్టావింశతిశ్చ షడ్వింశతిరను క్రమాత్
వేష్టనత్రితయేవర్ణాస్స మాప్తిస్తు గుణాంతరే
సర్వమ్తన్ని ధాయాంత స్సంగృహీతం మహాత్మభిః.

శ్లో॥ విదిక్షలే కుండలితం స్వమంగం
స్వేనత్రిరావేష్ట్య విభంగి భంగం
క్షిప్త్వాగ్రశేపుచ్ఛమహేస్థితస్య
పాద్యః ఫణాతః ఫణిబంధ ఏషా.

అని నాగబంధలక్షణము సాహిత్య రత్నాకరమున వ్రాయబఁడి యున్నది. ఆంధ్రలక్షణ గ్రంథములలో నెచటను దీని లక్షణమగు పడనందున సంస్కృత శ్లోకమునే వ్రాసితిమి, వాసుకిద్వయబంధమనియుఁ గృష్ణ సర్ప ద్వయ బంధమనియు నాగలింగబంధమనియుఁ గొన్ని భేదములగుపడుచున్నవి, వీనికి లక్షణము విచారించునది

(e) రథబంధకందమునకు సంస్కృతాంధ్రములయందు లక్షణ మగుపడదు ఈ గ్రంథమునందలి 854 వ పద్యమగు రథబంధ కందమునందలి 1, 3, 7, 21, 29, 35, 39, 40 యీ సంఖ్యలు గల యక్షరములను జేర్చి చదివినచో 'శ్రీవేంకటేశ నీవేగతీ' అని బంధ మధ్యమునం దేర్పడుచున్నది. ఈ రథబంధమును సీసపద్యముతోఁ గూడా బ్రహ్మశ్రీ గోపీనాథము వేంకయగారి కృతమగు శిశుపాల వధమహాకావ్యమున వ్రాయఁబడియున్నది. అందలి నడిమి యక్కరములఁ జేర్చి చదివినయెడల "శ్రీరాజ గోపాలకృష్ణ యాచేంద్రమ హీరమణ" అని చిత్రము గనుపడుచున్నది. ఈ రథబంధములు చిన్నవిగను పెద్దవిగను నానావిధములుగఁ గవులు వ్రాసియున్నవి పెక్కులు గనుపడు చున్నవి. వీనికన్నిఁటికి లక్షణము విచారించునది.

18) ఇతర గ్రంథములలోని బంధకవిత్వ చిత్రకవిత్వ గర్భకవిత్వ పద్యముల నామములఁ దెలుపు పట్టిక.

1. పెద్దన ముకుందవిలాసమునందు వృత్త కంద గర్భిత సీసము. ద్విపద చౌపదలాలీశోభానమంగళారతి సువ్వాల ధవళాది వివిధ భేదసీసము కందద్వయ గర్భిత చంపకమాలికావృత్త విశేషబంధచిత్రకందము, శైలబంధ చిత్ర కందము, పుష్పగుచ్ఛ బంధ చిత్ర పంచచామరవృత్తము, చక్రబంధ చిత్ర శార్దూలము, ఛత్రబంధ చిత్రకందము, గోమూత్రికాబంధ చిత్రసుగంధి వృత్తము, నిరోష్ఠ్య ద్వివిధకందము.

2. కనుపర్తి అబ్బయకవి కవిరాజమనోరంజనములోనఁ గంద ద్వయ రుగ్మవతీ కమలవిలసితగర్భ క్రౌంచపద వృత్తము, గోమూత్రికా బంధకందము, గోమూత్రికాబంధ ఉత్సాహవృత్తము ఛత్రబంధకందము చక్ర బంధశార్దూలము ఖడ్గబంధకందము, పుష్పమాలికాబంధ చంపకమాల, నాగబంధ చంపకమాల, పాదభ్రమక కందము, ఓష్ఠ్యకందము, నిరోష్ఠ్య మహాస్రగ్ధర, సర్వతోభద్రబంధశ్లోకము, ద్వ్యక్షరకందము, ఆంధ్ర గీర్వాణ భాషాశ్లేషకందము.

3. పారిజాతాపహరణమునందుఁ బాదభ్రమకకంద, గోమూత్రికాబంధ కందము, నాగబంధ చంపకమాల, ఛురికాబంధకందము, చక్రబంధశార్దూలము, ద్వ్యక్షరకందము, ద్విపద క్రౌంచపదవృత్తము, గర్భిత భుజంగప్రయాత స్రగ్విణి.

4. బట్టుమూర్తిగారి నరసభూపాలీయనందు అష్టదళ పద్మబంధము, వృత్తకంద గర్భసీసము, చక్రబంధము.

5. భరతాభ్యుదయమునందుఁ బుష్పమాలికా బంధసీసము, పుష్ప గుచ్ఛబంధ విద్యున్మాలావృత్తము, మత్తేభ మణిగణనికర వృత్తద్వయ గర్భిత సీసము, కందపద్య గర్భిత చంపకము చక్రబంధ తరళవృత్తము, నిరోష్ఠ్య కందము, సర్వోష్ఠ్యకందము, అచలజిహ్వోక్తిగీతము, పాదభ్రమక కందము.

6. ఓగిరాల జగన్నాథముగారి సుమనోమనోభిరంజనమునందు నాగబంధచంపకమాల, ఛత్రబంధకందము, మర్దలబంధకందము, పుష్పమాలి కాబంధ చంపకము, గోమూత్రికాబంధకందము, పుష్పగుచ్ఛ బంధమాణవక వృత్తము.

7. సూరయవేంగనగారి రామరాజీయమున చక్రబంధశార్దూలము, నాగబంధ చంపకమాల, గోమూత్రికాబంధకందము, చతుశ్చరణ గర్భకందము, ద్వికంద గర్భక్రౌంచపద వృత్తము, నవగ్రహోష్ఠ దిక్పాలక దశావతారనామ గర్భకందము.

8. కూచిమంచి తిమ్మన్నగారి రసికజనమనోభిరామమునందుఁ గంద మణిగణ నికరవృత్తము సగర్భ స్రగ్విణీ భుజంగప్రయాత ద్రుతవిలంబిత వృత్త సీసము సగర్భమత్తేభకంద సీసము.

9 పిండిప్రోలు లక్ష్మణకవిగారి లంకావిజయమున నాగబంధ స్రగ్ధరా వృత్తము, కందమణి గణనికరవృత్తము, చతుర్విధ కందము, పుష్పగుచ్ఛ స్రగ్ధరా వృత్తము, ఉభయభాషాకందము.

10. అడిదము సూరన్న కవిజనరంజనము నందుఁ జతుర్విధ కంద గర్భిత మణిగణ నికరవృత్తము, చతుర్విధ కందగర్భిత ప్రమితాక్షరవృత్తము.

11. సుబ్రహ్మణ్య విజయమను విద్వత్కర్ణామృతమున చిత్ర గర్భిత వచనములో సీసగర్భిత పాదము, పుష్పమాలికాబంధ భాగము, నాగబంధ భాగములోనగునవియు, ముక్తపదగ్రస్త కందద్వయ గర్భిత చంపకమాలికా నాగబంధము, శైలబంధకందము, మణిగణనికరగర్భిత కందము, భుజంగ ప్రయాతగర్భిత స్రగ్విణి, తరువోజ సమపాదోత్సాహవృత్తావతంస భుజంగ ప్రయాత స్రగ్విణీవృత్త ద్విపదమంజరీగర్భిత దండకరూప చిత్ర సీసానుచర చతురంగతురంగ సకలగ్రహవారప్రచార దేశిక చిత్రగీతసీసము, మణిగణనికర గర్భితకంద పుష్పమాలికాబంధము, కాంభోజీరాగ పదగర్భిత చిత్రసీసము, సహనాఖ్యరాగ పదగర్భితసీసము, ముఖారిరాగ పదగర్భిత సీసమాలిక, ఆనంద భైరవిరాగ కీర్తనాగర్భిత సీసము, ముఖారిరాగ పదగర్భిత సీసమాలిక, చతుర్థ పాద గోపనకందము.

12. బహుజనపల్లి సీతారామచార్యులవారి సుందరరాజ శతకమునందు ఖడ్గబంధకందము.

13 మచ్చ వేంకటకవిగారి శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనిర్వచనకుశరాట్చరిత్ర మునందుఁ బుష్పబంధ చంపకమాల, కందగర్భ చంపకమాల.

సుగంధివృత్తము, సగర్భకంద మణిగణనికరవృత్త తేటగీతి, సగర్భ మత్తకోకిల వృత్త సీసము, శకటబంధ కందము, అనులోమ కందము.

24. సింహాద్రి వేంకటనామధేయ విరచితమగు చమత్కార మంజరి యందుఁ బుష్పబంధ స్రగ్ధరావృత్తము, చక్రబంధ శార్దూలము.

25. రామకృష్ణోపాఖ్యానమను శ్లేషకావ్యమునందుఁ గందగీత గర్భిత చంపకమాల, పుష్పమాలికాబంధ చంపకము, స్రగ్విణీగర్భ భుజంగప్రయాత వృత్తము, కందగర్భ మణిగణ నికరవృత్తము.

26. ధరణిదేవుల నాగయ్య విరచితమగు దశావతారచరిత్రమున నోష్ఠ్యాచల జిహ్వాద్వ్యక్షరీ కందము, పుష్పమాలికాబంధ చంపకమాల, గోమూత్రికాబంధ చంపకమాల, ఛత్రబంధ కందము, నాగబంధ స్రగ్ధరావృత్తము, పాద గోపన చంపకమాల, అనులోమ విలోమకందము, అష్టదళ పద్మబంధ స్రగ్ధర మంజుభాషిణీగర్భ యుత్పలమాల.

27 వేదాంతదేశిక విరచితమగు పాదుకాసహస్రమునం దుత్తర భాగమున గోమూత్రికాబంధము, మురజబంధము, శరబంధము, గరుడగతిచక్ర బంధము, ద్విశృంగాటక చక్రబంధము, ద్విచతుష్క చక్రబంధము, చతురర్త చక్రబంధము, అష్టదళ పద్మబంధము, సకర్ణికషోడశ పద్మబంధము, చతురంగ తురంగ పదబంధము సర్వతోభద్ర యివి వ్రాయబడియున్నవి. వెండియు బ్రహ్మశ్రీ వత్యము పరబ్రహ్మశాస్త్రిలవా రనేక బంధములు సంస్కృతాంధ్రముల యందు వ్రాసి యున్నారు. వానిలోఁ గంకణబంధము మిగులఁ జిత్రముగనుక నిందుఁ బొందు పఱచుచున్నాము. ఈ కంకణబంధమున నెచట నారంభించి చదివినను శ్లోకమేర్పడుచున్నది గాన నిందు 64 విద్యున్మాలా వృత్తములుగల కంకణ బంధము లగుపడుచున్నవి.

శ్లో॥ వ్యాసాద్యావా కామాద్యాయా  
పాల్యాత్వా గాత్రీలాత్రాశా  
స్త్రాఘ్రిధారాభా టీక్యాభ్యాప్యా  
లీనామేహా వై స్మాస్యాభా.

(విద్యున్మాలావృత్తాని 64 కంకణబంధోదితాని) పై నుదహరించిన గోమూత్రికాబంధ పుష్పమాలికాబంధ పుష్పగుచ్ఛబంధ ఛత్రబంధనాగబంధములు,

తెలుఁగుఁ గబ్బములలో నానావిధ పద్యములతో వ్రాయఁబడియున్నవి—ఎట్లనఁగా గోమూత్రికాబంధము సుగంధివృత్తము నందును ఉత్సాహవృత్తము నందును చంపకము నందును గందము నందును; పుష్పమాలికాబంధము సీసమునందును స్రగ్ధర యందును, చంపకమునందును, రథబంధ కందమునందును సీసము నందును; పుష్పగుచ్ఛబంధము పంచచామర వృత్తమునందును, విద్యున్మాలా వృత్తమునందును మాణవక వృత్తమునందును స్రగ్ధరావృత్తము నందును. నాగ బంధము చంపకమాలయందును; నాగబంధము చంపకమాల యందును స్రగ్ధరా వృత్తమునందును నిమిడ్చి వ్రాసియున్నది. ఒక బంధమునే వివిధపద్యములతో వ్రాయుటకు లక్షణ మెయ్యదియో విచారించునది.

(19) సర్వలఘుసీసము. అవకలివడిసీసము, అక్కలివడి సీసము, సర్వతః ప్రాససీసము, విషమసీసము, వడిసీసము, సమసీసము అను సప్తవిధ సీసములలో నీ గ్రంథమునందుఁ గొన్ని భేదములు 1 12-47-75-221-224 547-802-813-814- పద్యములలో వ్రాయఁబడియున్నవి. వీని కన్నింటికి లక్షణ మప్పకవీయములో వ్రాయఁబడియున్నది చూడుడు.

(20) హయప్రచారరగడ, తురగవల్గనరగడ, విజయమంగళ రగడ, ద్విరదగతి రగడ, విజయభద్ర రగడ, మధురగతి రగడ, హరిగతి రగడ, హరిణగతి రగడ, వృషభగతి రగడ అను నీ తొమ్మిదివిధముల రగడ లలో, నీ గ్రంథమునందు నైదు విధముల రగడలు మాత్రమే యుపయోగించి యున్నాఁడు. అవి యనఁగా ముప్పైతొమ్మిదవ పద్యమునందు హరిగతిని, 253వ పద్యమునందు మధురగతిని, 256-263 పద్యములలో వృషభగతిని, 360-808 లో గర్భితము (25) పద్యములలోఁ దురగవల్గనమును, 877వ పద్యములో ద్విరదగతిని మాత్రము నుపయోగించియున్నాఁడు. కొన్ని ప్రబంధములలో వీని భేదములు గల పద్యములు వ్రాయఁబడియున్నవి. ఆ యాయు భేదములకు లక్ష ణము అప్పకవీయమునందు వ్రాయఁబడియున్నది. ఇంతియకాక నీ గ్రంథము నందు 805 పద్యమును శృంఖలిఖిత రగడమని వ్రాయఁబడియున్నదిగాన నీదాని లక్షణము విచార్యము, దీని లక్షణ మప్పకవీయమునఁ గనుపడదు.

(21) కందము, పథ్య, విపుల, చపల, ముఖచపల, జఘనచపల, అని యప్పకవీయమునందుఁ జెప్పఁబడిన కందభేదములలోఁ గందము తప్పఁ

దక్కిన కందభేదము లీ గ్రంథమునం దొక్కటియైన నగుపడదు. 372వ పద్యము మాత్రము ఛన్నకందమని వ్రాయఁబడియున్నది. దీనిలక్షణ మెచ్చటను గన్పట్టదుగాన నిది విచార్యము. ఈ కందషట్కమునకు నప్పకవీయమున లక్షణము వ్రాసియున్నది. ఈ కందభేదము లెచ్చటను ప్రయోగింపఁబడని కతన వాని లక్షణములను నిందు వ్రాయుట ననుపయోగమని యెంచి పీఠికావిస్తరణభీతిచే విరమించుచున్నారము.

(22) ఈ గ్రంథమునందు 144వ పద్యము ఆర్యాగీతిరూపకందమని వ్రాయఁబడియున్నది. అప్పకవీయమున నుద్గీతి, యుపగీతి, ఆర్యాగీతి, కమలనగీతి పవడగీతి యని వ్రాయఁబడియున్నవి. ఈ గీతి భేదము రెండును బ్రయోగింపఁబడియుండుట గానము. ఇఁదుఁ బొందుపఱుపఁబడిన ఆర్యాగీతికి మాత్రము లక్షణము వ్రాయుచున్నాము.

22. "సమురిదీత పథ్యాకం
దముకన్నను నొక్క గురువుఁ దాఁకించినచో
క్షమనార్యగీతి యగుఁ
గమలాప్రాణేశ సహజ కందం బదియే."

ఇఁక పథ్యాకందలక్షణము జూడుఁడు.

23. "ధరలోఁ బథ్యాకందము
హరియగు నాఱవయెడ నల మాఱింటిఁబై
విరతియుఁ గూడఁగ మూటను
నెరయుఁ జతుర్గణములుగము నిలిచిన చోటన్.

(23) నరసభూపాలీయమున నరసరాజు మూర్తికవిచంద్రుని

24. సీ॥ బాణవేగంబును భవభూతి సుకుమార
తయు మాఘుశైత్యంబు దండి సమత
యల మయూర సువర్ణకలన చోరుని యర్థ
సంగ్రహమ్ము మురారి శయ్యనేర్పు
సోమప్రసాదంబు సోమయాజుల నియ
మంబు భాస్కరుని సన్మార్గఘటన
శ్రీనాథుని పదప్రసిద్ధ ధారాశుద్ధి
యమరేశ్వరుని సహస్రముఖ దృష్టి

గీ॥ నీక కలదటుగాన ననేకవదన
సదన సంచారభేదంబు సడలుపఱచి
భారతీదేవి నీజిహ్వఁ బాదుకొనియె
మూర్తికవిచంద్ర విఖ్యాత కీర్తిసాంద్ర

అని వర్ణించినట్లుగా నీ గ్రంథముగ వేంకటేశ్వరుండీ కవిని యీ క్రిందిపద్యముచే వర్ణించినట్లుగాఁ గవి వ్రాసుకొనియున్నాఁడు ఎద్దియనిన

25 సీ॥ అల విన్నకోట పెద్దన లక్షణజ్ఞత
శబ్దశాసనకవి శబ్దశుద్ధి
ప్రాబంధిక పరమేశ్వరుని యర్థమహిమం
బుభయకవిమిత్రుని పదలలితము
శ్రీనాథు వార్తాప్రసిద్ధి నాచనసోము
భూరికాఠిన్యంబు పోతరాజు
యమకవిధము మల్లయమనీషిచిత్రంబు
పింగళి సూరకవి వరుశ్లేష

గీ॥ నాంధ్రకవితాపితామహు నల్లికబిగి
ముక్కుతిమ్మన తేటయు భూషణంబ
లంకృతియు నీకకలదౌ తలంప లక్ష
ణకవి యప్పయ వేంకట సుకవిచంద్ర

ఈ పోల్కిఁబోలిన పద్యము లీ రెండు గ్రంథములయందుఁ దప్ప దక్కిన గ్రంథములయం దగుపడవు.

నరసభూపాలీయమును ఈ కవి చక్కఁగా చదివి దానిని చాలవఱకు అనుకరించిన భాగములు శ్రీ పూండ్లవారు ఎంతో విపులముగా వ్రాసియున్నారు.

(24) ఈ ప్రబంధరాజములోని 80రవది యగు నాది ద్విప్రాసదళ మధ్య త్రిప్రాసనియమాంత్య ద్విప్రాసదళ చరణాక్కిలిపడి సీసమును బోలిన పద్యము దశావతారచరిత్ర 8వ యాశ్వాసమున వ్రాయఁబడియున్నందున నిందు సూచించుచున్నారము..

26. సీ॥ స్మరహరాదిక సురాసుర దురాసద
ధరాధరవరాతిగ రథోత్కరముతోడ
మదవదాయతనదాస్పద పదావదఘనాం
గదమదావళరాజ ఘటలతోడ
మృగహయాదికరయా హృతిజయాహతభయా
వహ హయాత్యుత్తమావళుల తోడ
నలికులానలవలాహకబలాహితబలా
ర్ణవకులాచల భద్రతతులతోడ.

ఈ పద్యమునకును బైనుదహరించిన ప్రబంధరాజమునందలి పద్యము నందలి పద్యమునకు నించుక పోలిక యగుపడుచుండినందున దీని నిందు బొందుపరచితిమిగాని వేఱొండు యభిప్రాయముచేఁ గాదు.

(25) ఈ గ్రంథమున 789వ పద్యము ప్రాసభేదమని స-శలకు బ్రాసము జెప్పఁబడియున్నది, భారతాదులయందు నీ ప్రాస మగుపడదు. అప్ప కవీయమునందు స-ష ల ప్రాసమైత్రి యున్నట్లు చెప్పియున్నదిగాని స-శ లకు జెప్పియుండలేదు. అయినను నీ ప్రబంధరాజమునం దుదహరింపఁబడిన 'ఆశల ద్రువ' అను పదమును 'ఆసలద్రువ' నని వ్రాసినచో లక్షణవిరుద్ధము లేక యుండును. వ్రాఁతప్రతులయం దన్నిటను నీ పద్యమునకుఁ బ్రాసభేదమని నామ మిడి వ్రాయఁబడియున్నందున స-శ లకు నెచ్చటనైన ప్రాసముండునా యని విచారించగ మూర్తికృతమగు నరసభూపాలీయము తృతీయాశ్వాసమున నీక్రింది పద్య మగుపడుచున్నది.

27.మ॥ అసిజెండాడి విపక్షవృక్షముల శౌర్యాగ్నిచ్చటం బేల్చి శ
స్త్రశరచ్ఛేదమున గ్రనణోర్వీతలము న్సంక్షుణ్ణముం జేసి వై
ర్యస్సృగార్ద్రిం బొనరించి ప్రోఁది గొన కుద్యత్కీర్తి సస్యౌఘముల్
వెస సిద్ధించునె యంచుఁ బల్కు నరసోర్వీనాథు యోధావళుల్.

మఱియు నల్లసాని పెద్దనగారి చాటువు అని చెప్పఁబడు యీ క్రింది పద్యమునను గానఁబడుచున్నది ఎట్లనిన,

28.ఉ॥ కాశియు నీకరాసి కెనగాదు నృసింహుల కృష్ణరాయ యా
కాశిని జచ్చువారలకుఁ గల్గును జేతికిఁ బుట్టె నీమహో

గ్రాసిని ఖండతుండములుగాఁ బడిగూలిన వైరికోట్లకున్
భాసురరంభకుంభ పరి........ .. ... ... ... ... ........... ... ...

ఇట్టి ప్రాసములు పెద్దన్నగారి గ్రంథములయందెటనుఁ గనుపడవు.

29.క॥ ఈసరణిఁగామతంత్రా
భ్యాస పరిశ్రాంతి మిగులఁ బరవశమైనన్
*నా శిలిధాతుక్షయమై
మాసములోపలన వాఁడు మరణమునొందున్. జై.భా.

అని ప్రయోగద్వయ మగుపడుచున్నందున వీని కాధారమెయ్యదియని విచారించఁగా వేములవాడ భీమకవి రచితమగు నీ క్రింది చాటుపద్యము మాత్రమగుపడుచున్నది. ఎద్దియన

30.చ॥ బిసరుహ గర్భువ్రాఁతయును విష్ణుని చక్రము వజ్రివజ్రమున్
దెసలను రాముబాణము యుధిష్ఠిరు కోపము మౌనిశాపమున్
మసకపుఁ బాముకాటును గుమారుని శక్తియుఁ గాలుదండమున్
బశుపతి కంటిమంటయును బండితవాక్యము రిత్తవోవునే.

అను నీ పద్యము భీమన చెప్పినట్టు తెలియుచున్నది గాఁబట్టి పై చాటువును నాధారము జేసికొని సశలకుఁ బ్రాసమును గల్పించిరి. అయినను నిట్టి ప్రయోగములు భారతాదులయం దగుపడని కారణమును బట్టి దీనిఁ బ్రశస్తమైన ప్రయోగమని జెప్పుటకు సంకోచించుచున్నాము.

(26) ఈ గ్రంథమున 684-778 పద్యములు ప్రాసభేదమని వ్రాయఁబడియున్నవి. ప్రకారవ్రతువసుడులకుఁ బ్రాసము భారతాదులయం దగుపడుచున్నది.

31 ఉ॥ క్షత్రియవంశులై ధరణిఁ గావఁగఁ బుట్టినవారు బ్రాహ్మణ
క్షత్రియ వైశ్య శూద్రులనఁగాఁ దగు నాలుగు జాతుల న్స్వచా
రిత్రము దప్పకుండఁగ బరీక్షితు కాచినయట్లు రామనాం
ధాతృరఘుక్షితీశులు ముదంబునఁ గాచిరె యేయుగంబునన్.

---

*నాసిలియనినను సాధువే.

అని ప్రయోగ మగుపడుచున్నది. మఱియు 688వ పద్యము ప్రాస భేదము వ్రాయఁబడియున్నది. ఈ ప్రాసభేదమున కప్పకవీయమున

32.తే॥ రలలు తమక్రిందనుండఁ బైగ్రాలు వ్రాలు
ప్రాసవర్ణంబులై వానిఁ బాసియైన
గూడియైనను బెఱయడుగులను నిలుచు
.. ... ...... ......

అని లక్షణము వ్రాయఁబడి యున్నదిగాన నీగ్రంథమునందలి 688వ పద్యములోని నల్గవపాదమగు 'సీక్రియ సత్పుత్రకులు చరింతురుపుత్రా,' అను ప్రాసమును సాధువని గ్రహించునది, వెండియు నిందు 781వ పద్యము ప్రాస భేదమని వ్రాయబడియున్నది. ఈ లకారశ్లిష్ట ప్రాసమునకు రాఘవపాండవీయ మునఁ బ్రయోగమగుపడుచున్నది. ఎద్దియనిన

33.శా॥ లోకత్రాణరతిం దదాదిమ మహీలోకప్రవేశోత్కఖా
షాక్లప్త ప్రథమ ద్వితీయపదగుం జన్మంజుమంజీర గ
ర్జాకల్పామల రామ భారతకథా సర్గంబుల న్మించు వా
ల్మీకి వ్యాసులఁ గొల్చెదం దదుభయ శ్లేషార్థ సంసిద్ధికిన్.

అని ప్రయోగమగుపడుచున్నందున 781 వ పద్యమునందలి "నాక్లప్తకాంచుడంచును" అను నీ ప్రయోగము సాధువని గ్రహించునది.

(27) ఈ గ్రంథములోని 876వ పద్యము అష్టభాషా సీసము వ్రాయఁబడియున్నది. సంస్కృతము ప్రాకృతము శౌరసేని, మాగధి, పైశాచి చూళిక, అపభ్రంశము, ఆంధ్రము ఇవి అష్టభాషలనఁబడును. వీనిలో సంస్కృతం బు ప్రకృతియనియుఁ బ్రాకృతంబు వికృతియని వ్యవహరింపఁబడుచున్నది. ఇందు భారతీదేవి శైశవభాషితంబు ప్రాకృతము నాఁబడు. ప్రాకృతంబు సౌరసేని మాగధి పైశాచి అపభ్రంశము అని ప్రాకృతంబు అయిదు విధములైనది. పైశాచియందు భేదమించుకంతగలిగి చూళికాపైశాచియన నొప్పె, ప్రాకృతాదులు చెడి తద్భవములగుచు ననేకవిధములుగఁ దమలోఁ గలసి యుండుకతన నీ యాంధ్రం బేర్పడెగాఁబట్టి సంస్కృత ప్రాకృతాదులు

రెండును, ప్రాకృత భేదములగు శౌరసేన్యాదులైదును నాంధ్రభాష యొకటియు జేరి యష్టభాషలు నాఁబడు. చక్కఁగ సంస్కరింపఁబడినదిగాన సంస్కృత మనఁబడును. ఇది యెల్లభాషలకుఁ దల్లియగుకతన స్వర్లోకప్రశస్తము. మహారాష్ట్రదేశీయంబు ప్రాకృతంబు. శూరసేని దేశీయంబు శౌరసేని. మగధ దేశీయంబు మాగధి పాండ్యకేకయబాహ్లికానూప గాంధార నేపాళకుంతల సుధేష్ణ భోజకన్నోజకంబులఁ బొసఁగు మాటలు పైశాచి చూళికలనంబడు. ఆభీరవిషయ జాతము అపభ్రంశము. ఇయ్యాంధ్రదేశములోని భాష ఆంధ్రమనఁబడు, కావ్య నాటకాదులయం దొక్కొక తెగవారికి నొక్కొక భాషవిధింపఁబడియున్నది,... పైనుదాహరించిన భాషాష్టకోత్పత్తి వివరణము అప్పకవీయము, అహోబల పండితీయమునుంచి యిందు వ్రాయఁబడెనుగాన నందుఁ జూచిన విశదముగఁ గోచరించును. దశావతారచరిత్రయందుఁ బ్రాకృతభాషాగ్రథితమగు నొకసీస పద్యము మాత్రము గనుపడుచున్నది. ఇయ్యష్టభాషామిశ్రితమగు పద్యములు గ్రంథములయందగుపడుట యరుదుగ నున్నయది.

(28) ఈ గ్రంథమునందలి 880వ, నమస్కారశబ్దలక్షిత కంద ద్వయ గర్భిత వచనమున నూటయెనుబది దివ్యతిరుపతులను గుఱించి వ్రాయ బడియున్నది...నమస్కారశబ్దపర్యాయము లుభయభాషలలోనివి జేర్పఁబడినవి. ఇట్టి విషయములను దెలుపు పద్యము లెచటను గన్పట్టవుగాని యయ్యలరాజు నారాయణామాత్యునిచే రచియింపఁ బడిన 'హంసవింశతి' పద్యకావ్యము చతుర్థాశ్వాసమున మంజుగతి రగడయందు దివ్యతిరుపతులను గుఱించి వ్రాయఁ బడియున్నది. ఈ గ్రంథద్వయములోని నమస్కారశబ్దలక్షితములను దివ్య తిరుపతుల నామములను పోల్చిచూచిన నించుమించుగా సరిపోవుచున్నవి గాన నీ గ్రంథముల పౌర్వాపర్యము నరయునది. దివ్యతిరుపతియనఁగా వైష్ణవ ఆళ్వారాదులచే మంగళాశాసనము చేయఁబడిన శ్రీవైష్ణవ క్షేత్రమునకుఁ బేరు. అనఁగా దీర్ఘప్రసాదాదుల కర్హక్షేత్రము.

(29) ఈ గ్రంథమునందు 288వ పద్యము మొదలు 321 వఱకును మఱియు 393 మొదలు 510 వఱకును నలుమేలుమంగాభివర్ణనము వివిధా లంకారములతో వ్రాయఁబడియున్నది. సమిష్టిమీఁద నూఱు నూటయేఁబదిన్ర్యు వయవవర్ణనమునకై వినియోగింపఁబడియున్నవి. తెలుఁగుప్రబంధములయం

దన్నిటను నిట్టి పద్ధియములు కవులు వ్రాసియే యున్నారు. ఒక తెలుఁగు గబ్బముల యందేగాదు సంస్కృతమునందును వ్రాయఁబడియున్నవి............

శ్రీపూండ్లవారి గ్రంథము దొరకనందువలనను, ఇదంతయు మరల నెప్పుడు ఎవరు సేకరించి ముద్రింతురో యనుశంకచేతను, చక్కని విషయ ముండుటచేతను, చదువరులకు యథాతథముగా నుదాహరించితిని. ఇఁక శ్రీపూండ్లవారు హెచ్చరించి, వివరింపక విడిచినది, హంసవింశతితోడి పోలిక. తెలుఁగుకవులకు నాచనసోముని కాలమునుండి ఒక అలవాటు కనఁబడుచున్నది. అదేదనఁగా అష్టాదశవర్ణనలలోగాని వాని అంతర్భాగములలో గాని తమకాలపు శాస్త్రవిషయములను, పర్యాయపదములను ప్రయోగించుచుండిరి. నాచన సోముని కోటవర్ణనాదికముల పదములకు నేడు అర్థముచెప్పుట సులువుగాదు. అట్లే వృత్తులు వచ్చినప్పుడుకూడ, ఈ ప్రబంధరాజకవి ప్రతివిషయమునందును తన కవితా నైపుణితో తన సకలశాస్త్ర కలావేత్తృతను వెల్లడించినాఁడు.

(1) తన కవిత్వములో గల గుణములనిట్లు చెప్పుకొన్నాఁడు— 'సీ. అలవిన్నకోట పెద్దనలక్షణజ్ఞత' ఇత్యాదిముందే యుదాహృతము.

ఒక్క సీసపద్యములో ఆంధ్రవాఙ్మయ చరిత్ర సారమునిమిడ్చి, ఆ గుణములన్నియు తనలో కలవన్నాడు. తెలుఁగులో నాటికేర్పడిన రచనా ప్రక్రియలన్నిటిని ఒకచేయి చూచినాడు.

(2) పెక్కువిషయముల కిది యొక నిఘంటువో లేకపోయిన జాపితావంటిది. భగవంతునికి అంకితముగా తాను వ్రాయనీకావ్యమునకు గల సాహిత్యలక్షణములను మొదటి వచనమందే చెప్పినాడు— 'అంకితంబుఁగా శబ్దశాస్త్రరీతికి విఖ్యాతియును, ధ్వనులకునికియును, ఉక్తాత్యుక్తాదిగాఁగల యిరువదాఱు ఛందంబులకుఁ జందంబును, కావ్యాలంకార చూడామణికి కావ్యాలంకార సంగ్రహమ్మును, సకలా లంకారమ్ముల కలంకారంబును...' ఇత్యాదిగా కావ్య శాస్త్రవిషయమును గుప్పించినాఁడు.

వేంకటాచల పట్టణవర్ణనలో, వచనమున 'మఱియు నప్పురవరంబు మందాక్రాంతఫల సదవవన మంజరీ మందార సరజితోత్పలమాలికా...' అని యారంభించి 'మంగళమహాశ్రీ' వఱకుగల వృత్తములనన్నిటిని వరుస కూర్చినాఁడు.

78 వ జాతివార్తా వచనమున స్వామి 'వేంచేయునవసరంబున గురు మహా ప్రధాన మాండలికసామంత...' ఇత్యాదిగా ప్రారంభించి రాజాస్థానముల యందలి దెబ్బదిరెండు నియోగాలవారిని చెప్పినాఁడు. ఆంధ్రవాఙ్మయములో వీనిని మొదట పేర్కొన్నవాడు పాల్కురికి సోమనాథుడు. (క్రీ.శ. 1300-1323) ఆ వచనమందే ఉత్సవయాత్రావర్ణనలో జనుల వేషభాషావైఖరుల వర్ణించుచు అపూర్వపదములను జాపితాగా గ్రుచ్చివాని సంఖ్యలను కూడ తెలిపినాడు. 'చౌశీతి బంధపు వ్రాతపని ప్రతిమల చుట్టంచు చందురుకావి దుప్పటి బంగరు చెఱఁగులవలె వాటులును' తర్వాత 'పదిరెండుదండ' లట, 'పదిరెండు పరువడు'లట 'గతులు పదిపంద్రెండట,' 'పదిరెండు గాయమానంబు' లట, 'పదిరెండుమొనలట 'ఇట్టి వెన్నియో! సంగీతవర్ణన వచ్చినచోట సంగీతశాస్త్రోపన్యాసమే. నాట్యవర్ణనమునకు ప్రారంభించిన భరతనాట్య గ్రంథమునకు పునరుక్తియే-ఒకనాట్యప్రదర్శనమునే వర్ణించినాఁడు. భోజనాదినైవేద్య వర్ణనల సందర్భమున నాటి ధాన్యపు దినుసుల, జాపితాను, భక్షణముల పణ్యారముల జాపితాను, పండ్లదినుసులు, తేనెలదినుసులు, చక్కెర పిండివంటకముల దినుసుల జాపితాను,—ఈ విధముగా భాషకేగాక నాటిదైనందిన వ్యవహారమున నుండిన సకలవస్తుజాలమునకును, సకల విషయములకును సకలానుభవములకును, జాపితాలను తన కావ్యములోకూర్చి సాంఘిక చరిత్రకారులకు కావలసిన సాధన సామగ్రిని నిఘంటువువలె ఇచ్చినాఁడు. వీని నెల్లనొక యకారాది క్రమమున వ్రాసినయెడల అదియొక చక్కని సాంస్కృతిక విషయనిఘంటువగును.

ఇట్లెంతైనను వ్రాయుటకు అవకాశముకలదు. ఆంధ్రవాఙ్మయమందుగాని సంస్కృతవాఙ్మయమందుగాని ఈకవి యెఱుఁగని లోతు పాతులుగాని, చెప్పని విషయములుగాని కానరావు. ఈతనిగుఱించి తమ దాక్షిణాత్యాంధ్ర సాహిత్య చరిత్రలో శ్రీ డా. నేలటూరి వేంకటరమణయ్యగారిట్లు వ్రాసినారు. "వేంకటపతిని కవియని పేర్కొనుట కంటె శాస్త్రకర్తయనుట యుక్తము. పద్యములను ఛందోవ్యాకరణాది దోషములు లేక వ్రాసినంతటనె కవితాప్రతిభ లేనివాఁడు కవి కాజాలఁడు. వేంకటపతి వ్రాసిన గ్రంథములలో నేయల్పసంఖ్యాకములోతప్ప తక్కినవన్నియు ఛందోవ్యాకరణాలంకార శాస్త్రములకు సంబంధించినవే. శాస్త్ర విచారమునందు కవితాప్రదీపనమునకుగాని భావవిలసనమునకుగాని యవకాశ మధికముగనుండదు. ....కాని ఎట్టి యుత్తమలక్షణగ్రంథమైనను

వేంకటపతి కవిత్వాతిశయమును నిర్ధారించుటకది సహకారి కాజాలదు...లభించిన గ్రంథములలో నితని ప్రబంధరాజవేంకటేశ్వర విజయవిలాసము గొప్పది. అదియు నమూల్యమైన లక్షణగ్రంథమేకాని, తన్మూలమున నతని కవితాశక్తిని కొంతవఱకు గనుగొనవచ్చును. అతఁడు మహాసమర్థుఁడని యఱమరలేక పల్కవచ్చును. అతని పాండిత్య మద్వితీయము, శాస్త్రపరిచయమును లోకజ్ఞానమును అసాధారణమైనవి. ఛందోవ్యాకరణాది శాస్త్రవిచారమున కొంతయెగుడు దిగుడు గానవచ్చుచున్నను శైలి మొత్తముమీద సాఫైనదే. పదముల కూర్పునను గర్భ చిత్రకవిత్వ రచనలయందితని నేర్పు మఱియెవ్వరికిని లేదు ......బళి ! బళి ! యని మెచ్చదగదా యిట్టి యనన్యసామాన్య రచనా కౌశలమును. కాని ఇది యంతయు శతసహస్రావధాన కౌశలమువంటిదిగాని యుత్తమ జాతికవిత్వము కానేరదు."

ఈ మహాకావ్యమునకు చక్కని విపులవ్యాఖ్యను మహాపండితు లెవరైనను వ్రాయుట దేశోపకారకము. ఈ విధముగానైనను ఈముద్రణమును ప్రకటించుటకు నాకీయవకాశమిచ్చిన ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీవారికి చాల కృతజ్ఞుడను.

*30_11_1976*
మదరాసు_1

వేదము వేంకటరాయశాస్త్రి

# శ్రీప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము

## అవతారిక

శ్రీలలనామణీ ముఖ విశేష వికస్వరలోచనాబ్జ
షాళిమదాళిమేచక విభాన్వితమై తగు పారిజాత పు
న్మాలిక గల్వపూసరము మాడ్కి భుజాంతరపాళిమీఱ ను
ద్వేలదయాసనాథుఁడగు వేంకటనాథుఁడు మమ్ముప్రోవుతన్.

## ద్రాక్షాపాకము

సీ. రతికి భారతికి మేరలు నియోగింప నె
చ్చరిక నెమ్మదిఁగొన్న గరితమిన్న
గారాబమునఁ బాలకడలి ముద్దులు సేయ
నలరు నిల్లంట్రపు టాఁడుబిడ్డ
కలుములు వెదచల్లు కడకంటి చూపుల
మగని ఱొమ్మెక్కిన మాయలాడి
చెలికత్తెయగు మంచుమలపట్టి పోరామి
గీలుఁగొల్పిన రాయగేస్తురాలు

గీ. తనకడుపు చల్లఁగా జగత్రయముఁ గన్న
తల్లి జాబిల్లికినిఁ గూర్మి చెల్లెలయిన
మంగళాకార యలివేలుమంగ నాదు
తలఁపు లీడేర్చి మాయింట నిలుచుఁ గాత. 2

సీ. శ్రీకరభోగంబు సింహాసనంబుగాఁ
జుట్టుక్రొమ్మగఱాల మెట్లుగాఁగ
ఘనఫణాశ్రేణి ముక్తా ఛత్రరాజిగాఁ
జెలఁగు తన్మణులుపై కలశములుగ

వెలయునిట్టూర్పులు వీచోపుగములుగా
వినుతులు కాహళధ్వనులు గాఁగ
మేనితళత్త్రళల్మెలుకట్టులుగ నా
నందాశ్రు లభిషేచనంబుగాఁగ

గీ. నీలనీలాంబరము జముకాళముగను
జలరుహాక్షునకెల్ల రాజసము లొసఁగఁ
జాలి సురనుతిగను భోగిసార్వభౌము
శేష శ్రీభాష్యరచనా విశేషుఁ గొలుతు. 3

సీ. వినతాప్త చిరదాస్య విశ్రాణనోదగ్ర
నిష్ఠురాహిత కవినిగరణములు
సద్యోతిగమన వేళోద్యక్షతగ్రావ
తీవ్ర సంస్కృత భిదురవ్రణములు
మహనీయతర మేరుమందరోపమ గజ
కచ్ఛప గ్రహణ కర్కశకిణములు
శక్రనియంత్రితా వక్ర యక్షాధ్యక్ష
రక్షితైక సుధాహరణ చణములు

గీ. దనుజరాణ్ణీరసారణ్యదావ శిఖలు
దాస జన కల్య కల్యాణదాయకములు
పన్నగశయాన రథరాజ పన్నగములు
దురిత పత్త్రభిదాక్రీడఁ బరఁగు గాత. 4

ఉ. చిత్రచరిత్రుఁడైన సరసీరుహనేత్రుని యాజ్ఞచే మణీ
వేత్రము పద్మజాండములు వేగలిగింప నణంప బ్రహ్మగాఁ
బాత్రముఁ జేసి మించిన కృపాజలరాశిని సైన్యనాయకు
న్సూత్రవతీకళత్రుని విశుద్ధచరిత్రుఁ బవిత్రుఁ గొల్చెదన్. 5

చ. శ్రితహితభోగద న్గదను సేవకశంఖము శంఖము న్నము
న్నతి దిగధీశనందకము నందకము న్గుణజాతటంక్రియా

సతత హతో్గ్రదైత్యవర శార్ఙ్గము శార్ఙ్గముఁ బాలితత్రయీ
శతధృతి ముఖ్యదేవమునిచక్రముఁ జక్రము నాశ్రయించెదన్. 6

## ఆశీర్వచనము

ఉ. తమ్ములకెల్ల విందగు నిధానముఁ దమ్ముల యిండ్లకొమ్మకు
న్దమ్ముఁడు కన్నులైన గుణధన్యుని పొక్కిటఁ బుట్టినట్టి పొం
దమ్మిఁ జనించి మించిన విధాతకృపారసమొల్కు దచ్చి కం
దమ్ములమాకు నీవృత నుదారతమీఱఁ జిరాయు రున్నతుల్. 7

క. వీణా సరోజపుస్తక
పాణిన్, శుకవాణిఁ, బద్మభవురాణిన్, సు
శ్రోణిన్, బంభరవేణిన్
వాణి న్వినుతింతు మిగుల వాగ్వైఖరికిన్. 8

## పరికరాలంకార సహితాశీర్వచనము

చ. గిరిజ యురోజదుగ్ధములు క్రేపల జాఱఁగఁ గ్రోలి బొజ్జపై
వఱదలు వాఱు చాఱ లహివల్లభ హారము జోడుకోఁ డెగా
మెఱయఁగ బాలలీలలను మేలములాడుచు ముద్దుఁ జూపునా
కరిముఖుఁ జూచి నవ్వు శితికంఠుఁడు మాకొనఁ గూర్చు సంపదల్. 9

## భ్రాంతిమ దద్యుక్తి సంబంధాతిశయోక్తి రూపకాలంకార సంసృష్టిసీసము

సీ. ఘుపదాహతి నిర్దళద్రసాతలరవా
శని సద్భ్రమ జపద్భుజంగరాజ,
ముష్టిప్రకృత్తివాతోత్పతత్కౌతుకి
కంతుకీభవదద్రి గణరవమ్ము
మండలక్రమ చరన్మకుటగంగావర్త
మార్గభ్రమన్మరు మండలంబు
హస్తవిన్యాసవేగాభ్రగాశాకుంభి
మక్షికాక్రాంతేందు మధుపదంబు

గీ. సప్తపాతాళ సుగుణవజ్జలధిపటహ
మంబికాధవ తాండవాడంబరంబు
పుత్రపౌత్రాయురారోగ్య భోగభాగ్య
శాశ్వతైశ్వర్యములు మా కొసంగుఁగాఁత. 10

సీ. జానకీ రఘురామచంద్ర ఘోరవియోగ
కాండాకరప్లవదండవరము
మాల్యవదాది సమస్త దానవపత్ర
రథకంఠషటు వాగురాగుణంబు
సంజీవనిగ్రాహజలరుహోత్పాటన
నిరుపమ గంధసింధురకరంబు
లంకాపురీ మహాలంకారమణి గృహా
హుతిసమిద్ధర వీతిహోత్రముఖము

గీ. శస్త్రశౌర్యప్రశస్త ప్రహస్తతనయ
ధారుణీధర విదళనోద్ధత భిదురము
వాయుతనయ మహోత్తాలవాలమెపుడు
దండనాధార దండమై దనరుఁగాత. 11

క. రతిరాజ జనక తుల్యుని
మతి రాజీవ ప్రభవుని మహనీయ గుణా
రతిరాజ దంతరంగుని
యతిరాజాచార్యుఁ గొలుతు నస్మద్గురునిన్ 12

క. స్మరియింతు నారదుఁ బరా
శరు రుక్మాంగదు వసిష్ఠు శౌనకు దాల్భ్యు
న్నరుఁ బుండరీకు శుకునం
బరీషుఁ బ్రహ్లాదు భీష్ము వ్యాసు దనుజపున్. 13

సీ. వాగ్వధూ భోగిని వల్మీకు వాల్మీకు
వరపురాణాగమవ్యాసు వ్యాసు

నవవచశ్చాతురీ భవభూతి భవభూతి
శారదాహృద్ధన చోరుఁజోరు
సూరినీలాభ్రమయూరు మయూరు స
త్ప్రజ్ఞా సతీపంచబాణు బాణు
సారథీలోల మురారి మురారి ను
ద్దండ విలోకనదండి దండిఁ

గీ. గావ్యరచనా మహోల్లాసుఁ గాళిదాసు
బహువిచిత్రకళాహర్షు భట్టహర్షు
సత్కవీశ్వర సంతతశ్లాఘు మాఘు
నభినవప్రీతి నెంతయు నభినుతింతు. 14

క. అనవద్యశబ్దశాసను
ఘను నన్నయభట్టు నుభయకవిమిత్రునిఁ ది
క్కనమఖిఁ బ్రబంధపరమే
శు నెఱ్ఱప్రగడను దలంతు సూక్తి ప్రౌఢిన్. 15

సీ. జల్లిమాటలు నపశబ్దములను జజ్జు
టల్లికల్ ప్రావలం దతుకుఁ బలుకు
లును పునరుక్తములును వట్టి పూదెలుఁ
గాకుదెనుంగులుఁ గటువు లీఁచ
లును ప్రాలుమాలికలును సందియము లేమ
ఱఁపులు మఱఁగులు వ్యర్థపదములు ర
వణమీఱు బదునైదు వాక్యదోషములు గ
నక యవి సరవిగనక మినుకులు

గీ. జిగిబిగి మెఱవడియు వడి సొగసు లంద
చందములు నందచందము ల్పొందులు తెలి
య కవితాకవితల రాజహంస కవులఁ
గదసి కావుకావనెడి కాకవులు కవులె. 16

## ప్రతిజ్ఞాదికము

వ. అని నిఖిల దైవతాచరణంబును, ఆచార్య చరణ స్మరణంబును, సుకవి బహూకరణంబును కుకవి నిరాకరణంబునుం గావించి

క. సాహసమునఁ గృతిసేయఁగ
నూహించితి రసికసుకవి యూథము విని సం
దేహము గలిగిన నధిక
స్నేహమ్మునఁ దీర్చి మేలుఁ జేకొనవలయున్. 18

* తే. గీ. తప్పుగలిగిన చోటనె యొప్పుగలుగు
సరస కవితా చమత్కార సరణియందుఁ
గప్పుగలిగిన నీహారకరుని వలన
నమృతధార ప్రవృద్ధమై యలరినట్లు 91

తే. తప్పులనితోఁచునవియెల్ల యొప్పులగును
మధుమధుర మత్కవిత్వ చమత్కృతిఁ గన
రీతిరీతిగఁ గన్పట్టు జాతికనక
మొరయఁబడియాఱు వన్నెయై యున్నయట్లు. 20

క. ప్రతిపద్యంబుఁ జమత్కృతి
బ్రతిపదమును బ్రౌఢి మివులఁ బరగిన కృతి స
త్కృతిగాక జల్లిమాటల
యతకడపుం దడిక సభల కర్హంబగునే 21

క. మునివచనంబుల లెస్సగఁ
దెనుఁగించెద మనుచు వానిఁ దెలియక బెనుప

* ఈ పద్యము తెనాలిరామకృష్ణుని పాండురంగమహాత్మ్యమున నిట్లుండినది. "తప్పుగల్గినచోటనే యొప్పుగల్గు। నరసికావళి కవితల యవగుణములు। సరసకవితావశోక్తుల సరణియందు। నమృతధారాప్రవాహంబు లడరుఁ గాదె" (1-14) 'అవగణములు...లడరు' అని యనన్వితము. "యవగుణముల సరసఁ గవితా' యని పఠించిన సరిపడును" అని మా తాతగారు విమర్శ వినోదములో వ్రాసినారు. చూ. 51.

న్దెనుఁగును సంస్కృతమును గా
కెనసిన కబ్బములు సుకవు లెంతురె సభలన్. 22

## ఉపమాలంకారసీసము

సీ. బహువిధాలంకార పరిపూర్తిఁ జెలువొంది
కమనీయశబ్ద సంగతుల నలరి
వృత్తసౌభాగ్య సద్వృత్తి రూఢిగఁజెంది
బహుళార్థసంగ్రహ భావమలరి
చిత్రబంధమ్ములచే సోయగము మించి
లలితకలధ్వనులను జెలంగి
జాతివార్తా పాకరీతి శయ్యలమీఱి
నయమును జవరదనమ్ము గలిగి

గీ. నట్టి కవితాంగనారత్న మలరు వార
కాంతకైవడి ప్రౌఢిమ కతన దనదు
తలఁపు గీల్కొల్పి బుధులను వలవఁజేయ
మేలని రసజ్ఞులగువారు మెత్తురెపుడు. 23

క. చెఱకుతుదనుండి మొదటికిఁ
బరగఁగ రుచిగొన్నయట్టి భంగిని గృతియున్
సరణి విన మఱియు మఱియును
సరసత మధురిమము మీఱి చవు లీవలయున్. 24

క. తోఁచిన వగ రచియించెదఁ
దోఁచనిచోఁ జిలువగట్టుదొరతోఁడై వా
యాచకనె యానతియ్యఁగఁ
దోఁచ దసాధ్యంబు కవనధోరణి పట్టన్. 25

## పంచపాదిసీసము

సీ. శ్రీకరంబుగఁ బదిరెండవయేఁటఁ దా
రావళు ల్గూటియించి ప్రౌఢిఁగన్న
మునిమునిమీసంబు మొనయునేఁటనె యమక
శతక మొనర్చి కౌశలముఁగన్న

నిరువదియేఁటను శృంగారమంజరి
యు నుదాహరణఁజేసి ఘనతఁగన్న
నిరువదేనవయేఁటఁ గృష్ణమల్లకథ చ
తుర్భద్ర జెప్పి సంతుష్టిఁగన్న
మఱియును బాలరామాయణ ద్విపద పొ
సంగించి బహువిధచాటుకవిత

గీ. నతిశయముఁగన్న నాదుజిహ్వాంచలంబు
తనివినొందదు కులదేవతావతంస
వేంకటేశ్వర చరణారవిందమహిమ
నవనవోన్మేషలేశవర్ణనలఁగాక 26

వ. అని తలంపుచు నొక్కనాఁడు కర్ణాటతుండీర చోళపాండ్యదేశాధీశ ముఖనిఖిలధరణీవర మణిదత్త మత్తేభ ఖత్తలాణిక పల్యంకి కాందోళికాది చిరత్న రత్నఖచిత రుచిరాభరణ గణప్రకాశిత విభవుండును, సద్గుణ ప్రభవుఁడును; కార్యఖడ్గపటిమధురీణుండును, చతుష్షష్టి విద్యాప్రవీణుండును; సనక్షత్రాత్రినేత్రోద్భవోపమానాచ్ఛ ముక్తాగుళుచ్ఛచ్ఛవి సంకీర్ణకర్ణభూషావిశేషవదనుండును, దిగంతాయాత విద్వత్కవి వ్రాతబంధుజనావన సదనుండును; నిరంతరాభ్యాగత భూసురాన్నదాన నిష్ఠాతురుండును ధర్మరహస్య పరిశీలన కళావిఖ్యాతుండును; దైనందినాజ్ఞాన ప్రాపితపాపహరణ చుంచు చంచ దష్టాక్షరమంత్ర పఠనాసాదుండును ప్రభుసందేశ సకల లోకోపకార కృత్ప్రచారుండును, సత్యవాక్య ప్రతిష్ఠాగరిష్ఠుండును, సదాచారనిష్ఠుండును; అసాధారణ మేధాఘటిత మంత్ర తంత్ర సంధానాబంధన గంధవాహ బాంధవ నిర్గంధిత గంధాంధ దండనాధ యూధ స్కందాపార పారావారుండును, శారదా శారద నారదా నారద పారదా పారద శార సౌరాహారాచల నీహార మందార వనీసార వనివంచిత సమంచిత శాశ్వత విశ్వజనీనకీర్తి విహారుండును, పరస్త్రీ పరధన పరాఙ్ముఖశీలుండును, దీనదయాళుండును, కాశీసేతు మధ్యస్థల ప్రసిద్ధ నిజచరిత్రుండును, కృతసుధీజనస్తోత్రుండనగు నేను నిత్యకృత్యంబులఁ దీర్చి, నిశాసమయంబునఁ గర్తు మకర్తు మన్యథాకర్తు మతి

సమర్థ హరిత్కృపాపాణింధమాపాంగలబ్ధ బహువిధ భోజనామూల్య జాంబూనదాంబర సార గంధసార రుచిర విచికిల ఘనసార తాంబూల ప్రియకామినీ సంగీతగోష్ఠీ సుమశయ్యాష్టభోగాభోగ సంగతుండనై హంసతూలికాతల్పంబున వేకువఁదేఁకువగల సుఖసుప్తినున్న సమయంబున—

సీ. చక్రిదంష్ట్రోద్ధృత సర్వంసహా చక్రి
 చక్రివిదారణాశ్వంబువాఁడు
దాని రమావధూమాన ధనాదాని
 దానిరాడ్వరద సద్గరిమవాఁడు
మాలితనుద్యుత మర్దితఘనమాలి
 మాలిన్యవిరహిత మహిమవాఁడు
హరినీలాహ్వయధారుణీధ్రవిహారి
 హారిద్రరుచి నిచయంబువాఁడు
గీ. పాలమున్నీటిదొలఁకులఁ దేలువాఁడు
లీలఁ బొలదిండి మూఁకలఁ దోలువాఁడు
వేలుపులచాలు నేవేళ నేలువాఁడు
బాలవేంకటశౌరి నా మ్రోలనిలిచె. 28

తే. గీ. నిలచి జలధర గంభీర నిస్వనమునఁ
బలికె నాతోడవీనుల పండువుగను
మాకు నంకిత మొనరింపుమా కుమార
యీ విలాసంబునకు సాటి యెందులేదు. 29

## శబ్దచిత్రసీసము

సీ. సుకవిరాజులుగాని సుకవిరాజులుగారు
 పోలికనయభూరి ఘూరిగరిమ
గురుచంద్రములుగాని గురుచంద్రములుగారు
 తరముబుద్ధినిదాన దానపటిమ
సద్బుధేంద్రులుగాని సద్బుధేంద్రులుగారు
 ప్రతియుక్తి సౌభాగ్యభాగ్యమహిమ

రాజభద్రులుగాని రాజభద్రులుగారు
పాటిగీత్యనుభావ భావకలన
గీ. క్షితి నితని కని ఘనులెంచఁ బ్రతిభ గాంచి
తౌరః లక్షణ లక్ష్యశబ్దార్థ చిత్ర
రాజితాంధ్ర కవిత్వ సామ్రాజ్య సతత
పాలనాప్పయ వేంకటపతి కవీంద్రః 30

**నవగ్రహ నవరత్న నవనిధి నవరస ప్రతిపాదకప్రతాప సత్కీర్తిసీసము**

సీ. పద్మాప్త విద్రుమప్రభఁగరుణఁగని హి
మకరత శృంగార మహిమ వెలసి
ఘననీలగురుమణి ఖగరౌద్ర తనుగేరి
శంఖజకవుల హాస్యంబుఁజేసి
క్ష్మాజవిదూరజౌఘ ముకుంద భయమిడి
కృతవజ్రవరతమస్థితి శమమయి
బుధపుష్యరాగ సాద్భుతకచ్ఛఁ బరగించి
భానీలకుంద భీభత్సమందఁ
గీ. దగి మహాపద్మ గోమేధక గరిమ హార
వీరకేతు ద్యుతి జయించి వేఱువేఱ
నీ ప్రతాపంబు సత్కీర్తి నెగడె నౌర
యప్పయామాత్యకవి వేంకటార్యవర్య! 31

సీ. క్షితిలోన రాజగోపతి కృష్ణకృష్ణగో
పతిరాజు లీడని పలుకవచ్చుఁ
జింతింప సోమకౌశికభద్రభద్రకౌ
శిక సోము లెదురని చెప్పవచ్చు
బాగొప్ప హరిహరి నాగారి నాగారి
హరిహరులుద్దని యాడవచ్చు
నలువొంద శుక్రవ నవధర్మధర్మవ
నవ శుక్రులెన నీకనంగవచ్చు
గీ. ధనధృతి భృతిజయోక్తిగీత వితరణ వి
భవగుణవిలాస శక్తిమాబలరుచిజవ

శౌర్యమతి దయాశుచితాంగశాంతిసత్య
భావనీతుల వేంకటపతికవీంద్ర! 32

సీ. భూరి శృంగారంబు పొడగట్టి నిలిచిన
పోలిక ఘనరసస్ఫూర్తి జెలఁగ
వలపుబోవని నీటిపైఁదేలుపూవుఁ జ
ప్పరము దెఱంగున భావమలర
వనధిపీచికమీఁద వచ్చువాలుగవిధం
బున నొకమిన్నగమ్ముకొనిరాఁగ
నాడెమై ననుఁగాంచు ననుఁగాంచు మనుచును
బ్రాణముల్గల పదరాజి మెఱయ

గీ. మునుపు నిపుడుఁ గవులొనర్చు ననువుఁదెనుఁగుఁ
గబ్బములలోనఁ దెరనాటకంబులెస్స
గా వినికిసేయుగతి నలంకార సరణి
వెలయ రచియించు యప్పయ వెంకటార్య. 33

సీ. 1*అల విన్నకోట పెద్దన లక్షణజ్ఞత
శబ్దశాసనకవి శబ్దశుద్ధి
బ్రాబంధిక పరమేశ్వరు నర్థమహిమం బు
భయకవిమిత్రుని పదలలితము
శ్రీనాథువార్తా ప్రసిద్ధి నాచన
సోము భూరికాఠిన్యంబు, పోతరాజు
యమకవిధము మల్లయమనీషిచి
త్రంబుఁ, బింగళసూరకవివరు శ్లేష

గీ. నాంధ్రకవితా పితామహు నల్లికబిగి
ముక్కుతిమ్మన తేటయు భూషణుని య
లంకృతియు, నీకె గలదొ తలంప లక్ష
ణకవి యప్పయ వేంకటసుకవిచంద్ర. 34

---

సీ*1 ఈ మహాకవి "కావ్యాలంకార చూడామణి" యను లక్షణ గ్రంథము దెనుఁగున వ్రాసియున్నాఁడు (పూ రా.)

తే. గీ. జగతిఁ బాణిని లింగానుశాసనంబు
రామకవి లింగనిర్ణయక్రమ మొకటిగఁ
జేర్చి తెనుఁగుఁగబ్బంబుఁ జేసితౌర
గణపవరవార్ధిచంద్ర! వేంకటకవీంద్ర! 35

క. అతులిత విద్యానాథ
ప్రతాపరుద్రీయ భాసుర రసమంజరులన్
గృతులెంచ నాంధ్రకృతులుగ
వితముగఁ జేసితివి సరస వేంకటసుకవీ! 36

సీ. అమరమునకు బదు లభినవాంధ్రఘనిఘంటుఁ
గౌముదికెన యాంధ్ర కౌముదియును
(*గణయతిప్రాసలక్షణ సీసమాలికఁ)
నాంధ్రప్రయోగరత్నాకరంబు
నిఖిలరేఫఱకార నిర్ణయ పద్ధతి
షట్ప్రత్యయముల ప్రస్తారసరణి
దగనిర్వదాఱుఛందములకు వచనంబు
సమధికాలంకారసారమును మ

గీ. హాకృతులు సేయ మాపేర నీకె జెల్లుఁ
గాక వేఱకవులకునెట్లు గలుగఁ నేర్చు
నౌర నీశక్తియెక్కడనైనఁ గలదె
గణపవర మప్పనార్య వేంకటకవీంద్ర! 37

## ప్రతిచరణ త్రిస్తబక యమకైకనియమ భాసమాన సీసము

సీ. కవనమా భువనమా నవనమా నయహారి
నయహారి భయకారి జయము దయము
లవనమా యవనమా నవనమా నలభాతి
నలభాతి కలరీతి నానుమేను
భవనమా సవనమా న్యవనమా యవికాసి
యవికాసి పవిభాసి నదము మదము

సీ *(గణనీయ సర్వలక్షణ శిరోరత్నంబు) అని పాఠాంతరము(పూ.రా)

జవనమా పవనమా నవనమా సుకృతిత
సుకృతితత్వకృతి విత్సుగతి జగతి

గీ. వదన మామద మాతుల సదన మనుచు
ననుచు ఘనులెంచి పొగడఁగ వినుచుఁ గవుల
మనుచు దయమీఱ నప్పయార్యునికుమార
లక్షణకవి వేంకటమంత్రి లలితతంత్రి. 38

## ద్రాక్షాపాకము

శా. ఔరా! హారివచోరసస్థితి యహా హాశబ్దదాంపత్య మ
య్యారే! పాకబుజుక్రమంబు బళి శయ్యారీతు లోహో చమ
త్కారం బద్దిఱ జాతివార్తలు పురే! ధారాసమారూఢి మ
మ్మారారాజదలంక్రియల్ కవులలో మాన్యుండ వీ వన్నిటన్. 39

క. అనియానతిచ్చి నను ది
గ్గనమేల్కని యద్దిఱయ్య! గలిగెఁగదా నేఁ
డనుకూల నాయకుఁడు మో
హన మత్కృతి యనెడి కన్నెకని ముదమందన్. 40

క. నేనా దేవుని పేరను
నానావిధ శబ్ద గుంభన చమత్కృతిఁ గాఁ
బూనితి నొకకృతిఁ దద్దే
వానుమతిం దత్కటాక్ష మాధారముగాన్. 41

## కవి చరిత్రము

సీ. శోభిత రామాయణోభయ పరమభా
గవత చరిత్ర ముఖ ప్రబంధ
బంధుర వచనాను బంధ నందవరాన్వ
యాబ్ధి చంద్రాయమా నప్పనార్య
నందన వేంకటనాథ వర ప్రసా
ద ప్రసాదిత కవితా విలాస

*కాటేపలీ ముఖ్య గణపవర గ్రామ
శేఖర శిష్ట వసిష్ఠ గోత్ర

గీ. శోభమా నాశ్వలాయన సూత్ర మంత్రి
వర్య లక్షణకవి వేంకటార్య ఘనుఁడ
మంగమాంబామణీ గర్భ మహితశుక్తి
మౌక్తిక ప్రతిమానసమాన తనుఁడ. 42

క. అమితాశువు మధురము చి
త్రము విస్తారము చతుర్విధ కవితలను చి
త్రముగను వింశ త్యవధా
నముల ఘటియించు లక్షణకవివరుండన్. 43

క. పంకజ భవ భార్యాకర
కంకణ ఝుణ ఝుణ నినాద కవితాపటిమన్
బొంకంబగు లక్షణకవి
వేంకటపతి మంత్రి యనఁగ వెలసినవాఁడన్. 44

క. మును శ్రీహర్షుఁడు సంస్కృత
మునఁ జేయు ద్విరూపకోశమునకు దినుసుగాఁ
దెనుఁగున ద్విరూపకోశము
ఘను లెన్నఁగఁ జేసినట్టి కవిచంద్రుండన్. 45

క. జగతి న్వృత్త చతుష్టయ
మగణితముగఁ జిత్రకవిత లై దిర్వదిలోఁ
దగ మెప్పుగనం దగురూ
ఢిగఁ గల్పిత కల్పలత ఘటించిన ప్రౌఢన్. 46

క. వాణీవీణానిక్వణ
పాణింధమ పదనిబంధ బంధుర ఫణతుల్

*కామేపలీ - అని కొన్ని ప్రతులలోఁ జూపట్టు. ఈ విషయమును పీఠికలో జూడనగు (పూ. రా.).

రాణింప వసంతతిలక
భాణముఁ దెనుఁగించి కీర్తిబడసిన సుకవిన్. 47

క. సుకవులు పొగడఁగ మా
తృకలన్నియు వరుస నెసఁగనే దొలుదొలుతన్
జికిలిగఁ గఠిన ప్రాసశ
తకరాజము సేసినట్టి ధన్యుఁడఁ బుడమిన్. 48

తే. గీ. రహిగఁ బాణిని యాచార్య రచితమైన
ప్రక్రియా కౌముదిని యాంధ్రరచన చేత
సీసమాలికఁ జేసి ప్రసిద్ధిఁగాంచి
నట్టి యప్పయకవి వేంకటార్యమణిని. 49

క. ఎన్నఁ దెనుఁగునకు రాజను
గ్రన్నన యతిరాజునకును రమణయకును నే
జిన్నను ద్విపదనొనర్పను
జిన్నన్నను బిరుదుగద్యఁ జెప్పిన ఘనుఁడన్ 50

*సీ. (నవనవముగను జాంబవతీ విలాసమన్
చిత్రకావ్యము విరచింపవశమె)
చండవిద్యావతీ దండకరాజంబు
సులభమే రసము హెచ్చుగనొనర్ప
లాలితచక్రవాళాకృతిఁ దారాళిఁ
దరమె యన్యులకు వింతను ఘటింప
నఖిల పురాణ సారాంశ మిట్లలవియే
యిల్లవిలాసంబుగాఁ దెలుఁగుఁజేయ
వేంకటేశప్రసాదప్రవృద్ధ సుప్ర
సిద్ధ సారస్వతోద్బోధ సిద్ధికతనఁ
గలిగె సౌభాగ్యమని యెల్లకవులు నన్ను
నెన్ననే నెన్నుకొనుటెన్నఁ జిన్నగాదె. 51

*'ప్రాస బు లిర్వదేఁబదియతుల్లక్షణం । బుగసీసమాలికఁ బూన్ప వశమె' పా. (పూ.రా.)

మ. ఆనివార్యస్థితి ధారుణీసురులు మృష్టాన్నంబు లాదిత్యనం
దను వారమ్ముల ద్వాదశీవ్రతముల౯ దర్వీకరేంద్రాద్రి రా
యనికి౯ ప్రీతిగ నారగించగను నిత్యాశీర్వచోన్విత శో
భన మంత్రాక్షత వర్ధమాన విభవ ప్రాప్తుండనై భక్తితో౯. 52

## షష్ఠ్యంతములు

క. విద్యాగరిమ నిరస్తా
విద్యాగత వాసనాత్మ విద్యాగునకున్
సద్యోగర్భజ హృదయల
సద్యోగున కవనకేళి సద్యోగునకు౯. 53

క. శరదాగమాబ్జతులితా
శరదారుణ నేత్రయుగళ శరదాభునకున్
వరదానవేంద్రనందన
వరదానునకున్నల ప్రవరదానునకున్. 54

క. కమలాసనాది విభునకుఁ
గమలాసన కార్యమిత్ర కమలాసన హృ
త్కమలాకరలీలాకర
కమలాక్షునకున్ నతైక కమలకరునకున్. 55

క. నిగనిగచిలువమల వెలుం
గ గని దనరు సంతసంపుగని నిండిన ప్రే
మ గని యెడఁదెగని మది గ్ర
మ్మఁగ నిలిచిన చిన్నికల్మి మగువ మగనికిన్. 56

క. పుడమి గరికడుగని తొడుకు
నడగని నడగిను నొడయని నాణెపుముంజే
కడియంపు బాస గుబ్బలి
నడవడిగల విడిదినలరు నలనాయనికిన్. 57

క. స్నిగ్ధా౯త్మకత్వ విరహిత
దోగ్ధా౯శరహరణచండ దోశ్చక్రునకున్
వాగ్ధా౯వావక్రునకమ
వాగ్ధా౯వళి స్వపదభక్తి నతచక్రునకున్. 58

క. ఘృణికిన్ ఘృణిజిత ఘృణికిన్
ఘృణికిన్నతతాను వృత్తి హితఫణిగుణికిన్
గుణికిన్ దురగవిమణికిన్
మణికిన్ నిత్యసకల నిగమవిపణిపతికిన్. 59

క. శార్ఙ్గోపమానకంధర
శార్ఙ్గామర్దన నిరూఢ సారభుజబలో
పార్ఙ్గాస్రవప్రభునకున్
శార్ఙ్గిస్థల్యధిక శేషశైల విభునకున్. 60

క. దక్షాహిత రక్షాయత
వీక్షాయతి భువనభరణ విభవున కసురా
ధ్యక్షోధరవక్షోవర
శిక్షాకరభయదచక్ర శీలభవునకున్. 61

క. లంకానాయక లలనా
లంకారాపహజయాకలంకరతిక మీ
నాంక సహస్రాకృతికిన్
వేంకటపతికిన్ గటాక్ష విభవోన్నతికిన్. 62

## వక్ష్యమాణలక్ష్యవిశేషోద్దేశ వచనము

వ. అంకితంబుగాఁ బంకజాసన విలాసినీకరాంచల మణివిపంచికా ఘుమఘుమార్భటి నిర్భరసుధాప్రాదుర్భావాస్పదన వరస సందర్భంబు గుబాళింప విభవంబులకుఁ బ్రభవంబును, విద్యాధికులకు హృద్యంబును, విన్నాణంబులకుఁ జెన్నును, వింతలకు బొంతనంబును, విటవిటీజనంబులకుఁ బుటపుటయును, ఎరహుఁకు మెఱమెఱయును, పీటికి సీటును, శబ్దశాస్త్రరీతికి విఖ్యాతియును, ధ్వనుల కునికియును, ఉక్తాత్యుక్తాదిగాగల

యిరువదాఱు ఛందంబులకుఁ జందంబును, కావ్యాలంకార చూడామణికిఁ గావ్యాలంకార సంగ్రహమ్మును, సకలాలంకారమ్ముల కలంకారమ్మును, లక్షణసారసంగ్రహ సరస్వతీవిలాస సాహిత్యచింతామణి సత్కవిజన సంజీవని భీమానంత ఛందోముఖ్యాదష్టాదశ లక్షణంబులకు లక్ష్యమును, రేఫఱకార నిర్ణయమ్మును, అమరామరశేష విశ్వశాశ్వత శబ్దార్ణవ యాదవ వైజయంతికాకార నానార్థరత్న మాలికాకార హలాయుధ వాగురి కేశవ తారపాల ధరణి ధన్వంతరి ధనంజయ రభస విశ్వప్రకాశ మాధవ చింతామణి జయప్రతాప శుభాంగజయపాల క్షీరస్వామి ప్రణీత చతుర్వింశతి వివిధ నిఘంటు పదమ్ములకుఁ బదమ్మును, షష్టివిధయతి చమత్కారముల కాధారమును, చతుర్వింశతి ప్రాసమ్ముల కావాసమ్మును ప్రౌఢికిఁ బ్రౌఢియును, తేటకుఁ దేటయును, చిరంతనాంధ్ర ప్రబంధ జాలంబుల కాలవాలంబును, సనాతన విద్వత్కవి వితాన రచనావిధంబునకు ఘంటాపథంబును, ఇదానీంతన సత్కవినికాయంబునకు సహాయంబును, భవితవ్యకవికలాపంబునకు నాచార్యరూపంబును, నిఖిల భాషా విశేషంబుల కున్మేషణంబును, మూఢజాతులకు బోధహేతువును, ప్రౌఢ తతికి సమ్మతియును, సర్వజనకరంబున కాశ్చర్యకరంబును, బహు విధోచుంబిత కవితాచమత్కృతికి వసతియును, నగరార్ణవశైలర్తు చంద్ర సూర్యోదయోద్యాన సలిలకేళీ మధుపాన సురతి వియోగ *వివాహ కుమారోదయ మంత్ర* ద్యూతప్రయాణ రణనాయకాభ్యుదయ వర్ణనాతిశయంబున కాశయంబును, అన్యానధీన సుధీనవనవ స్తవ్య సర్వపధీన పాండితీ మండిత చమత్కారంబుగా నా రచియింపంబూనిన రసికజన హృదయోల్లాసంబైన ప్రబంధరాజ వేంకటేశ్వర విజయవిలాసంబునకుఁ గథాగ్రమంబెట్టిదనిన—

# శ్రీ ప్రబంధరాజ వేంకటేశ్వర విజయ విలాసము

## ఏకాశ్వాసము

### వేంకటాచల పట్టణవర్ణనము

### అనుప్రాసయుక్త అక్కిలివడిసీసము

సీ. సింధుర చితపాన బంధురాభ్రవితాన
 సింధురకటదాన గంధలీన
మారవ పవమాన సారవజ్జవమాన
 గౌరవ హయమాన సారమాన
మసమాన శరమాన లసమాన తేజోన
 లసమాన ధరణీనరసనిధాన
మమరనాథ విమాన సమరజయనిధాన
 సమరధాత్ర్యుద్ధాన కమనయాన
గీ. మమిత గోస్పర్ధి ఘనగోపురాగ్రభాగ
నిరత రమణీయ హీరమణీకదంబ
విశదకాంతి వినిర్మిత దశదిశాంత
ఘట్టనము వేంకటాచల పట్టణంబు. 1

### ముద్రాలంకారయుక్త వింశత్యుత్తరశతవృత్త గోపనోదాత్తవచనము

వ. మఱియు నప్పురవరంబు మందాక్రాంత ఫలసదన మంజరీమందార సరసిజోత్పల మాలికా సుగంధి సుందరీకనకలతామణి భూషణ ప్రభాకలితంబై రుచిరప్రభాత భాస్కర విలసిత మణిదీపికా మణివితానకాంతి చామర పుష్పదామ చంద్రకళవంశస్థాన మణిమాలికా సుందరంబై, భూతిలక వసంతతిలక, కుసుమితలతావేల్లిత మనోహర వాతోర్మినదీ ప్రఘోష

పణవ ద్రుతవిలంబిత లయగ్రాహి విహితోజ్జ్వల హారవర్తన వనమయూర మత్తకోకిల భ్రమరవిలసిత హంసశ్రేణి క్రౌంచఖచరప్లుత మనోజ్ఞంబై, మేదినీ జలధరమాలాకేతు మన్మహాస్రగ్ధర భాసురోత్తమాంగ భద్రక మత్తేభవిక్రీడితంబై, భూమత విభూతికాంత వినయ కవిరా జితంబై, సింహరేఖోత్సాహ శరభ క్రీడా శార్దూలవిక్రీడిత ప్రహరణోత్సుక వీరవిలసిత మత్తాపరాజితేంద్ర శ్రీకుమారలలిత తురగ త్వరిత పదగతి బంధురంబై, మేఘవిస్ఫూర్జిత తరల విద్యున్మాలాసు కాంతిమానినీ మదన విలసిత ప్రముదితవదన రతిప్రియకాంతంబై, చం ద్రికానిశావిచిత్ర భుజంగప్రయాతంబై, ప్రగుణమృగనాభిశాలినీ మాలినీ భుజగవిజృంభిత వీణారచన మధురోద్ధత గీతాలంబన మణిరంగ చిత్ర పద బై, మదరేఖాలసగతి గజవిలసి తాశ్వలలిత రథగమన మనో హరంబై, వంశపత్ర పతిత జలోద్ధతగతి కమఠవిలసిత హరిణీకవికంఠ భూషణ హంసరుత భ్రమర విలసితక్ష్మాహార బింబపద్మ సుకేసరంబై, సింహోన్నత వరవక్త్ర పలాశదళ పృథివీభుజంగంబై, క్షమాలక్ష్మి కళాజిత ప్రతాప పద్మనాభ ప్రియంవదాష్టమూర్తియై, సర్వతోముఖ మంగళమంగళమహాశ్రీ కలితంబై వృత్తరత్నాకరంబుంబలె నలరుచుండు, వెండియు 2

ఉ. జాతులమించి పల్లవరసస్థితియున్ సుమనోవితాన వి
ఖ్యాతివహించి శాఖలం బ్రకాశమునొందు సుభాషితద్విజ
వ్రాతముఁ గల్గి కాంచనపరంపరలన్ గణికా నికాయసం
భూతవిలాసమున్ వెలయఁ బొల్చుఁ బురమ్ముఁ బురీవనమ్ములున్. 3

## ఉపమాలంకారము

సీ. కమనీయ యంత్రతంత్రములచే విలసిల్లి
సన్మార్గలంఘన సరణిఁ దనరి
పైపూఁతవన్నియల్ పచరించి యంచిత
మణిమాలికాస్ఫూర్తి గణనకెక్కి
చిత్రాంశుక నిరూఢిచే సోయగము మించి
పరిఖాప్తి నెంతయు బరిఢవిల్లి
లోకమీఱు భుజంగ లోకసంగతిఁ గాంచి
ప్రద్యుమ్నలీలల రహి వహించి

గీ. శోభమానకవాటంపు సొంపుమిగిలి
సతత ముఖ్యాతి మహిమల సంతసిల్లి
వెలయు విటవర్యరీతి నవ్విటికోట
కదియు కొమ్మల సాంగత్యగరిమ వలన 4

వ. అట్టివిశాలంబగు సాలంబునకుఁ గ్రొత్తడంబు ఘటించు కొత్తడంబున,

## ప్రకృతాప్రకృతశ్లేష

సీ. అల నృసింహునియుద్ది నాగ్రహదశనొంది
యుగ్రునివలెఁ జాలనుక్కుమీఱి
నలినసంభవు మాడ్కి నలుముఖంబులనాని
తమ్మియందమున నాళమ్ముఁ గాంచి
సత్ప్రబంధము పోల్కి సారధ్వని నిగుడ్చి
శక్తిభృద్గతి శిఖియుక్తినొంది
సూకరపతిమేరనేక పద్ధతిఁ బూని
యలరువిల్తునిభంగి నతనుతఁగని

గీ. భ్రమము వహియున్నచోటఁ బాదుకొనియుండి
తురక కైవడి నల్లమందు పొడిమెక్కి
రాజువిధమున నరిపురిరాజివేచి
వఱలునోడక నెపరంగి వగపిరంగి. 6

తే.గీ. అన్నమున సున్నమున నృపుల్ బన్నమొంద
నెన్నిమందు లిడుదు రౌర యెన్నిమందు
లట్టి దొక శూరకర్మమె యనుచు నెట్టి
యెల్లమందుల గెలుపొందు నల్లమందు. 7

పంచచామరము కఱంగటన్నిరఁగిగుండు గుండువారి దారిమే
దురంబునౌ దురంబులో నెమర్కొనం బెనంగుచోఁ
బరస్ఫురత్తురంగపాళి బాళిఁదాఁకి దాఁకిత
చ్ఛరీర పారవశ్యకృత్ప్రసంగి సంగతిం దగున్. 8

## ఉత్ప్రేక్షాలంకారము

క. పరిఖాజలగతకైరవ
సరసిజములు గగనతార సమితియుఁ దనరన్
బురవప్రలక్ష్మి పదముల
శిరమున నర్పించువిరుల చెలువంబనగన్. 9

## రూపకాలంకారము

చ. పరిఖను వార్ధిలోఁ గలయ పారతరంబగు స్వర్ణముల్ పయో
ధరవరతస్కరుండు గొని దాటఁగఁ దత్పురలక్ష్మి గాంచి కిం
కరమణి గోపురోపరిముఖధ్వజహస్తము సాఁచి మోద పాం
డురకరకాళిదంతములు దుల్లఁగ నీరదసంజ్ఞ వర్తిలున్. 10

క. ప్రాసాదకేతువులు మరు
దాసాదనమునఁ జరించనది మత్పురికిన్
వాసవపురి యెనయే వివి
ధాసమవైభవములందు ననుగతిఁదెలుపున్. 11

## అక్కలివడిసీసము

సీ. సురవైరి సోమకాసుర హరణాత్త భా
సుర వేద ముఖర భూసురగుణంబు
జన్యకుంభిన్య సౌజన్యాభి యాతి ప
ర్జన్యోగ్ర పవన రాజన్యకంబు
భవసఖనిధి పరాభవ చమత్కృతి పటూ
భవదమిత ధనూరు భవకులంబు
ధరవహాగ్రజ బలోద్ధరణకేళి విధాన
ధర శక్తియుత హలధర జనంబు

గీ. చతుర కవిబుధగాయన సచివ రసిక
నటవిటీ వీరరాహుత్త భటచయంబు
దనరు నప్పురి మహిమంబు ధాతకైన
భుజగకులనేతకైనను బొగడఁదరమె. 12

తే. పుష్కరస్ఫూర్తిఁ జెన్నొంది భూరిదాన
పటిమచే మించి వైరిప్రభంజన ప్ర
శక్తిఁగని, నీలరుచిఁ బొల్చి సరసగతుల
ఘనములన మీఱు నప్పురి గజచయంబు.

తే. అమరలక్షణములను ఛందముల మీఱి
యతులగతులను బదచమత్కృతిఁ జెలంగి
కందముల మించి సత్కవికావ్య సరణిఁ
బొలుచు నుత్తమహయము లప్పురమునందు. 14

చ. చిలుకపతాణియు న్జిలుకుసింగిణియు న్విరియంపకోలలున్
దొలఁగఁగఁజేసి తత్పురము తోయజగంధులతో విహారము
ల్సలుపఁగ వేడ్కతోడ బలుజాడల రూపులు దాల్చినట్టి పూ
విలుతుని మూర్తులోయనఁగ పీటవిటుల్ జరియింతు రెప్పుడున్. 15

## రూపకాలంకారము

చ. అలకలె జాలసూత్రములు హారసమంచిత రత్నరాజి య
వ్వలయము పూస లాత్మ చెలువంబగు పుట్టికగాఁగఁ గామినీ
కులమును ధీవరవ్రజము కూరిమిచేష్టల మేఁత చేతఁ జూ
పులవలఁ జిక్కఁజేయు విటపుంగవ మత్స్యములన్ బురాంబుధిన్. 16

## అపూర్వప్రయోగము

చ. అలుగువహిన్ వెలార్చు పొగ రందము మీఱుచు స్నేహమానుప
ట్టుల నొర పైదలిర్చి యుదుటున్ గనుచున్ నసమాస్త్రకేళిలోఁ
బలు మొనలాని మాఱ్మగల పగ్గెలు తగ్గులుజేసి ప్రోలునన్
గలసి చరింతు రవ్విలువకత్తెలు మారునికత్తులో యనన్. 17

## రసప్రాధాన్యరూపద్విరుక్తి సీసము

సీ. మిలమిల బెళుకుచూపులు పేరెములు బాఱ
గలగల గజ్జెలు గులుకరింప
ఝుణఝుణహస్తకంకణములు మ్రోయంగ
గణగణ మొలనూలు గంట లువి య

ధళతళత్కమ్మలు తళుకుఁజెక్కులు డాయఁ
గిలకిలనగవులు సొగపులీన
గమగమ మైకదంబములు గుబాళింప
పరివరిగుబ్బెల రవణ మెసఁగ

గీ. మిసమిసల రత్నభూషణ ల్మెఱయ మెఱయ
రవరవల గుబ్బ లొండొంటి రాయుచుండ
నిగనిగఁగడానికాసెలు జిగిదొలంక
మినమినమెఱుంగురంగు నెమ్మేను లలర. 18

సీ. తులకించు జిలుఁగుదువ్వలువపైఁటచెఱంగు
జాఱువాపొళ్లు వసంతమాడఁ
జెమట కస్తురిబొట్టు చెమరి ఫాలములపై
నలకంబులకు వింతచెలువుఁ దెలుప
జడల నల్లిన మల్లెసరులఘుమ్మని తావి
మిండతుమ్మెదల కామెతలు సేయ
బిరుదందెల ఝళఁఝళరవమ్ములు త్రిదండి
సమితిగుండెలు ఝల్లుఝల్లు మనఁగ

గీ. సొలపునడపుల గౌనులు నులివడంగ
బిరుదులకు గాఁగ నొరయుచుఁ బురమువీథి
మేళములగూడి విటులతో మేలమాడి
కొనుచువత్తురు వెలజాతి కొమిరె లెపుడు 19

ఉ. వాడఁగనీకఁ గ్రొవ్విరులు వాసనకు న్బరువంపు సంపదల్
వీడఁగనీకఁ బుప్పొడులు వేమఱు సోమరిగాడ్పు సోకులన్
గూడఁగనీకఁ బల్లవుల కోరిక లీరికలెత్త క్రేవలన్
జూడఁగనీక నమ్మెదురు బోటులు దత్పురిఁ బూవు లెప్పుడున్. 20

సీ. ఇందు రమ్మనుచుఁ జోటిచ్చి తివాసిపైఁ
జెయివట్టి గూర్చుండఁ జేసి యతనిఁ
దొడతోడఁ దొడఁజేర్చి గడుమంచి బుక్కాముఁ
జూతుగాకంచు ముంజేత నునిచి

కల్జజవ్వాజి చొక్కమటంచుఁ జెవులందుఁ
　　　　జేర్చి చెక్కుల గోరఁ జేరఁదీసి
గంబురాయిట్టి దెక్కడలేదు చూడుమా
　　　　యని రవ కనురెప్పలందుఁ జరిమి

గీ. యిట్టిచెయ్వులఁ గూరిమిఁ బుట్టఁజేసి
పల్లవుల చేతిరొక్క మప్పరిమళములు
వెలల పేరిఁట దోచి యవ్వీటఁ బొల్తు
రలరు సరులమ్మ ప్రాయంపు టలరుఁబోండ్లు. 21

## నారికేళపాకము

సీ. సారవత్సౌరవోజ్జ్వల దంభ్రమిళృంగార
　　　　నూపురం బలిబిలి గోపురంబు
గణనదుర్లభమణి గణ ఘృణి చుంబిత
　　　　గోపురం బలిబిలి గోపురంబు
ఘనమునిజన చిరంతన పుణ్యసరణికి
　　　　గాపురం బలిబిలి గోపురంబు
కీర్తిత మోక్ష లక్ష్మీ పక్ష్మ లాక్షికిఁ
　　　　గాపురం బలిబిలి గోపురంబు

గీ. కాంతి చిత్ర వర్ణ నితాంత కాంతియుత వ
నీపథ మధులిట్పికపిక నికరకలక
లారవావృత వృషభాచలాగ్రమునకు
మూపురంబైన యలిబిలి గోపురంబు 22

## వృత్త్యనుప్రాసము

తే. హరియు హరియును హరియుఁగా సరియుఁ గరియుఁ
గిరియుఁ గరియును బలునెమ్మి పురియు దరియు
దరియు ఝరియును జమరియు విరియు సురియు
నరియుగంబును ధనరియుం డవ్వచరియు. 23

సీ. కొండలరాయనిఁ గొలుచు కవులకు బం
గారంపు ముడుపు మోకాళ్లముడుపు
పరమదాసవ్రాత పాపంబులెల్లను
గదలకుఁ దుడుపు మోకాళ్లముడుపు
దిటమున నెక్కి నెంతటివారి కొదవించుఁ
గన్నంత ముడుపు మోకాళ్లముడుపు
నానాదిగాగత నరసంతతికిఁ బున
ర్గమనంబు లుడుపు మోకాళ్లముడుపు
గీ. తలుపు లిడవట్టి మేనులు విడుపుఁ జూపు
నొడుపు మడినెంచి తపములు గడఁపు మునుల
పొడవు లెఱిఁగించు జీఁకటి నిడుపు గుహల
కడు పొలుపలరు నిడుపు మోకాళ్లముడుపు. 24

### యతి భేదము

ఉ. స్వామి తమోపహారి కురు సారస సారస సారసారజా
తామిత భంగ చారికి మదానవ దానవ దానవర్ధిత
శ్యామతనూ విహారి కళిజాలక జాలక జాలకాతి ద
క్షామల కైర వారిక విసార విసార విసార ధారికిన్. 25

క. హారి కిరి నేత్రపాలిత
వారికి నిజదాస దురితవారణ రాజీ
వారికి శ్రితక విరాజికి
వారికిఁ గోనేరి కతుల మగసిరు లిడుచున్ 26

సీ. వెలసి పూదేనెకాల్వల నిగుడ్చును రేపు
నెత్తావి తెమ్మెరల్ నినుచు మాపు
వలకారి దొమ్మితేఁటుల నల్గడల రేపు
మరున కందిచ్చు ముత్తరము తూపు
సంజీవనీ ముఖౌషధుల నెల్లెడఁ జూపుఁ
బుణ్యంపుఁ బ్రోవకుఁ బూటకాపు
శుకపికశారికా నికరంబులకుఁ బ్రాపు
బడలిక లన్నియుఁ గడల ఛాపుఁ

గీ. జిన్ని చిగురుల నింగిని జేయు తోఁపు
తేటకొమ్మల కొనల మిన్నేట ధోఁపు
పువుల వెలయుచుఁ బాపముల్ దివియు తోఁపు
బుద్ధి లేదనఁదగు తోఁపు పెద్దతోఁపు. 27

## ఉభయస్ఫురణము

చ. కనక నగాధినాయక శిఖా ముఖ జాగ్ర దుదగ్ర శీఘ్రలం
ఘన ఘన కాంచనాబ్జ కళికా తిలకాళి గురుద్గురు స్ఫుటాం
జన జనక ప్రభాసిత లసత్సిత సారససంగ భంగ మ
జ్జన జన కల్పితాఖి మతసత్పురుషార్థము పాండుతీర్థమున్. 28

సీ సంతత పనిత సజ్జన వృజిన విభంగ
ముహుర జహజ్జహద్బహు విహంగ
లసిత సముద్ర భటీ సముద్ర వరసంగ
సకల తీర్థైక నిజప్రసంగ
యుత్ప్రుతి ధ్వని దదర్యుభయ పార్శ్వ రథాంగ
గౌరీశ వినుత మనోరథాంగ
మృదుల వాసిత గంధ కదళికేక్షుల వంగ
ధరణీ రుహాగ్ర పతప్లవంగ

గీ. యూర్ధ్వ సారంగ సారంగ యుక్కుడంగ
కలిత సారంగ ముఖ విహంగమ పతంగ
పుంగవ గరుద్గణా నిల భంగురాంబు
కణమణి ఖచిత శృంగ యాకాశగంగ. 29

సీ. కాండ పాండిమహారి గగన ధున్యుపమాన
హాటక పంకేరుహ ప్రసూన
కమనీయ నవనీత ఖండ హాసన ఫేన
మహనీయ తరజీవ మణి నిధాన
నాగాహిత ప్రాహుణక నిమంత్రణ మీన
పులిన భూ నానాగ ఫలవితాన
సతత నిజస్నాత సాధుకిల్బిష దాన
తతవీచికా తిరస్కృత నదీన

గీ. దానవారాతి పాద పద్మ ఛరలీన
మాన సానూర దోధూయ మాన దీన
మానవాళికిఁ గురియు హేమంపుసోన
వానమావు మొకము బయకాని కోన. 30

## శబ్దార్థోభయశ్లేష

మ. తనులావు ప్రకటించుచున్ మొగములం దట్టంపుఁ గెంపుల్ జనిం
ప నుదారమ్ముగ రాజహంసతతి పద్మవ్యూహమున్ జొచ్చి నే
ర్పునఁ దద్వాహినియం దమందతరి వారుల్గాంచుచు జోడు పీ
డని మత్తారికులంబు తోరణము జంటన్ జేయు లీలా గతిన్. 31

## గౌడరీతి

చ. అగ మహిమావ లోకన సహర్షఘనాఘనఘోటకీభవ
త్రిగుణ ఘనాఘనౌఘ నిభ భద్రఘనాఘనసంఘ చంకన
ద్గగనధునీపనీప తదఖండఝరీలహరీ పరంపరా
త్యగణిత ఘుంఘుమార్భిత గుహాప్రతిఘోషము ఘోష మొప్పగున్ 32

క. ఏతాదృశ విభవమ్ముల
శీతాచల సేతుమధ్య సీమోర్జిత వి
ఖ్యాతావినూతన హరిని
కేతన సువిశేషగిరివర మలరున్. 33

సీ. నకులకులమ్ము లుత్సుక ఫణిఫణముల
చాయఁజాయల గొండ్లి సేయునపుడు
గన్నెలేళ్లకు నెల్లఁ జన్ను బాలెంతయు
బాలెంత పులినంపు లీలనొసఁగు
నెమలికీరము బిడారముల మెలఁగుసారె
కీరముల్ చిత్రబిడారములును
ముదినాగములు సింగములు తోపుఁదోపుల
జోడుగాఁగూడియే నాడునాడు

గీ. భయద రభసశరభ సముదయముఁ బ్రోచు
సాహసోదార భూదార చక్రమచట
జాతివైరంబులేక మజ్జాతిగాఁగఁ
గన్నువిన్కారిదిన్నె తేఁ డున్న కతన. 34

వ అయ్యహిమమహీధరంబు హిమధరంబు విధంబున సర్వమంగళకాభ్యుదయ విధానంబును, మేరుశిఖరిగరిమ ధర్మస్వరూప రంజితంబును, రాఘవ సైన్యంబుతేవ సుగ్రీవనీలగజగవయపనసరమణీయంబును, శ్వేత ద్వీపంబునుంబలెఁ బ్రధాన పురుషశోభితంబును, కృష్ణునిపగిది వేణునాద విలసితంబును, దానవారి వక్షంబుడంబున వనమాలికావీక్షణీయంబును, నలువనలువగు నలు వదనంబుల నలువున బహుశ్రుతులచె పశ్రుతంబును, నీలగళు జటాజూటంబు నీటున నాకాశగంగా ప్రసిద్ధంబును, ధనదా స్థానంబు పోలికఁ బుణ్యజనానందకరంబును, పురందర పురంబువైఖరి సుమనో మందిరంబై, పంక్తిరథ సంపదుపలాలితంబై, యయోధ్యా నగరిగరిమఁ దనరియు ఆరామాభిరామంబై, విభ్రమ బహులతా లక్ష్మణద్యుతి నలరియు శుభశరభరతాస్పదంబై, శత్రుఘ్నమహిమ నమరియు ప్రకటరాజస గుణోన్నతంబయ్యు లోకేశ్వర శోభితంబై, సుత్రబంధంబును వరారోహాంగంబునుంబోలె నానా విధాలంకార వస్తు ధ్వనిరుచిరంబై విలాసంబుల నొప్పుచు, రాకానిశీథియును రంభా కదంబంబునుంబోలి చంద్రానుగమంబై ప్రసన్నతాకారంబున నమరుచు, మందరాస్థలంబును శంకర సుఖపురంబులు వనంబునుంబోలె విలసద్గం ధర్వనికరంబై లతావితానంబును, వనేచరమందిరంబును రాజసౌధంబు నుంబోలె జాలకావృతంబై వీణాకల్పనంబును వసంతాగమనంబును, సముద్రంబునుంబలెఁ బ్రవాళాంతరంబై భాగ్యవంతుని శాంతంబును నందనంబును, రాగంబునుంబోలె సంతానకాంతంబై పద్మాకరంబును కువలయంబును, విష్ణుపదంబునుంబలె రాజహంస మంజుళంబై శంఖ చక్రాది సాధనంబును గురతరవారి వాహినీనివహంబును, నిజాంతస్థ భూభృద్ద్వారంబును ఘనాగమనంబును, రాజాభ్యుదయంబునుం బాడ బోదారతేజంబులు మహోమందరాగాభంగస్ఫూర్తియు నమరి అన్వర్థ కమలాధిపాహ్వయంబై, సురశాసనాస్పదంబయ్యు నసురశాసనాస్పదం బై, ఏకశరభమహావన ధుర్యంబయ్యు ననేకశరభ మహావనధుర్యంబై,

నిశాధిక జ్యోతిర్లతాధామ రూఢఁబయ్యు ననిశాధిక జ్యోతిర్లతాధామ రూఢంబై, నవరతాహీన శృంగారోన్నతంబయ్యు ననవరతాహీన శృంగారోన్నతంబై, వారణగంధంబయ్యు నవారణగంధంబై, సమఁబయ్యు నసమంబై, ఒక్కొక్కదిక్కున శతసహస్రారామ నదనదీఝురీపరీతంబును, ఒక్కొక్కచాయ ననపాయచిత్రవర్ణ శ్రీపర్ణకుముద సముదాయ సముద్యన్మకరందస్యందిబిందు బృందాస్వాదతుందిలేందిందిర సందోహ సంగీత భంగీతరంగితానషంగాఁబులోల నాళీకజాల డోలాందోళన ఖేల ద్బాలమరాళ చంచూపుటత్పుట దరాళ మృణాళవిశాల ప్రభానిస్తంద్ర చంద్రికా సారంబులగు కాసారంబున నలరుచు నొక్కొక్క చెంతఁ గాంతలతాంత కుంతాక్రాంత నితాంతతాంతాబ్జ కాంతకాంత వేదికాంతారామరకాంతాకాంతై కాంతరతాంతశ్రాంతి వారిక చేలాంచల జాయమాన పవమాన వలమాన విటపిపటలంబులం గనుపట్టుచు నొక్కొకవంకఁ బొంకంబగు నేణాంక పంకజా ప్తోపలోపలాలిత సారహీరపద్మరాగ మరకత ప్రముఖ మణిఘృణి రమణీయంబగుచు, నొక్కొక్కయిక్క దహరాకాశ విహారమాణ పరమాత్మానుసంధాన సమింధాన పరమానందానుభవ పరిపాక తృణీకృత లౌకికవ్యాపార పారీణ ప్రసిద్ధులు వెలయుచు నిప్పగిది నలరుచుండు. వెండియు ౨౫

## చౌపదములు

సతతభక్తియుత సన్మనిజాలా
కృత నుతులను రాగిలు పృథుశీలా
కృతయుగమునను సుకృతమయిలీలా
క్షితి వృషగిరియనఁ జెలగును జాలా.

సీతావరుఁ డూర్జితముగఁ జేరున్
రీతిఁ గనిన దారిని బొల్పారున్
త్రేతను హరిని ధరించిన చారు
ఖ్యాతిని గరుడనగంబున మీఱున్.

వెలయు జవ్వనఁపు ద్రేతల పొందుఁ
గలిగిన కృష్ణుని కత లెందెందు

దశము కొఁగనగు ద్వాపరమందు
నల శేషాచలమునఁ జెలువొందు
కలియుగమునఁ జేకాన్కల నలరు
గొలిచి యిచ్చునకొ్కలందిని సిరులు
బలువిడి నొసఁగెడు బహు వైఖరులు
నలువుగ వేంకట నగమన వఱలు. 36

సీ కలికాల కలుషాంధకార ఖండన చండ
పటిమ ఖగంబు వేంకటనగంబు
సాధ్వాళి సాధ్వస సర్పదర్పాద్రైక
గరుడఖగంబు వేంకటనగంబు
కవిదీనతాబ్ద సంఘాత ఘాతానల్ప
కల్పాశుగంబు వేంకటనగంబు
పర తురుష్కాశర హర రాఘవామోఘ
నటదాశుగంబు వేంకటనగంబు
గీ. ప్రబల కన దీషణత్రయ భావముక్త
సూక్తి సక్త విరక్తి సచ్ఛక్తి యుక్త
భక్త జన చిత్త చింతిత ముక్తి దఘన
చటుల భావనగంబు వేంకటనగంబు. 37

సీ. గురు దరీముఖ ఝరీ వరలహరీ వార
ఘుమఘుమ నిస్వన క్రమ నిగాఢ
మగమాంత కాంత నిష్యంది సన్మకరంద
తుంది లేదిందిరామంద గీత
మా పద్భిదోల్లసదప వర్గకామినీ
ప్రాపక జపశీల తాపసగణ
మదతిజేక్షణ హర్షకృద దభ్ర శుభ్రాభ్ర
సఖమహోభ్రంకష శిఖర నికర
గీ. మర్థిని స్తర్థి ఘనసత్వమాతి విచల ద
భంగరంగ దుత్తుంగ తరంగ వర్గ
ఘుళఘుళార్భటి సందర్భ కవన కవిఱ
సామిత తపఃఫలంబు శేషాచలంబు. 38

## హరిగతి వేంకటశైల రగడ

శ్రీ లసదల మేల్మంగా సంగీ । క్షేమ విశాలము వేంకటశైలము
నాళీక భవాది వినిర్మిత స । న్మణి మయసాలము వేంకటశైలము
జలయంత్ర ఘనాఘన ధారా । ప్రసవదబ్జాలము వేంకటశైలము
కలకల రవయుతశుకపిక నికర । గ్రసిత రసాలము వేంకటశైలము
తాలతమాల క్రము కల కుచముఖ । దాడిమసాలము వేంకటశైలము
సాలఘుమతియతి చింతిత కైవ । ల్యఘటనలోలము వేంకటశైలము
నానాసూన రసోద్భవ కుల్యో । న్నత కల్లోలము వేంకటశైలము
మానవనాయక దీయమాన స । న్మద శుండాలము వేంకటశైలము
జాత పాపనాశన పాపవినా । శన కీలాలము వేంకటశైలము
ధాతురూప వంశవివరభవ శ । బ్ద వరాభీలము వేంకటశైలము
సంసారచ్ఛల బలవద్గహన । జ్వలన జ్వాలము వేంకటశైలము
కంసాహిత కలహంత కంద సం । ఘాత వినీలము వేంకటశైలము
ప్రకటిత కుంద ముకుంద మకరవర । పద్మ సునీలము వేంకటశైలము
మకరధ్వజ తోరణ చామర పర । మ పదోత్తాలము వేంకటశైలము
బంధుర శిఖరోపరి పరిశోభిత । బల భిస్సిలము వేంకటశైలము
గంధద్రుమ సంవేష్టిత భుజ గా । గ్రజ కాకోలము వేంకటశైలము
శ్యేనానూనాశీఖగ కబళన । చిరకాకోలము వేంకటశైలము
దానవభేదన తల్ప వికల్ప వి । ధాయక తూలము వేంకటశైలము
కంతు సమంథన చందన పరిమళ । ఖని వాతూలము వేంకటశైలము
సంతత సేవిత భాగవతావే । శ సువాచాలము వేంకటశైలము
గంధగజాసుర హరణార్పిత మ । గ్రద్యుతి శూలము వేంకటశైలము
అంధుప్రస్ఫుట మర్కట కీటకృ । తాతత జాలము వేంకటశైలము
మహనీయ చతుర్దశ భువనావన । మందిరజాలము వేంకటశైలము
గుహపుష్కరిణీ చరజల కరణీ । గురుతరజాలము వేంకటశైలము
రాజిత రాజీవ కుముద సముదయ । రంజకజాలము వేంకటశైలము
నైజ పుణ్య భూమ్య వినిర్మిత తత । నాళీనాళము వేంకటశైలము
సార రసాభవకిటి దంత విభా । సారసనాళము వేంకటశైలము
ధారుణి కేసరి కాసర సంయుత । తత భూగోళము వేంకటశైలము

ప్రకటఫలిత కదళీ జంబూముఖ । భాసురకోలము వేంకటశైలము
కవిదారిద్ర్యోదద నామక భి । త్థర కుద్దాలము వేంకటశైలము
అతుల పురజన వృజిన ఘన హనన స। దాదిమ కోలము వేంకిటశైలము
పతిత యవనపుర లంకాపురహ్యా । త్పావని వాలము వేంకటశైలము
కాండ వికాండ తరీకృత సరసీ । ఘనశైవాలము వేంకటశైలము
తాండవ వేళోద్దండ లాసికో । క్త భరతతాళము వేంకటశైలము
జన భోజన దర్శన భయవ సుద । ర్శన కరవాలము వేంకటశైలము
ఘనపులినా వృత దీర్ఘ ఝల్లరీ । కల్పితవాలము వేంకటశైలము
హరిదురు వాసిత కుంకుమకస్తూ । ర్యతి జంబాలము వేంకటశైలము
పరిపరి విధములఁ బెనగొనియెడు పా । పంబుసరాళము వేంకటశైలము
మకరీ పత్రకనద్రామామణి । మంజుసలీలము వేంకటశైలము
సకల జననికర భవహృద్ది వ్యౌ । షది కత్తైలము వేంకటశైలము
చమరీవాలజ పవన్ఫ రణిత వం । శ విలస ద్వైలము వేంకటశైలము
అమర భ్రమరకచా గీత ప్ర । త్యారవ ద్వైలము వేంకటశైలము
కాకోదరతతి పతినామ విశ్రం । ఖల కృత్కీలము వేంకటశైలము
లోకేశ్వర నిర్జరవరసన్నుత । లోలుపశైలము వేంకటశైలము
ప్రాభవ భవమృదు శైత్య మాంద్యసౌ । రభయుగ్వేలము వేంకటశైలము
వైభవహవ ధూమ శ్యామలతా । వాటి స్థూలము వేంకటశైలము
కందర బృంద రటన్నిర్ఝర లం । ఘన జంగాలము వేంకటశైలము
స్యందన కరి తురగ గరుడవాహన । సంభ్రమహేలము వేంకటశైలము
అతుల బహిర్ద్వార వితానక కృత । హాటక చేలము వేంకటశైలము
గతి సురభీకృతనైక దిగంతర । గంధ బిడాలము వేంకటశైలము
కమల భవాకర కలిత విహరణో । త్కంఠ మరాళము వేంకటశైలము
అమిత మత పాషండ మదాప న । యన నారాళము వేంకటశైలము
పరవన తుందిల భద్రోన్నిద్రా । వనశార్దూలము వేంకటశైలము
గురుతర శాఖిశిఖోద్యద్రిం ఖ । ద్గోలాంగూలము వేంకటశైలము
సింధుర కందర సంధన్నోప ల । శేఖర కూలము వేంకటశైలము
సైంధవ సింధుర చంద్రమణి విలా । స జనన మూలము వేంకటశైలము
అనయ పుళింద పురందర నిర్మిత । హరి కుకూలము వేంకటశైలము
అనయము తపసుల కనుపును కజ్జా । యపు కండోలము వేంకటశైలము

మొక్కు వరాలందిడును వరాలు క । పురతాంబూలము వేంకటశైలము
గ్రక్కున తనుబొగ డర్థుల కొసఁగును। కనక దుకూలము వేంకటశైలము
తవులఁగఁ గనరేయి పగళ్లు దివిజ । దనుజులయాలము వేంకటశైలము
అవిరళమృగయోత్సవధావచ్ఛా । గాదిసృగాలము వేంకటశైలము
సూటిగఁబొగడని ఖలుల స్మిలకు । జొక్కుపుగాలము వేంకటశైలము
ఏటను బ్రహ్మోత్సవమున సుజనుల । కిచ్చువిరాళము వేంకటశైలము
ప్రాకటచతురాస్యోక్త నిగమ సా । రంపు నిరాళము వేంకటశైలము
ఏకాంగులకును వైష్ణవులకు సిరు।లిడు హేరాళము వేంకటశైలము
నార్ఖాదాధిపు పట్టిన హరియం । దపు వింటాలము వేంకటశైలము
ఆర్ఖేలనవర్ణిత విగ్రహమగు । హరిమణికీలము వేంకటశైలము
ఎసక మెసఁగ దిశ ఘూర్ణిలు వేలుపు । టింతులమేళము వేంకటశైలము
వసుధాదీశాంతః పురకాంతా । వారనిచోళము వేంకటశైలము
లఁబుగ నెలకొన పసులకుఁ దాపసు।లకు ననుకూలము వేంకటశైలము
అంబరచుంబి కదంబ కదంబ మ । హాహింతాళము వేంకటశైలము
శోభిత విద్వత్కవి రచితాకృతి । స్తుతిధారాళము వేంకటశైలము
ఆభపదోన్నతి పెరిగానుక యు । న్నది పాతాళము వేంకటశైలము
గజహయ పుష్కల ముష్కరతౌరు । ష్కబలపిఫాళము వేంకటశైలము
భజియింపని జనులకుఁ జూపును ద । ప్పక గోపాలము వేంకటశైలము
కొలిచినవారల కనువారము నొస । గూర్చు సుమాళము వేంకటశైలము
తలఁచినభక్తుల కభిమత శుభమతి । దయనిడు వేళము వేంకటశైలము
ఇరువుగ నుండెడు నరులకుఁ గోర్కుల । నిడు ఫలకాలము వేంకటశైలము
పరిపరిగతులను యతు లాత్మలఁ దలఁ।ప గదగు శీలము వేంకటశైలము
హరినతఫాలము వేంకటశైలము । హరులదువాళము వేంకటశైలము
దొరువులతాళము వేంకటశైలము । దొరలకు మేళము వేంకటశైలము
వేంకటశైలము విబుధావాలము । వేంకటశైలము వినమితనీలము
వేంకటశైలము విగతికరాళము । వేంకటశైలము వెన్నునిపాళెము.

## అనుప్రాసదళ వచనము

వ అట్టి గట్టునఁ జడలతుదల మొదలఁ బొదలు విరిబొదలరొదల వదలుచుఁ గదలెడు కొదమతుమ్మెద కదుపుల నెదుగఁ బదిలముగఁ గుదురఁగనిన

నిరుకప్పుకప్పుట కొప్పులగు గొప్పకొప్పులు, పున్నమవెన్నెల చిన్నెల మిన్నల మిన్నెల్లఁ జెన్నలర న్నెలకొన్న క్రొన్నెల నెఱయించ నెదురు నెన్నుదురులు, రేరాజాల తెలిడాలు నగఁజాలు వాలుగన్నుల జిగిగల వాలుగన్నులు, పొంకంబగు జింకల జంకించు బింకముఁజూపు చూపులు, శంపాలతికల సొంపునింపు సంపంగిసంపద గుంపులఁ బెంపుపెంపున స్ఫుటమ్ములయిన నాసాపుటమ్ములు, శ్రీవర్ణసవర్ణంబులగు కర్ణంబులు, నిద్దపు టద్దపుటుద్దుల తళకులఁ జెక్కుఁజెక్కులు, నిగరాలమగజాల నిగరాల గను నితాంతకాంతదంతంబులు, పగడంబుల జగడంబులపై జగడంబులు సేయు విడంబించు విడంబించు పదవుల పదవులగు పెదవులు, వలముఱి మురువుల చలమరితనంబున జయించ నగ్గలంబుగల గళంబులు, చొక్కపుఁ జక్కదనంబుల జక్కవకవఁ గవకవ నవ్వు నిబ్బరపు సిబ్బెపుటుబ్బు గబ్బిగుబ్బలు బిసమ్ముల వసమ్ముగాని వెక్కసమ్ములాడ నారజమ్మగు భుజమ్ములు, ఆకసంబుఁ గేకసల్కొట్టి కాకుసేయుట కౌనను కౌనులు, అవక్రచక్రంబు నాక్రమించిన ఘనజఘనంబులు, రంభాస్తంభ సంరంభంబు వెడలం గడలకు గడలుకొలుపు దొడలు. నాణెంబులగు తూణంబుల జాణతనంబులాడి ధిక్కరించు నిక్కులకిక్కులౌ పిక్కలరు పిక్కలు, సరససారసవిసరంబుల పసదనంబుల నిరసించు టొసపరి మిసమిసలు దెసల నెసఁగ నాస్పదంబులగు పదంబులు గలిగి వాలుగంట్ల పడగ కొమ రమరు మరువెలివమ్మి వాలుగంట్లకైపు సొలపు మెలపుల వలపుగొలుపు వాలుగంట్ల కింపులునింపు నవ్వనంబు సురపతి యాస్థానంబు కైవడి సుమనోవిరాజితంబై, రాజానుగ్రహంబు లీల నపరిమిత ఫలానుకూలంబై, అనుకూలాంగనారత్నంబు విధంబున ననవరతోత్సవకరంబై, పారావారంబుమేర వాహినీసమాగమస్థలంబై, మార్తాండునిరీతిఁ గమలానందకరంబై, కంఠీరవంబుచాడ్పునఁ గందరమావిలసితంబై, భారతంబు చందంబున భీమార్జున నకులసహదేవ శోభితంబై, వినాయకుని పగిది సువర్ణపత్రమంజుళంబై, మహానటుని జటాజూటంబువైఖరి యహీన భోగాస్పదంబై, నిగమనికరంబుతేవ నిరవద్యజటాధరంబై, కుకవి ప్రబంధంబు మర్యాద జాతి వార్తాశూన్యంబై, దూతికల తెఱంగునఁ బల్లవ రాగం బొనగూర్చుచు, సాదిపోలిక తావుల మావుల ద్రోదిసేయుచు, సౌర భావరణంబున కళికామితోత్కర్షణంబున కరంబుసొంపు సంపాదింపుచు,

భాసురకేసరంబులు రాజితాక్షతలును, అసమానసార లసమాన పరాగ పవమాన డింభములు చెలువలరు చలువతెరలను, శారికావార సుకర కలకల రవంబులు క్రొత్తముత్తైదువ పాటలును, ఫలాపేక్షాయాత నూతన రాజకీరావళులు నిచ్చలపుఁ బచ్చతోరణంబులును, కేకికేకా రావంబులు వందిమాగధ బృందమంగళాష్టకంబులును, కోకనద సముదయంబులు మెట్టుఁబుట్టికలును, కింశుకముకుళంబులు సురుచిరదీపంబులును, పికకులకలకుహూకారంబు లవార్యతూర్యరావంబులును, కిసలయవితానంబు వితానకపుఁ దానకంబును, కుందకళికా సందోహంబు మీసరపుసేస ముత్తెంబులును, జనులు ప్రియంపడి చూతమను జూతంబు నవకపుఁ బెండ్లి చవికయును, తత్సుమవిసర రసలుబ్దంబులై చుట్టుసోలి వ్రాలిన మదాళినీశ్రేణి నల్లపూసల చాలును, తన్మధ్యభాగలంబమానఫల గుచ్ఛంబు తాళియుంగా వనేందిరా మాధవు కల్యాణమందిరంబు తెఱంగునం దఱంగలించు, మఱియును—

## ద్వంద్వప్రాసకందము

క. వనము నిఖిలజన సంజీ
వనము సకృద్దర్శనాభివర్ధిత పుణ్యా
వనము నిరంతరమునిసే
వన ముపగతజీవనము సువనపావనమై. 41

వ. వెలయు దత్ప్రదేశంబున. 42

## ప్రకృతాప్రకృతశ్లేషయుక్త సాగరోపమానవన వర్ణనసీసము

సీ. అక్రాంత సౌమనస్సామోదకృప్రదస
సారముద్భవరస కారణంబు
తారప్రవాళశిత ద్రుప్రవాహస
ద్గాఢిహప్రభమోత్కళికాకరంబు
గోధికాహరిశంఖ కోలపోతస్థల
రాజీవరాజీవరాజితంబు
బ్రహ్మకళాగూఢ బాడబరాగప్ర
కాండవిఘోషరంగత్తటంబు

గీ. నగుచు శంకరవరబాణహారిపవన
శశధరాభ్యుదయాన్విత శ్యామలాభ్ర
సహితకమలాదిజన గురుస్థానమ య్యె
సంగు రంగుగ వనరాశి సరణి వనము. 43

## రూపకాలంకారము

సీ. వనమహీస్థలికొల్మి ఘనకింశుక ప్రసూ
నంబు లంగారవారంబు లచటి
యళిసమూహంబు నల్లలు మందపవనుండు
చర్మభస్త్రికమూతిచయము తలిరు
టాకుజొంపములు తీవ్రానలజ్వాలలు
వనపక్షిరవము తజ్జనితరవము
కమలకర్ణికతాయికడునొప్పు కేతకి
పసవదళంబులు పట్టుగార్లు

గీ. గాఁగ నామనియను లోహకారకుండు
మదనునకు జిగురువాలును మంచిపెరుల
శరములును వాడిగాఁజేసి బిరుసుపదను
పువ్వుదేనియ నించె నాఁ బొల్చు నచట 44

## మధుమాసవర్ణనము

## సప్తానుప్రాస చరణసీసము

సీ. ఒకమేర మృదుసౌరభకిశోరకసమీర
మొకయోరవరకీరపికవిహార
మొకచోటనాఖేట సకలాట పికకూట
మొకబాట వనఘోటక కుల ఝాట
మొకపొంత సులతాంత నికరాంతరప్రాంత
మొకచెంత ఫలసంతతి కుజకాంత
మొకతోయ ఖగనాయ కుదాయ సముదాయ
మొకచాయ సురగాయక కృతగేయ

గీ. మమిత సారస సారస కుముద నికర
మధురసాసార మధురసా మధురసార
భృంగసంగీత భంగీతరంగితాభి
లాగమంబు దలిర్చు చైత్రాగమంబు. 45

లయగ్రాహి. అంత ముదిత ప్రసవకుంతము విచిత్రసుల
తాంతము నిరస్తము నిశాంతము తరుశ్రీ
మంతము గళన్మధు వసంతము పికోల్లసదు
దంతము ఘనర్తురసవంతము రసాలా
క్రాంతము విటీవృత వనాంతము హితానిల ని
శాంతము కనచ్ఛుకశకుంతము నికుంజో
ద్భ్రాంతము కరాళికులకాంతల సమంచిత వ
సంతము తనంతన నిశాంతము చెలంగెన్. 46

## ప్రాససీసము

సీ. ఔరగందపు మెట్టువాఱిఁదారెడు పాఁప
కోరసోకిన సెకయూరుటకును
తీరైన పాండ్యరాణ్ణారీకుచోదార
హారావళీయుక్త చారుగంధ
సారపంకవిహార హారియై నిబిడ శృం
గారవనంబులఁ జేరి మీఱి
సారస సారస సార సౌరభములు
చూఱలు గొనుచు గర్పూరముల దు

గీ. మాఱములు దూఱి హిమవారి పూరమాని
పేరెములుబాఱి మిగులగంభీరము గను
సారెపురపీథి గడిదేఱి స్వారిదిరుగు
మేర నందందు మందసమీరణంబు. 47

## రూపకాలంకారము - అపూర్వప్రయోగము

ఉ. ఆననతేఁటిమ్రోఁతయె యుపాంగముగాఁగఁ బికాగ్రనాదమే
గానముగాఁగ నామ్రగశుకస్ఫుట పత్రరవంబు మర్దళ
ధ్వానముగాఁగ లేఁజివురు బాహువు ద్రిప్పులతాంగనాళి నెం
తేనియునాడఁ జేయుఁ బురితెమ్మెరనట్టువ పూవుఁదోఁటలన్. 48

## శబ్దచిత్రసీసము

సీ. తన సుదర్శనలీల తన సుదర్శలీల
కరణిపుణ్యజన వర్గంబుబెంపఁ
దనవిగ్రహోన్నతి దనవిగ్రహోన్నతి
వఱెనసమాయుధపటిమ జెలఁగఁ
దనదుశ్రీవత్సంబు తనదు శ్రీవత్సమ
ట్లఘనచూ సంగతి లలిఁ దలిర్పఁ
దనదుదరస్ఫూర్తి తనదు దరస్ఫూర్తి
గతిశరజాతాచ్ఛకాంతులెసఁగన్

గీ. బరిధవిలు సిద్ధ సాధ్య సుపర్వశర్వ
విధివిధుబ్రధ్న పాథోధి విబుధనాథ
భావనుతి రూఢిగూఢ పాత్పరిబృఢాఖ్య
భూరిధరణీధర విహారహారి శౌరి. 49

క. తురగావరూఢుఁడై భూ
భరముడిపెడు నపయశంబు పరిహారముగా
నరలోకరక్షణార్థము
తురగము నెక్కెనని జనులు తొడరి నుతింపన్.

సీ. ప్రణవంబు రమణీయమణి ఖలీనముగాఁగఁ
బ్రొద్దునిద్దామొగముట్టు గాఁగ
దపసికన్బాపము త్తెపుఁ దలాటముగాఁగఁ
బండువెన్నెల దృష్టి దండగాఁగ

బలుసంజెడంబు కెంబట్టు పల్లముగాఁగ
మొదటి పల్కులు మువ్వపదువుగాఁగ
వినువాఁక తరగలు పెల్లజల్లులుగాఁగ
వాల్మించు కెంపు హబాయిగాఁగ

గీ. జోడ నలమీఱి లేదెందు జోడనంగఁ
బరుగుచున్నట్టి గరుడుఁడన్ గరుడునిపయిఁ
జేరి నందిత ధారా విహరహారి
సరణి వాహ్యాళి వేంకటస్వామి దలఁచి. 51

## షడ్రుతూప మానాద్యంత యమక వచనము

వ. అప్పు డప్పన్నగనగవిభుం దానందమందిరంబైన యానందమందిరంబు ప్రేమం దిరంబుగా నొయ్యన వెడలి కడలి కడలెత్తి మొరయ వడువున నడవడిగల నడవడిని యడుగడుగు వెంబడిబోడము బడలిక లడంచి తడబడక బుడిబుడి మొక్కులిడి యెడనెడఁ బొగడు పౌరజన జయజయ నినదంబు మతకరించు భూరిభేరీ మృదంగ కాహళపటహ డెంకణఢక్కా హుడుక్కా నినాదంబుల లోఁగొను నిద్దపుఁ బెద్ద మద్దెలల మొఱపపు టుఱుములకు నెఱమెచ్చి పురివిచ్చియాడు నెమ్మికొమ్మల యొమ్మిక సమ్ముఖంబునం గమ్మిక ముమ్మరమ్ముగా వరుస బురుసాకాశలాశలం బసిఁడిపొడివసంతంబులాడ జోడుల కోలాటంబులు వేయు కైలాటకపు మిటుకులాంద్ర జాఱుజడల నల్లిన మల్లెపూసరుల వఱలు గమగమ వలపుల విటులకుఁ దలదిమ్ము వుట్టించునట్టి వెట్ట దినంబులయ్యును పార్శ్వ నిస్తంద్ర చంద్రశిలామయి చంద్రశాలోపరి భాగాభోగ వలభి దుపల వలభిపాళికీలితచిరత్న రత్నకోరక వారక ఫలదీ బహుధావన సమాగ తఁబులగు కలికిచిలుకల కులుకుపలుకుల నులుకు కలరవంబుల కలరవము కింకుర్వాణ మానసలై మను తలంపులు నుతించు ప్రోషిత భర్తృకల దృక్తారకంబుల కీ లెఱింగి తదుచిత శయ్యాతలంబునకుం దార్చి కూర్చు నెచ్చెలులు నేర్చు కైవడి కెలన నమర్చిన తేఁట పన్నీటి ధూమ్రంపు భస్త్రికలముంపున నసమయ హేమంత సమయంబయ్యును, మహోత్సవాలోకన కుతూహల నిఖిల దిశానిశాయాత మనుజ పరంపరా

ప్రయత్న సంపాదితా లేపనాపకరణ క్రియోపార్జిత గ్రామీణ కుమార కటితట లంబమానంబులై యత్తలిరుగుత్తి గుత్తంపు మొత్తంబులతో నెత్తంబులఁ దత్తరంబుల తత్తద్గతుఁ నత్తమిల్లి క్రొత్త దళుకొత్తు మెత్తని తన్నీరు తిత్తుల యొత్తుల ధారాళంబులగు సలిలాసారంబుల నకాండ కాండదాగమంబయ్యెను మధ్యరంగ ప్రదేశ పురోగామి గణికాపాళిగల్ల పాళికా శ్రమకణ నిర్వాపణ రసిక కర నికర చల ద్వృంతోశీర తాల వృంత సంజాత సుగంధ బంధుర వాతపోత సంచారంబున నవ్వేళ వసంతవేళయయ్యెను అధికారి నియమితంబులై యప్రతిప్రతిత ప్రతి భవనద్వారంబుల కురుంజుల క్రింద రంజిల్లు నపరంజి కొప్పెరల దెప్పరంబగు నిరంతర పరిమళవంతంబైన కుంకుమ రసవంతంబు కొంతా విజయో దంతంబున నింతింతనరాని సంతసంబున మంతుకెక్కిన కంతుని కరాంతంబున నెంతయు వింతగాని లతాంత కుంతంబున సంతసంపు దొంతర పికిలి పూబంతుల నతివిచిత్రంబులగు నేత్రంబుల మెండగు నందెల యొమ్మైన చిమ్మనగ్రోవుల మించిన యగ్గలికల ముంచిన తడిసి జడిసికడాని నీరు పాపల రూపుల నొంటి జిలుగు తడివలువ లంట వడవడ వడంకు కామినీ కాముకుల వలన నకాలశీతకాలంబయ్యెను, కౌశికాగరు కర్పూర సామ్రాణి ధూపమ్ములు ఘుమ్మన గ్రమ్ముకొను పూచప్ప రంబుల నుప్పరంబులు నిగనిగ వెలుఁగఁగల జిలుగుజిగివగ బిగిసరుగ నిగుడి నెగడు పొగరు వగల మిగుల మదిదిరుగ దిరుగు తేఁటి మగువల తెగల తగులుగ తగిన జిలిబిలి తేఁటపాటల వాటిలు సొంపు సంపాదించు తెలిదామర గుంపుల నింపు నింపు చికిలి మకర తోరణంబుల ధోరణిగా మిటారించు నిద్దపు టద్దంపుఁ జకచకల మొలక వెన్నెలల వలన నినవ సర శరదవసరంబయ్యెను నొప్పునట్టి బ్రహ్మోత్సవంబునఁ దత్సేవా పరాయణ భూపాలక కుమార కాగ్రభాగ సంస్థాపిత నూతన కేతనవ్రాత పటాపటాత్కార గంధసింధుర ఘంటికా ఘణఘణాత్కార దుర్దమ సమ్మర్దోన్నమిత సుభట పటలి హస్తాగ్ర విన్యస్తశాత కుంభశుంభత్సరు ప్రభాసమానా సమాన నానావిధాయుధ సంఘర్షణోత్కర్ష జాయమాన ఘణఘణాత్కారదిశబ్దకోలాహలంబున సకలలోక లోచనానంద కరుండయ్యెఁ దత్సమయంబున- 52

## జాతిసీసము

సీ. జంపుసూరెపుటంపు కెంపునిద్దపు రేవ
గుత్తంపు బంగరు కొమ్ముకట్లు
డంబుమించిన పగడపు తలమాళిగ
నాణెంపు పెద్దకట్టాణి గద్దె
జాతికిరీటి పచ్చలరావిరేకలు
గమకపు పోలాతి గంటజోళ్లు
నిండు చందురునిగ్గు వెండిమేలందెలు
కప్పురాసంతన యొప్పుటొరిజ
గీ. సానదీఱిన వజ్రాంకుశంబుఖారి
నిగళమష్టమదములు గుడుగుట యేక
సరముఁ గంటాటమును నిజచాయల ప్రతి
కరులని గరి బడుటగల్గు గంధకరులు. 53

ఉ. ఆవులు దివ్యవస్త్రములు నాభరణంబులు వెండిపైఁడియున్
గావడినేతులున్ బునుఁగు కప్రము కస్తూరి గంధమింతులున్
బూవులు పీవనల్ ముకురముల్ ముడువుల్ గొఱియ ల్ఫలావళుల్
దేవశిఖావతంసునకుం దెచ్చిరి కానుక లెల్లవారలున్. 54

క. కోరి తలయండ్లు దాల్చిన
వారును నడుగడుగు మ్రొక్కువారును ప్రాణా
చారము లెల్లెడ నొరిగెడు
వారిలు తీర్థములు వచ్చువారై రెందున్. 55

సీ. అభయంబులిచ్చు మాయిభరాజవరదున
కుభయంబు లొనరింపుచున్న వారు
వెఱవులు మాన్పుమా వేంకటేశ్వరునకుఁ
జరువులు భయభక్తి జరుపువారు
ఘనయోగిజన సమావనయోగి కన్నుమ్రోల
వినియోగములు సేయుపనులవారు
దురితరు జౌఘవైద్యునికి హృద్యంబుగా
నునివేద్యము లొసంగఁ గనెడువారు

గీ. పరులఁ బొరిఁగొను జోదుకు పరులు నరుల
దోసములు దోసునయ్యకు దోశ లలరు
నప్పనికి నప్పము లతిరసాధిపతికి
నతిరసంబుల నిచ్చువారైరి వరుస. 56

సీ. బడలినవారికి వడపప్పుపానకా
లనఁటిపం డ్లొపిన యన్నిగలవు
యొళనీరు బిసనీరు లెందుహేరాళంబు
నీరుచల్లయుఁబెరు గపార మచటఁ
గప్పురగంధంబు కైరవల్పట్టీలు
తట్టుపునుంగును జుట్టుపూవు
లెందువేడినవెల్ల యేచప్పరంబున
విప్పైన గొడుగులు విసనకఱ్ఱ
గీ. లేలకులు శొంఠియును లవంగాలు పనస
తొలలు చెఱుకులు ఖర్జూరఫలము లెన్ని
వేడినను గొండనుచు జాటు వేంకటేశు
భక్తజాలంబు తిరునాళ్ల ప్రజకు నపుడు. 57

## సాయంకాలవర్ణనము

మ. అపరాహ్ణంబను వర్ణకారుఁడు ప్రతీచ్యంభోజపత్రాక్షి క
చ్చుపడన్ జందురుకావి యంబుద.పటస్తోమంబు నన్నించఁగా
నపరాబ్ధిస్థలినుంచు కుంకుమరస వ్యాకీర్ణకుంభంబునాఁ
దపనుం డస్తవసుంధరాధరము చెంత న్నిల్చి గ్రుంకెన్వడిన్. 58

సీ. గఱులు చుఱుక్కవ నెఱసంజకాకసోఁ
కిన వెఱఁగంది యీకియలు ముడుచు
ముడిచి కౌఁగిలి పెంటి సడలించి నిట్టూర్పు
నిగుడ మోమీక్షించి దిగులుఁ జెందుఁ
జెంది వాపోవుచుఁ జెంతఁద్రిమ్మరుపెంటి
దఱిమి మెట్టగఁ జేరి వెఱచి మరలు
మరలి బిల్చుచు తొల్లి మమతఁ గూడిన తన
నెలవులు మూర్కొని కలఁకి యొరలు

గీ. యొరలి తూటలు కసిగాట్ల కొఱికి నిలుచు
నిలిచి పెనఁగొన్న నాచుతీఁగలను డాఁగు
డాఁగి విరహాభరమ్మునఁ గాఁగి కుందు
కుంది యబ్బుర మొందెను గోక మొకటి. 59

సీ. అఖిల ప్రపంచ మహాభూత మోహిని
మునిజనానుష్ఠాన ముఖ్యవేళ
స్వైరిణీ పుణ్య సాక్షాత్కార దైవంబు
చోరావళీభావి శోభనంబు
కలితనిశీథినీ కాళికా జనయిత్రి
కమలా మయావహాక్షతజ పూర్తి
మందేహ గృహ కుంకుమ స్థానకసమృద్ధి
యస్త్రా గదావానలాభివృద్ధి

గీ. ఘనపలాశ కుసుంభ కోకనద బాల
కిసలబంధూక హల్లక విసర గైరి
క చపలాదాడిమీ సుమకాంతి యనఁగ
గగనతలమున సాంధ్యరాగంబు దనరె. 60

## యతిభేదకందము

క. వలసినమేవులు గొని కా
ళ్ల లావులును నిక్కలించి ద్రుక్కెగరిపయిఁ
బులుగులు చట్టుపలార్చుచుఁ
గొలకొలమని కూఁత లిడుచు గూడులు సేరెన్. 61

## ఉత్ప్రేక్షాలంకారము

క. అరబాలు సంజకెంపున
నిరవై దనరారి కడమయిరులను సాబాల్
కరిబరగుచుఁ జద లత్తఱి
గరిగల గురువిందగింజకై వడిఁ దనరెన్. 62

క. కాకోల ఘనాఘనఘన
కాకోల ఘనాఘనౌఘ కలహంస శిఖి
శ్రీకంఠ కంఠ భానిభ
ఘూకప్రియతనుతమ మలఘు దిశలఁ బర్వెన్.

## స్వరూపోత్ప్రేక్ష

సీ. ఇనుఁడు గన్పడ నిసుక్వోటఁగి మందేహులు
కొంచక నిల నల్లుకొని రనంగ
సకలంబు నాక్రమించుక నొక్క రూపమై
పరఁగిన మాయాప్రపంచ మనఁగ
జారవాంఛిత మహీ జాతముల్ శోభిల్లఁ
బ్రాపించు దోహద ధూప మనఁగ
విరహులపై దాడి వెడల వేయించిన
మారుని నీలగుడార మనఁగఁ

గీ. గటికి చీఁకటి పుడమి యాకసము జత యొ
నర్చి కాటుకబరిణచందమునఁ జేసి
చెలఁగు నభిసారికల దీవనలనఁ బెరిగి
సూదిమొన కెడమీక హెచ్చునను నెరసె.

తే. గీ రాజు చనుదెంచు నని నిశారమణి యప్పు
డింద్రనీలఁపు మణిపాత్ర లిడిన సోబ
నంపుటారతి తెలిముత్తియంపు గుంపు
లనఁగ నభమునఁ దారక లతిశయిల్లె 65

## అపూర్వప్రయోగము - స్వరూపోత్ప్రేక్ష

సీ. నిక్కుతమశ్శాఖి నెగసి యంటట నుండి
పొడచూపు మిడుగురు పురువులనఁగఁ
గాల కృష్ణ మృగాంక కలితమై గనుపించు
బెడిదంపు తెలిచాయ పొడలనంగ

యజ్ఞావరాహ దేహనిశాతరోమజా
త స్ఫ్యూత గగనరంధ్రము లనంగ
దట్టంపుతీవలు చుట్టుకయున్నట్టి
పొదలపైఁ జూపట్టు పూవు లనఁగ

గీ. దేవతల పీటివాకిట దివ్వెపండు
వులకుఁ బెట్టిన దీపాలకళిక లనఁగ
నాకసంబెల్ల మెల్లన యావరించి
మినుకు మినుకునఁ జుక్కలు మెఱయఁ దొణఁగె. 66

## అపూర్వప్రయోగము - ప్రకృతాప్రకృత శ్లేషసీసము

సీ. నీలాంబరాన్విత లీలచే రాణించి
సద్బలాఢ్యతను నిచ్చలు వహించి
యాశ్రిత ద్విజరాజి ననయమ్ముఁ బోషించి
పాండుతనూజ సంపత్తి గాంచి
పరచక్ర ఖేదన పటిమను గనుపట్టి
పంకజాతమ్ముల బస నడంచి
అతులి తొత్తాలాంకగతిని చాలఁ జెలంగి
శీతోల్లసత్కర ఖ్యాతిఁ దనరి

గీ. రేవతీపతి సంజ్ఞ ధరించి మఱియుఁ
గమలజుండునుఁ హరియు శంకరుండనంగ
బుధభృతిఁ దగి సుదర్శన స్ఫురణఁ జెంది
కృత్తికా యోగమున మించి యిందుఁ దలరె. 67

## హేత్వాలంకారము

క. కమలములకు గుముదంబును
గుముదములకు ముదము మదచకోర వితతికిన్
భ్రమదంబు కోకముల క
ప్రమదంబును గాఁగఁ దుహినభానుఁడు పొడమెన్ 68

క. తనయుఁడు గలిగిన ముదమున
వినుముట్టె సుధాబ్ధియందు విలసిల్లెడి య
వ్వనజాయతాక్షుఁ డోయనఁ
గనుపట్టిన చందునందుఁ గందు జెలంగెన్.

## సమాసోక్త్యలంకారము

మ. రవి యస్తాద్రికిఁ జేరె నంత శశియున్ రాగాత్ముఁడై తమ్మిలే
నవలాశీత కరంబులన్ దొడరినన్ నాథుండు గామీసుదోఁ
చు విధంబున్ దగమోడ్చెఁ దమ్మి విరులచ్చో నవ్వెనాఁ బూచె
రవిణుల్ తానవమానియైనగతి రేరా జొప్పె వెల్వెల్లనై. 70

## ప్రకృతాప్రకృత శ్లేష వ్యతిరేక యుక్త హేతూత్ప్రేక్షాలంకారము

సీ పద్మాప్తతనయా కబంధ రోచుల మించి
నీలాంబరద్యుతి నికర మడచి
పటుతరానంత భారాలి బిట్టదలించి
నారద స్ఫుటకాంతి నగుచుఁ ద్రుంచి
నీలకంఠ ప్రభాజాల మంతయుఁ గేరి
దాక్షాయణీ విభాతతిని మీటి
భీమకర్బుర గురుధామరేఖ నదల్చి
హరిమణి దీధితిఁ గరము గెల్చి

గీ. జారచోరాదర స్థితిఁ దేరె దీని
కనుచు తా నిత్యపరిశుద్ధ మగుట చటుల
భయనిధానంధ తమసకబళనమునఁ బి
చండిలంబగు పండు రేయెండ గాసె. 71

క. కందు బలుకాపుఁ బెట్టుక
జెందొవరా మాంత్రికుండు చీఁకటిదయ్యా
లందఱుమఁ బూది జల్లిన
పొండిక వెన్నెల జెలంగె బుధులు నుతింపన్. 72

క. అంతట జంద్రాతపము ది
గంతము లన్నిండఁ బద్మజాండము తళుకున్
దంతపుబరిణ విధంబున
వింతై కనుపట్టె భువన విస్మయలీలన్. 73

వ. ఆ సమయంబున— 73

సీ. జీవరత్నప్రభ జెలఁగు దివ్యవిమాన
పంక్తినాఁదేరు దీపములు వెలుఁగ
ఘన పద్మరాగ మకరతోరణములు నాఁ
దిరుదండె దీపముల్ దేజరిల్ల
నిజవాహఫణి ఫణా నిర్యన్మణి ద్యుతు
లనఁగ నిచ్చెనపంజు లతిశయిల్ల
నీరార్పితమణి నీరాజనములు నా
నేనికపంజు లెన్నేనిఁ జెలఁగఁ

గీ ప్రతిమగమి చేతి దీపికల్ బరిఢవిల్లఁ
గొలువుదివిటీల కోటానుకోటు లమరి
వరుస గన్పట్ట నభయపార్శ్వముల భక్త
దత్త సామ్రాణి ధూపముల్ దనరెనపుడు. 74

## సర్వలఘు రూపసమసీసము

సీ. నిఖిల సురదనుజ నికరమధిత జల
నిధిభవ ఘుమఘుమ నినద మనఁగ
నభినవ ఘనసమయ సముదయ దశ ని
లసదమిత పెళపెళ రవ మనఁగ
సహరహగమనట దభవకర ధృత ప
రఢమరు ఢమ ఢమ రణిత మనఁగ
ఖల కనకకసిపుదళన విహరణ నృ
హరి భయద కహకహ రుత మనఁగ

గీ దతతుహిన మహిధదర తటపదతులిత
గగన సరిదిదుత బహుళ ఘళఘళ మహి
మ యనఁగ దివిభువి నెనయు రయము మెఱయ
రహి వెనుకొని నిజపటహరభటి నిగుడ. 75

## శబ్దస్ఫురణము-అపూర్వప్రయోగము

ఉ. వేంకటశైలభర్త తిరుపీదులరా వినిచెన్ దృఢంబుగాఁ
బఁకజసంభవాండ ఘటపంక్తి హటద్దళ నోగ్రబాణ యం
త్రాంక ఫెఢీల్ ఖణీల్ ఫెళఫెళాదిఢమిండమి డబ్బుడబ్బు ఢా-
ఢంకరణ ప్రచండిమ విడంబిక డంభ విజృంభితార్భటుల్ 76

సీ. ప్రళవభైరవ హస్త పటహపటపటధ్వ
నులు బలుపెట్లు గ్రోవుల తతులును
మహి డిగ్గి సేవించి మరలు నింద్రునిఁ గొల్వ
పంజులౌ నక్షత్ర బాణములును
పనిబూని చక్రంబు బహురూపలాస్యవి
భ్రమమందె ననఁ జక్ర బాణములును
పరిచరణాయాత తరణి చంద్రప్రభ
లన తదీయజ్యోతుల గణములను

గీ. రోదసీ సరసీజాలపాదపద్మ
కుముద రూపము లాకుఁచ కోలగముల
చెలఁగు బిరుసులు పగలు పత్తులుగ నమర
బరఁగు బహుచిత్ర బాణవైభవము గనుచు. 77

## జాతివార్తావచనము

వ. వేంచేయు నవసరంబున గురు మహాప్రధాన మాండలిక సామంత సేనాపతి ద్వారపాల కావసంక ఘటికా నిర్ధారక గణక లేఖక పౌరాణిక పురోహిత జ్యోతిషక కావ్యజ్ఞ విద్వద్దేవార్చక మాల్యాకార పరిమళాకార గోష్ఠాధికార, గజాధికారాశ్వాధికార వస్త్రాధికార భాండాధికార ధాన్యాది కార్యాంగరక్షక సూతసూద చాణూర బేతాళ మల్ల తాంబూలిక తాళవృంతిక నరవాహక చాత్రిక చామరిక కాళాచిక కరదీపికాధారక కతారిక కారవాలిక పాదుకాధారక నర్తక గాయక వైణిక శాకునిక మాగధ వైతాళిక స్తుతిపాఠక పరిహాసక క్షౌరక రజక సౌచిక చర్మకార ముద్రాధికార పురపాలక వనపాలక నరవైద్య గజవైద్యాశ్వవైద్య పశువైద్య భేరీవాదక మురజవాదక కారక స్వర్ణకారక శిలాచ్ఛేదక కాంస్యకారక కుంభకారక చిత్రకార వ్యావహారిక జాలిక మృగయార్థి పక్షిపోషకులును, ఫణిహారులు రాయబారులు సుగ్రాణఁపు తెగలు కెవనిబంటులు వేశ్యాజనంబు లనియెడు డెబ్బదిరెండు వినియోగంబుల వారలు నలు చెఱఁగుల గొలిచిరా, బహువిధచిత్రబాణ యంత్ర ప్రాపీణ్యాలోకన కనత్కౌతుకాయత్త చిత్తులై తొలంగం ద్రోయరాని సందడి దలంగి చన నియమించు కాచనం

కలధౌత వేత్రపాణుల మునుకొను వింజామరల క్రోవుల యంత్రధారల వలనఁ గలగుండువడు వారును వేఱొక్క దిక్కున కోరనేల కోరనేల యనిపించు వీక నుదురుల నున్నని సన్నపుఁ బూదిరేకలు ఱంటెపువాటుగా నీటుగానఁబడ మెడల వెండి గొలుసుల సజ్జగుసజ్జలు, జవ్వాది మెఱుం గేర్పడఁ గనిపించు పడగల బెడఁగు క్రొమ్ముడులు దాడిమపూవిత్తులపై దాడిమీఱు పీడెంపు బలుకెంపు నింపు పలువరుసలు ముక్కుల తళుకులు పొదలికల నెన్నడల కులుకులు గల బలిజకన్నడ మిటారులు, కుందనపు బిందియల యందంబు క్రిందుపఱచి పచారించి సరిబిత్తరి ద్రోయు క్రొంబసపు మిసిమి నిబ్బరపు టుబ్బుసిబ్బెపు గబ్బిగుబ్బలు యపరంజి నక్కల వలె రఁజిల్లు మంజరి కాపురూపు చెక్కులు, యలరుటమ్ముల రటమ్ముల యలరుటమ్ములు చూపుఁజూపువాలిక చూపుచూపులు చికురాకు పొగరు జిగివగ తొగరు నూకుటడుగుల జోడించిన పాలవెండి పాగడమ్ములు మినుమినుకను పెనుమిణుగురుఁ బురువులు గిరికొన్న తాపించ గుచ్ఛంబుల దినుసున నెఱసంజజిగి గురుగింజల మెండుకొను కొండెలు గల చోళ విలాసినులు, పంజులవలె వెలుంగు మానికపు పంజుల కమ్మలు యరి కమ్మల గోరజపు టారజంపు తిలకంబులు కప్పురాల బరణుల యొప్పు రాలజేయు నిడుదవేనలి నూనెముడులు చూచువారి పెదవులకుఁ జవులొద వించు నాణెంపుటాణి సుప్పాణి ముంగురులఁగల గుజరాతి హొంతకార్తులును, మకరధ్వజుని కొంప యొక చెంప జీరుమడిచారలమీఱు జిలుగు టంచు మణుంగు కుడివంక పైటచెఱంగులు పంచబాణుని యర్ధచంద్ర బాణంబులన శోభిల్లు నాభినామంబులు చిక్కెంటలఁ జిక్కెడలించిన నూనె నీటు మెఱుంగు కొనవాడి చిలుకముక్కుం గోళదువ్వి పొంకపఱచిన దావంక చెవిగప్పుజాఱు గొప్పుల పూసరంబులు మగల గికురించ కంకణంబులు గట్టినరీతి నత్తమిల్లు పుత్తడి కంకణంబులుగల స్థాతనిజాతి నీటు కత్తెలాదిగా నేతెంచిన నా యూవిలాసవతులు నాలిమగనాలి గుంపులొకరి కొకరు కేలుకేలున గీలించి తమతమ చెంగటి కోడెప్రాయంపు గోవాళ్లకుఁ ఉరునాళ్లచూచు వేడుకంటలోఁ బిసికిళ్లఫలము కల్పించ నుపాయంబు లెంచి తళుకుబెళుకు చూపులసైగల జెదరి బెదరఁచూచి చెరువుల మెరుపుల బొల్పు పట్టయిన మేరువులంగట్టిన కదళికా తరు ఫలముల జతగూర్చ పుండ్రేక్షు కాండంబులంగని యవురా చెఱకులఁ బండ్లు బండెన్ గంటిరేయనిన

నచ్చేంతనె జేరి జారుబాటుగా నోరమోములఁ దెలియవేడి యేమేమి యెక్క డెక్క డనిన నచ్చిలుకలకొలికులు పలకారి కలికి కపురపుఁ బలుకుల జలజలన యొలుకు బుుకులును బంగారు బొంగరంబుల హొరంగుల రంగుల తురంగలించు పొంగారు చన్నుంగవల తెలుంపులును, రత్నాంకిత తాటంక రుచులు తలంకక లంకెలు గొన నలికించు నకలంక సాంకవ పంక సంకలిత సంకుచిత రేఖాలంకరణంబులై యురుగెలంకుల కుంకుమపు సుంకుల వెదచల్లు బింకపు చంకల పొంకంబును, చూమ నాసలి పైకొని యిట్టుట్టు నెడతెగిపోలేక పునుఁగు పిల్లులవలె చుట్టునుం దిరుగుచు నటుచేతుల కసిదీరఁ దోపుదోపుల బాలికల పాలిండ్లు పిసికిళ్లం బట్టి నొక్కుచు గ్రుక్కిళ్లబిక్కు సుకుమార విటకుమారుల వలనను, మఱియు నొక్కయెడ నెడమీఱిమానిసి యుక్కలజిక్కి యువ్వ పాతఱలను మక్కినక్రియనూర్పు గాడ్పుల కవకాశంబు లేకునికి తమలోదా రొకరికొకరు పదరికొని పట్టునూలియల్లిక చేత్రాళ్లగమకంబులును కటి సూత్రంబుల రసఘుటికల దంబులును సందిళ్లమణుల తాయెత్తులును, జరాసులా యెత్తులును, గచ్చుకేడెమ్ములును మచ్చు పిడెంబులును నిలుపు మందుల కరాటంబులును, బయిటి బరాటంబులును నులిగొన్న కోఱమీసాల కనుంగొను గిరువు చూపులకోపులును, మచ్చువగలుజేయు మబ్బురాయుంటల మేపులును, మెలిబెట్టిచుట్టిన ముంజేకోకలును అగ్గలికలవేయు కేకలును, అంకుశపు టలుగుల క్రింది కొంకుల ములుకులుగ తగులుకొనిన యినుప సరిపెణల పెనఁకువగల యిత్తికొమ్ము సింగోటుల గుప్పుడులును కొండబూరుగ మాని చేవ కొఱడుల ద్రప్పుడులును, పూలతురాయీల రాణించు చేకత్తుల గిలగిలలును, ఢీకెంచపాయంచు నగెడి పొగరు నగవుల కిలకిలలును వన్నెలాడాపట్టంపు జూపట్టు పటికెంపు జంబువాలును, పెక్షులొక్కని పలుకు పికిళుల కేలును మడిమలు సోఁకనేగు పుటము లెగరుట వలనం బటువులగు పిరుదుల మురువు సగం బిరుదుగాఁ గనుపింపఁ బిక్కటిల్ల తొడగినట్టి నరిగకంగుల కూరుపుపనికవురు పరకాళి యొంటి పొర బిగువు నిడుదకాసెల రాగిల్లు గుల్లకావిగోచి చల్లడంబులపైఁ జుట్టిన గంధకావిదట్లు పొరలవరలు ముదురు బదనికల దనరు నరపెట్టులును నెన్నుదురుల వలపుల గొలుపు జేగుఱుకా బొవిట్టుల చిట్టెలును పెద్ద గోతమ్ము మురళించుట కతన టోడుగ్రమ్ము నురమ్ములమీఁద ననుపు

వెలవెలు మోదుగమొగ్గచాయ ఒగ్గెడి కుసుమంపు మొనవాడి గోరంట నొత్త లత్తుకకెంపు నెరసిన యలతి గాయమ్ములు మాయుటకుఁ దీఱిచిన తమ్మిమొగడ లందపు గందపుపట్టెల హరువులును, చెవులుకుం జవుల నించు ముత్యాలయొంటుల కమరిన మగఱాల మురువులును, కెమ్మోవుల పచ్చిగంటుమాటుటకు వహించిన రవిక సరవిమఱచు మడుపులు సగము మునిపంట గొఱికి నెక్కు టెక్కులును చదరు వదరుల పిక్కలును నిదురలేమిం దేలగిలు కడకన్నులం గనుపట్టు కట్టెఱ్ఱ మఱుంగుపరచుటకు ఘటియించిన చలువ కలువ విరిబంతులు హత్తించు దత్తులును యెదుర వారలుఒలిమి వళుకులు వైచి పంతముల కొలారికలం పెడి జిత్తులును చంపల జాఱుసిగల కులీశముల ముళ్ల నాకరించిన కత్తెర వరుస పూవుటెత్తుల పైని బొమ లఱ నిక్క గట్టిన జిలుగు కురుమాలదంపు దసిలిక సీదు రుమాలుముచ్చంగుల బురుసాకుచ్చురింగులును జంట నేస్తగాండ్రచేతి తిపిరి కిన్నెరల టింగుటింగురులును, చౌశీతి బంధపు వ్రాతపని ప్రతిమల చుట్టంచు చందురుకావి దుప్పటి బంగరు చెఱంగుల వలెవాటులును బింకపు నెమ్మెనుల నీటులును బేరజపు టారజపు తందనాల పదమ్ములును వింతవింతలుగాఁ జూపట్టి మీఱు రంగారు బంగారు సింగారపు గొలుసుల దండమానపు పదమ్ములును టెక్కగు చెక్కుల జవ్వాదిమేలు మేలు పట్టీలును నెడనెడ నడుగులు తడబడ తొడలనడుమ తడిబట్ట మేలివట్టు కీలుకీలును, హొంతకారులపై బడి ముడిగి రెండుమోచేతుల పోటుల గరిబడు రీతులును గర్వాలా పదనవదన ఘూత్కారంబుల గంధసిం ధురంబుల కైవడులు ననుకరించి సమదండ గజదండ భృంగిదండ యెడుమయోరభృంగి కుడియోరభృంగి భృంగపటలముపై సరపుదండ సింగపుదండ పొదలికదండ యడుగడుగు పొదలికదండ మద్దెలసంచు కుక్కుటపుదండ మొదలుగాఁగల పదిరెండుదండలును; యెడమడుగు పరువడి కుడియడుగుపరువడి కదలుపరువడి దాటడుగుపరువడి కోవు పరువడి యొంటియడుగుకత్తెర సర్పబంధకత్తెర జాగెనకత్తెర పొదలిక కత్తెర చిట్టడుగుకత్తెర పావుపావు జోగినపావు మొదలుగాఁగల పదిరెండు పరువడులును; హరిగతి గజగతి వ్యాఘ్రగతి మహిషగతి జంబుకగతి మర్కటగతి మాఖరగతి హరిణగతి చటకగతి పక్షిగతి తాండవగతి సరసగతి మొదలుగాఁగల గతులు పదిరెండును; విష్ణుచక్రంబు

రామబాణంబును నాగబంధంబును తొలకరిమెఱుపును అల్లినుత్తును విస్సందు హస్తాభరణంబును పదఖండనంబును నుత్రిత్రాడును లోబిత్త రియు వెలిబిత్తరియు సర్పాంకుశంబును మొదలుగాఁగల పదిరెండు గాయమానంబులును, లోమొన వెలిమొన యుశిమొన చదురుమొన పుణ్యంపుమొన పాపంపుమొన చాటగుమొన దాటడుగుమొన కదలుమొన యురఫమీటుమొన నెరమీటుమొన సరితాళంబుమొన లాదిగాఁగల పదిరెండు మొనలును, లోవెలి గజ్జుదుముకు చూరణనఖుకు మొదలయినకు యిరువగల నఖుకులు; దారుధాణు దఢ యుద్భడ అంత్రటీక టీకనాట్యము ధారుధాణ ఝూటుధాణు కపాలు దారుగపాలు ధాణు ధారుకధాకు ధాణుదారు ఝూటు మొదలు పదునాల్గు విసరులు, కత్తి కొనడొక్కర ముత్తరడొక్కర కుమ్మరింబు జోడింపు సందుసీసంబును కొంతుమారును సమసీసమ్ము సురాటమ్ము చేబయు కందనంబును కర్లనంబును తొట్టను కిల్లియు బలి బడుటయు రొండివేటును పణంబును కర్నాతును భారంబును చొంగణయు పెట్లాగును రూణింపును సరిబిత్తరంబును లాగును వింటాలంబును తిణింగియు పాదనివారణము పదగశాప్తియు గళకత్తెరయు నృసింహం బును కాశినిలుకడయు నను ముప్పదిరెండు విన్నాణంబులును; దండ నిల్కడ కదలుదుటు కలయు మెలఁకువ వింగళింపు దిశాపదిశలు పాదపుపారువ హస్తపుపారువ దేహపాపురువ నయనపుపారువ లివ రాకడ యేకసరవైసర ఝంపు పిక్కు కరలాఘవంబు మొదలగు వితమ్ము లెఱింగి; అసి ముసల ముద్గర ప్రాసరోహణ కణయ కంపణ ముసుంఠి భల్లాతక భిండివాల పరశుగదా కుంతకోదండ కఠారిక తోమర త్రిశూల వజ్ర ముష్టి పరిఘాతల చక్రపట్టెస ప్రకూర్మ నఖర యోదండ నారాచంబులు లౌడి వంకిణి సబళ యీాటె సెలకట్టె శిళ్లను ద్వాత్రింశదా యుధంబులు, పిచ్చలవిడి తచ్చెన కచ్చెలు దీసియు పెచ్చుమల్లాడియు గచ్చులు సెసియు హెచ్చుకత్తులు దూసియు ఘల్లుఘల్లురన నొకటిరెండు మొనలు బయలు చిమ్ములు చిమ్మి కమ్మిన ఝల్లుఝల్లన గుండెలదరి బెదరి ఝల్లున సందడిపిరియ తెఱపిగని యిట్టలగు పట్టుల నిలిచి పిచు రొమ్ముముట్టెలును కావి దట్టీలును పులితెక్కిన యంగములు దుఱిం గరింప జూపట్టు కరమ్ము కరంబుల నిలువు సానకత్తుల నెగభుజంబుల నిక్కనొరిగి పెక్కువెరిగి యిక్కువెఱిగి మాయామోహిని వర్గంబు

నుంబోని వారాంగనల కటాక్ష మార్గంబపేక్షించు బిరుదు కెంచపుమాష్టిల వాలను, మఱియు నొక్క చొప్పున నుప్పరిగల ముంగని చప్పరంబుల మధ్యరంగంబుల నొప్పులకుప్పలై ముత్యపుఁ జిప్పల చొప్పున విప్పులగు కనురెప్పల కప్పు దప్పనరికి బవరి తరితీపు చూపు చూపు తీరువుల తదీయముఖ పంకరుహ భ్రమద్భ్రమర విభ్రమంబు పుట్టించు ప్రతిభవనభూపాలకావరోధ కన్యకల కరాంచల హేమపాత్రికల దేజరిల్లు కర్పూర నీరాజనంబులవలనను, నేత్రోత్సవంబై వెలయు వలయు వైఖరీ మండలాకారంబుగాఁ జుట్టును దిరుగు వీణావేణు శంఖకాహళ పటహ ఘనఢక్కా పటహ డమరు డిండిమ నిస్సాణ ఝర్ఝరీభేరీ మర్దళ మురజ తుత్తుంబికాది బహువిధ నిరవద్య వాద్య నిర్ఘోషంబును, శశిముఖీశయకుశేశయాధిష్ఠిత శాతకుంభకుంభ ప్రదీప్తదీపంబును ఆరాత్రిక పాత్రధారిణి పరంపరామంజుమంజీర సంజాత సింజానుపుంజరంజిత మణిమేఖలా ఝుణఝుణత్కారంబునునై జూపట్టు తటిత్తు వేడుకల గైకొని గోవిందలిడుచు యెద్దులపై తమ్మటమ్ములు తిడిమి తిడిమని మ్రోయవేయుచు వచ్చు రోణంగి దాసరుల గంతులుగని నిజదివ్య త్రిభువనావన భవనాంగణంబున వేంచేసి తదనంతరంబున. 78

సీ. అలమేలుమంగా మనోజ్ఞ భృంగపరాకు
యహ రహర్దానవ హరపరాకు
శ్రీ తిరుపతి మహాసింహాసన పరాకు
దివిజాధినాథ వైభవ పరాకు
సకల భక్తజన రక్షణ విచక్షణ పరాకు
జరవందిత పదాంబుజ పరాకు
కమనీయ సందీప్త గరుడవాహ పరాకు
శతకోటి మన్మథాకృతి పరాకు

గీ. దేవర పరాకు తిరుమలాధిప పరాకు
మాయురేః స్వామి చాఁగు భళా యటంచు
మాగధులు చేరి సముఖంబు వేగవిప్ప
నలువుమీఱంగ నిజవాహనంబు డిగ్గి 79

సీ. ఒకచోట మునికూట సకలప్రణుతి ఘూట
మొకచేర నతిధీర సుకవిదార
మొకదండ వేదండ నికురుంబ హయకాండ
మొకఛాయ ఘనగాయ కకృతగేయ
మొకసీమ నిజధామ ధకధక ద్యుతిభూమ
మొకమూల భూపాల ముకుటజాల
మొకపొంత శశికాంత నికరాజిత ప్రాంత
నొకత్రేవ నటభావ సుకరరావ
గీ. మమర నమరీశయ కుశేశయాభిరామ
చామర సమీరణార్చక చలిత కైశ్యుఁ
డగుచువేంకటభర్త సింహాసనమున
నిండు కొలువుండెఁ గన్నుల పండువుగను. 80

## అపూర్వ ప్రయోగము

చ. సరిగ సలాము చేసి ముదిసన్నపు త్రాళ్ల ధరించి మల్లులై
బిరబిర తానకంబు లిడి పేర్మిని మీసలు దువ్వి బిత్తరిన్
జొరవకు చొచ్చి త్రేశి బరి చొంగణసీసముకత్తి చేబయిన్
గరవళము న్నృసింహమును గైకొని జెట్లను గాంచి వెంబడిన్.
సీ కంబము కౌఁగిదెలాగను డొల్ల తాటిదం
డములు త్రోయంగ రెట్టల గమకము
సంగడాల్ బూన బుజాలపు రాయంబు
బరిలోడు ద్రిప్పు మేల్బరుల యుబ్బు
బలు గోతముయి రశింపగ నురంబులటోకు
పడి డాశములు సేయు తొడలకంటె
మొనపుగ తిరుపట్టె వరుచలెత్తఁగ పొంచ
ములలాకు డంకలు, బొరల మెడల
గీ. బలిమి గని పెట్టి గంధపట్టె లెఱమట్టి
కాపె తిరుకాశదట్టులు గావుబొట్లు
మొల్ల సరులొప్పు చరిత్రాటి పిల్ల జుట్లు
పెద్ద చేత్రాళ్లగల జోడు బిరుదు జెట్లు. 82

తే. గీ. కదలఁగి దిశలు ప్రతిధ్వనుల్ బోఁగము నటులు
గా మిగులు మల్ల జఱచి సలాము లిడుచు
ముందటను నిల్వఁగా డసదం౦కి తక్క
రమ్ము లిరుగేలఁ బూని పఠాకటంచు. 83

చ. విడిచినయంత మల్లులటు వెన్కకుఁ జెంగున వింగడింపుచున్
బడిబడి మీసలంటి మెలిబట్టుచు దండల నిల్చి కమ్ముచున్
బిడికిళులూది పట్టుకొని బిట్టుగఁ గేకలు వేయుచున్ బొమల్
ముడిగొనఁ బండ్లుగీటుచు సముద్ధతి చేఁజెయిసోఁక మీఁటుచున్. 84

క. భాయీ యిదెయొక నుడిలో
మాయనుపించెదను చూడుమాయని కరిమై
చాయఁగని బొమ్మ గ్రుద్దిన
చాయగ గ్రుద్దుటను పెట్లు సరిగాఁ దాఁకెన్. 85

సీ. అత్తఱిఁగల బడిబిత్తరులను హత్తి
చేతుల దట్లకాశెలను జేర్చి
సుడిగాలి తిరిగెడు వడువున వడిజుట్టు
కొంచు వైలాన లాగించిత్రేయు
త్రేటులో లాగించి త్రేసి సమమ్ముగాఁ
బుడమిపైఁ బడియంటు లిడకలేచి
మెడలపైఁ గర్నాదులిడి పులుల్ వలెత్రాటఁ
జిక్కి నఖమ్ములఁ జిమ్ముకరణి
గీ. రెమ్ముచును పొంచములు గూర్చి రెండుకడల
నిరికి గళకత్తెరలు గట్టు పెఱిఁగి కూడ
తిరుగఁబడి కురుల తగరుల్ ఢీకొనుగతి
నురిది తలఁ దలఁ దాఁకించు నొకరినొకరు. 86

ఉ. కొక్కెసచే బిగింప మెడ గొబ్బున కేల్వడిఁ బెట్టి దీసి మే
ల్కక్కిత బట్టి త్రిప్పి చెయి లావును దుస్సక రెండు ప్రక్కలన్
ఠొక్కరసందు త్రేయఁ దొడనొక్కుచు సందెడఁ జేసి త్రోసి వెన్
జక్కి సురాట మెక్కివడి జాఱి గడంబడ డింక బొర్లఁగన్. 87

సీ. వడిగకర్లమునకువచ్చి చక్కఁగ కాళ్లు
వెనుకకు నిగుడింప వెంబడిగను
మోకాళ్లువంచి తెప్పున బొటవ్రేళ్లచే
తిరుకాశ దూర్చి యెత్తి పొరలించి
సరసుక యోర రాఁ బరిబడి పొరలించి
యొకకేలఁ గుత్తుక నొడిసిపట్టి
ముడిగి గడ్డముక్రింద ముడ్డి యాడించి యం
కిణిగొట్టి సీసాన కినిసి నిలువఁ

గీ. జంకలను చేతు లునిచి పై చక్కి నెత్తి
తలకు సందిలి తప్పించి తొలఁగిలేచి
వివసమాయించఁ జూచి యాపీణ జెట్ల
కెలమి బిరుదులొసంగి పీడ్కొలిపి యంత. 88

క. బిరుదుగల తులువ లిరువురు
నెఱమట్టి మెఱుంగు దట్టు లెగుచల్లడముల్
బరగంగ బొందెకోలల
హరిగలు తాటించి మ్రొక్కియారము మీఱన్. 89

క. పొదలుచు నొండొరు చలమునఁ
బెదమీసల దీటుకొనుచుఁ బెట్లాటకు బె
ట్టిదమగు గేకలు వ్రేయుచు
కదియుటకై దండబూని కలనిల్చి తమిన్. 90

ఉ. పెట్టినదండ దియ్యకొక పెట్టునఁ బై బడనియ్య కొరఁగా
గట్టిగ బట్టినట్టి హరిగల్ వెలిలోనుగ ద్రిప్పి యొడ్డి కేల్
బొట్టిలకోలలన్ మొనలు టోరకు ఱొమ్మునకున్ మొగానకున్
బిట్టుగఁ దాఁకఁగా బొడిచి పేరము వారుచు హెచ్చరించుచున్ 91

ఉ. గిబ్బ లెదిర్చి కొమ్ముల ఢకీలుఢకీలునఁ గుమ్మలాడు దా
రబ్బికయైన చిత్రరులహత్తి బెనంగుచు బొందెకోల బల్
దెబ్బలు ఖేటకోపరి తతిన్ గళిపెళ్లగధాఁకఁ బోరె పె
ల్లుబ్బుచు విఢగళించి తగనుద్దిగ నిల్వ బహూకరింపుచున్. 92

వ. తదనంతరంబు

క. సంగీతపు మేళపు జత
సంగతి తాళములు నాగసరములు ఢక్కల్
చెంగులు ముఖవీణియలు ను
పాంగము తప్పెటలు గజ్జలందుక చేరన్. 93

మ. ఏకతాళంబున వీరమర్దళరవం బేకంబుగా నట్టువుల్
ధికతోంతత్తక ఝుంకు ఝుంకు కిణాతాం దత్తాంకియత్లో ధికు
ద్ధికు తెత్తెయ్యధిమిక్కు తక్కుధిగుతాంధిత్తాత్త తాళంబులన్
గకుబంతంబుల మాఱుఁబల్కఁ గొను గోల్పట్టనప్పట్టునన్ 94

సీ. భైరవ శ్రీరాగ బంగాళ హిందోళ
మాళవులును రాగమంజరియును
భూపాళ గౌళు లన్పురుష రాగాష్టకం
బహిరి లలిత బిలాహరులును
గుజ్జరి మలహారి గుండక్రియ వరాళి
దేవగాంధారియు దేశతోడి
దేవక్రియ కురంజి దేశాక్షిరామ క్రి
యాంధాళి నాట ధన్యాసి పూర్వ

గీ॥ గౌళ సారంగ మంగళ కౌశికులును
కన్నడయును చాయ గౌళ కడు నపూర్వ
మైన భల్లాతకియును నారాయణియును
గ్రమత నిరువది నాల్గు శ్రీ రాగములును. 95

సీ. కాంభోజియును సుమ్మకాంభోజియును సింధు
రామక్రియయు సైంధవరామక్రియయు
రామక్రియయు మేళరామక్రియయు వసంత
సామంతి శుద్ధవసంత ముఖ్య
మాదులు సామంత మలహారిలును చెంచు
మలహారి ముఖారి మాళవియును
గౌళనారాయణ గౌళపసం...
వరాళిపున్నాగ వరాళికంక

గీ. రాభరణమును శోకవిరాళి మేఘ
రంజి గుజ్జరి పంతువరాళి నాట
జౌళి దేశాక్షి తోడివరాళి శ్రీవ
రాళి హెజ్జుజ్జి కేదార గౌళిపాడి. 96

తే. గీ. రీతిగౌళయు నీలాంబరియును ఘనము
దనరు హంవీరనాటయునని నపుంస
కములు ముప్పదిరెండు రాగములు మఱియు
దేవ మలహరి సాహరి రేవగుప్తి. 97

తే. గీ. మాళవశ్రీయు సాకొండు మలహరియును
కోనమలహరి నాసైదు గూర్చిపంతు
లాదిగాఁగల మిశ్రంబు లన్నిమదికి
నరిదిగన్నట్ట వినికి సేయంగఁ దెలిసి. 98

సీ. గానంబునకుఁ బ్రతి గానమెందునఁ జతు
ర్దశ రాగదోషముల్ రహిని విడిచి
సరవి ముప్పదిరెండు సంచారము లెఱింగి
పదునార్గు మూర్ఛనల్ పరిహరించి
ధైవతషడ్జ గాంధార నిషాద పం
చమమధ్యమ ఋషభస్వరగణముల
క్రమముతో మంద్రమధ్యమ తారకంబుల
మెఱయించుచును శత్రుమిత్రరాగ

గీ. విధములను వేళలను జతుర్విధ సులక్ష
ణములు భరతము ఛందః క్రమమును దెలిసి
పొసఁగఁ జంచత్పుటము చాచి పుటముఖముల
మేర నూటొక్క తాళంబు వేఱుపఱని. 99

సీ ఘుమఘుమ మధుర నిర్ఘోషంబు రాణింప
ననురాగమున మైత్రు లనుసరింప
స్థాయిక్రమగ్రామ సరణి నిరూపించి
ఘనదేశ్య శుద్ధ వైఖరి నటించి
సమయోచితప్రాణ సంవిధాన మెఱింగి
యంగచేష్టా దోష మపనయించి
పవనజయవ్యాప్తి భావంబు సమకూర్చి
ముఖ వికాసా రూఢి మొనయఁ జేసి

గీ. ఛత్రకర్త జౌధారణి ఝుంకె సరళి
పొటస్సైసిక యుప ఝుంకె మీటుకంపి
తాహతంబులు హుళియుఁ బత్యాహతమును
స్ఫురితములు వాద్యము లనయ సరణి మీఱి. 100

చ. సొలపుగ నిర్వ ద్రైదు విడిచూపులు నాల్గుమొగంబు త్రిప్పుతీ
డలవడ బొమ్మసన్న లొక యర్వదిరాలుగుహస్త చేష్టలున్
వలనుగ కేకిహంసవృష వారణ కేసరి శుద్ధ సంగతుల్
వెలయుచు ముట్టి నేర్చిసరిచేమలలో బిరుదంది పొందకన్ 101

సీ. తనమ్రోల డిండిమధ్వనిమ్రోయ నలుగడ
బెళుకుచూపుల భుజంగులను గాదఁ
గులుకు నెన్నడల రాగిలుకుటందెలసద్దు
నటుల కాదిమతాపటిమఁజూపఁ
జెలులకు నర్మోక్తిఁదెలుపుచు చేయుకేల్
కదలిక తచ్ఛాస్త్ర గరిమ నెఱప
నీటుసింగారపు నెమ్మేనిమై సరి
విరివింటి దొరనైన మరులుకొలుపఁ

గీ. బట్టుచాలని అవిక చన్గట్టుదెగడు
బిగువు సిబ్బెపుగుబ్బచన్నుఁగవ యుబికి
పైఁటజార్పఁగ నుడిగపుఁబడతి దిద్ద
మురువుగ నెసఁగె నొక ంగనోహ్మహనాంగి. 102

క. బురుసాకాశరువారపు
నెఱికలు కొనఁగోరఁ దీర్చి నీలాంబుదభా
సురచంచల యనఁ దనరుచుఁ
దెరలోన న్నర్తనాధిదేవత లీలన్. 103

వ. నిలిచిన

సీ. మునుమున్ను భువనమోహనరంగమర్దళ
ధీరస్వరమ్ముల ధిమ్మి మఱియె
నావెంబడిగను గాయనగాయనీమణి
గానమ్ము ఘుమ్మన గ్రమ్ముకొనియె
నావెంటనె విచిత్ర యవనికాంగ వసంత
కుసుమముల్ ఝల్లన ముసురు చూపె
నావెనుక నటిపదాంగుష్ఠ విన్యాస
మునగజ్జియలు ఘల్లుమనుచు మ్రోసె

గీ నంతఁ గనుపట్టెఁ గల్పశాఖాగ్రకిసల
నవ్యమణిముద్రికాకంకణ ప్రదీప్త
కోమలకరాంగుళీకటకాముఖైక
చతురలీలాభినయము విస్మయముగాఁగ. 104

క. తెర యించుక వంచిసఁ జం
దురుకావిరుమాలముసుఁగుతో నింటిమొగం
బరతోఁచ నపుడు తళతళ
మెఱుపుం దీఁగె యనఁగాను మేసిరి యమరన్. 105

## విలాసము

తే. సొగసు తెలివాలు నుసు సోఁగ సొంపు తళుకు
బెళుకు చికిలి యొయారంపుఁ బేరెముదుటు
సొలఁపు విడియంబు దేలింపు చుఱుకు టోర
కలికి బెదరెప్పు చూపుల కలికిఁ జూచి. 106

తే హరుని మున్నేయి మఱచిన యరిది శరము
మరుఁడు సమ్మోహమంత్రాభి మంత్రితముగ
నేసెనోయనఁ దెరయోరఁ జేసి వెకలెఁ
దన్మయావస్థ జనుల చిత్తముల ముంప. 107

క. లయకోపు దృష్టియును నభి
నయ ముదుటుదరమ్ము మోడినయ మున్నతిరే
కయును బ్రమాణము హరువున్
మెయిసిరి యవళఘము మురువు మెలకువ యమరున్. 108

సీ. దిరదిరఁ జక్రంబు దిరుగు చందంబున
లగువు గన్వడ నడ్డలాగు లెత్తి
కడలిసీటను పెంటికరుడు బొర్లు విధాన
కుఱుచగా ముంగలి మెరుమువైచి
కీల్బొమ్మరము జాటగిఱ్ఱున ద్రిమ్మరు
తెఱఁగున వేడెపు తెరువుగట్టి
నేల యురుమురుము లీల పేరిణి వగ
పదఘాతమున శబ్దమొదవఁ జేసి

గీ. యొరపుగాఁదిగె మెరుపోని మెఱయుకరణి
కోపు పొదలిక విడుదల కోపుదీఱి
తమ్మి చిరువలిగదలు విధాన మే నా
కింత యిటునటు బెళికించి యంతమఱియు 109

సీ. కియ్యడ కట్టిన క్రమములు వినుపించి
దేశి శుద్ధాంగముల్ దేటపఱచి
తొలుత సూళాదుల కొలవణి మెప్పించి
జక్కిణిగతుల నొసంగులంది
మండల స్వస్తిసంభ్రమ సగతులు జూపి
చిందుల నంద మందంద నెరపి
తిరువుల లాగుల తరితీపు గల్పించి
దళచంచు గతుల బిత్తరము మెరసి

గీ. దండపాద వినోదా వధాన కరణి
విభ్రమములన నాయాస విధము దాల్చి
మాయురే యన నాడె రంభా తిలోత్త
మాఘృతాచి ముఖుల కవమానమొదవ. 110

## అపూర్వ ప్రయోగము

క. ఏణీలోచన యీగతి
నాణెముగా నాడునట్టి నాట్యం బార్త
త్రాణ పరాయణుఁ డటుగని
పోణిమి బహుమాన మొసఁగి పుత్తెంచి వడిన్ 111

వ. అంత నేకాంతంబున కాంతంబుగా మోహినీరూప పంచమానా పంచశరుం డును, సప్తసాలభేదన చణశరుండును, విహంగేశయానుండును, భుజంగ శయానుండును, మహాభ్యుదయుండును, సదయుండును, సారసోదరుం డును, సాదరుండును, యర్చితోమాధవుండును, భక్తజన వ్రాతచూత మాధవుండును, గుణుండును, నిర్గుణుండును నై నవమందారు మందారుండు తిగపసి పిళ్లలు పొందళిహాల నమర్చి తెచ్చిన బంగారు తీగ విప్పపూరాజనాలు

పుష్పమంజరులు కస్తూరినగరాలు ముత్తెసరు లేనుఁగ కొమ్ములు గంగా జలములు కేసరులు చంద్రవంకలు వెన్నముద్దలు దాళవాలు నారశ్లు రామబాణాలు కటకసటులు రత్నసరులు జీనిసరులు, రాయసరులు పచ్చ దినసరులు గంధసరులు ముద్దిగంద్రలు రేఖామలు కాంభోదులు మదన సరులు జలమబుడతలు వెలవడాలు మల్లెశ్రీగంధులు కుసుమపూ రాజనాలు కృష్ణనీలాలు ముద్దుఁబ్రాలు కస్తూరిపట్టెలు చెన్నుగులు శ్రీరంగాలు చింత పూలు గోరోజనాలు సన్నెమఘ్జెంగులు జీలకఱ్ఱబోలు పోతుఁగంట రాజ నాలు సీతాభోగాలు గౌరీకుంకుమలు నాగమల్లెలు గొబ్బికాయ బలు గుత్తులు రణము బెండ్లికొడుకులు ఈశ్వరప్రియములు యేలకిరాజనాలు పిచ్చికగోళ్లు వంగాకుబుడుమలు ప్రయాగలు పసుపుగన్నేర్లు గుత్తిబ లుగుత్తులు రావిపూరాజనాలు పొన్నశ్రీరాజనాలు నివ్వరులు నీరు కావులు రెడ్డివంకెలు చౌటవరులు తీగెమల్లెలు సుఖభోగులు సన్న సూదులు గౌరవంకరాజనాలు కాటుకరేకులు ముంగుర మొటికలు పసుపుముద్దలు మంచివిరులు రంభచెక్కిళ్లు చిలుకముక్కులు మధు రములు చామరాలు పెండెముడువులు రాచవన్నెలు తులసివనమాలికలు సింధుకర్పూరాలు రాయమెచ్చులు యేరుమల్లెలు మునిమనోహరాలు వెండి గుండ్లు బొంతమడమలు కూటికుప్పలు కాలుసంపెంగలు కందర్పభోగులు గజపతిలాగీలు బొందడీలు పునుఁగుఁదావులు తేనెతొలలు మోసనాలు గుజ్జుపుతోఁకలు తేటచలములు ఊదుఘటికలు గాజుకడియములు జాజి కుసుమలు దూసలు భీమగుదెలు యేడాకుమొలకలు గుజ్జరులు బిరుసులు జున్నుఁబ్రాలు చిన్నిచుక్కలు కళింగలు వంగవరులు జగన్నాథప్రియ ములు రామలక్ష్మణులు కలియుగమహిమలు కాసరులు కాశీప్రయాగలు షష్టికములు గిమ్మసరులు ననునూటనాలుగు వగల పైరుల చేరుడు బియ్యంపువట్టి ప్రసాదంబులు కలమాన్నంబులు కలవంటకంబులు పొంగలి పులియోగిర దధ్యోదనంబు తిరుపిసంబు పర మాన్నం బానపాలు జున్నులు మీగడ తెరలు నవనీతంపుఘుటిక తొలుపుం బప్పు లప్పడంబులు వరుగులు వడియములు శాకత్రాతంపు బజ్జులు చారులు శిఖరులు పచ్చళ్లూరుబిం డ్లావకాయ మొదలూఱు గాయలు చక్కెర ఖండచక్కెర జీనిచక్కెర కల్కండంబు పుల్లండంబు ద్వీపద్రాక్ష పనస కదళీచూత ఖర్జూరనాళికేళాది ఫలంబులు మసురు

దేనె పూఁదేనె జుంటితేనె పుట్టతేనె పెరతేనె కజ్జుతేనె కురుజుతేనె పుండ్రేక్షు రసపానకంబులు వడంబలి బేడలు వేపుడు సెనగ లనుప గుగ్గిళ్లు చలిమిడిముద్దలు కాయంబులు చిమ్మిలి యడుకలు పోరులు నుండ్రఁబులు కుడుములు దోసెలు నిప్పట్లు రొట్టెలు వడ లతిరసంబులు యప్పములు వెన్నప్పములు సుకియ లమృతకలశంబులు లాగులు చక్కె రబురు లుక్కెరలు కరిజలు పొరివిళంగాయలు తిమ్మనంబులు పాలకాయలు చక్కిలంబులు మోరుండలు మనోహరంబులు గారెలు బూరెలు మండెంగ లంగరొల్లెలు మణుఁగుఁబువ్వులు ఫేణీ లొబ్బట్లు కడియపుఁట్లు చాపట్లు లిడ్డె నలు తేనెతొలలు గురుగు లేలకికాయలు వెన్నమెఱుంగులు నిడికుండుకలు లడ్వాలు ముత్తెపుఁజిప్పలు చంద్రకాంతంబులు మణకెలు సారెసత్తులు చలువమజ్జిగ లెళనీరు శొంఠి కషాయంబు మొదలుగాఁగల నిఖిల భక్ష్య భోజ్య లేహ్య చోష్యపానీయాదులు ధ్యానావాహనార్ఘ్య పాద్యాచమనీయ స్నాన వస్త్రోపవీత గంధాక్షత పుష్పధూపదీప నివేద్య తాంబూలంబులును షోడశోపచారంబులు సన్నిధి నంబులొసంగ నంగీకరించి యారగింపునం దృప్తి జెంది సుఖసుప్తినున్న సమయంబున. 112

## ప్రభాత వర్ణన

క. కోరి చకోరక దంపతు
లారసి గుమిగూడి పొట్ట లాకలి దీఱన్
బారణసేయుచు వెన్నెల
నీరము తమి మీఱఁ బెంట్ల నిమురుచునంతన్ 113

ఉ. చక్కని చొక్కు వెన్నెలరసంపు బిరఁజి ప్రియాంగనాళికిన్
గ్రక్కున నోరికిచ్చి తమిఁగౌఁగిటఁ జేర్చుచు ఱెక్కలార్చుచుం
ముక్కున ముక్కుఁ గూర్చిరవముల్ నిగుడించుచుఁ దోన పాయుచున్
మక్కువ డాయుచున్ గలసిమంపిలు నౌర చకోర దంపతుల్ 114

చ. సలలిత కాలసింహ పటు శాతనఖాంకుశ ధారణన్ దమో
జ్జ్వాల దురుకుంభి కుంభభవ శస్తసుమౌక్తిక రీతివేగుఁ జు
క్కలరెను బ్రాజ్ఞగంబుసుత నమ్మెయి బుట్టిన రక్తపాళిస-
వెలువడి క్రొత్త కెంపు జిగి విన్నున వన్నియ నించెఁ జెన్నుగన్. 115

## యతి భేదము

క. గ్రావవసదుడఊఊ ౩ ఇ
త్యేవంకాలాచ్చక్రమలఘుదీర్ఘప్లుతస
ద్భావ జ్ఞాంఘ్యోయుధ సం
భావోదాత్తానుదాత్తా మధ్యమరవముల్, 116

వ. వెలయుఁ దత్ప్రదేశంబున

## అను ప్రాసవర్ణనివృత్తి యమకవృత్తము

ఉ జాతి తొగల్ నలంగ జలజాతములెల్లఁ జెలంగ బాంధులన్
భీతి తొలంగఁబైట నళిబృందము లుప్పతిలంగ నెమ్మిసం
గాతిగలంగఁబుప్పొడులు కంతుని పావడలై వెలుంగఁ బ్రా
భాతదిశన్ మెలంగె ననపాయ బలాతత వాతపోతముల్. 117

చ భవనములందుఁ దమ్ము వసు భారమునన్ వెలయంగఁ జేయు రే
కువలయనేత్రకార్శ్యమునకున్ దగ విన్నదనంబు నొందెనా
సవసవ దీపపంక్తులు వెసన్ దెలుపెక్కెఁ దలఁప మిత్రులం
దవిలినయార్తి డెందములఁ దాల్పరె స్నేహ దశాను వర్తనుల్. 118

# సూర్యోదయ వర్ణనము

## బహువిధోల్లేఖాలంకారము

సీ జేజేల సభను రంజిలు వెలిచూవు వె
డఁ దపికి ల్బూతలాటం బనంగఁ
దూరపు వెలఁది నిద్దురఁ బోవునట్టి వి
న్నాను పైఁ గెంబట్టు బటు వనంగ
సాము సేయుచును వాసవియెత్తు వలకేలి
కడిఁది మానికపు సంగడ మనంగఁ
గడిలిరాజు హరికిఁ గైగాన్క నిచ్చిన
బటువు క్రొంబగడాల బంతియనఁగఁ

గీ. బాలితాంభోరుహ నికురుంబంబు ముదిత
నిఖిలలోక కుటుంబంబు నిబిడతమిర

కుధరశంబంబు దీధితి మధిత మృదుల
పక్వబింబంబు తపన బింబంబువోడమె. 119

క. తొలిమల గుహయను గొలిమిని
గలితోదయ సమయలోహకారుఁడు రాగా
నలమునను గాచి యెత్తిన
బలులోహపుముద్దయనఁగ భానుఁడు దోచెన్. 120

## ఉపమాలంకారము

ఉ. ఆవనజాప్తుఁ డద్రిపయి నంబుధి స్వప్రతిబింబముం దగన్
గేవలమైన యద్భుతము గీల్కొను చక్రయుగంబుగా మయూ
ఖావళిసూత్రసంహతి యుగాభువిబాంధుల మేలుతూరుపన్
జావిలి దెల్పుథక్కయను చాడ్పున నొప్పె విచిత్రబంగియై. 121

## ఉత్ప్రేక్షాలంకారము

మ జగదాశాబహుదైన్య వారణవిరాజద్వీక్షణాన్వితయౌ
గగనశ్రీ కిరుచక్కి ప్రాగపరదిగ్గాపద్విపద్వంద్వహ
స్తగతాంచద్వసురౌప్యకుంభములు నా సంధిల్లె సత్కాంతులన్
మిగులన్ సూర్యసుధాంశుబింబములు నెమ్మన్ దద్దిశాంతంబులన్. 122

## రూపకానుప్రాణితోత్ప్రేక్షా లంకారము

తే. పూర్వశైలస్తనగములఁ బుష్పవంత
బింబములువొల్చె సమముగా నంబరమునఁ
గాంచనాంబరధరు కరాగ్రములయందు
నమరియుండెడి శంఖ చక్రము లనంగ 123

## అపూర్వప్రయోగము

సీ. తొలిబల్కు చెలులాడు తలిరాకుటయ్యెలఁ
గూర్చిన పవడంపుగొలుసు లనఁగఁ
బ్రాచీదిశాలక్ష్మి పట్టుమేలిమితామ
రను మించు పత్రము లనంగ

రాజు పై నెత్తిన ప్రత్యూషనృపుతోఁపు
దళుకొత్తుఁ దేరి జఁద్రాదులనఁగఁ
దూరపుగుబ్బలిదొర చెంతఁ జేర్చిన
సూరెపుటపుటల్లి జొంపము లన

గీ నగ్రజన్మకరాబ్జ దత్తార్ఘ్యతోయ
నిశిత నారాచదళితమందేహదేహ
దారుణాస్రపదస్రోరుధార లనఁగ
నవ్యఖద్యోతకాంతులు నభముఁబ్రాఁకె 124

చ జఁరుహమిత్రుఁ డయ్యుదయశైలముపై నటదోచుఁ గంటెముం
గలసమయోచితజ్ఞ పట్టుగాయక మంగళగీతికాచయ
మ్ములు తనునిద్రమేల్కొలుపఁబొల్పుగ మేల్కొని నిత్యకృత్యముల్
వె యఁగఁ దేర్చి శౌరినృపవేషముఁ బూనక రాజసంబునన్. 125

## తెనుఁగు సమాసము

మ. నెలజాతీనియ సంతసంపుమగజా నీరాళపుంగొప్పటా
కులనిద్దంపు బసిండి నున్ణవికె నిగ్గుల్ దొట్టుకట్టాణిపూ
సల మేల్పొబ్బ మెకఁబు చెక్కడపు కీల్ జాగాజగగాద్దియన్
జెలువెచ్చ న్గొలువుండె నెల్లరులు జేజేయంచుఁ దన్గొల్వఁగన్ 126

వ ...ట్టిపట్టున

## స్వభావోక్త్యలంకార జాతి

సీ. జొత్తు దళొక్కుతు జుంజురు ముంగురులు కోర
శల్లిఖపై తలముళ్ల చేరఁజుట్టి
వనమృగంబులుజేర ననువైన మొగసిరి
తిలకము ల్ఫాలసీమల నమర్చి
ముంజేతవాకట్టు మూలిక ల్గట్టిన
పులుగుపూసలు చాల నలువరించి
కఁరదండమధ్యభాగ్మముల గురుగింజ
పట్టియల్ నీటుగాఁబరిధవించి

గీ. సిలికాళల పిడియమ్మ లోలిజేర్చి
గూర్చికర్ణంబులను కొండగోఁగుఁబూవుఁ
జేర్చి జేగురునామముల్ దీర్చిచెంచు
నాయకులు వచ్చి రధికసన్నాహములను. 127

క. అందు నొకకొండ అడవుల
యందులవలెఁగాక పురమునందుల వింతల్
డెందమలర వందఱువెర
గందుచుఁ గనుఁగొనుచు మోదమందుచుఁ జనుచున్ 128

## అపూర్వప్రయోగము

సీ. మణిసౌధములఁ జూచి మాభూమికొండల
సిరితిని మెఱుంగు లెఱుఁగమనుచు
ఘనకుడ్య చిత్రముల్ గాంచి జేజేలంచు
ముదమంది చెయ్యెత్తి మ్రొక్కులిడుచు
సభలోని కలకలస్వనములు విని భీతి
నొండొరుమాటున నొదుగుకొనుచుఁ
గలవడంబులుగాంచి కళుకెంత యీసీమ
పొరటతలిరుజొంపముల కనుచు

గీ. బెక్కువన్నెల పులుఁగులు పెంచఁదగిన
యడవిమెకములు మఱియు వనాంతరముల
గలుగువస్తువు లచ్చట గాంచి నవ్వి
వటుఁ డయిన భుజగారిరావటుని యెదుట 129

### జాతి

సీ. మెడతెరువులు నల్లిపొదలు కాలికలు
సోగ లాగలు నిక్కు రాగికాళ్లు
బిల్లికన్నులు మొనపిచ్చికపల్లులు
సున్నపు పోలికలు చిన్నితలలు

బూరుగకాయబోల్ బోరలు లవిటిఁల
కొనకత్తెరలకట్లు కొంకిగోళ్లు
గరెలమేల్ నిడుదసైకపుటత్త్రెవేళ్లుక
ప్పు మెఱుంగు గొప్పరూపులును నుదుట

గీ. మలపములు కేరకొట్టుటల్ చలము గలిగి
కుమ్మ్మపురువు చిక్కుపురువు గుంతపురువు
సుడిపురువు నుస్తైపండులు మిడుతమెదుకు
చెఱుకుపాల్ పాలెరకుఁ గ్రోలి యగిరిఁగెరలి. 130

గీ. ఎదటి కుఱుఁజులఁగని తూరి పొదివిపట్టి
తెక్కుతుదబోర మెడతోడ ప్రక్క పెంచె
మెరిఁగి బిరబిరఁ జుట్టుచు కరచి తరము
బిరుదుకుఱుజు పికిళ్ల పంజరపు గూళ్ళు. 131

సీ. వడిపెద్దరెక్కలు పొడియాకే జడకాళ్ళు
దురసుటీకలు సోఁగ తోఁకచాలు
బలితపుఁ గురుచమెడలు జేగురుమొగముల్
లావునడుములు నల్లనిమెఱుంగు
వన్నెలు పింగాణి కన్నులు తిరిబొముల్
మిడిదేగచాఱలు మిద్దెజుట్లు
మొగ్గారెలును కొద్ది మొనగట్టి పల్లులు
మందపు బొమ్మలు మట్టురూపు

గీ. లమరికలఁగల్గి సంకటి తమిదరొట్టె
వేఁటపొట్టజన మినుపపిండిమెతిక
లొడికముగ బొక్కి దగదీరఁ బద్దకోళ్ల
గఱచి కాటులగెల్చు రొక్కముకోళ్ళు. 132

సీ. ఎఱజర్ల మిడిగుడ్లు నెగుపెదతల చండ్లు
పలుచని డొక్కలు బలుపుఁ బరులు
నలుపు జుంజురు రోమముల బల్మి కందముల్
దురుసుమొగములు సత్తువయొడళ్లు

విప్పు జబ్బకాళ్లు ప్రేల్మట్టు తోకలు
గురువర్తు లాండముల్ కొద్ది చెవులు
బలుపెనగూడిన మెలిగట్టు కొమ్ముల
తలలును మదము చెంపలు మొదలగు

గీ. నంగములు గల్గి వారిజపాకు లులువ
తొక్కుమిరియా లుమెతతాయ మెక్కిసెలఁగి
కుఱుచనిది సన్నలుబడ డీకొన్ని తమి నెదు
టి దగరులఁగెల్చు గురుబపోట్టేళ్ల జోళ్లు. 133

**జాతి**

తే. మేను తల తోక కాళ్లు పల్ మించుగలిగి
రెట్టమెడనెత్తి తొడప్రక్క పొట్టపెంచ
మఱచికాటున విడువక తఱమిగెల్చు
దొడ్డపికిలి పిట్టల బిరుదుకురుజులును. 134

సీ. గందపుమ్రాఁకులు గపురంపుటనఁటు లె
న్గుతలముత్తెములు జేగురు చిలుకలు
గోరంకిఠిమ్ము కస్తూరిమెకమ్ములు
వెదురుబియ్యము కొండ వెలఁగపండ్లు
చాఱపప్పు సితఖర్జూరముల్ ద్రాక్షలు
తేనెకావళ్లు రాతిబదనికెలు
నెమ్మిపురులు నక్కకొమ్ములు తలముళ్ళు
పారుటాకులు మఱలొ కేరిజములు

గీ. గసగసలు పీకవిఁడ్లు సోగ చిలుకలును
సింగములు పులిపిల్లలు జింకలేదు
గములు మానిసికోతులు కాఱుపోఁతు
లేడికదుపులు పులిజున్ను పాడిపసులు. 135

మ. సెలవిం డ్లేనుఁగుదంతముల్ పికిలిపూచెండ్లుఁ బునుంగిజ్జిమై
యొలపుఁ గస్తురి కప్పురంబు పులితోళ్లొడ్డిలు జవ్వాది పి

ల్లులు పీల్కు౽ంచెలు పుట్టతేనె సవరాలుఁ జల్లులుం బందికొ
మ్ములు జాబువ్వను జీడిపప్పు మయినంబుఁ గోరజం బాదిగన్. 136

## అపూర్వ ప్రయోగము

తే. కానుక లొసంగి ప్రణతులై కడను జంక
చేతు లిడి నిల్చి రప్పుడా చెంచుదొరల
యందుసడిసన్న ప్రోఢ మాటాడసభల
దిట్టయగు శింగణాశౌరి కిట్టు లనియె 137

## ద్విపదకందగు ప్తగీతి

1క. కలువదొర మానికముల
దళంపు తళుకులనెపుడును దగలోఁ గొనఁగఁ
గల తరగల పాలకడలి
చెలుంగు చెలవుని నినుఁ గొలిచెద లోకమునఁ. 138

## లాటానుప్రాసము

క. నినుగను కన్నులు కన్నులు
నినుఁ బేర్కొని పలుకు పలుకు నీపుణ్యకథల్
వినియెడువీనులు వీనులు
నినుఁ దలఁచిన తలఁపు ఫలఁపు నీరజనాభా. 139

## అస్పుటకందము

క. శ్రీనాయక తావకభుజ
మానితఖడ్గంబు సకల మహిమండలితో
నానాసుర సేనాసం
తాన యశస్స్నిగ్ధ దుగ్ధధారలు గ్రోలున్. 140

## పరిణామము

క. వేలుపుటింతుల కౌఁగిటఁ
బాలుపడం దివికిఁ బోవు పగతురకెల్లన్
నీలాల నిచ్చెనా యను
నీలాలిత బాహుహేతి నీలాద్రిపతీ. 141

---

ద్వి. కలువల దొరమానికముల దళంపు తళుకులనెపుడును దగలోఁగొనఁగన్
గలతరగల పాలకడలి చెలంగు చెలువుని నినుఁగొలిచెద లోకమున్

## ఉపాత్తక్రియానిమిత్త జాతిభావ స్వరూపోత్ప్రేక్ష

క. ధరణిభరణ దీక్షకు వా
విరిఁ బూనిన గెలుపు లచ్చి వేనలి లీలన్
బరఁగు కరాళభవచ్ఛుభ
కరనందన మబ్ధికన్యకా చిత్తేశా. 142

## ముద్రాలంకారరూపార్ణవదండకము

కలితభువనయోగ జీమూత గోత్రావళీ శాత్ర వాళ్మద్యుతిచ్ఛేద నోద్దామ ధామాభిరామకృతీ, విలసితమునిభావ షట్కోణపంకేరుహాంతస్థ సత్కర్ణికాపార సంచారి భృంగానుకారీ స్థితీ, ఘనవిపిన సరోంబుపాన ప్రభిన్నాగ్రపాదస్ఫుర ద్గ్రాహక గ్రాహ మస్తాగ్ర భిద్భీమ చక్రాయుధా, వినుత జనదురంత సంసార ఘోరార్ణవోత్తారణాకారణాభూతనౌకా ప్రతీకాశనైకాభిదా. 143

## ఆర్యాగీతి రూప కందము

క. వ్యాళాధిప నగనాయక
నీలధారాధారినేత నేడజకులరాట్
శైల పశ్వేతక్ష్మ భృ
త్పాలా వృషభగిరినాథ ధరరాజవరా. 144

## అభేదభేదాతిశయోక్తి—అపూర్వప్రయోగము

క. ఈతేజోనిధి కర్థమె
రాతిరి సత్కాంతఁ జెందరామి యనుచు ఖ
ద్యోతు రెయి సరుచి జేయు వి
ధాత కరింగడచి నీప్రతాపము శౌరీ. 145

## ధ్వని

సీ. తలయెత్తుటకుఁ గల్గెఁ దనజాతి వారిలోఁ
దెలి వేయిపడగల చిలువసామి
కనయంబు చాయపొం దొనరింపఁగాఁ గల్గె
గటికిచీఁకటి పాఱ గదుము జేని
కలరు విల్తునిదాయ యొాదల నిలఁగల్గె
జల్లని వెల్గు లేజందమామ
కలదచ్చి దెసల కొండలను నిల్కడగల్గె
నింగినంటకయున్న నీటిదారి

గీ. కవుర భువనాతిశాయి వైభవ విభూతి
బూని సుజ్ఞాన జేగీయమానుఁడ వయి
పిట్టగమి పాదుశాబాసుగట్టు మీఁద
నెలకొనఁగ మెల్చి దేవర వెలసియుండ. 146

## జాత్యభావ ఫలోత్ప్రేక్ష

క. తగవరు లిలలో వెలఁదులఁ
దెగటార్పరు గాన మిమ్ము ఢీకొను పగరల్
దిగవిడుతు రనుచుఁగాదా
వగభీరువులైరి లచ్చి వలపులరాజా. 147

## గుణితాసాధారణా నుపమాన కందము

క. గడిగాటపు గిరిగీములు
గుడిగూబల గెబ్బిగైత గొల్లలు గొలన్
దడలుచు గండరిగర్వము
విడుతురు నీరిపులు జేరి వేంకటశౌరి. 148

## అనుపాత్తవాచకధర్మోపమానలుప్త వృత్తిప్రాససీసము

సీ. ఇటు గిబ్బతేజి యెక్కటిరౌతు చేపట్టు
గరితగాంచిన గట్టుగాంచినాఁడ
నిటు జోడుపీడని బటువు పుల్గుటచుంగు
చుట్టపుట్టువు మెట్టుఁ జూచినాఁడ
నిటు నండుటేటిపాలిటి కలంకులు దీర్చు
గేస్తు గుబ్బలిఁ దిలకించినాఁడ
నిటు వల్లెతాటి మిక్కుటపు టెక్కరికీబు
కెడగొప్పతిప్ప వీక్షించినాఁడ
గీ. జియ్య యేమందుఁ గొదనాల్గు చెఱఁగులందుఁ
దిరిగి కనుఁగొననెందు దేవరకు దొరయు
పురుడు నేగాన నీబంబుబురుకగాన
చామనమెఱుంగు తిరుమేని సామిగాన. 149

## అధికము

క. ఉల్లము పొడుపు దొరయ్యా
చల్లని నీయసము పాలసంద్రములోనన్
దొల్లిటి సాముల యసముల
నెల్లను బుద్బుదములట్లు నిల గన్పట్టన్. 150

## స మ త

సీ. వితరణంబులు లేవె వివిధ పంగ్వంధ
ధ్యుల కభీష్టములు సంధిలవుగాక
నుత్సవంబులు లేవె యురుహరు హరిదాగత
ప్రభుదత్త విత్త మేర్పడదుగాక
గిరిదుర్గములు లేవె పరమోత్తను సమస్త
తీర్థరాజాప్తి పర్తిలదుగాక
నెఱనంబులు లేవె నిరుపమ పారసీ
కచ్ఛేదనోద్వృత్తిఁ గనదుగాక
గీ. ధరణి పుణ్యస్థలముల దేవగణం లేరె
నీవలెను దివ్యతిరుపతి నిలిచి భక్త
వారములఁ బ్రోచు సాములు వేరుగాక
పంకజాతాప్త నీకాశ వేంకటేశ. 151

## శయ్య

క. వలరాజఁట కొమరుఁడు చి
ల్వలరాజఁట పాన్పు ముద్దుబమఱఁది చెంగ
ల్వలరాజఁట కావుననే
వలరాజని నిన్నుఁ బొగడ వసమే సామి 152

## అపూర్వప్రయోగము - తెనుఁగు మఱుఁగు

సీ. పయ్యరమేపరి నెయ్యఁపు బోనంపు
తెలిమెకం బెకిగింత గలుగు సామి
రెంటఁ్రాగుడు చట్ట రెట్టింపు తాలుపు
తలపువ్వ తంద్రిలో నిలుచు జియ్య.

చొక్కలాయపు జక్కి యెక్కటి తోడెక్కి
తత్తడి పురిసికఁ దాల్పువేల్పు
మబ్బు పూబుట్టువు మాళిగలోనుండు
గుబ్బెత నెదజేర్చి యుబ్బుజేజె

గీ. సంజ జగడంబుకాక రాచాయమించు
తలఁపు మానిక మరచేత నిలుపు రాజ
డాలు తులకించు బేడెస టెక్కియంపు
సాహెబును గన్న చొక్కపుఁ జక్కనయ్య. 153

## అపూర్వ ప్రయోగము

శా. నేలన్గూఁతలు వెట్టువాలు పులిచక్కిస్మించు పావాలు మున్
గాలంజాలు జెలంగుడాలు మొనకెక్కన్ బక్కిరాడాలు ని
ర్గేలన్ బేర్కొనువేల్పుచాలు నెదనెమ్మిన్నిల్వబూ చాలు నే
వేళం బూతల మేలు మేలును గలా వెన్నుంలనినుం గొల్చెదన్. 154

## జాతివార్తలు

సీ. చలిగాలి దిండిమేతల జాతికొమ్మల
యాటల కిరవైన యట్టి సెలలు
గుజ్జుపు మూతుల కులము ఫౌల్తుల తేఁట
పాటలకునికైన మేఁచరులు
నిసుమంతమాన్పవంగసము బాలల కిన్నె
రల మ్రోతలకు మారువలుకు గవులు
తెలిసుద తెరగంటి తెరగంటి తెఱవల
రచ్చపట్టగు నెలజాతిగములు

గీ. జంట-ముక్కాలి జెక్కడాలంటు చేత
మలినమౌ నలినములుండు బలుకొలఁకుల
గలిగి చెంచులకెల్లను నిలుక దయిన
పొన్నవలిమల చెంత మా బూమిసామి. 155

తే. అట్టి సలిమల సేరువ యడవి నున్న
చెంచులెల్లను మాపని సేయనుండి
కోరి దేవర యడుగులు కొలువ వేడి
యరుగుదెంచితి దామకుఁ దండ్రు నన్ను. 156

ఉ. ఈ దివసంబునందుఁ దగనిచ్చటి కోనల యీ కిరాంద్రనం
బేదలు మామలల్లుడులు పెద్దలు సుట్టలు నల్లిబిల్లిగాఁ
బ్రోదిగ వేఁటలాడి కడుపు ల్దనియించుచు నిల్లుముంగిలై
సోదెము జూచువారలకు జూపుచునుందుము నాడునాటికిన్. 157

క. సామీ సల్లని ప్రొద్దున
నేము దలంచవలె మిమ్ము నిట జేజే రా
గీములపట్లను బీళ్లను
నేమును మీ సలువ వలన నెమ్మది నుందున్. 158

## అపూర్వ ప్రయోగము

క. పులిమీసల నెపుడే ను
య్యేల లూఁగుచు విల్లుపూని యెదటన్ గిదటన్
బలమున్ గిలము న్వేలయుఁగ
నలుగుల నెలుగులను ద్రుంతునలవోని తఱిన్. 159

సీ. గెలుపుపేరు వజీరు గినిసిన కిప్పుబై
దువరాచ సెంచు మాదొడ్డివేల్పు
సతబాసవాల్దాఁట కతలాని పాఱు వే
సముఁగొన్న బోయ మాజాతిపెద్ద
సుకఁటివీఁపుల చుట్ట దొరమొక్క రానేస్తి
జంగిలి యెఱుక మాసంగడీఁడు
దరమంపుటొజ్జకు తదవ్రేలొసంగిన
యానాది మాకితవెన తేఁడు

గీ. వేయునేటికి తరిమల వెండికొండ
తాలిగుబ్బలి కడగట్టు తావులందు
నప్పసం బుప్పతిల్లుచు మెప్పుగన్న
యట్టికొరవంజులెల్ల మాసుట్టబయ్య. 160

సీ. బలితంపు వణఁకుగుబ్బలిక్రింది నాడెల్ల
కేలిగా మాపెద్ద కైరఁదేలు

గందపుఁగట్టు దుర్గపుఠాణములనెల్ల
పట్టుగా మాసిన పాపఁడేలు
బొడుపుకొండకు సెల్లుబడి కోనలవి యెల్ల
కొమరు మీఱంగ నాకొమరుఁ డేలుఁ
గర్వంపు వెంబడి బంగరు గ్రంకు మలలెల్ల
దేవరబంటు సాధించి యేలు
గీ. నిండె కొంచెపు నక్రమయీదరములు
మత్తు బొత్తిల్లు తనకేలుసత్తి దనర
నాదు పినమన్మఁ డేలల్ల నాటనుండి
చిలువమలవాఁడయో రాచకలువతేఁడ. 161

సీ. డంబెచ్చు తపసికన్నుంబాప పేరెక్కి
నందలి కుందేటి కందు నొకటి
చాయజక్కవ చంటి సాహేబు పాపని
తురకమానికమగు దుంతి యొకటి
ముక్కంటి పండుల మ్రొక్కు లీడేర్చు నా
యంకుని తండ్రి చేసింక యొకటి
జాళువా పరపయ్య జంపి యీపట్టికి
మేలిచ్చు సామేని మెకము నొకటి
గీ. నీటియెకిమీని మొలనూలు బోటిమిన్న
నొంటిపంటనుగల కిటి యొకటి నిక్కి
కలను నెమకిన మెకముల పొలపుఁగాన
మేము జేజేల గాచిన సామిసంద. 162

సీ. మా వేటలకుఁదప్పి వేవచ్చినదిగదా
మెలఁగెడి యీనేల మెకములెల్ల
మాసెలవిడి పారవేసిన యదిగదా
యిమ్మైన యీయేన్గుకొమ్ములెల్ల
మేమువాసవి సూడ మిగిలిన యదిగదా
యీనెలవున దెచ్చు తేనెలెల్ల
తొలుత మాపోగు కట్టల రాలినదిగదా
యిందు గల్గిన హరిబీకలెల్ల

గీ. యేము సెప్పిన సుద్దుల యింత గలుగ
దితవుగాఁ బల్కుఁ-యీ సోటుకతలదెల్ల
కాన యీకాన నాకెనగాన మేటి
నల్లయెఱుకాన యెఱుకాన నల్లసామి. 163

ఆ. మేముగలుగు పజ్జ మీకొక వేఁట దో
టలను వేడ్కఁ జూపవలయుఁ గాక
నురకయిండ్లకడను నుందుమే మీసొమ్ముఁ
దినిన ఋణముదీర్చు మనుచుఁ బలికి. 164

క. వేయేల జియ్య వినవ
య్యా యిక మా వినప మొకటి యటు కనుఁగొనఁగా
నేయెడఁ జూచిన నడవిలు
లాయంబులు వెలయ జమునిలాయము లనఁగన్. 165

క. ఇనమణి యవిగాకా చెం
తన యెక్కటి రెండుమూఁడు నాల్గయిదాఱే
డెనిమిది పదియుఁ బ
దనకొండ్రుంద్రెండు గాఁగ దగ నేర్పడుచున్. 166

## జాతివార్త

సీ. కోనము న్వెలువడి ముర్ఘురధ్వనులతో
దారిమున్నైలు మోర లోరసిలగ
నేల జల్లెడువలె నెలకొల్పి పొలమెల్ల
పోడు గొట్టిరన గోరాడి చప్ప
రింపుచు పైవేరు దెంపుల దంష్ట్రలు
నూరిజాల్నెలవుల నురుగు బిరుదు
జల్లులగతినొప్ప దుళ్లుచు నవ్వాడి
కోఱల నరవాడుదేరు చీఁక

గీ. దిగుబురుత్తరింపుచు వెదురుగడలువడ
రాచి తుదలెల్ల ఝాడించి రాలుబియ్య
మెరకుగొని పెంట్ల గూడిమై నెరులు నిక్క
నేగ్గు దోమగఁ జూచు న య్యేకలములు. 167

క. ఇది పొల మిది బిల మిది చే
నిది బైరిది కుంజ పుంజ మిది చె
ట్టిది ఝరి యిది దరియని తెలి
యదు మెకములు నేలయీనినటుల మెలంగున్. 168

క. కైవాలుపండు పంటల
కైవాలు మెకమ్ములామి కైవాలుటచో
సీవాలున సీవాలున
సీవాలున నీప్రశస్తి నెఱపఁగవలయున్. 169

## ఆదియమకము

క. బలుబంది పందికదుపులు
పులు లెలుఁగులు సిలుగు చిఱుత లేనుఁగులున్
గలయడవుల గలకొలఁదుల
దులదుల వేటాడగాక దులవలయు హరీ. 170

## ఆద్యంతైకనియమ ఛేకానుప్రాస యమరూపకందము

క. నేనిక నేనికయౌదల
మానిక మానికరమైన మానికడెంబుల్
పూనిక పూని కరంబుల
కానిక గానికగ నిచ్చుఁ గానిక యిత్తున్. 171

ఉ. రమ్ము మురారినిన్ను సుకరమ్ముగఁ దోకొనిపోయి నేడు నా
యమ్ములచేత జంతునిచయమ్ముల నెల్ల వధించి మావినో
దమ్ములు చూపి నీమది ముద మ్మలరింతుము నాదుజోడు లో
కమ్ములయందు సెంచుకులకమ్ముల గానము సాము సత్తునన్.

క. ఇడుమలబడి మెకములవలె
యడవులను జరించునట్టి యదము లటఁచున్
గడు చుల్కజాడకే మె
ప్పుడును పురందములు విన్న ప్రోడల మనుచున్. 172

## అపూర్వప్రయోగము

సీ. బాసఁదప్పక బూమి రాసబాపని కిచ్చి
నిజము సేకొన్న మన్నీనికతలు
నలకిపుట్టువు గ్రోలనరచేతను గలాని
చిలుకుముక్కున నిల్పు బలియుకతలు
కంపటీలను పసిగాపరులకు గొండ
వేలనెత్తిన గొల్లబాలుకతలు
నలుమాఱుమనువుబిడ్డల బిడ్డలాటకై
నేలకు జేయు కయ్యాలకతలు

గీ. కులముపెద్దలు రచ్చల గుంపుగూడి
చేరగావచ్చి కోయితల్ జెప్పుకొనఁగ
సకలమును విన్నవారము సామి మమ్ము
నేళముగ సూసి సిత్రాన నెంచకయ్య. 174

చ. అనవుడు వానివాక్యముల కయ్యెడ మిక్కిలి సంతసించి నె
మ్మనమున నుగ్రవన్య మృగమండలి హింసవిలాసధర్మమౌ
నని పరికించి వారికిఁ బ్రియంబునఁ గట్నము లిచ్చి దూతలన్
బనిచి దిగంతశైల ఘన పక్కణ భూముల కాక్షణంబునన్. 175

క. కమ్మలు కైరాతకకుల
కమ్మల రమ్మనుచుఁ గౌతు కమ్మలరారన్
సమ్మతి పనిచిన నొకదివ
సమ్మతి గడవక విదమకు సమ్మతిగాఁగన్. 176

## అపూర్వప్రయోగము

క అయ్యెడ నడవిని నొంటొరు
కుయ్యిడి పిలుచుచును లుబ్ధకులు హరిపసుపుల్
సెయ్యుచు గనుగొని బాగెము
నెయ్యఁబున మనకు గల్గెనే యని చేరన్. 177

క. ఆసమయంబున నొకశుభ
వాసరమున నంజనాద్రి వాస్తవ్యుం డు
ద్భాసురతరచిత్రమృగ
వ్యాసక్తి మనంబు వెలసి తానందముగాన్. 178

సీ. మును చెవిబాయజాఱిన యోరసికను క
సీదురుమాలు భాసిల్లగట్టి
సరిలేని కట్టాణి చౌకట్లు ధరియించి
కస్తూరికా తిలకంబు దిద్ది
తెలిరుచందురుగావి దట్టిగట్టిగజుట్టి
వలవంక రతనంపు వంకిజెక్కి
కుంకుమ రసమునఁ గూర్చుగంధ మలంది
వలిపెదుప్పటి వలెవాటు వైచి

గీ. సకలభూషణమణిరుచినికర కిరణ
రాజి గడుమించ నిజమందిరంబు వెడలి
పొగడపుగుబ్బలి నడుమను వెడలునట్టి
వనజబాంధవ వైఖరి వనర నపుడు 179

జాతి

చ. గొరిజలయుబ్బు మేనిజిగి గొప్పయురంబు వెడందపంచకం
బెఱుపగు వన్నెచిన్నె చెవు లెక్కువమై సిరసెత్తు మెట్టువాటీ
కొరసగిలింతగట్టి మఱి కొంచెము కండము కాళ్లవేగమున్
మెఱుఁగుగనుల్ సుదేవమణి మెత్తని రోమము లొప్పమెప్పగన్. 180

సీ తగినట్టి మాష్టీని దండపోల్కి మెఱుంగు
మెఱయు కైవడి బిసమీటినగతి
కీల్బొమ్మతెఱఁగున గిణిబెళ్క చొట్టున
లకుముకి పోలిక లాగుసారె
ద్రిమ్మరు మేర రసంబు కదలుమాడ్కి
నీట మునిఁగి లేచు సూటిత్రాటి
బాణవితాన పటము విడచినయట్లు
రిక్కతెగిపడిన రీతి మింట

గీ. చిల్కకొలికినవైపున జింకదాటు
పగది బంతియొగయుదారి పాపములకు
సరవి యంతరపల్లటి వరుస బిరుదు
పాత్రవలెనాడగల జిత్రపత్రమునకు. 181

ఉ. బంగరుజల్లులున్ బికిలి బంతితలాటము ముత్తియంబులు౯
రంగుగ మోముపట్టు నపరంజి ఖలీనముపట్టు పల్లమున్
సింగిణి విండ్లు తూణములు చిల్కల కోలలు పట్టియంబులున్
సంగతి పార్శ్వభాగముల జక్కఁగఁ బూనిచి సాది నిల్చినన్. 182

గీ. వాజిగుణమును రాగెయు వాగెభూమి
మానమును శరశస్త్ర సంధానములును
జోడు పరశస్త్రముల రాక సూటివిధము
ననెడి యష్టావధానము లాత్మ నెఱిఁగి. 183

గీ. బిగువు పదిలంబు చూచి గంభీరవృత్తి
మ్రొక్కి పౌన్నంకి వన్నియు ద్రొక్కి నిక్కి
సరవి కైరని నెక్కి యుత్సాహ లీల
పిక్కటిల్లఁగ దుమికించి యెక్కువగను. 184

## పంచధారాయుక్తసీసము

సీ. వలయాద్రి పరిమిత వసుమతి గైకొన్న
గమనిక చుట్టు ద్రేవెడములు ద్రిప్పి
విరసించు నసురుల శిరముల మెట్టింతు
ననెడు చందముల జోడనలుబట్టి
నిజకీర్తి చంద్రికల్ నిగుడి యంబుధులెల్ల
గడచె నన్న విధాన నిడివిదోలి
యిలమీఁద తనయాజ్ఞ చెలియలికట్టగా
నిలిపినగతి కుఱుచలను మలచి

గీ. తనకు ప్రతిదేవుఁ డెందు లేఁడనుచు నెమకు
పగిది తగు నర్థ వేడెము ల్బరపి మఱియు
ఖంజళి మురళి ఝళిపి ఝంపయి సుధాల
మనఁ గతు లెసఁగఁ జూపుచు వాళిమీఱ 185

వ. అప్పు డయ్యాటవిక నికరంబుతో నారాయణవన ప్రాంతంబున మృగ శరణ్యంబగు నమ్మహారణ్యంబు సొత్తెంచు నత్తఱి ముత్తెపుఁదేటనీటి చొక్కాటంపు సెలయేటి దరుల వఱలు చలువల బోదన నేదిన పంటవలంతి నెమ్మేన శృంగారరసం బుప్పొంగిన తెఱంగున చెంగలించిన నిచ్చలపు పచ్చికల మచ్చికల విచ్చలవిడి మెసవి మిస మిసల మసలుచు నీఁగ్రాలిన జరీనజీరుకు బారు నునుపుతనువులం దనరుచు వలికరువలి బొలసిన సొలసి బెగడి మిడిగొరిజల వడిచివుకు చివుక్కున నుప్పరంబులు గుప్పించుచు తళుకు బెళుకు చూపులనేపు జూపుచు కుఱంగట లొద్దుగు మోదుగ కంకేళి దాడింబ బాసన బంధు జీవనం బాదిగాఁగల చెట్టుల నిట్టలంబుగ నగ్గలికల నలరు కలికల నమరు సుమనికరంబుల దూరంబులం గనుంగొని కారుసొదయను బమ నెదల నెదుగ నెదగదుర తండంబులుగ నడ్డంబులుగ నుండు గుండుల గండు మీఱ జంఘాలత నుల్లంఘించి పొదలెడు కన్నెలేడులును, రావి మఱ్ఱి యందుగు వెలఁగ వెదురునంటుల నంటులైన చిగుళ్ళు కంటి కంటి కంటినని కంటికి నింపుగా నాకంటికి మెసవి వేసవి తేటనీట నీటగు కొలంకులం జేరి నీరంబులు జల్లుకొని పొరలి కెరలి మరల తామరల పరంపరల వెంపరలాడి తుండంబుల తండంబులు పొదవులెత్తి భూత్కారంబులుచేసి చల్లని తావులకు తావులగు మావుల క్రేవలకై వశంబులయి వశాళితో గొండ్లిసలుపు దంతావళావళులం దిలకించి వేసటగొనక సటలమెకంబులు గమకంబగు తమకంబులపైకి దుమికి నఖముఖంబులన్ గుంభంబులు సంరంభంబున చక్కలుగా వ్రక్కలించి జొత్తిల్లు నెత్తుటంబొదలు మెదడు పొలసొంపొలయ మెక్కిపుక్కిళ్లకు కక్కసంబైన కోరల యోరలఁ జిక్కిన పెక్కుదొర ముత్తెంబుల నుమియ దానపుదమికి జగ్గుమను నిగ్గులుదేరు వన్నె ముగ్గుల సింగారంబుల తెఱంగులును యర చిచ్చులకై పెచ్చుగాఁ జూపట్టు పుట్టపట్టులు గొట్టి గుడ్డుచీమల బారు వాముల మిలమిల మొదలు చెదలు కదుపుల లెస్సగా బుస్సుబుస్సున గూర్చి యెగబీర్చుచు ముసముసన ముసరు కటికచీఁకటి తుటుముల నందంద గ్రందుకొని యందలి తేనియలాని గుటగుటార్భటుల నటునిటు ద్రిమ్మరు జల్లిదంపు బొల్లి మొకము మెకంబులును, తరువుల మెండుకొని

యుండు కొండగొఱియల ముఱియలుగ నఖరశిఖరంబుల విదళించి కుత్తుకలొత్తి నల్లలుగావు బట్టియెరగొని గవులుచుట్టుకొన గవులమివుల నిదురగదుర పొగరున గురుపెట్టుచు చిత్రవర్ణ కంబళంబుల డంబువిడం బించు చావులగు వీపుల రూపుల నేపుదనరు చిఱుఁతపులులును నిర్ఝ రంబుల జర్ఝరితంబుగా నూరునీరంబుల మెరసినిరవుకొనిన సమ్మర్దంబున కర్దమంబు గావించు దుర్దురంబుల నిర్దయత మార్దవంబు పొసంగ మెసంగి కఱుసంబులూడ్చి ఱుసకొట్టుచు మీఱు సరీసృపనారీవారంబులతో మస కముల తనివి ననక సంచరించు నాచుతాచులంగాంచి మేను ఱుప్పొంగ చెంగుచెంగున దాఁటుచు డగ్గరి వావిప్పి తెప్పున కబళించి చప్పరింపుచు నొప్పు పొడదుప్పులును నిండారుగండశైలంబుల డాలీను గైరికంబుల నిజాంగంబులు ప్రతిబింబితంబులయినం గనుంగొని మదులనెదురుగి రోసంబుల ఖాసిల్ల పిఱిఁదికి సని బిరబిరన ఢీకొని మొకంబులు వంచి రెండిమ్ముల ఢకాఢకి దాఁకి సెలగభంగంబులైన యుత్తుంగ శృంగంబుల మీసరంబులగు కాసరంబులును, ఎందెందు సంచరించు నందందు కమ్మ తావులు ముమ్మరంబుగాఁ గ్రుమ్మరింప నింపగు గస్తూరికా మృగ వారంబులు వెన్నెల జెన్నెలరు వెన్నెలకువ్వల మవ్వంబున నివ్వటిల్లు తెల్లజల్లుల నుల్లసిల్లు బల్లిదంపు జల్లిమెకంబులును పదయుగ నఖాంచ లంబులఁ జంచచ్చంచూపుటంబుల రెట్టిత్రావుడు బొబ్బమెకము దచ్చి కాళ్ల మెకంబుల నిరికించి కఱచుక యుప్పరంబున కుప్పరం బెగసి మలలసెల యేట్ల పులినతలంబుల నజ్జుగాఁ జెండుగండ భేరుండకాండంబులును, చిమ్మనక్రోవు* వెలువడు జలంబుల కరణి తరునికర కర్షణంబుల చిల్లున చమురుగారు శరీరంబుల మత్తిల్లుచు క్రేళ్లురుకు పాకానీకంబుల దోకొని ఘుర్ఘురారావంబుల మీఱుచు గములు గట్టిగట్టి మొనయై దులదులమెలఁగు నలగుల జుట్టు చుట్టును వేంద్రంబునం దీంద్రించు ఇంద్రనిప్పుల కుప్ప యొప్పునఁ దేజరిల్లు బిల్లికన్నుల నలుదెసలం గలయఁ జూచుచు నల్ల నల్లన బలగంబుల నెఱయించికొనుచు కురువింద బృందంబులు గల కెలంకుల ముట్టెల నట్టిట్టుగాఁ బెట్ట గలిగించి చప్పరించి రొప్పుచు కోనల డొంకలం జెఱువుల దొరువుల పడియల మడుఁగుల నెలవుల చలువల పజ్జల నజ్జులు సేయుచు నీరంబులు దూరుచు పేరెంబులు వాఱుచు ఘోరా కారంబుల మీఱుచు పారంబుల దాటుచు నింపారు సూకరయూథారం

ఋలును, లేవెలుంగు మినుకు శకలకు గాక చలుజాతి పదగల రంజిల్లు
బిల్లులు బెల్లుగాబట్టి గరగరఁగొరికి బిరుసుచేని నునుగజ్జల నెజ్జుగా జవ్వాది
యొత్తి యెమ్మెరం ద్రిమ్మరు జవ్వాదిపిల్లులును పిల్లల నక్కునందు
నెక్కొననిల్పి నిక్కుగల కొమ్మలనెక్కి పచేళిమంబులైన క్రొమ్మావి
పండ్లుమెక్కి గ్రక్కున నిక్కడక్కడ దాఁటుచు నందునిందు మాటుచు
నిక్కినిక్కి వెక్కిరించుచు చెవులు రిక్కరింపుచు పండ్లిగిలింపుచు గండ్ల
బెదరింపుచు కిలకిలారావంబులు నింపుచు గలగలన చెట్లు గదలించుచు
వెనుక ముందఱఁ జూపి మెలఁగుచు పెనఁగులాటలం జెలంగుచు పిక్క
టిల్లు మర్కటంబులును గలిగి విలసిల్లు విలోకించి యంత యక్కాం
తారంబున నొక్కసెలయేటి కెలన నిలిచి యచ్చిలువ మలతేఁడు శేనం
పాత మొదలగు వేఁటలాడుఁడని లుబ్ధుల కానతిచ్చిన. 186

క. పులియెలుగు పొదల చల్లడ
ములు దట్టులు నీలిగోణములు పికల ఢం
డలు కావుబొట్లు మెట్లును
కలిగి చెలగునట్టి బోయగమి యవ్వేళన్. 187

క. బలువిండ్లు చిలుకుటమ్ములు
మొలిదట్టులు నీలిగోణములు కురుచపిడె
మ్ములు పికలు చేకొమ్ములు
నలరఁగ బోయదొరబిడ్డ లాహరి యెదుటన్. 188

ఉ. కొంచెపువాలముల్ గురు చగోళ్లను గొప్పశిరంబు కాళ్లమే
ల్మించిన నాల్క డొక్కజిగి మిట్ట యురంబు వెడందకండ్లు మై
పెంచిచెలంగు భీముఁడు తుపాకిలకోరి కరాళిగొంటు క్రా
మ్మించు తలారిజీడిపులి మేఘముహాఁదగు జాగిలంబులున్. 189

## యతి

మ. సెలకట్టెల్ తడువిండ్లు నుర్లుతెరలున్ జేకత్తులున్ చల్దిపా
దులు పందీటెలు దీమముల్ చిలుకులూదుల్ చిక్కముల్ మోటక
త్తులు బోనుల్ బడెగండ్లు ముంగిసలు నెద్దుల్ పొగులున్ బోటుకో
ళ్లలు జాలంబులు గంటలున్ దివెలు గా లంబులో జిగుర్కొటలన్. 190

## జాతి

సీ. అన్నువతల గొప్ప కన్నులు నల్ల నా
లుక తెరిపి మెడగులు కరివన్నె
తెల్లబొమల్ జట్టతిరులు నిక్కగు మెడ
లెల్లబాణీలును నల్లిపొదలు
వెడఁదసన్నపుటత్తు క్రేళ్ళుల్బు చెక్కిళ్ళు
రెట్టకట్టెదురీక మిట్ట బోర
కురుచలవిటిమాచ్చు గొరవంక కాళ్లెట్టి
బాణీలు మొనపండ్లు పరుపు గలుగ

గీ. వారణంబును జలకట్టె బైరిగెద్దు
చంచడము సాళువము శనిశరము మించు
యాష్టమును తళుకాదిగాఁగ వేరవేర
నొప్పు డేగల జతగూర్చుకుండుటయును. 191

## అజహాల్లక్షణము

సీ. ముందరవిలు బాలు మొనసితుపాకీల
బారు లాతరువాత బలసికురుచ
బల్లెంపు గుంపు లావజ్జదెప్పరమైన
గడలపౌజులు నిరుగడల నడుమ
మదగజంబులు వాటి గదిసి యరదములా
శార్వంబులందు బాణాల తుటుము
లావెన్క హితులు ధరాధిపుల్ మంత్రులు
గొల్వ వెన్నుని వెంట గూనిపీపు

గీ. లిఱుకు భుజములు కెంజాయ కఱుకు మీస
లుఱంకు కనుగ్రుడ్లు మిట్ట పండ్లుఱుకు నెఱులు
బెఱుకు చూపులు పరువుల విఱుపులగల
యొఱుకల దొరదామకుఁడు కొండయిని యందు. 192

సీ. ఏనాఁడిరాయ నీపీ కోవలో రమ్ము
ముతరాచ నీవల్ల ఘోదను నిలువు
వేకరిసామి నివి పట్టు సూడుము
భోయనీ వాసలచాయ కావు
మెఱుకులతేఁడ నీవీనెప్పు సూడుము
సెంచనీద్దా పొగయంచకదలు
వేసమన్నీఁడ నీపీకాన వెరజుము
గైతనీవా జాడ గనగ చూపు
గీ. తాచురారూపు చుట్టునేస్తంపు జియ్య
యయిన రాసనక్కరపతి యదె పిరపడి
సూసి బందుగు లిటురాజ్ఞి జోస్తి ననుచు
పలికి యావల వల వేటరులను గలిసి. 193

క. వలలం గాలంబుల గొడ
మల సూదుల జువ్వలను గ్రమంబున మడుగే
రుల యడల వ్రేసి యొడ్డియు
బలువిడి నూదియును దొడఁగి బారలు మీరన్. 194

ఉ. ఉల్లికతట్ట మారువము వాలుగ బేడస కొఱ్ఱమీను పెం
జెల్లయు పక్కెపారియును నీచును ముచ్చగ బొమ్మడాయముల్
దొల్లిక తేలుమీని సుకదొంతును పిత్తడికాసుమల్లు మీ
నల్లెయు గండెరొయ్య పరకాదిగ చేపలఁ బట్టిబెట్టుగన్. 195

వ. అంత నయ్యెఱుకలుగల యెఱుకుఱేఁడు ప్రేమంది తన మందిని గూడి
శౌరి కనుఁగొన లటహ పటహంబులు దిక్తటంబుల నదర చరపించి. 196

గీ. వలలు వేయించి తడికలు వంచి యడుగు
జాడలెత్తించి బోనలు సంఘటించి
పోగువారించి గసికలు పొసగనుంచి
మినుకుల రయించి తడికలున్మాటి యచట. 197

గీ. పాదులను దీముగువ్వల పాదుకొల్పి
జిగురు గండెలు నురులును జిప్పతుదళ

నిల్పి మీటలు తరువుల నిగుడజేసి
పట్టి మృగముల పిట్టల గొట్టియందు 198

గీ. ఒకటి తొలుత వేఁట జిక్కిన మెకముఁదెచ్చి
నెత్తి నీటను గడిగి చేకత్తి చేత
ఖండి కనుగ్రుడ్డు బెఱికి తన్నెంచ చెంచు
లంత తమ్మి కంటికి నివాళించి చెలఁగె. 199

వ. అట్టిపట్టున

చ. కని చిగిరింతయున్ గదుడు కారయు కోరిక చేరి బోదయున్
గునుకును నొంటి చిప్పరయు గొఁగడ యూదరనక్క తోఁకయున్
బొనుకెడ పీరితోఁటగియు పొత్తర మల్లవ మారువెల్లియున్
వెనుతరు ప్రొల్లబూదియును పీడలి పిచ్చుకబియ్య మెంద్రయున్ 200

గీ. కనుము కందురు గరిమిడి గఱికె పొలికి
తొప్పరంట్రింత సాలువ యుప్పు గడ్డి
పరిక పుల్లాచి మొదయము బైటి తుంగ
మొదలుగాఁ బూరి రవలింప పొదలు వెదలు 201

సీ. శార్దూల గజసింహ శరభ సంఘంబుల
సమయించి కణతుల జక్కుసేసి
భల్లూకశల్య శంబరలు లాయంబుల
దునిమి సివంగుల దూల బొడిచి
సారంగ గండక చమరీ మృగంబుల
నురుమాడి కొర్ణగండుల వధించి
గవయ జంబుక ఖడ్గ గండభేరుండ ప
టలి గూల్చి మన్ను పోతులనుఁ జంపి,

గీ. యేదులను నొంచి దుప్పుల నేపణంచి
శశకముల ద్రుంచి యిఱ్ఱుల సంహరించి
యితర వన్యమృగావలి నెల్ల విశిఖ
ఘాతురిని గెల్చి ఫణిగిరి స్వామి మఱియు, 202

క. కాయంబులు గాయములై
యాయంబులు పగుల ఖిగుల నాయంబులచేఁ
దోయంబుల టింకిని బలు
తోయమ్ముల మృగకులమ్ము ధూళించె వడిన్. 203

క. సామికిటీకటము నేసిన
యా ముత్తియమమ్ము సుదనయమ్మునం దనరె
న్నాముని కృపగలిగిన రఘు
రాముని తూపుతుద నీటి రాజుండువహిన్. 204

గీ. అంతట నిఖిల మృగయా విహారలీల
సలుపుచును వచ్చి యాదైవసార్వభౌముఁ
దఖిల పరిజన పరివృతుఁ డగుచు వేఁట
సరవి చేయెండ సోఁకునఁ జాల బడలి 205

## యతి భేదము

సీ. మునుపుష్యరాగంపు మొదల రక్కొని మించు
వైడూర్య శాఖల పచ్చరాద
దమ్మసందుల పగడంపు సైకపు సుడి
తలిరుల తుదల నిద్దపు సుపాణి
మ్రుగ్గుల నొరయు క్రొమ్మూలలా లిరులక
డాని పుష్పొడి రాల్పడో నన వగ
చిందు గోమేధిక సీధువునకు మూగు
నింద్రనీలపుజాతి గండుదేఁటి

గీ మ్రోఁతలకు సొక్కు బంగరుపులుఁగు లెఱుకు
పలుమొనల చించు రతనంపు పండ్లపడియు
రసము ప్రవహించు సెలయేటి యిసుము దిబ్బఁ గ
లుగు చిత్రతరుచ్ఛాయ కెలనఁ జేరి. 206

క. అటు ముందట పటుశైత్యో
ద్భటమయి ధిటమయి నిగాఢ దళసంతతి వి

స్ఫుటమయి రుటమయి కడునా
పటమయి ఘటువయిన ధొక్కవటముం గనియెన్ 207

చ. కనునెడ మంత్రియో సురశిఖామణి చూచితె యెంతవింత యీ
జననుత భోగికంకణత సద్విజరాజ సమాశ్రయత్వమున్
ఘనతరజూట భాసురత గన్గొన సప్రసవాయుధారి యో
యనఁ జెలువొందె నివ్వట మహర్నిశ మంచు విలాసవైఖరిన్. 208

గీ. పలుకు నమ్మంత్రి కూడుక ఫణిగిరీశుఁ
డత్తరుచ్ఛాయ కలరు నెయ్యంబు మీఱ
వచ్చి శ్రమమార్చ నొకకొంతవడి ప్రియంబు
వెలయఁగా విశ్రమించిన వేళయందు 209

సీ. వెన్కఁజిక్కిన మెకంబును దెచ్చి తలనీట
దడిపి పువ్వులు సుగంధంబువేసి
కొనకోక తెగగోసి మునిమీసలు పెకల్చి
కానుకజేసి కాత్రేని గొలిచి
క్రొవ్విన పందుల కొన్నిటిగ మలిచి
కత్తిజాలను చివ్వి కౌచిగడిగి
తాలిచి కఱుకుట్లు గాలిచి యుప్పును
మిరియంపు పులుసును మేళవించి

గీ. చలువగల మఱ్ఱి తొఱ్ఱ క్రిచట్టు మీఁద
నిలుప నందఱితోఁ గూడ పొలుసుమెసవి
కోరకైదువదునెదారి గుఱుతుగట్టి
సామి సంతోషమునను న్న సమయమునను. 210

సీ. తొగరు జుంజురుకులు తొలఁగదిద్దిన గొప్ప
కొప్పుల నెమలీక లొప్పజెరివి
సొగసుగా నుదుట కస్తూరి నామములు దీర్చి
పొసఁగ జేగురుచుక్క బొట్లువెట్టి
పాఱుటాకు చిగుళ్ల పయ్యెదల్ సవరించి
యురమున గురిగింజ సరులమర్చి
సరిగఱ్ఱ పండువెదురు పీఁకగల విండ్లు
లెక్కించి చిలుకమ్ము లేర్చిపట్టి

గీ. మొకము వాకట్టు వెలిబూది మేళవించి
కరిమదం బంగములయందు గలయ నలది
నీటు మెఱయంగ నందంద నిలిచి మ్రొక్కి
కొమ్మరు చెంచెత లాసామి కొమరుగాంచి. 211

## సారాలంకారాను ప్రాణిత్తై కావళ్యలంకారము

క. గిరికలు కిరులను మించును
కిరుల శరీరముల బోలు కెరభెదుకరులున్
గరుల పొడవులున్నతములు
గిరుల గడవ గిరులు మిన్ను గెంటించు హరీ 212

## అలంకారకృతవస్తుధ్వని

గీ. సామినీయసపు చెలికి చందుమొకము
చుక్కచాల్ గోళ్లు వెండి మంచు మలలు జిగి
దొరయు గుబ్బలు తెల్లదామరల తళుకు
కలుకు నిడువాలుగన్నులు దలంచి చూడ. 213

## అంత్యచరణయతి భేదయేకాక్షరకందము

క. కైకోకీకా కెకుకై
కోకాకా కింకకూకి కూకకు కోకీ
కాకుకకు కేకికేకిక
కూకోకొకూక్కకకింకకో కైకౌకా. 214

## విస్మయము

క. హరినీదు ప్రతాపాతప
మరరే బ్రహ్మాండకర్ప రావృతమగుటన్
బరులు వడకుదురు గొడుగులు
తిరసకరింపుదురు గంట తిమిరము గప్పన్. 215

## దేశ్యపు తెనుఁగు వచనము

వ. కంటి విన్కలి దంట పేరింటి గుంటి యెకిమీఁద యీారైదు తూపుల
నెసఁగు దుచేదారి తెల్లనీవిరాజు సుడివాలుకేలున దనరిన యొడయ

కాకతా వెన్నెలగుత్తి కన్దోయి మన్నీఁడ తీవంచ మిన్నుల దొంగ నడంచిన
సామీ పున్నెంపుప్రోదియై చూపట్టు తిరుపతి ప్రోలువేలు రామిన్న మబ్బు
పూవిడుపు నిద్దాకప్పు కప్పు నెమ్మనికాఁడ పాలసంద్రంపు బిడారంపు
దేవర కన్నులికలతమిన్న నాయక పులుగు సాహేబు బాబారాయఁడ
మొసలివాయొంటుల నాయఁడ బూరగొమ్ముగల తుపాసి జాలువాసాలు
తాలుపు జియ్య మోదుగ మొగ్గనిగ్గు చౌకాటంపు ముక్కుమిటారంపు
పటాని నెక్కువాని నెక్కు తండ్రి పొలదిండి గొంగదొర యుంగుటం
బునజాలు గన్నయ్య కఱివేల్పు ముక్కంటి పండుల మెక్కు మొక్కలిని
గన్న ముక్కంటి పొగడిక నమరిన ప్రోడ వ్రేతల యీలువులు కొల్ల
లాడిన నెఱవాది చాగపు మ్రాన్ముచ్చిలించిన దంట రెంటత్రావుడు
మొరాలించిన దిట్ట కత్తినేస్తి తరిమల మోపరి తమ్మికంటి కయ్యపు
టోగిరంపు టయగారి పాట వినుజాణ జడదారి డెందంబు నెలవరి పది
నూఱు పేరుల దిరుగు జేజే కలుగు లాయంపు టెకిరింత నెఱరౌతు గన్న
దేవర నెలంత కొమరు మామడాచిన రతనంపుగని కొడుకు బోనంపు
గుంపు వజీరు నీటికందుపాపని పినతండ్రి మూకల సూడు పొలదిండి
రాయని పట్టి దురము బన్ను నెలవు పెనురాయనిసువుబంటు పాదుషా
పదియాఱువేల నూట యెనమండ్రు జవరాండ్ర నేలిన మాయదారి యలి
వేలు మంగమతేఁడ ఖారదుగ జగములానిన బొజ్జగలాఁడ చేవంచదుగ
కొండల కాణాచి కాఁడా. 216

## అచ్చతెనుఁగు పంచరత్నసీసములు

1 సీ. కలిమివాల్గంటితోఁ జెలిమి చేయని మేలు
జులిమి వావిరి జూపు బలిమివాఁడ
మెడద వాటిలు కిత్తు వెడదవావడి గ్రోలి
బెడదవా పెడు గొప్ప యెడదవాఁడ
పులుఁగువార్వము నూని యలుగు వారల జెండ
గలుగు వాటంపు చుట్టలుగువాఁడ
కరమువాదిడు మామ యురము వాలించు మొ
క్కరము వారని మేలికరము వాఁడ

గీ జారిపోరోగిరపు జడదారిమన్నె
పాట పాటాన విని సొక్కు బోటువాఁడ
సొగసుకాటుక పేరి గొండగవిదారి
నోమి నెక్కొన్న నలరూపు సామిమిన్న. 217

2సీ తులలేని పెందళ్కు నలుమోము జిగిపిల్ల
తుమ్మెద నును బొజ్జ తమ్మివాఁడ
జగజోతిచే బొక్కు సాదరమిడి వేడి
చూపులమై సొమ్ము లేపువాఁడ
యిత్తికతల యెన్ను నీను చూలాలు వా
విరి బూచు తఱిరెప్ప విప్పువాఁడ
తావితాల్వరి పగదాయకూటపు దిండి
రెక్కకట్టెర పక్కి జక్కివాఁడ
గీ. నెగడు తిగలేని తపసికంటి పొరబువ్వ
మన్నె వారిడు పొగడిక గన్నవాఁడ
సొగసుకాటుక పేరి గొండగ విదారి
నోమి నెక్కొన్న నలరూపు సామిమిన్న.

3సీ గుడుగుపాల్ మబ్బుజాపిడుగు వానకుగట్టు
గొడుగు వాటము దాల్చు వడుగువాఁడ
నుడుగువాల్ గుమిమైల గడుగువారి మెఱుంగు లు
డుగు వారని ।వేలు మడుగువాఁడ
పడుగు వాలికనని చేడుగువారిని చెండ
పొడుగువానగుకత్తి దొడుఁగువాఁడ
వడుగువాకుగ ఖలి నడుగు వాకునఁ జేరి
యడువాలఁ ద్రొక్కు నడుగువాఁడ
గీ. నడుగు వదలని జగజెట్టి ముడుగుటకును
చిడుగుడు నగరిడి నడ చెక్కుడగువాఁడ
సొగసుకాటుక పేరి గొండగవిదారి
నోమి నెక్కొన్న నలరూపు సామి మిన్న.

4 సీ. ఛాగపు పొలదిండి సాహేబు తలమాని
కపు వినుకొమరు పొగడ్తవాఁడ
ననుమీను మనుమని నుడిపంట ప్రాయుమేల్
డంటగన్న తుపాసి బంటవాఁడ
మోదుగ నునుమొగ్గ ముక్కు చక్కని పక్కి
నెక్కు నెక్కటి గేరు టెక్కువాఁడ
తపసిరా చందుడెందపు తమ్మి ముద్దియ
పయి నంగుగ మెలంగు మయిమవాఁడ
గీ. కోరి యనయంబు ప్రామి నిక్కు కొనలుదెల్ప
లేని వలకారి జిగిరూపుమేనివాఁడ
సొగసుకాటుక పేరి గొండగవిదారి
నోమినెక్కొన్న నలరూపు సామిమిన్న.
5 సీ. బలితంపు వలపు దాల్పరిదిండిగమి తావు
గల దొరవాకిట నిలుచువాఁడ
చాగపు ననదోఁట సామింట జాలీను
బాలెంతయగు బొటవ్రేలివాఁడ
పాలేటిరాయని పాపని సైఁదోడు
పెద్దకొల్వొడు రొమ్ము గద్దెవాఁడ
బెడఁగు చెంబడిబిడ్డ కడుపున బొడమిన
జడదారి వడిసుడి నదరువాఁడ
గీ. వెల్లసుడి చుక్క తలగోము బొల్లిమోము
పక్కిరా మూపు నడిచక్కి నెక్కువాఁడ
సొగసుకాటుక పేరి గొండగవిదారి
నోమినెక్కొన్న నలరూపు సామిమిన్న.

## అభేదరూపకా లంకారము

సీ. కలచి సంద్రము బయల్ సెలసికొట్టిన కోఱ
తుద చుట్టికొను నాచు మొదలితాచు
చప్పరింపఁగ జాటి చక్కఁగా సెలవిని
చిందు సుదుగు బుగ్గ చందమామ

కొప్పరింపంగ రోమ కోటివింటను డుయ్య
బొడమిన బెజ్జమ్మ లుడుగణములు
రిక్కించి వీపులు దిక్కులదరం జేయు
ఘుర్ఘురధ్వని ప్రతి ఘోషమురుము

గీ పొరలి కలనంటు మున్నీట బురదతోడి
యొడలు ఝాడింప కడనూడి పడిన పెల్ల
లబ్జజాండంబు నీవు మహావరాహ
రూపమందిన వేళ గారుడగిరీశ. 218

మ. వనమేలా వనమేల పట్టణగజా వాసప్రవాస ప్రరం
జనమేలా జనమేల రాజగృహసంచార ప్రచార ప్రసా
దనమేలా ధనమేల ఘోటక భటాధార ద్విదా రద్వి పాం
గనమేలా గనమేలనిన్ గనం బరా కారూపకారూపకా. 219

## గూఢచతుర్థపాది

చ. మెలంగిన బాలికన్ రెయితమిన్ డిగనీక వరాల్గురించిమేల్
గలరవనాదముంచి యెద లాగెదు పౌరుషమాయురారి సా
గుల మిడిగాక నీపనికి గోవెల చానంగ బొట్టుకట్టిలో
గిలియిడి గల్గు మేరదయ నేరముసామిక నీవెనట్టులో. 220

## సమానాక్షరనకారయుక్త పాసావకలి ప్రాసనీసాను ప్రాణిత సర్వలఘుసీసము

సీ. తనువును దనువును పెనంగొన నెనసిన
మినమిన మను నును చనుమొనలును
చనువున నినిచిన తనివిని దనరును
మును నిను జెనకిన వనితను గన
కనునను నెనరెన యని కినుకను పని
గొని కినుకను దనియ నతనుం డని
మొనలను పొనపొన గునగున మునుకొని
దినదినమును గొనబున ననిచిన

గీ. ననయను ధనువున గినిసిన వెనుక చి
న వనటను గనుట నికను ననువున దను
న నెల నెలను మనసున ఘనతను గనుచు
నెనను మునుపొనర నవని వనజనయన. 221

## ద్వ్యక్షరి

క. నిన్ను నెమ్మనమున నమ్మిన
ననుమానము మాన మాననని నేమమునన్
మన నీనామము నూనె
న్నను మానిన నిన్ను మాన నానేమేనా. 222

## ఏకాక్షరనామకందము

క. లోలాళి లాలి లీలా
శీలాలీలాల లేల లీలలు లలులే
లోలోలై లాలలల
ల్లీలై లల లాలలోల లేలో లేలా. 223

## ద్వాత్రింశదనుప్రాసయుక్త ప్రాససీసావకలిప్రాస సీససంసృష్టి

సీ. జాలుప్రేలును సంకు గ్రాలుడాలును బిల్ల
రాలు కేలునుగల బాళివాఁడ
పాలుప్రోలును పుల్గుడాలు మేలును పచ్చ
దేరు సోలునుగల హాళివాఁడ
మేలుకోలును జగమేలుకీలును గల్మి
జాలునాలును గల కీలులవాఁడ
వాలుడాలును మున్గు చేలుప్రాలును వేల్పు
చాలుమేలునుగల వేలవాఁడ

గీ. రేలును బగళ్లు నెఱజగడాలు బన్న
పాలువడు గాఁఖ పొగడత సోలువాఁడ
వేలుపోవని పొలదిండ్ల నూలుకొనుచు
దీలువడ గొట్టునట్టి గగ్గోలువాఁడ. 224

షట్చక్రవర్తి. షోడశరాజనామాభిరామప్రాసభేద ఖాసమూసవృత్తము

చ. పృథివిఁ బురూరవు న్నగలు హైహయజున్ బురుకుత్సుఁ జంద్రమ
త్యదిపు నలుం దిలీపు యవనాశ్వభవుం భరతున్ గయు న్నగీ
రథుని మరుత్తు నంగు శిబిరాము సుహోత్రుని నంబరీషునిం
బృథుని యయాతి రంతి శశిబిందుని భార్గవు మించవే హరీ 225

క. దేవర చూడని వేఁటలు
లేవే మిము మెచ్చఁజేయ లేమేయైనన్
మా విలువిద్యల నేరుపు
సీవించుక చూడవలయు నేడమి కదఁకన్. 226

క. వాలమ్మున నొకచమరీ
వాలమ్మున నేసి భిల్లవల్లభ యవినిన్
వాల మ్మనువుగ మృగయా
వాలమ్మునఁ బట్టి శౌరివైపు గనంగన్. 227

క. జాలమ్ము వెడల శబరీ
జాలమ్ములయం దొకర్తు జవమున ఖగరాట్
శైలపతి మెచ్చనేసెను
కోలెమ్మునఁ గాడయేరు కోలె మ్మొకటన్. 228

క. ఈ విధ మొసరఁగ మృగయా
ప్రావీణ్యము నెఱపఁ గాంచి ఫణిగిరిరాయం
డావల వస్త్రమణీభూ
షావళు లిప్పించియున్న యత్తఱి మిగులన్. 229

## కకారాద్యక్షరకందము

క. కలకంఠము కరెపులుగును
కలవింకము కంకణంబు కహ్వము కరుడున్
కలరవము కనకభుక్కును
కళకును కంకమును గాకి కక్కెరకైదున్. 230

మ. మొదలై నట్టి ఖగవ్రజంబు తగ స
మ్మోదంబుతో వేటయం
దదవౌ డేగల ముష్టిబట్టి గములై
యంతంత చప్పుళ్ల బె
ట్టిదమై యుండఁగఁ జెట్టు చెట్టుసెలక
ట్టైఁ గొట్టి బెట్టేయుచున్
మది నుప్పొంగుచునున్న యా మృగయులన్
మన్నించుచున్ శౌరియున్. 231

గీ ఆఱుత దోరెపు త్రాడుచే న త్తె మమర
దళుకుచేఁ ద్రోల్త వానకోయిలల దునిమి
బైరిచే వెన్క కొంగలబాఱు గొట్టి
సాళువముచేత గుండేళ్ళు జీరెనంత. 232

సీ. చెంగాలి చాయ హారంగు మీఱిన దట్టి
చుంగులువార చెఱంగు జెక్కి
అపరిమిత ప్రభాత తపనీయ కటిసూత్ర
వలయంబుపై చిక్క మలవరించి
వలచేత మణిముద్రికల కాంతి దిశలందు
మొనయు వేష్టపు డేగ ముష్టి బట్టి
డాకేల పచ్చరాడ బైన చోపుడు
గోలనెల్ల విహంగకొలము జోపి

గీ. వెన్కకును జాగి యూకించి వ్రేసివేటు
తోన చెంగున లంఘించి దాని దిగిచి
హస్తమును పూని పక్షి సహారమునకు
వేఁటకాంద్రను దోడ్కొని విపినభూమి. 233

సీ. లావుక పసరిక లకుముకి గిజిగాడు
పూరేడు జీనువు కారుకోడి
గువ్వ గుంకన కోడి గోర్వంక కోయిల
భరతము జక్కువ పావురమ్మ

పొటిపిట్ట యల్లఁకి పొన్నంగి తీతువ
గున్నంగి యేట్రింత కొక్కరాయ
పిచ్చుక కేరిజబెగ్గురు వడ్లంగి
చీడ చెమరుగాకి చిల్కపెడిచె.

గీ పికిలి పాల కూకటి గువ్వ బెళపజిట్ట
కక్కెరవెలిచె గొఁగడ కన్నె లేడు
పాలజీనువ డాబయుఁ బైఁడి కంటె
నీళ్లముచ్చును నుల్లకి చల్లపిట్ట. 234

క. తమి హెచ్చ పొదలకైదుల
గుమిగని యీకెలును దేగకును డిండివడిన్
చమరుం బాతని పిడికిట
సమరంగా బట్టి యేయనధి యవ్వేళన్. 235

(పా) క. (చమరుంగాకిని శ్రీహరి
కొమరుగ నీకియలు దేగకును దడివడిగన్
చమరందంబుగ ముష్టిని
యమరంగా బట్టి యేయ నాసమయమునన్.)

సీ కైదుబారెగరిపో గనఁగొని క్రిందుగా
చివచివ మెఱుఁగుతీగవలె సాఁగి
యవ్వేంటుపడిపయి నంటి తొడిగొకటి
విఱిగపడగ నట్టె వెంబడిబడి
పాటున నొక్కటి బట్టుక యటుతారు
బిరికైదు నొక్కటి గఱచి తొంటి
పలుమొన దిగియుచు ప్రక్కలఁ బాఱుకొఁ
జుల రెక్కలను గొట్టుచును పొదలుచు

గీ. గలగలన మెల్లనే మువ్వగదల కొదవ
పుఱుగులదర గూయుచునుండ దెలసిశౌరి
కదసి యాదేగ చేనుంచి కైదు తలలు
నొక్కి కొనగోట మెదడెల్ల చెక్కిమెసఁగి. 236

గీ. కాళ్లకై దులు నెదమచే కడకు దివియ
నంతట నదను దప్పినదగుటఁజేసి
తేలిగుడిఁజుట్టి యాసామి కేలిదేగ
నొయ్యనొయ్యన జుక్కలనొరయ నెక్కె 237

(పా) తే. (పిట్టపిట్టకు చిక్కంబు పెట్టినట్టి
యదను ననదను దప్పిన దగుటఁజేసి
తేలిగుడి సుట్టి యాసామి కేలిదేగ
యొయ్యనొయ్యన జుక్కల నొరయనెక్కె)

శా. ఆరీతి న్వినువీధి నెక్కినను డాయన్ లేక యాశౌరి యొ
య్యారం బొప్పఁగ నెండమాటుగను చే యడ్డంబుగా మోమునన్
జేరంజేయుచు దృష్టినిల్పి వెనుకన్ జేయూది కూర్చుం డొకిం
తోరై చూచుచు నంతనొక్కవనికై యొయ్యొయ్య కేడించినన్. 238

క. కనుఁగొని యచ్చట వ్రాలుట
మనమున నిశ్చయముచేసి మంత్రి సహితుఁడై
తన సేనల నచ్చోట నె
యుని చటుచని కనియె నొక్క యుపదన మెలమిన్. 239

వ. అంత

క. నారాయణవనమున భుజ
సారుం డాకాశరాజచంద్రుని సుత నాం
చారున్ నెచ్చెలులుం శృం
గార వనమ్మునను మిగుల గారవ మెసఁగన్. 240

## మనోజ పూజాభివర్ణనము
## అపూర్వ ప్రయోగము

సీ. విరివియౌ తరుల క్రొవ్విరి తేనె మురువైన
కరువలి వీచు చెంగల్వకొలని
కెలన రేజోతి రాచలువతిన్నియపొంతఁ
బరువంపు పూలచప్పరము బన్ని

కురువేరు పెడవెట్టి మరువంపు దడిగట్టి
ముంగిట కపురంపు ముగ్గుబెట్టి
గురుతర కౌశికా గురు ధూప ధూమము
లిచ్చి సువాసన మెదుట నుంచి

గీ. మదనురతి యుక్తముగ మృగమదమునందుఁ
జేసి తత్ప్రతమున నిల్పి భాసురముగఁ
జందన సుమాక్షతములఁ బూజలు ఘటించి
బహువిధోపాయనమ్ములు వహి నొసంగి 241

సీ. ధ్యానమాత్మభవున కావాహనము లోక
చారి కాసనము ద్వక్షాస్రి యికర్ఘ్య
మంబుదాపునకుఁ బాద్యము వార్ధిమన్మని
కాచమనీయ మబ్జాంబకునకు
స్నానంబు శంబరాసనునకు వస్త్రము
ప్రకటాంబరతనుధారి కుపవీత
మద్విజరాజు మేనలునికు సుంగధ
మతిశీలగంధవాహరధి కక్ష

గీ. తముల విహత శౌర్యునకుఁ బుష్పము విరివిలు
తునకు ధూపము సురభి మిత్రునకు దీప
మల రవీంద్వక్ష సుతునకు ఫలనివేద్య
ము శుకబలునకుఁ దాంబూలము రతిపతికి. 242

గీ అనుచు సకలోపచారంబు లర్థిఁజేసి
మకరచిత్ర పతాకాయ మదకరాయ
మత్త హంస గజేంద్రాయ మన్మథాయ
మానినీమాన హరణాయతే నమోస్తు. 243

వ. అని వెండియు

శా. జేజే యిక్షు శిరాసనా శరణు రాజీవధ్వజా మ్రొక్కు భ
ద్రాజీవేళకుమారకా వినుతి సారంగీ గుణా డెంకణల్
రాజీవాది శిలీముఖా భజనమో రాజాప్త కొల్వోశుకీ
రాజాదండము దర్పకా ప్రణుతులో రామామనోహారకా 244

## చౌపదములు

ఆదనిదె మమ్ముఁ బ్రోవ తులోన్మదన
మదనమోహన చమత్కృతి సదన
సదనానిల కౌశల శరమదన
మదనటనస్థితి మదిని వలదనా. 245

## వితాక్షచౌపది

కమ్మని చిటిపొటి కరువలి తేరు
తుమ్మెద బలగపుఁ దొలఁగిన బారు
కొమ్మల దళములఁ గూర్చునజీరుఁ
డొమ్ము మదన నియ్యోజి కెవ్వారు
పచ్చవింటిచే పంతముతోడ
మెచ్చుల గెలుపుల మించుంజేఁక
హెచ్చుకంటిదొర నేఁడిన ప్రోడ
పొచ్చెము లెంచక పూవిలుకాఁడ. 246

## డిండిమవృత్తయుక్త కర్ణాట చౌపది

విరివిగానెల పండువెన్నెలలుగాయ
పురివిచ్చి నెమ్మిగుంపు తటానడాయ
మరువౌ చిలుకవార్యము దువాళిసేయ
తరిగాదు మనువు మందజీని రతిరాయ. 247

చ. అన వినుతించి మ్రొక్కి కమలాసన లా వివిధోపహారముల్
గొని అమలోన భక్షణలకుం బ్రియమైప ఫలాదులన్ రుచుల్
గొనుచు మనోవికాసములకుం దగు జాజసపాట లుబ్బుమే
లెనయఁగఁ బాడి సోలుచు రహిం దమలోనసె దారు మెచ్చుచున్. 248

## వనవిహారవర్ణనము

చ. మదనునియిట్టు నోమియల మానిను లెంతయు సంభ్రమంబునన్
బొదలుచు నాసవంబనఁటి పూవుదళంబుల ముంచిముంచి మె
చ్చుదనర నొండొరుల్ చవులు చూచి భళీ సొగసయ్యె నంచు స
మ్మద మొదవంగఁ ద్రాగుచుఁ మాటికిఁ గేరుచునుండ నయ్యెడన్ 249

క. ఆపసములు చవి గ్రోలెడి
యాసవసవ లెఱిఁగి తేటులలరులగమిపై
యాసవదలి పొదలికదలి
యాసవరన గాంచి చెంత నాదర యమునన్. 250

## దశదోహదయుక్త కందము

క. పలుక కొరవి గోగిడ వా
విలి మూర్కొన్న పొన్నఁదన్నఁ బ్రేంకణము మి పా
టలఁ గ్రోవినగ చనుపకము
తిలకముగన మావినంటఁ దెగడన్ బొగడన్. 251

వ. పువ్వుఁజేసి యవ్వారుఁ బోడుల వెండియు

సీ. తిలకంబు నొకతె చూపులసన్న గావించెఁ
జాంపేయ తరువొర్తు జంకజేసె
గోగు నొండొకతె యెగ్గులు బల్కుచును దూరె
గడుఁజేరి యొకతె ప్రేంకణమువాడె
నొకతె డాయుచుఁ గురవకము గౌగిటఁజేర్చె
వకుళంబుపై మించ నొకతె యుమిసె
డేమావి చేనంటి ప్రేమనొక్కతె యూఁచె
నొకతె వావిలిమ్రందు నూర్పు లొసఁగె

గీ. గడిమి నొకతె పొన్నఁ గనికి తాకిక నవ్వెఁ
బ్రకటముగ నశోక మొకతె తన్నె
నిట్లు పానవశతనింతులు మెలఁగ నా
తరులు సరచి విరులఁ దనరెనంత. 252

## వనకేళి మధురగతిరగడ

సారసవదనలు సారపదమ్మున
గారవముగ శృంగారవనమ్మున
తములెచ్చిన చిత్తములను వేడుక
గములై తగు పూగములను గూడుక

యెదల పొదలు పయ్యెదలను జాఱఁగ
మెదలు చూపు తుమ్మెదలటు జేరఁగ
బలుపిడి జిగిగుబ్బలు జిగి దేరఁగఁ
దలతలమను వార్తలు ముదమారఁగ
నలువమీఱు వేనలు లలరింపుచుఁ
గులుకు నడల బెళుకులు గన్పించుచుఁ
బలుకుల కపురఁపు బలుకులు నింపుచుఁ
జెలరేఁగుచు కప్పులల బిగింపుచుఁ
బకపకనగి చంపకముల కపగుచు
శుకములె గరకింశుకములు దిరుగుచు
బరుపపు ననకాపరునని దిరుగుచు
గురువిందలపొద గురువని మఱుఁగుచు
నిమ్మరువము దన కిమ్మనువారును
రమ్మదె కర్పూరమ్మను వారును
సహకారమ్ములు సహకారమ్మల
మహిళకుఁ బ్రియమీ మహిసుఫలమ్ములు
నారికేడఁబులు నారికేడఁబులు
వేరులుంచ కుర్వేరువటంబులు
పొన్నదేని దా పొన్నకు డాయకు
సన్నజాజికై సన్నలు చేయకు
నలగని సురపొన్నల చే నదుమకు
చులకనగా వంజుళకము జిదుమకు
యీకుందము చెలి కీకుందము నిలు
మాకందఁబులు మాకందంబులు
కదలి చూతమీ కాదలి వికాసము
పొదల గంటె పూపొదల విలాసము
వెదకు మిపుడు క్రొవ్వెదకును మల్లెయి
మెదలెనిందు తుమ్మెదలకుఁ బిల్లలు
మరల గంటితామరల కొలంకుల
సరులెనతగవా గురులు కెలంకుల

మలయఁగ జొచ్చెను మలయసమీరము
కశికలకేన నగ్గశికల మీరము
కలికతనముగల కలికికుచమ్ములు
తుల యనఁదగు పంక్తులకుచమ్ములు
నలరుగొన్న తరు లలరుల నాగము
చెలువరొ చేయుము చెలువగు గానము
నని వనితలువని ననితర లతులను
వనమయూర ధావన మృదుగతులను. 253

## అచ్చతెనుఁగు ప్రాసకందము

క. చిలుకల కొలఁకులు బిత్తరి
సొలఁపుల మెలపులను గరికి సొబగుల ముద్దుల్
చులుకఁగఁ బలుకుల కపురపు
బలుకులు జలజఁనె యొలుక బలుకుచు మఱియున్. 254

## అచుంబిత రచిత చతుర్ధశయత యమకాంత్యనియమ శరణ చరణ గరిష్ఠ నిరోష్ఠ్య విరాజిత రగడ రాజము

## అపూర్వ ప్రయోగము

కలికి కలికితనాన నానది గట్టి । గట్టిగ నంటి నంటిని
కలికి కలికిచ నిన్న నిన్ననగాక । గాక కడికంటి గంటిని
జాలి జాలిచెనఁత నంతట జాల । జాలక నీతి నీతిగ
నేల నేలకిలతిక లతికన నీక । నీకడజాతి జాతిగ
సారసారస రాజిరాజిల సరస / సరసత చల్లచల్లగ
కేరికేరిస దాడి దాడిలకింక । కింక నెల్ల నెల్లగ
నాడనాభగ నాచనాగజయాన । యానన గట్టగట్టగ
నీడనీడగ నేలనేలకి నెచ్చ । నెచ్చెలి దిట్టదిట్టగ
దరిని దరినిల లేక లేకల దండ । దండిన నంగనంగన
సరసి సరసిని సన్నసన్న నెసంగ । సంగతి నంగచంగన
నిచ్చనిచ్చన నయ్యనయ్యెడనెన్న । నెన్నడరేక రేకగ

నచ్చినచ్చిక కాని కానిగయ౯శి । యాశిరి సాకసాకగ
కన్నెకన్నెరికాన కానల గన్నె । గన్నెర చాయ చాయగ
నెన్నెనెన్నిన దాస దాసనకింత । కింతగ డాయ డాయగ
గదలి గదలిక నలరె నల రెయిగాయ । గాయక నీడ నీడగ
నదిరి నదిరహి సరిగసరిగయి సందె । సందెల జూడఁజూడఁగ
రాగ రాగతలంకెలంకెగ రాక । రాకడ లెక్క లెక్కడ
తీగతీగడి నీవ నీవనదేట । దేటకి నిక్కనిక్కడ
నీటనీలన ననియెనని యొంతేని । తేనియతేరతేరకె
చాట నాటన కాదకాదయ సంగి । సందిడ చీర చీరకె
నాతి నాతిలకాశి కాశి జనించ । నించదె నాగనాగనె
నీతినీతిల కానకాన జనించ । నించదె నాగనాగనె
లలన లలనలతతిని తతినిం లాగి । లాగిగడించ డించగ
నలిని నలినిడ నిగ్గనిగ్గెడ నాట । నాటల నంచనంచగ
ననల ననలన గతిగగతిగన నాచె । నాచెయి గట్టగట్టగ
ననిచె ననిచె ననంగ గంగఱయంత । యంతట జిట్టజిట్టగ
చక్క జక్కనిదంట దంట లెసంగ । సంగతి దాట దాటది
అక్క అక్కడి లీల లీలత నంట । నంటని చాట చాటది
నీలినీలిని నాడనాడన నీచె । నీచెన దాయ దాయగ
రాలరాలగ నేయనే యలరంగ । రంగర కాయ కాయగ
యింతి యింతియె యేనయేనల నింద । నిందగ నేన నేనన
కాంతకాంతత తాళితాళిచె కలసి । కలరి సితాన తానన. 255

సీ. ఏలాలతలు దూర నేలాలతాతన్వి
నన లేవి కోయ క్రన్నన మృగాక్షి
మరువబోకింత యేమరువంబు జానన
జాతిటు బెనుపుటే జాతినాతి
గోరంట పూగొమ్మ గోరంటకే కొమ్మ
కేళిగై కొమ్మ కంకేళి బాల
వాదులేటికి విరవాదులకె లెమ
పొగడదండల కెంత పొగడె దబల

గీ. కన్నెగేదఁగి రేకుతై కన్నె వలన
వలని మచ్చరమేల యేవలన ననుచు
నోజమై గూడి యవ్వరు పయోజముఖులు
చయము వేడుక పుష్పాపచయముజేసి. 256

## జలక్రీడాభివర్ణనము

## ప్రౌసభేదము

క. క్రీడాపతులయ్యెడనీ
లీలం బుష్పాచయ కలిత ఘనకేళీ
లాలిత జనితశ్రములై
యాలో జలకేళి కాంక్ష నటు చననెదుటన్. 257

క. అంభోజోత్పల కైరవ
జంభరకలహంస చక్రబక వివిధరవా
రంభ విజృంభణ సంభ్రమ
గంభీరంబైన కొలను గనుఁగొని యచటన్. 258

## మాధుర్యము

క. నారిమణులయ్యెడదమ
సారపు మణిభూషణములు సడలించు నెడఁ
గార కెడలిన లతలన
తీరై కనుపట్టి రధిక తేజం బలరన్. 259

క. అక్కొలను జేరి దిగునెడ
చక్కఁగ సోపానములను జాఱి యహా యో
యక్క యిది యెంత జద్కని
యొక్కసఖియ తనదుచెం త యాతఁగ నిల్చెను. 260

క. నీకును వాకును జోడ
ల్లా కిన్నెరకంఠికామృగాక్షికి సరియా
నాకొమ్మకు దానికి సా
టికలికికి సుద్ధి యల్ల యింతి యటంచున్.

## ముద్రాలంకార — అపూర్వప్రయోగము

మ. వనజాతాక్షి యురోజకుంభములతో వర్తించురోమావళీ
ఘనహస్తస్థితితోఁ గనన్మకరికల్ ఘర్మాంబులన్ దోఁగ జా
ఱిన గస్తూరి మదంబుతోఁ దళుకు మీఱెన్ హారపద్మాళితో
మన మువ్విళ్ళంగఁగ డిగ్గెఁ వత్సరసికి న్మత్తేభవిక్రీడితన్. 262

## జలకేళి వృషభగతిరగడ 7

చలువ పలువగ మించ నంచను సరసి । సరసిజములబులు వీడక
నతోవు వలువలు గట్టిగట్టి మనంబు । నం బురికొనెడు వేడుకఁ
దరిని సరినిల నమరి మరితమ తమక । తమకము లోనర డిగ్గుచు
మెఱసి యొరసి యొకళ్లొకళ్లిటుమెట్టు । మెట్టుచు మిగుల మొగ్గును
ఘనత గను తమివలపు గలపము కరగ । కరగత జలము చల్లుచుఁ
దనువులను వుగ దయ్యు నొయ్యన తరగ । తరగక నిలిచి మళ్ళుచు
యెలమి బలిమిగ నీదవే దుకుకేల । కేలటు సాచకానవు
లలన యెలనగ వొమ్మరమ్మొకలాగు । లాగున నెంతదానవు
రావకా వగ ననుచు బిరాన । రానను తొడిగి గ్రమ్ముచు
తీవరేవల ననఁగి పెనగుచు తెలివి । తెలివిరిదమ్మిరెమ్ముచు
కుసుమరసములు విసరుపస గైకోక । కోకనదంబు గాంచెను
వనము బీసముల్ కేవ నావగవారి । వారిని దనుప నెంచెను
కప్పుపొప్పిడి గ్రేవేయ నాయమె కంట । కంటటు బెంచివేగమె
యప్పమొప్పగ తోవకలనీ వాడ । వాదరయుండలాగమె
మరలి పొరలుచు నలికతిలకము । మాయలు గొన్ని సేసెదు
తరలికెరలుచు తోన వేనలి తరమె । తర మెఱుఁగకయు తీసెదు
వద్దురాగతనాలు పలుకకు । వాదులాడగ తగునె వారికి
యద్దిరా దొరసాని నిటు । లానగు పొమ్మటు నీదువారికి
యనుచు నండఁక నేవియొక చెలియందు । నందఱ జూచి కొందఱ
దనర నోహో రంతు సేయఁగ । తగునె యిటు నెఱబిరుదుముందఱ
యెల్లవారికి నోలపెట్టెద । నీదులాటకు బిరుదు గట్టెద
నొల్ల ననియెడివారి దట్టెద । నొనరమన్మదు నా నీబెట్టెద
వెందుజునిగెద రంచు బెట్టుగ । నేచిచే సుమగణము నొట్టుగ

యందలపై జిల్కపట్టుగ । నాడి సఖియకు బ్రియము పుట్టగ
నోల యాచిగురాకు బోణికి । నోల యాయంబురుహపాణికి
నోల యాయలినీలవేణికి । నోల యామదకీరవాణికి
నోల జక్కవ బాలకిప్పుడు । నోల తామరగోల కిప్పుడు
నోల తుమ్మెద నారిమీఁదను । నోల యంచయొయారిమీఁదను
నోల యాకసవిఱుని నందన । నోల యోషాకలిత చందన
యని సతు లందఱును భళియో । యతివ నేర్పరివని రయంబున
వనరుహాకరసీ మసుద్దులు । వరుసనిడిన యనంతరంబున. 263

## ఉత్ప్రేక్షాలంకారము

చ. అలయక వెన్కయీత నొక యంబురుహాసన క్రీడ సల్పుచో
వలిపెపు పైటమాటునను వ్రట్టువచన్మొన లొప్పెఁగాంతి తా
వలవు బ్రవాళవల్లికల బ్రాలిన కోకయుగంబు మారుచే
వలబడి ముక్కులెత్తుకొని వైఖరి జూడఁ జెలంగెఁ జిత్రమై 264

## ముద్రాలంకారము

వనమయూరము. చండగతి పెన్నెఱులు జాజి కటిసీమన్
మెండుకొని గప్ప కడుమీఱి జలకేళిన్
దాండవము సల్పెడు విధంబునను నీపై
యుండి రబల ల్వనమయూరముల రీతిన్. 265

## రూపకాలంకారము

సీ తళుకు పెన్నెరి ముంగురులు గండు తుమ్మెదల్
సోగకన్నులు కప్పుచూపు తొగలు
తరులతల్ మొగములు తగు తెల్లదామరల్
గబ్బిపాలిండ్లు జక్కవల జోడు
బడుగులు బెడగుల య్యరుణాంబుజంబులు
మీఁగాళ్ళు మేటి తాఁబేటిచాలు
చేతులు తూండ్లు రాజిల్లు నాభులు సుళ్ళు
సోల్పుచూపులు బెళ్క మీలుగాఁగ

గీ. లలన లెసఁగిరి కాసార లక్ష్ములసఁగ
సుడియు నడుములు వడవడ వడక జడత
నడల నడుగులు తడబడ తొడలు జడియ
నెడల బడలిక లెడనెడ నడల నపుడు. 266

సీ. చిలుకలకొలికి తొయ్యలి యింతి యుగ్మలి
మగువ పైదలి బోడి మచ్చెకంటి
యెలనాఁగ వెలఁది కన్నుల కలికి నవలా
మెలఁత మెఱుఁగుఁబోడి నెలఁత పడఁతి
చెలువ జక్కవ చంటి బేడియ లతకూన
పొలఁతి ముద్దుఁగుమ్మ పువ్వుఁబోడి
జవ్వని బిత్తరి చాన ప్రోయా లన్ను
కన్నె లేమ తెఱవ కలికి గోల
గీ. ముగుద కొమ్మ సకియ ముద్దియ జవరాలు
నతివ గోఁతి కొమిర యందకత్తె
యెరపులాడి బోటి యువిద బంగరుబొమ్మ
తలిరుబోడి మొదలు చెలులతోడ. 267

క. వేళంబె సలిల విహారణ
కేళిరతిం దేలి యామృగీలోకనతా
చాల ముదమంది యొండొరు
కేలూదుచు సరసభమునఁ గేరుచుఁ నగుచున్. 268

గీ. జిలుఁగు వలిపెంపు మైనెల్లఁ గలయనంటి
యంగరుచి చేలమున మించి రంగు మీఱఁ
గొలను వెలువడు నప్పు డాకొమ్మ యొప్పెఁ
బటిక నార్చిన యపరంజి ప్రతిమబోలి 269

చ. చలువలు దెచ్చియిచ్చె నొక చాన నెరుల్ తడియార్చె నొక్క తొ
య్యలి నెఱిగొ ప్పమర్చె నొక యంగన వెంబడి పూలమేల్ తురా
నెఱికొన నిల్పె నొక్క చెలినిం డెదగంధమలఁదె నొక్క పైఁ
దలి మెలిసొమ్ము లుంచె నొక తన్వి నభోపగు గూర్మిపుత్రికిన్. 270

క. అరయ నపరంజి ప్రతిమకు
మెఱుఁగిడి చొక్కమగు జాజు మెయి జరమిన యా
యిరవున యాకాశ మహీ
శ్వరసుత తగనెరుల చూడ్కి వహి నింపెసఁగన్. 271

సీ. సంపంగికావులు చందురుకావులు
వెలిపట్టుజీబులు వేఁట చాళ్ళు
బొమ్మంచు ముయ్యంచు పొప్పళి హొంబట్టు
నుదయరాగము కందులు రత్తవన్నె
ముత్తలపందిళ్ళు నుత్తరగోగ్రహ
ణంబులు కరకంచు నాచువన్నె
నిండువెన్నెలు మంచినిగమగోచరులు సా
మంతపీఠులు ప్రతిమలును బొగడ

గీ. పచ్చలును మేఘవన్నెలు పచ్చపట్టు
గరుడపచ్చలు నేత్రముల్ తురగవళ్ళు
హంసవళ్లను పద్మాలు హరిణవళ్లు
మొదలుగా వల్వలు ధరించి ముదిత లపుడు. 272

## ఉత్సాహయుక్తగీతి

ఉ అందమైన కీలుగొప్పు లందుఁ బూలుతేనియల్
చింతనీక యుంచి నిగ్గు చెంగళించు జాళువా
సందిదండలుం గరాలు సన్న సన్న సరులు హొం
నందెలుం గడెంబు లచ్చహారముల్ తురాలు క్రొం

గీ. బసిఁడి గంటల మొరసూళ్ళు బాహుపురులు
సరిపెణలు ముత్తియంపు ముంగరలు తాళి
పతకములు దాల్చి పన్నిట పదనుమించు
చందన మలంది రంతట సంతసమున. 273

క. ఈరీతి వారి భూరి వి
హారానంతరమునందు నతి చతురగతుల్
మీఱఁ గయి జేసి మనమొక
మేరన్ క్షణమాత్ర విశ్రమింతమె యనుచున్. 274

క. ఒకవంకఁ బుష్పితేసియ
నకలంబై వంక యందను మెఱఁగన్
పికశారిక శుకనికర
ప్రకటరవంబు విని సతులు పరమోత్సవలై. 275

ఉ. కేవలమైన నుంజిగురు కెంజడమై సుమనః పరాగమే
తావి విభూతియై పికలి తాననాదము సింగిరాదమై
క్రేవలఁ బూపిదీనియంబు గీల్కొన దాల్చిన యోగపట్టియై
మావివిలాస మింపెసగ మన్మథ మోహన సిద్ధు డోయనన్. 276

క. అచూతము చెంగటఁగని
నాంచారును దొడుక చెలులు నయమార్గాతి
ప్రాచుర్య ప్రౌఢోక్తి
శ్రీ చాతురి మనము బొదలఁజేయుచు డాయన్. 277

క. లలనామణు లా వేళనె
యెలమామిడి కొమ్మ వదలి యిటునటు జన రా
గులుకుచుఁ బల్కెడు దేగను
గలికలమని ముద్దు గదలఁగాఁగని వేడ్కన్ 278

ఉ. కాంతలతో నభోవిభు శిఖామణి పుత్రిక వేగదేగ న
త్యంతరయంబునం బొదివి యత్తరుశాఖల నెక్కి మిక్కిలిన్
సంతసమంది పట్టుకొని చాల ప్రియంబున గారవించి యం
తంతకు సుబ్బి భూషణమయంబగు హస్తముచేత దువ్వుచున్ 279

ఉ. ఎవ్వరిదొకొ యివ్వలన నివ్వని కెవ్వలనుండివచ్చెనో
జవ్వనులార యిప్పలుఁగు దందము నందము దెందమునందునన్
నివ్వెరగందఁజేసె నిఁక నేటికి మాటికి మాటిలేటికిం
దెవ్వతెయైన యిట్టిచెలు వెన్నను విన్నను గన్న దెల్పరే 280

క. అని చిరతనూరి నాంచా
ర్యనితామణి చెంతనున్న వామాక్షి కరం
బున కావేసడమ నొసం
గిన యత్తఱి నంజవాఖ్యగిరిపరుఁ డచటన్ 281

గీ. ఎండచేఁ గంది వంతనాథుండు దాను
నందనమునకు వెడలి యానందరేఖ
పచ్చి పసిఁ జొచ్చి చల్లనిపసతు లందు
బడలికలఁ దేలి పయ్యార మడర నపుడు. 282

గీ. తపకు గులుకంగ ననుచు మావులను బెంచు
కొనిన పూదీవ లనుచు వాసనల గొనుచు
మలయు సీడల నిలుచు జల్వాలను మనుచు
మెలఁగు నలులను వెనుచుఁ దెప్పలను జనుచు. 283

గీ. మిసిమిరాచిల్కతెక్కల పస సదల్పఁ
బూను నచ్చపు బచ్చజాతినె జూచి
యాత్మ నరుదంద దందశూకాద్రినేత
సచివుఁడును దాను గూర్చున్న సమయముననుఁ. 284

## అపూర్వ ప్రయోగము

సీ. వేగమె మదినెంచి వేంకటనాథుండు
తనదు నెయ్యంపుఁ బ్రధాని జూచి
యివ్వని మనడేగ యెచ్చట నున్నదో
నెమకు పొమ్మన రమారమణునాజ్ఞ
జవదాట కవ్వేళ జని యమాత్యవరుండు
చిరతనూరను పద్మసరసిచెంత
నెచ్చెలు ల్గొల్వఁగా హెచ్చిన నాంచారు
దేవిని గనుఁగొని భావముననుఁ
సంభ్రమంబు ముదంబు నాశ్చర్య మొకటి
పెనఁగొనఁగ నప్పు డౌరౌర యనుచు
దొరలగా నొక్క ఘనసార తరువునీడ
నిలిచి యచ్చెంత నున్న నెచ్చెలులఁ జూచి. 285

## అపూర్వ ప్రయోగము—యమకము

క. నాళీక వనాళీ కల
నాళీకకు వేలపాలహారిముఖాళీ
పాళీదృక్పాళిం గని
బాళిం బడెనేని మౌని బద్ధుఁడు గాఁడే. 286

వ. అని తన మనమున నుతియించి యయ్యుఁరుంబోండ్ల నెయ్యంపుఁజెలిక
సానియైన తొయ్యలిం గనుంగొని.

# అలమేలుమంగాభివర్ణనము

## అపూర్వప్రయోగము—యమకము—ద్రాక్షాపాకము

క. బెళికియు బెళుకని చూపుల
మొలచియు మొలవని యురోజముల తేనియలన్.
జిలికియుఁ జిలుకని పలుకులు
చెలిమై నూనుఁగువయసు చికిలి దనర్చెన్ 288

చ. పలుచనగాక మిన్నదయి బర్వకయుండెడి చిన్నిమోవియున్
దెలుసుటెగాక పల్కుగడి దీరి నెఱుంగని క్రొత్తసిగ్గునన్
మెఱుఁగులె గాక గుల్కు వగ మించఁగనేరని నెన్నడెందమున్
జలజదళాక్షి కింపెసఁగె శైశవ యౌవన సంధి వింతగన్. 289

## స్వభావోక్త్యలంకారము

సీ. ఎదఁదమ్మి లేమొగ్గ లెనసి పైనిల్పనో
యనఁ బూఁపచన్నులు నునుపుదేర
వెదఁదగూడులనుండి వెన్నెల పులుఁగులు
తెమలెనా నేత్రాంచలముల బెళుక
గలదు లేదనువాద కలితోక్తి మార్గమ
నఁగ కడుసన్నపు నడుము చెలఁగె
బాల్యపు చేటింకబాఱఁ గన్పట్టెడు
యిసుము డిన్నియనాఁగ నెసఁగె బిఱుఁదు

గీ. కొదమరాయంచ యంచల మెదలె ననఁగఁ
గులుకు నడ యందమయ్యెఁ జెంగల్వనేస్త్రి
సిస్తుఁ గనె మోము నెమ్మేను మస్తు మీఱెఁ
గంబుకంఠికి మొదలి ప్రాయంబునందు. 290

క ప్రియ మొనరించెను సతి ప్ర
త్యయ కారక గుణ సమాస తద్ధిత వృత్త్యే
వ్యయ వర రూపక పృథ్వా
శ్రయభావమువలన శబ్దశాస్త్రము ధంగిన్. 291

## ఉపమాలంకారము

క. మొలకవలె నింత గదలెడి
తలిఱు మఱుంగునను దోఁచు తళుకుగులుకు మొ
ల్లలవలెను మోవిమాటున
నలరెడు పల్వరుస దనరె నబలకు మిగులన్. 292

క. తొలుతటి శ్రీపర్ణంబులు
చెలివీనుల నొక్కపోల్కి చే నగు లేదా
తలఁపఁగను కమ్మ లంటుక
నలవడు నక్షరనిరూఢి యబ్బుట గనునే. 293

క. తమివయసు వచ్చుటకు బా
ల్యము వాయుట కాత్మజన్ముఁ డాశుగ పంచాం
గ మరసి యట పైఁగాఁ బో
డ్రమణికి నెమ్మేన నొక్క లగ్నం బునిచెన్. 294

## అపూర్వప్రయోగము

క. రోమలతా రాహువదన
యామవతీనేత బోదువు ననుచు దురాగా
కామాహితుఁ డీకుందెఁడు
నామెరవెలఁదికినిఁ ద్రివళు లతిశయ మయ్యెన్. 295

## ఉపమాలంకారము

సీ. జలదంబుపయి మెఱుఁగులు మెఱసినరీతిఁ
గ్రొమ్ముడిమొగలిఱేకులు జెలంగ
లతను గెంజిగురు లుల్లసిలు చందంబున
నెమ్మేన రతనంపుసొమ్ము దనర

మంచుగప్పిన గట్టి మర్యాద మొగలిచే
కులపైఁడిలో గప్పిగుబ్బలమర
దొనలలో సానబట్టిన తూపులిడుమాడ్కి
విప్పుఱెప్పల వాడిపేష లమర

గీ. డాలుపగడాల భరణి క్రొమ్ముత్యాలజాలు
పరగు గతి కావి మోవి పల్పంతి యనఁగఁ
బొసఁగియున్నట్టి పొన్నారి పొగడఁ దరమె
నలువకైనను వేనోళ్ల చిలువకైన. 296

## అనుప్రాసకందము

క. తళుకులుగని చిలుకలకొలి
కలరులగుది వలపులనెల కళికులకచ వె
న్నెలగల తొలుకరి మెఱుఁగెల
నెలడాలున నన్నుమిన్న యీ చెలి భళిరా. 297

## అనుమానాలంకారము

సీ. బిత్తరి నెమ్మోము నెత్తమ్మి గాదేని
భ్రమరకమ్ములు పైని బరఁగు టెట్లు
కలికిచూపులు దీపకాంతులు గాదేని
కలితకజ్జలరేఖ గలుగు టెట్లు
జవరాలిపాలిండ్లు జక్కవల్ గాదేని
గవగూడి తముదామె గవయు టెట్లు
జవ్వని నాభికాసారంబు గాదేని
యనయంబు తుఱులంద దనరు టెట్లు

గీ. గాక యీయింతి సౌందర్య గరిమ చిలువ
కన్నెకైనను మానవకన్నెకైన
వేల్పుకన్నియకైన భావింప లేదు
పొసఁగ నాసామికే తగు వసుధలోన. 298

## మధ్యమయమకము

క. సుందరి గళకుచనాభీ
సందీపిత నిగనిగ చకచక ధళధళ లెం
దుందరముఁ మందరముఁ
గందరముఁ దరము కరము గౌరవలీలన్. 299

## అచ్చతెనుఁగు యమకము

క. మిన్నా నడుమల కలువల
మిన్నా నెఱిచూపుమేలి మిన్నలు వెన్నన్
వెన్నా పలుకులు చక్కని
వెన్నాయనటాకు కలిమివెలఁదికి గనఁగన్. 300

## చక్రవాళసీసము

సీ. కన్నెనాసిక చంపకము గెలుచుట కోపు
కోపుమై క్రొమ్మెఱుంగు జిగిచూపు
చూపు నీలంపు గచ్చుగల కలువరూపు
రూపు వాతెఱ చిగురుగమితోపు
తోపు నెమ్మోము చందురు మిన్నలును మాపు
మాపు బొమ్మమరుకమ్మ విలుకోపు
కోపు నెన్నడ యంచకొదమ గడకుఁ బాపు
బాపు నా దగు కౌను బయలుదాపు
గీ. దాపు తానయ్యె కీల్జడతాచుదొరకు
దొరకునే యన గంఠంబు దరము దరము
తరము పల్జిగి మొల్లల తరము తరము
తరువు వారువున పిఱుఁదిల మురువు గన్నె. 301

## ప్రతిభేదధ్వని వ్యతిరేకాలంకార ధ్వనిద్వయ యుక్త సంభావనాలంకారము

సీ. అంటితో గౌరు కేలంటి యుండినగాక
పడఁతి తొడల సాటి నుడువ వశమె
యెలదమ్మితో నెల యెలమి బొందినగాక
యింతిమొగము సవ తెన్నదరమె

చిలువతో నెమ్మిమచ్చిక జేసినను గాక
యన్నుఁ వేసలి కెన యెన్నవశమె
వెన్నలతో నిరు ల్వెలసి నిల్చినగాక
పొలఁతిచూపుల సరిబోల్పఁ గలమె
గీ. యెనయు గా కేమి యవి పొర యొత్తి ముడిఁగి
విరిసి కంది పడగ మోడ్చి పురి విదిర్చి
వెల్లనై మూలఁబడి పోవె విలసితోరు
వదనకచవీక్షణావళి యెదిరినఁత. 302

## పాదత్రయయమకోదాహరణము_అపూర్వప్రయోగము

క. యువతీమణి తనురుచిగనె
నవతారుణ్యాప్తి విలసనమ్మున వీనుల్
నవతాస్థితిఁగనె నవతల
నవతనుగనె కౌను నౌననవతంసముగన్. 303

## వర్ణవృత్తి ముక్తపదగ్రస్తగీతి

గీ. తళుకు చిలువచెలువ జడములుకు కులుకు
కులుకు కొరపల్కు కపురపు పలుకుచిలుకు
చిలుకువడికోపు విడిచూపు బెళుకు కళుకు
కళుకువాతెఱ పెరతేనె లొలుకు ములుకు. 304

గీ. గోలకౌనునభంబు నిజాలకౌను
బోటి చూపు మెఱుంగుల సాటి చూపు
చెల్వగోరు సదావళి గెల్వగోరు
కాంతరూపు రమాకృతి నంత రూపు. 305

## పూర్వగీతి శబ్దచిత్రయమకము - సొమ్ము

క. చెలికి రతనాలకమ్మలు
వెలసెన్ దెసగెలుపుటచ్చు వెడవిల్తుఁడు చూ
పుల ములుకులు పదనుగలుగి
నలవడ రతనంపు శాణయంత్రముల నఁగన్. 306

## యథార్థప్రతిపాదకపద తదాద్యక్షర నిర్ముక్తార్థాంతర సూచక పద్య తదాక్షర వినిర్ముక్త వర్ణాంతర గ్రాహి సీసము-అపూర్వము

సీ. భూరిపున్నాగంబు పొక్కిలి నాగంబు
గతి గంబురాపల్కు కళుకు చెక్కు
లవిరళ రాంశుకం బవయంబు శుకంబు
కలిత వాక్యనిరూఢికంబు వరుత
మనవసుధాస్థితి కటిమండలము సుధా
రీతి యధరము ధాకృతికుచములు
నవచకోరకములు నయనముల్ కోరక
ములు దంతములు రకము పురివేణి

గీ. అలప్రవాళముకేలు వాలమ్ము చూపు
నభము నెన్నడుము భములు నఖరతంక్తి
ధనువు కనుబొమ నువుబువ్వు తళుకునాస
వెన్నెల నగవు నెలమోము వెలఁది కలరె. 307

## రూపకాతిశయోక్త్యనుప్రాణిత గమ్యోత్ప్రేక్షాలంకారము

సీ. జగిమోము నెత్తమ్మిఁజేసి యచ్చటితేనె
తియ్యనిగచ్చుపాతెఱను నునిచి
మెఱుఁగుమీఁగాళ్లు తామేళ్లనుజేసి త
త్కఁటినతపాలిండ్ల గలుగనునిచి
నునుపు మీఱిన తొడ లనఁటుల జేసి యం
దలి కపురమ్ము పల్కులను యునిచి
పొక్కిలి గవిఁజేసి యక్కడి యిరులచాల్
పొందుగా నవలగ్నమందె యునిచి

గీ. గళము దరమునఁజేసి యక్కళుకు మొలక
నగవుననె యుంచి మేను మించుగను జేసి
దాని బెళుకులు చూపులలోన యునిచి
జగతి సికొమ్మ నలువవింతగ సృజించె. 308

## త్రిప్రాసము

క. చిందమ్ముల చందమ్ముల
కెందమ్ముల జిగి దెగడు సకియ మెదకేల్
మారందమ్ముల చెందమ్ముల
యందమ్ములగు మహిళాధరాస్యేక్షణముల్ 309

## శబ్దచిత్రకందము

క. అరికుచ జంఘల కళిక మ
కరి యాదిమవర్ణ ముడిగి కరియై గతి సే
పరికాంత సానుబంధత
సరియయ్యెను బాహులతకు సరిగాదయ్యెన్. 310

## శ్లేషవిశేషఘటక చరణసీసము

సీ. నారీమణి ముఖంబు తారస్ఫురణ మించుఁ
గోమ కటి చక్రమార్గము భ్రమించు
రమణి చన్నుఁగవ తాళముల నీతి హరించు
సతిపలుకు మధురసాకృతి భరించుఁ
గలకంఠి కన్దోయి కమలవైఖరి మించుఁ
జెలిచూపు వాలుగతుల గడించు
గజయాన నెమ్మేను కనక స్థితి హసించు
లేమవేనలి ఘనాళిని గ్రసించు
గీ. ముత్తియము జక్కబండికల్ పుడమి తాటి
పండుకైవడి ద్రాక్షాసవములు తమ్మి
మృగము మీనల్గు పైడి సంపఁగయుఁ దేఁటి
మొగులు కవగూర్చి నలువ నేర్పున సృజింప. 311

## శ్లేషోద్భావితోపమాలంకారవిశేషఘటక దుర్ఘట చరణసీసము

సీ. కలికివేనలి సోగ గననొంచి పింఛంబు
కడుతోకచాలయి కానఁబడఁగఁ
గన్నియ క్రొవ్వెద కప్పుకొన గడంగి
యిరులెల్ల గహ్వరమెడలఁ జొరఁగఁ
గప్పురగంది నున్గొప్పుమెఱుఁగు లా

గఁగఁజేరి మొగులుఁ బిల్గట్ల బ్రాఁక
నీరజాస్త్రతుణమును నెఱిఁబూన మారొ్మ్రైని
కటి త్రాచు పుట్టమఱ్ఱ్రలను దాఱ

గీ. భళి కలాపంబునకుఁ గలాపంబు నుత్త
మమ్మునకు నుత్తమమ్ము ఘనమ్మునకు ఘ
నమ్ము చక్రికిఁ జక్రియై నాచు నళి య
మునను నీలము నళము పూబోణివేణి. 312

## నియమయుక్త శ్లేషానుప్రాణితోపమావిఖ్యాతగీతి

గీ. తెలివళము రూపుఁజూపుట జలజమగును
వాలుమించుమించుట వాలుగయగు
రెంటఁదగు పేరు కందోయి నొంపికతన
నాతి రాజిల్లె రాజీవనయన యనఁగ. 313

## శ్లేషవిశేషపోషిత పాదాదికేశాంత కేశాదిపాదాంత ఉపమేయావయవ తద్గుణ ఘటనభాసురసీసరాజము

సీ. అళికచపాదద్వయము పద్మపాళికి
మదకంబు గళజంఘ మకరపతికిఁ
గందరనాభిక కటిశ్రీకనదరికి
నాగారిమధ్యయార్ భోగిపతికి
రంభోరుకుచము ధరాధినాథునకుఁ గూ
ర్మ విభుప్రపద వాతెఱ సురమణికి
తారకానఖర వక్రస్థితి విధునకు
గజయాన ముంగురు ల్ఘనున కైన

గీ. కరమెదువు సుడిరేక సైకమ్ములోఁతు
వలదనుడు సోగజిగి వట్రువ నునుమెఱుపు
తెలుపుతేట కులుకుముక్కుతీరు పొగడ
ధరమె యనఁ బొల్చె ధరణి నత్తరళనయన. 314

### శబ్దచిత్రము

తే. నలువ నలినకువలయ మీనపదముల తు
దలఁ దనరు వర్ణము ల్దివిచి లలన తెలి
కళుకు బెళుకు తళుకుగ కన్నులు సృజింప
నది మొద ల్నయనాభిద విదితమయ్యె. 315

### ఛేకానుప్రాస నియమద్వయయమకవృత్తము

ఉ. తారల గోరుగేరు వెలితామర గేరుటఁ జూపుజూపు బం
గారము రూపురూపు లతికాతతి నెంతన కేలుఁగేలు క
ర్పూరపుఁబల్కుపల్కు తెలిపువ్వులమిన్నల నవ్వునవ్వు శృం
గారపువేణివేణి యొడికంబగుఁ గంబుగళంబు కొమ్మకున్. 316

### అధికాద్యేకాద్యక్షరయోగోపమాన గోపనచరణసీసము

సీ. తర్కింపఁ జక్కని తలిరాకుఁబోణికి
ధరము చన్దోయి కంధరము వేణి
అరయంగఁ జిన్నిపాయపుటన్నుమిన్నకు
సరము లేగెలు శ్రీసరము నాభి
పరికింప సామి శుభ్రకరనిటాలకు
దరము కంఠంబు ప్రదరము చూపు
భావింప గంధ దంతావళయానకు
రస మధరంబు సారసము కరము
గీ. అమరు మంజుభాషకు నలసములు గమన
ములు గురునయనములు మీనములు గణింప
గామినికి జంఘిక మకరగతి హిమకర
గతి వదనమయ్యెఁ జిత్రసంగతి గజగతి. 317

### విచిత్రయమకత్రయ దీపితోపమాద్వయ నియమోదాత్తవృత్తము

చ. పొలఁతుక జానుకౌనుహరి బోదగమిన్ దగమింగమించు తే
నెలఁతుక యూరుసౌరు జిగి నీలహరిన్ లహరిన్ హరించు నె
మ్మొల చెలిమిన్నకన్నుఁగవ మీల్దొగలన్ దొగలన్ గలంచు మె
ప్పుల కొమతేటమాటనగుఁ బూరసమున్రసము న్సమున్నతిన్, 318

## సభంగాభంగశ్లేషానుప్రాణితోపమాలంకారాంత్య నియమ ఘటక పాదసీసము

సీ. సుందరిపొక్కిలి సుమసరమ్మును గెల్చు
రమణికురులు కప్పుతాలఁగెల్చు
భామకన్నులు మహోత్పలముల నిరసించుఁ
జెలిగోరు తారకముల హసించు
మగువచన్దోయి మన్మథఫలంబులఁ గేరుఁ
గాంతమై పద్మరాగముల మీఱుఁ
గన్నెనగవు సదాకాశాకృతిని గొట్టు
నింతి పల్కెన్నగోయిలల మెట్టు
గీ. లలన కేల్సాటి కొమ్మ కపోలములసాటి
కలికిమొఖకీర్తి కామినీగళముఖాతి
వనితచూపుల రహినాతి వాతెఱ నహి
తెలవనడుము సరణిబోణిపిఱుఁదు కరణి. 319

## ఆద్యంతద్విప్రాసైకనియమము త్తపదగ్రస్తానందకరకందము

క. పొల తోరచూపు వలతో
వలతోదక నీలపుఁనవలకమ్మలతో
యలతోరపుఁబిఱుఁదులతోఁ
దులతొ య్యలికేక గజగతులతో నలరెన్. 320

## ఆద్యేకాక్షరలోపప్రాణితోపమేయ భావభావితోపమాన గర్భిత చరణ దుర్ఘటసీసము

సీ మానినికి సువితంబంబు నితంబంబు
కుందరదనకు వాగురులు కురులు
చిన్నికన్నియకు వాల్గన్నులు కన్నులు
కలువకంటికుచములు లకుచములు
బాలికామణికి శైవాలమ్ము వాలమ్ము
పాటలాధరకు శ్రీపదము పదము
కైరవేక్షణకు రంభోరులు భోరులు
కొమకుఁగ్రొమ్మెఱుఁగు మెఱుఁగుమెయి

గీ. పూర్ణచంద్రాననకుఁ దలిర్కో విమోవి
భద్రగజగామినికిఁ దేనె పలుకు పలుకు
పూవుఁబోఁడికి మిన్న ఖములు నఖములు
గాఁదగె లతాంగి చిత్రసంగతి నెసంగె. 321

గీ. అనుచు వెఱఁగంది పన్నగాహార్యవిభున
కీతలోదరి యూరుపేరెఱుక పడఁగఁ
దెలిసి యెఱింగింతునని మదిఁ దలఁచి యధిక
సంభ్రమంబున జేరంగఁ జని యతండు. 322

ఉ. కాంత విలాసవైఖరులు కన్నులపండువు గాఁగఁ జూచియే
కాంతలచేత నీ యబల కార్యములెల్ల నెఱుంగువాఁడ నీ
చెంతకు నెట్టిమార్గమునఁ జేరెద నింకిట నెద్దిబుద్ధి యీ
యింతిని మావృషాద్రిపతి కెవ్విధిఁ గూర్తు నటంచు నెంచుచున్. 323

క. నావచ్చిన పనియైకద
కావలె నఁట మీఁదవలయుఁ గార్య మటంచున్
దేవకరస్థస్యేనము
దావెదకుచు నింతనంతఁ దరుణీమణులన్. 324

ఆ. డాయనేగి యొక్క తోయజముఖితోడ
నున్న దేగఁ గాంచి యుత్సహించి
మంత్రివర్యుఁ డపుడు మానినీమణితోడఁ
బలికె స్వామికార్య పటిమదెలియ. 325

క. ఏవిధమున నీడేగిపు
డీవనిలో మీకు దొరికె నిది మాహరిచేఁ
దావలమైనది మీరా
దైవం బెవ్వరని యడుగఁ దలఁచితి రేనిన్. 326

## చతుర్వర్ణయమకగీతి

గీ. మావిభుండు యశోస్థ హిమావిభుండు
మావిధుండాస్య జితపూర్ణిమావిధుండు
మా విలాసి తనూసుషమావిలాసి
మాగురుండు నితాంతక్షమాగురుండు. 327

## గూఢదళకందము

క. ఈధరచంద్రక గురు విభ
గో ధర భవమణిగ తిన్న గుకళాతేజో
మేధాజవన యశమధృతి
బోధవితరణాత్మ విహృతి మురరిపు డెపుడున్. 328

## ఏకవింశతి వర్ణయుక్త మధ్యాంతయమకవృత్తము

చ. నిగుడెడి భూతికాంతి జయ నీతి కృపావన సారశుద్ధి ధ
న్విగతి విలాసవైఖరుల నీడజరాణ్ణగభర్తగెల్చు ప
న్నగధర రేవతీధవ ధనంజయ భార్గవ రామచంద్రులన్
నగధర రేవతీధవ ధనంజయ భార్గవ రామచంద్రులన్. 329

సీ. వనధి నొంచినయల్లు తను ధరించిన పుల్లు
గలుగువాఁడు తనంత వెలుఁగువాఁడు
కలువదట్టినరూపు చిలువమెట్టినయేపు
గన్నవాఁడు విధాతగన్నవాఁడు
గిరినిమోచినసత్తి కరినిగాఁచిన బత్తి
దనరువాఁడు గిరీశు నెనరువాఁడు
కరువలియెరసజ్జ మురువుతామర బొజ్జ
నెసఁగువాఁడు శుభంబు లొసఁగువాడు

గీ. వాలుగనులవాఁ డలబిల్లవాలువాఁడు
మేలు వాడిందిరకు జగమేలువాఁడు
జాళువా సాళువాఁ డంఘ్రిజాలువాఁడు
డాలుగలవాఁడు దనుమచ్చడాలువాఁడు. 330

## గూఢాష్టమిగీతి

గీ. ధరణి శత్రుఘ్నలక్ష్మణ భరత రామ
భద్ర గురుమణి గురుమణిస్థితి గేరుప్రధనచాప
నీతిబలధర్మవాగ్విత్తీర్ణి మహిమగతి
శాశ్వతంబుగ శ్రీ వేంకటేశ్వరుండు. 331

ఆ. అనుచు సచివుఁ డిట్టు లాశౌరి ఘనతర
విభ్రమప్రతాప విభవ దెలిపి
రమ్ము లెమ్ము తెమ్ము నెమ్మి దేగను గాని
చనఁగవలయు ననినఁ జాన యపుడు. 332

వ. అయ్యాందోళితయగు నియ్యంపు డెందం బానందంబునం బొందుపఱచి
కురుపతి మనోన్నతి నతిక్రమించి నరపతియగు శ్రీపతివేంకటేశ్వరుని
యందుఁగల కూరిమి పరుల కెఱుకపడక యుండునట్టుగాను నిలిపియు మోహం
బెచ్చరించి నిలుపోపకయతని వాక్యంబుల కుత్తరం బిచ్చుట కులకాంత
ధర్మంబుగాదనియు నూరకుండిన తిరస్కారంబై తోఁచుననియు విచా
రించి కించిద్దరహాస ప్రతిశిరోల్లాసంబున నిజసఖీజన వితానము క్రేగంటఁ
జూచి లజ్జాభరైకతానమతిఁదా నతాననయై యూరకున్న నమ్మోహనసంచా
రచారు నాంచారుదేవి యభిప్రాయం బెఱింగి 333

## అపూర్వప్రయోగము

గీ. తోడిచేడియలందుల రూఢికెక్క
నింగితాకారచేష్టల నెఱుఁగ నేర్చు
కనకమాలికయగునొక్క కనకగంధి
సచివుఁ గనుఁగొనె దరహాసరుచులు మెఱయ. 334

క. అనియెఁ దనస్వామి కార్యం
బనుకూలము సేయ బొంకు టదియెల్లను మీ
కును సహజము పదివేలై
నను నమ్మఁగలేము దండనాయక నిన్నున్. 335

## అపూర్వప్రయోగము

చ. జగతి నరుండు బొంకి నరసజ్జన దప్పున కీర్తిజేకురున్
మొగసిరిబాయు నాపదలు ముంచు శుభంబు దొలంగు పీడు న
మ్మిగ జెఱు ధర్మ మెల్లణఁగు మేలిమి నాశము నొందు నాయు వ
మ్మగు కలిదోషమందు భయ మంటదు నేస్తము బాయు సద్గతుల్. 336

వ. అదియునుంగాక

## ఆభేదప్రాసము

ఉ. ముందుగ తావకీన హరిమోహనరూపము చూడలేమ నీ
వందుకు దేవె లుట్టిపడ నాడుచు నావిభుఁ డుప్పు లేక ము
ప్పందుము గంజి త్రాగునని పల్కెదుగా యెటులైనచూత మిం
కందటిచేతనున్న మణికంకణముల్ గన నద్ద మేటికిన్. 337

క. నే వచ్చి చూచి మీహరి
కీవలసినయేని దేగనిచ్చెద ఐద మం
చావెలఁది మంత్రివర్యుని
భావంబు కళంకు దేర్పఁ బలికెన్ మగుడన్. 338

ఉ. నీవు మహానుభావుఁడవు నిన్నిటు నమ్మకయుంట గాదు నే
నావిభు జూచుముచ్చటల నాటకుదోడ్కొని వేడ్క మీఱఁగాఁ
బోవలె నంచు నిన్ను పొరపొచ్చెములాడితి నింతెగాక యీ
భూవలయంబునందుఁ గడు పూజ్యులు మంత్రులుగారె యెంచఁగన్. 339

చ. అనవుడు మంత్రివర్యుడు ప్రియంబు నయంబును మీఱ నప్పు డా
వనితను దోడితెచ్చి యొకవంకను బూపొద చెంత వేడ్కతో
నునిచి నిజేశుఁ డున్నయెడ కొయ్యనఁ జేర నేగునంత న
య్యనఘుఁడు పచ్చజాజగతియందుం గడు న్సుఖసుప్తుఁడై నెడన్. 340

## ద్విరుక్తకందము

క. తళతళమను జెక్కులనెల
గలకలనగు ముద్దుమొకముఁ గవజక్కవలన్
దలతలమను వలిచన్నులు
కలిగిన యొకసకియ శౌరి గలలో గనియెన్ 341

## తర్కము

చ. కలఁగని లేచి తాఁగలికిఁ గాంచుట నిక్కమెయంచు నిక్కమై
వెలసినకాంత యెక్కడికి వేచనె నంచు నిదేమి చూడఁగా
గలయును గాదు నిక్కవముగా దిదియంచుఁ దలంచి యేక్రియన్
గలఁ గనుఁగొన్ననాతి బిగికౌఁగిట నుండెద నంచు నెంచుచున్. 342

మ. నిలుచున్ నిల్చినచోఁ నిల్చు నడచున్ నిల్చుండఁ జూరకే
దలయూచున్ వనలోనరుల్ గదుసంధానించు నిల్చుచుం బల్క
గలయన్ జూచు దలంచుఁ బత్త్రములు గొన్నన్ బ్రాల్చు జిత్తంబునన్
దంచుం బాలిక నిట్టు లాకి ముకిలోనన్ జంతవేఁ గుందుచున్. 343

వ. ఇవ్విధంబునఁ బ్రపంచప్రపంచపరాఙ్గ నిశ్చిన్న ధైర్యకంచుకంబు
గల యవ్వేంకటాచలపతిం గనుంగొని యమ్మంత్రిచంద్రుం డాశ్చర్యం
బును భయంబును మనంబునం బెనంగొన. 344

క. ఇపుడు హరిపొంతం బొక
నెపమున నున్నదని తడయనేరము లేకే
యపరాధముఁ జేసితినో
చపలతనని వెన్నుఁ జేరఁ జని యిట్లనియెన్. 345

## హరిహరాభేదసీసము

సీ. అవిరళరుచి కలాపవతంసుఁడగు వాని
సుమకరకుండలీ శ్రుతులవాని
అతులితాసిత కంధరాభఁ గాంచినవాని
వరసువర్ణ ధరచాపంబువాని
తనువిలేపన భాసిత కదంబకమువాని
కల్యాణకృత్త్యంశుకంబువాని
అనుపమాన వృషాచలారూఢుఁడౌవాని
ధరను మాధవనామ గరిమవాని

గీ. యెడతెగని మిన్కులీను పేరెడఁదవాని
వేంకటేశ్వర పదనిజద్వివిధరూప
వేషరహిత పదార్థ సంశ్లేషవృత్తి
నలరు నిను నెంతు దేవదేవాదిదేవ. 347

## ప్రాసభేదము

క. పక్షీశ్వర తుఖ్కార భ
వక్షేమంకర గభీర పాథోధి మహో
క్షాక్షిణధ్వజనుత దయ
రక్షింపుము వల దుపేక్ష రాజీవాక్షా 347

### గూఢపశమి

తే. ఋతు బలాజి హయ కళార్త్య నతికళార్థ
యాశమ రమాప్తి ధర్మ భీమార్జును నకు
ల సహదేవ రాజవరపాళి సుగుణ మహి
మాద్యృత హసింతుహౌ వేంకటాద్రినిలయ. 348

### ద్విరుక్తి త్రికనితాంతానుప్రాసైక ప్రాససీసము

సీ. సార సారసభవో దార దారక నదీ
తారక తార కర్పూరసార
తార తారవిధుసీహారహార తురంగ
శార శారద ఘనసారహార
ఖార ఖారకులిశా పారపారదసురా
హీరహీర సురభిక్షీరపూర
గౌరగౌరపపద్మమారమారకభ మం
దార టార మరాళ వారణార
గీ. నారద పటీర డిండీర సార దంతి
కైరవ కరక ముకుర విస్ఫార మల్లి
కారములతోడ నీకీర్తి తారసించు
నౌర గాచలభూకివిహారహారి. 349

### విశేషాద్యక్షరనామకందము

క. భువన జఠర జయసన్నుత
గవాధిపాధన్యకలిత కారుణ్యా రమా
ధవ పరమపురుష తీవ్ర రి
పువిఘాల మహోవిశాల భుజగధరపతీ. 350

### గుణస్వరూపోత్ప్రేక్ష

క. హరి నీదు భాగ్యసూచన
కర గురు దృక్కోణ శోణకాంతి చెలంగెన్
శరణాగత భరణాయతి
కరుదుగ సాకారమౌ దయారస మనఁగన్. 351

## వృత్త్యనుప్రాసము

క. చందన హరిచందన శర
కుందేందుపురందరాశ్వ గోబృంద శతా
నందస్యందన తారా
సందోహాసితారవింద సత్కీర్తిహరీ. 352

## కవిప్రౌఢోక్తి సిద్ధార్థశక్తిమూల వస్తుకృతాలంకారధ్వని

క. జలజాక్ష నీదు తేజో
నల మిల వెలయంగ నభింధన జ్వలనుం డా
జలరాశిఁ బట్టె దావా
నలము మహారణ్య ఘోర నగములఁ జెందెన్. 353

## శబ్దశక్తి వస్తుమూల ధ్వని

తే. అతులిత మహేంద్రపదగుణ ఖ్యాతిఁ జెంది
కలిత గంగౌఘపదవృద్ధి గాంచి మిగుల
వెలయ శుక్తి సతి సీమంతవృత్తి సుపథ
రూపమును గన్న శౌరి పాపాపహారి. 354

## సంబంధాతిశయోక్తి

సీ. శక్రవిలాస సంచార సద్రచిత సై
కత సంగతి నెసంగె గగనగంగ
సాలమూలాతి విశాలవేదిక దీర్చె
రమణీయ నందనారామసీమ
భూరి పార్థివలింగ పూజామహత్త్వంబు
తగ సమకూర్చె సప్తర్షులకును
భువి తెలం గమరంగఁ బొసఁగించె వింతగా
బయలాని తిరుగు దేవతల కెల్ల

గీ. కదన మదవద సురవరహృదయ భయద
భవ దురుతర బిరుద భటపటల జలద
నిబిడ రజములు దిశలను బ్రబలు తఱిని
యంజనాద్రి నివేశ సూర్యప్రకాశ. 355

## శ్లేషానుప్రాణిత కార్యకారణ విపర్య యతిశయోక్త్యలంకారము

సీ. అని నీదు కోపంబు ఘనతఁ జెందకమున్నె
తత శరవర్ష మంతటను వెలయుఁ
దత శరవర్ష మంతట వెలయకమున్నె
ఘనరసాధి పరవాహినులు వాఱు
ఘనరసాధి పరవాహినులు బాఱకమున్నె
యరిజీవనోన్నతి యంతఁ దేలు
నరిజీవనోన్నతి నంది తేలకమున్నె
బహుతర తత్రత్రాణంబు నిలుచు

గీ. నరరె వినుతాద్భుతాన పరివిధాన
సదవ ధానప్రధాన దిగ్జయ నిధాన
దాన సంధాన మేధా నవీన విభవ
విలయ చండార్క సంకాశ వేంకటేశ. 356

## తాద్రూప్యాభేద రూపక సంసృష్టి

సీ. అవిరళ నిజకీర్తి ధవళాంబుజమునకు
గగనమండలము భృంగంబు గాఁగ
అసదృశ దోః ప్రతాపసమీర బంధు సం
కాశరతతి శలభాళి గాఁగ
నతులిత దాన ధారాంభోధిరాజుకు
చంద్రికాధవళి ఫేన సమితిగాఁగ
ననుపమ సౌందర్య ఘనజాల సరణికి
మెలఁతల చూడ్కులు మీలుగాఁగ

గీ. నెగడఁగాఁ జేసి భాసిలు నీకు దొరయు
దొరను నేగాన తావక చరణమాన
కోరకైదువు దునెదారిపేరి పుడమి
దారిగవిదారి చారుమందారి దారి. 357

## విరోధాభాసాలంకారము

సీ. సరసామృతాహారనిరతి నియ్యదుగాని
సరసామృతాహార నిరతి నిచ్చు
బరమసంతానసౌభాగ్య మియ్యదుగాని
పరమ సంతానసౌభాగ్య మిచ్చు

హరివాహనాధి రోహణము నియ్యదుగావి
హరివాహనాధి రోహణము నిచ్చు
సమరభామా సుఖావాప్తి నియ్యదుగాని
నమర భామాసుఖావ్యాప్తి నిచ్చు

గీ. నిన్నని నెదుర్చు ప్రత్యర్థినికరము గవి
దారి మొనజూపి నీహేతి దానరీతి
కంటి విన్కలి దంటి పేరింటి గుంటి
చక్కి నెక్కొన్న నలరూపు సామిమిన్న. 358

## ప్రకృతా ప్రకృత శ్లేషసీసము

సీ. శ్రీకరమైన హేవాకభాగ్యము నంది
వరకచ్ఛపాద్య విస్ఫురణఁ జెంది
యచ్ఛభూదార సమాఖ్యచే నలరారి
నరసింహ మహిమను నలువుమీఱి
యతివిక్రమత మే లతిశయంబు వహించి
యతుల భార్గవగురు ప్రతిభఁ గాంచి
శ్రీరామభద్ర ప్రసిద్ధిని విలసిల్లి
బలభద్రవైఖరిఁ బరిఢవిల్లి

గీ. యలఘు సర్వజ్ఞతా స్థితి వెలయఁ గాంచి
కలికి రూపున జగ మెఱుఁగంగ బొల్చి
దనరు విఖ్యాతిగ దశావతారరీతి
శేషశైల నివాస కౌశేయవాస. 359

## వకారాది నియమ శబ్దార్థాలంకారశ్లేష

సీ. వజ్రిభిన్నగరుచి వైఖరిని విదల్చి
వరశరజాతాభవహి నదల్చి
వాణీవరద్యుతి వారక నిరసించి
వనజ విశదదీప్తి వడి వహించి
విజయపత్రవిభను వేడుకగా జీరి
విపులాజి దీధితి వేగ జీరి
విధుకాంతమణి కాంతి వేటాడి పైదూరి
విమల చంద్ర ప్రభ వెరజ దూరి

గీ. విభవవీరత్వ వాగ్వర్ణ విజయ విహ్ఖృతి
విశ్రుత దయావితరణాప్తి వెలయ మీఱు
భవదుదార యశః ప్రతాపరమజెంద
భేదరీతి ప్రబలును దిగ్బృందమందు
నందితానంద నిలయ యానందకంద. 360

## కందగర్భిత ప్రమితాక్షర వృత్తము

రవిచంద్రనేత్ర సుర రా
జవర స్తవనీయ చక్ర శరజాత సరో
ఱువిహార నిర్భరస ము
త్సవచిత్ర వన ద్విపేంద్రదర దాతిశయా. 361

## త్రివిధాపహ్నవ లక్షణము

మ. స్థిర చక్రం బిదిగాదు బాహుజమహశ్శ్రీగాని శంఖంబుగా
దురుకీర్తిద్యుతిగాని దేహరుచిగా దుద్వృద్ధ నౌఘంబుగా
ని రహిన్ జూడఁగనంచు నీదు నెఱచిన్నెల్ ధన్యులెన్న నృపా
ధర గోత్రంబునఁ గానుపింపవె రమాధ్యక్షా జగద్రక్షా. 362

## శ్లిష్టమాలికా పరంపరితము

మ వనితాద్ర్బ కృకముదేందు బింబము యశోవల్లీ వసంతాగమం
బనిరా పూర్వకథాసుధాంబుధి భుజౌ జోరోత్కదయాత్మాధరం
బన రాజద్గుణ రత్నరోహణము నీ యాకార మెవ్వారికిం
జనునే సన్నుతిసేయ శ్రీహరి దయా సంత్రాతమాద్యత్కరీ. 363

## ఛేకానుప్రాస పంచచామరము

ఘనాఘనాభిరామధామ కంధిజా దరీదరీ
వనావనాఖిలాకలాదవైణవా హరీహరీ
వినావినామదైత్యదంత వీరకేసరీసరీ
దినాదినారజాక్ష సమ్యదృక్సుధాకరీకరీ. 364

## హరిహరవర్ణనాయుక్తానులోమ ప్రతిలోమ కందద్వయము

మారవిభావాభవన ప
చారధరజయాదర వనిజననుత యజరా
వారధిదర పర పురహర
సారగకజరామ సువనజనయన జేజే. 365

**ఆదిచరణద్వయగుప్త గీత్యుపరిచరణద్వయ సంబుద్ధికలికా తురగ వల్గన రగడసంయుక్త సర్వలఘ్వంత నియమకలిత సీసము**

సీ. నిగమకవి పవిహరణ నిఖిల విపదపహరణ
సతతచతుర విహరణనుత వితరణ
కపటదవిధినిగరణ కనదవితతరువరణ
జలరుహ సదృశ చరణ శరధిశరణ
విదితజితమురసురణ విధివిశదనఖకిరణ స
నయజగదవతరణ జననభరణ
గజవరదబుధశరణ యజవిభవ దరికరణ
సమదచలదనుసరణ సముపచరణ
గీ. నిరత గిరిరిపు శిఖి యను నిఋుతి వరుణ
పవన ధనద హరమకుట పటుమణిగణ
ఘృణి పరివృఢ భుజగ పరిబృఢనికషణ
విలసిత తనువర-కుమతి విదళ-చరణ 366

**చకార ప్రాస కందద్వయ గర్భిత త్రిస్త్రఖక రూపక లయ విభాతి**

నలిననయన సదయజలధివరువాస
ఖలదళచణ ఘనాఘన రుచి లలిత ఖభాంగా
విలసితగుణ విదితబల గరిమపాల
లలదలకవిభ గోపజన ఫలదసదపాంగా
కలితనయ ధీనదర జలజభవపాల
నలదవలవగ నికాయమణి వలహృదనుషంగా
తులిత మహిమచిదుదయ లపనసదావిచల
దలఘుతరమానస సకలనుతరథాంగా 367

**సంబంధాసంబంధాతిశయోక్తి**

క. మురహరతావక వితరణ
చరితము విని వితరణంబు చాలించెను కి
న్నరనాథుఁడు గాంచును జై
త్రరథవిహారంబు వితరణ మొకవేళన్. 368

## వ్యతిరేక రూప సంభావనాలంకారము

సీ. సతతంబు కువలయాహిత మొనర్పకయున్న
నతిరతాశావృత్తి నందకున్న
దోషోదయంబునఁ దొలఁగి పోవకయున్న
క్షితినందలకుఁ బగల్ సేయకున్న
వారుణీ నిత్యసేవనము జెందకయున్న
ద్విజరాజభావంబు దివియకున్న
ఘనసమాగమవేళ గని చాటుగాకున్న
గ్రహముల కెకిమీడు గాకయున్న

గీ. యప్రతిమమైన నీదుభుజప్రతాప
మునకు దీటనవచ్చు నవ్వనజహితుఁడు
కంటివిన్నరిదంట పేరింట గుంటి
నడుమ నెలకొన్న వేంకటనాథశౌరి. 369

## రూపకశ్లేషముద్రా సంసృష్టి

సీ. నీయాదరోన్నతి నిఖిలసజ్జన విప
ద్వారిధికిఁ దరణివారమయ్యె
నీకీర్తివిస్ఫూర్తి నీరేజభూతాండ
వరపేటికకు నిందువారమయ్యె
నీవితరణప్రౌఢి నిర్ణిద్ర సేవకా
వళికిఁ గల్పక కుజవారమయ్యె
నీనీతిమార్గంబు నిందితమూఢధా
వనబోధకా బుధవారమయ్యె

గీ. నీరుటము నరులకు గురువారమయ్యె
నీరుచితరాటవికి శుక్రవారమయ్యె
నీయభిద కలుషాద్రికిని దలఁప శని
వారమయ్యెను దేవదేవాదిదేవ. 370

## అపహ్నవాను ప్రాణిత కావ్యలింగము

సీ. తీరైన మెయితావి తెలిగందపొడిగాదు
  చేతోజ తనుజాత భూతిగాని
సుదుటఁ బెట్టిన మృగమదతిలకముగాదు
  గొప్పయెక్కువ కనుఱెప్పగాని
గళమున గప్పు డాకంఠసరముగాదు
  కమనీయ గరళ లక్షణముగాని
కటి తటి గురుచిత్రపట విషముగాదు
  డాలైన బెబ్బులితోలుగాని

గీ. వాలుపై నిల్చియున్న దా శైలపుత్రి
ధరణి నీశ్వరుఁడవు నీవె తలఁచిచూడఁ
గంటి విన్కలివంట పేరింటి గుంటి
నడుమ నెలకొన్న వేంకటనాథ శౌరి. 371

## ఘనస్తకందము

క. న్యమాపిత్యాభీశా
క్రమాస్యాస్తేందు బింబగంగాభృత్కృ-
రాక్రమక్షోణీజాతా
సామ్రాజ్యాపేక్ష శేషశైలాధ్యక్షా. 372

## త్రిస్తబక ముక్తపద గ్రస్త చరణ యోజాలంకారసీసము

ఖండన జ్యాఖండ ఖండపరశుకాండ
  కాండహారిపిచండచండ చక్ర
ధ్యానభక్తనిదానదాన గజాదాన
  దాన మకరమాన మానదాన
నాగారికృతరాగ రాగకాళియభోగ
  భోగనర్తనయోగ యోగచరణ
భీమాశరదధామ ధామమహాధామ
  ధామకృత్యభిరామ రామఖేల

గీ. గండమండిత కుండల కంపమాన
మసకాఖండల ముఖప్రశ స్తవినుత
వనచరద్వయ మృగయుగ మనుజషట్క
తా సముజ్జ్వల లీలావతారవిభవ. 373

సీ. ఖావత్కథానాంబు భవతజినీసంఖ్య
భద్రాయితగుణ సముద్రుఁ డెఱుఁగుఁ
దావకీన రథాంగ దళితాశరేట్సంఖ్య
భాస్కరపంకేజ బంధుఁ డెఱుఁగుఁ
దావకకీర్తి సద్వ్యాజగత్సంఖ్యను
గాయకసారస్వతేయుఁ డెఱుఁగు
భవదాకృతిఁ దలంచు యువతీమణులసంఖ్య
మాన్యసంకల్పసంభవుఁ డెఱుంగు

గీ. సారవత్వజ్జయాంకిత స్తంభ సంఖ్య
రూఢిగా దచ్చి దిక్కు లెఱుంగుఁగాక
నితరు లొక యింతయైన దారెఱుఁగఁ గలరె
శేషశైలనివాస కౌశేయవాస. 374

సీ. భోగీంద్రశైల శోభాయమానోత్సవ
వైయాసకి సదుక్త వరపురాణ
ప్రణయినీ సంపనీపద్య మానోరస్క
నోనువన్మాన హనూన వరద
దేదీప్యమాన మధ్యేసముద్రశయాన
మఘువాది రాజాయమానరూప
కీర్తియన్నారద క్షేమదాయి కటాక్ష
యతిమనోజ్ఞ విజరీవాద్విరేఫ

గీ. అవితరూపవతీ చతురాంబికముఖ
వల్లవీహృదాచిత్త సుపల్లవమణి
ఖగవ రాశ్వోరసోడ్డీన గతివిశేష
కింకరీకృతబాణేశ వేంకటేశ. 375

## ఒహూవిధో ల్లేఖాలంకారము

సీ. ప్రాగ్దిశాపరిమృధ భామినీకబరీషు
జ్వలనసీమంతినీ గళతలేషు
ధర్మరాజాంగనోదారవక్షోజేషు
నైఋతికాంతాఘనజఘనేషు
వరుణసతీమణి వరకర్ణపత్రేషు
హరిణాశ్వవనితారుణాధరేషు
యక్షకులాధినాయకవధూనిటలేషు
పురహరమానినీ కరతలేషు

గీ. మానసూనంతి హారంతి మలయజంతి
ధవళచేలంతివజ్రంతి దరహసంతి
నవసితాభ్రంతి ముకురంతి తవయశాంసి
పంకరుహబంధుసంకాశ వేంకటేశ. 376

క. హరయే దుష్టక్రవ్యా
దరయే దానవమదేభహరయే ధృత స
ద్గిరయే పరిపాలితశాం
కరయే తుభ్యం నమోర్యకలయే యనుచున్ 377

## ముక్తపదగ్రస్తనిస్తుల్యాద్వైవారగద్య

శ్రీమద్రమారమణీమణీ సముజ్జ్వల హృజ్జల జాతమార్తాండ తాండ వాడంబర సంభృతానల్పాకల్ప జటాకుటీర జటాజూట కోటీర నానట ద్గగనగంగా తరంగాభంగుర ఘుమఘుమారావ చమత్కారధిక్కార గంభీర వచోనిగుంభిత పదబంధాను సంధానబంధుర ప్రబంధ ధౌరంధర్య వామలూరుద్భవ వ్యాసప్రముఖ కవిరాజసంస్తూయమాన గుణప్రకాండ కాండముక్తముద్ధ్యూత గర్జా నిర్ఘోష భీషణదరీ ఢౌకమాన భూరిఝూరి సముత్పతక్షిప్రావసరోద్ధ గుబగుబచ్ఛందైందమాన బుద్బుద పాణింధమ శీతల కబంధవిధూతా ఘౌఘతీర్థరాజకాండ కాండచ్ఛటా సంభరణోదర ద్వితీయ మహిమోల్లంఘన విజృంభ మాణాంభోనిధాన ఖర్వగర్వ నిర్వా పణోద్దండార్ధేందు కాండ కాండగీవావతార సాధారణ మేధాసంవిధాన ప్రదాహృద్యానవద్య విద్యానుబోధితామేయ వాచంయమవేదండ దండ

ధర ద్రుహిణాఖండల త్రిపాద్వీభావసూద్భవ నార్కాదార్ణోధి పాళుగైల విశోక్ష ప్రముఖ కకుప్పరివృఢార్జున కిరీట ఘూటస్థగిత చిరత్న రత్న నిర్యత్న ప్రభానీరాజితాంఘ్రి పంకేజ దేదీప్యమానాత పత్రీకేతనాహల కులిశకలశాంకుశ రేఖాప్రచండచండ తేజోవిరాజత్ప్రాతీనకమఠ స్తబ్ధరోమ నృహర్యత్ష త్రివిక్రమ కుఠారభృద్దాశరధి ప్రలంబజిత్ప్రబుద్ధ గంధర్వ రూప శ్రీకృష్ణాద్యవతారాఖండపరశుప్రేయస్యహల్యా ద్రౌపద్యాటవిక పాటలాధరాదేవ భూతిశ్మాసుర భార్యాత్రివిక్రా భీరికాగణ్య పుణ్యప్రమదా మోక్షభోగప్రదాన శౌర్యాండ పాపర్య మాననిజకథాతుంబురు నారదగాయకా విధేయశివమతాపత్రయ వైయాసక ప్రభృతి భక్తజనవిధేయక వక్షస్థల ప్రాలంబమానకౌస్తుభగ్రైవేయక కటీరన్యస్త కౌక్షేయక ప్రహ్లాదాది పరమభాగవత చింతిత ఫలదాయక వేంకట శైలనాయక పాహిమాం పాహిమాం పాహి.

## వర్ణవృత్తి వృత్తములు కదళీపాకము ప్రాసభేదము

శా. వేదోద్ధారక వేణునాదకుతుకా వేల్లత్కృపావీక్షణా
వేదాంతాటన వేదనావిరహితా వేశ్మీకృతాబ్ధిస్థలా
వేదిక్రోణిరమేశ వేషదశకా వేదస్ఫురద్విక్రమా
వేదోండావన వేంకటాచలపతీ వేదండరక్షాకృతీ.

మ. కరిసంరక్షణ కామపాలసహితా కంజాక్షకాకోదరే
శ్వరతల్పా కమనీయరూప కనకాక్షధ్వంస కారుణ్య సా
గర కల్యాణమయాంబరాంత కటిభాగా కంస సంహారకా
తరసందోహ భయాపహారి కలితా తార్క్ష్యాఖ్య గోత్రాధిపా. 380

చ. శరధిశయాన శార్ఙ్గధర శంఖశశాంక దివాకరాక్షశం
బరహర శౌరి శుక్రమణి భాసురభాసిత తాటకేయ శం
కరసఖ శాశ్వతాశరవిఖండితవాసవిశౌర్యధుర్య శం
బరజభవాండపాలిక శమప్రదభద్రమహీంద్రవల్లభా. 381

చ. నరసఖ నవ్యరూపనర నాథశరీరగ నక్రకుండ లా
భరణ నగాత్మజావినుత పావననామక నందనందనా
నరహయమిత్రచాపధర నారదగా నసకౌతుకానతా
దర నవనీతచోర నయదానవినోదర నాగభూధరా. 382

చ. వరదవరాహ రూపవసు వాసవిసేవిత లోకవార్ధి భూ
వర వరుణాలయోన్మదనివారణవందిత మౌనిజాల వా
సరమణి పుత్రికాహృదయ శాసనసోదరవాసుదేవ వా
ర్ధరతను కాంతిశోభివన దంత్యుపనావరనీలశైలపా. 383

## ధ్వని-అపూర్వప్రయోగము

క. అమితమృగాటన రమణీ
యమహారణ్యా సరసీతరాలయ నక్రో
ద్గమిత గజత్రాణసుధా
ను మహిమ మహనీయుఁడౌ నిను భజింతు హరీ. 384

## అంత్యప్రాస నియమ చరణగుప్త ద్విపదతాళవృత్తగీతి

తే. దమిత కంసవిపక్ష దంతావళోక్ష
యమితసేవక రక్షణాయత్తదీక్ష
సమరభుజ్మనిదక్ష శశ్వత్కటాక్ష
యమరనాయకపక్ష యబ్జాయతాక్ష. 385

## ఆరభటీవృత్తి

ఉ. చండమయూఖ సంహనన సంభవభంజన భూరిఘోర కో
దండవిఖండనోజ్జ్వల దుదారపరాక్రమ పీవరోధుర్య దో
ర్దండ ధనుర్విముక్తశర దారితమేరువరాఘరోన్నతా
ఖండల విద్విషత్ప్రజల కాయఘనాంజన శైలనాయకా. 386

## ముక్తపదగ్రస్తసీసము

సీ. శ్రీమత్కటాక్షరక్షిత వనద్విపరాజ
రాజవిభూషణ ప్రణుతసార
సారంగరూపరాక్షసదాన చణబాణ
బాణరాత్రించర ప్రాణహరణ
రణభోజనాత్ర మార్కండేయ నుతిబృంద
బృందావనాంతర ప్రియవిహార
హారకోటీరకేయూరముఖ్యాకల్ప
కల్పాగసుమధరానల్ప మహిమ

గీ. హిమమయూఖాబ్జ బాంధపకమలనేత్ర
నేత్రపల్కలధారణ నృపతిధామ
ధామపిపరిత రావణదస్యుసార
సారఘనధామ వేంకట శైలధామ. 387

## కవిప్రౌఢోక్తిసిద్ధార్థశక్తి మూలవస్తుకృతవస్తుధ్వని

సీ. మదిగాసుమలనొంటి యడుగునిక్కన నిల్చి
బెడిదమౌ కెంజాయ జడలు దాల్చి
యనయంబు నౌదల విసువాక ధరియించి
తెలిమేనిపై బూదికలయ నలఁది
బలితంపుపొదల బెబ్బులితోలు కటిఁ జుట్టి
మిసిమిగాఁ గత్తుక విసము నించి
యజచేత మమ్మెన కఱకువాల్గీలించి
యొదలఁ బాములు ప్రాక నోర్పు గలిగి

గీ నీసమాఖ్యనుబోల పూనికలను తప
నిపు డొనర్చుచునున్నాఁ డుమేశ్వరుండు
కానిచో వానికేల యీగతి మెలంగ
సన్మునిసనాథ వేంకటనాథశైల. 388

## సంవత్సర యుక్తసీసము

సీ. శ్రీముఖప్రభవ సుస్మేరాభకౌస్తుభ
సర్వజిద్విక్రమ చక్రహస్త
సౌమ్య భావ మునీంద్ర సన్మనోంబుజ భృంగ
యవ్యయానంద హృద్భవ్యరూప
ధాత్ర సాధారణ స్తవనీయ నిజచర్య
విభవప్రమోదాప్త విబుధనాథ
జయదుందుభిధ్వాన చకితాసురాధ్యక్ష
దుర్మతి రాక్షసశర్మహరణ

గీ. చిత్రభాను స్వభాను జిత్సిద్ధతేజ
విజయనందన ఖరసూతవిధివినోద
మన్మథ క్రోధి శర్మనిర్మథనసార
వృషగిరీశ్వర సంతాళ వెంకటేశ. 389

సీ. శృంగారరసము మూర్తీభవించినయట్ల
యతసీలతాంత దేహంబు దనరఁ
గరుణారసంబు సాక్షాత్కరించినరీతిఁ
గనఁగొనలను రాగగరిమ మొనర
శాంతరసంబు ప్రసన్నమైన విధాన
నెదఁ గౌస్తుభప్రభ కుదురుకొనఁగ
నద్భుతరసము ప్రత్యక్షమైనకరణిఁ
గటితటిఁ గనకాంశుకంబు చెలఁగ

గీ. గరభతుష్టయ విలసితదరరథాంగ
ఖడ్గశార్ఙ్గముఖాయుధకాంతు లెసఁగ
మొసలివామేలి తమ్మెట్ల మిసిమి బొసఁగఁ
దపసి డెందాన నెలకొన్న తమ్మికంటి. 390

సీ. దేవరపంపున నీవేళ నటకేఁగి
విలసితంబగు నొక్క కొలనుగంటి
నక్కొల నందఁ బెక్కబలలు గొలువంగ
గడునొప్పు నొక రాజకన్యఁ గంటి
నక్కన్యఁ జేరఁగా నరుగుచో నందొక
సకియచేనున్న వేసడముగంటి
నావేసడము మాదియని మిమ్ముఁ గీర్తించి
పలికిన నలరి యా కలువకంటి

గీ. తనదు కూరిమి నఖియచేఁ బనుప దేగఁ
దెచ్చి యాకాంత యిట నొక్క దిక్కునందు
నున్నదని పల్కఁ జిలువరాదిన్నె ఱేఁడు
విని ప్రియమ్మునఁ దోడి తెమ్మనుచుఁ బలుక. 391

## సర్వలఘు వచనము

వ అపుడు సచివుఁడు గరుడగిరివిభు సముఖమున నునిచిన నుడధిపవదన
ముదమున మును విని నది గనుక సరసిజనయన యరిదరవరకర యసుర
కరహరణ మునిజన వినుత చరణ తన వచన మొకటి వినుము దయ

జిలుకు గనుఁగొనల నను గనుఁ గొనుము భవమపవనమున నొక
పురమున కినుఁడయి గగనపతి యనఁగ నొక నృపుఁడు గలఁ డతఁడు
తనకు సుతులఁ బడయుటకు బహుదినములు దపములు సలిపిన నతని
తపమునకు నతికృపుఁడయి మలిమలసుతముగఁ డెదుటనిలిచి నృపవర
యిహపరముల కయిన సుతనొసఁగెద నడె యెటు లనిన భుజగనగమున
కిరుదల దొరదెసను జిరుతనగరమున జలజసరసిని గములము నడుమ
నొక సిసువు దనరెడు నది తనయఁగఁ గయికొని విషధరధర పతికిఁ
బరిణయ మొనరుపుమని పలికి చనిన తఱిఁ దదనుమతిని ముదితను
దొడుక ముదితహృదయుండయి పొనపొన నచటికిఁ జని దనకు నుడువు
శివుని వచనసరణిఁ గమలసరసిని నిలచిన నిసువు నరసి కని కుతు
కమునఁ దన తనయఁగ గయికొని సకల విభవంబు లొనరిచి
మఱియు నొక శుభదినమున జలజనిలయ యని యభిధయిడి సుముఖుఁ
డయి నిలిచిన సమయమున నతనితనయ దినదిన మధికముగఁ
బెరిగినదయి వయసు బొడమినదయినతఱి నొకడినమునఁ జెలులఁ
యుపవనమునన నలు దునిమి వెనుక నయముగఁ గొలకుల జలవిహరణ
మొనరిచి వెలువడి యచటఁ గనుగలిగి వినయము బ్రియము బెనంగొ
నఁగ నునుంజెఱకు విలునళిగొనయము కఱకటి గరిగరి గఱవమరుసున
బరుపుట కొరవుగను గఱకు ఓరనిరి శరములు శుకపిక నికరముఖ
బలములు గలిగిన మదనునిగని గొలిచి తనకుఁ జిఱుపెముల దొరను
మగనిగ నొనరుపుమని మదినిఁ దలఁచు నవసరమున జతనమున మిముఁ
గొలుచు సచివుఁడు పులుఁగును వెదకి కొనుచు మిముఁగని పొనపొన
గినిసి బహువిధముల మిముఁ బొగడిన విని యపుడె చెలువలతల రతనము
నెఱతనముఁ దనరిన దొరతనముఁ గలిగిన దవుట నను బిలిచి పులుఁగు
నొక చలువ కలువసరమున సరమున నొసఁగి సచివుని వెనుకొని
మిముఁగని యెఱుక పఱపుమని యనిచిన ననిచిన మనమున నను
వనిత పనుపున నిచటికి నడచితిని ననుఁ గనకపు సరమనుదు రని
హరిపదములకు నొరఁగి తెలియఁ బలికి పులుఁగును గలువసరమును
నొసంగి యచటికి కలికి చెలువము బొగఁడగ నలువకు నలువి యగునె
యలున నెఱిఁగిన తెఱఁగునఁ దెలియఁ బలికెద. 392

క. సిరిసుగుణ పంక్తి తదుదా
హరణ త్రా రాపశి నఖముల మంజరి చ
న్నరి యాకందముల ప్రబం
ధరీతిఁ గచ మింతి వింత ధరలోఁ గలదే. 393

తే. రహి మది యయోధ్య వాతెఱ రక్తి మధుర
కౌను మాయా కబరి కాశి కటియు కాంచి
గాంచి వెలయు నవ్వేలఁజిని గాంచినంత
యబ్బురమె క్షేత్రఫలము మీకబ్బు టెల్ల. 394

### సర్వయమకరూప త్రిప్రాసకందము

క. సరమాకే లనఁటికి మీ
సరమా మెఱుఁగుఁ దొడ నాభిసరమా జలజా
సరమా ముఖరుచిభసలవి
సరమా కురుల జిగి కొమ సుసరమా పొగడన్. 195

### అనుప్రాసగీతి

ఆ. వాలుమీలు డాలు నేలింతి కన్గవ
సోము గోము నోము రామ మోము
మించుమించు సంచు మించు బాలికమేను
మిన్న చెన్నుఁ దన్నుఁ గన్నె నడుము. 396

### యమకము

క. నెమ్మలు గమనమ్ములు మీ
నమ్మలు మంజులతర నయనమ్ములు తళుకూ
నమ్మలు దృక్ఛలనమ్ములు
నెమ్మెఁగన మెఱుఁగుబోఁడి కిమ్మెయిఁ దనరున్. 397

### ద్వాత్రింశదవయవ వర్ణన రూపకాలంకారము

సీ. తుఱుమహిమోము చంద్రుఁడు నుదు రఱనెల
బొమలు విండ్లక్షు లేణములు ముక్కు
నువ్వుఁబువ్వు చెవులు శ్రీల్ నునుబండ్లు మొల్లల
ధర మిగుర్చెక్కుఁలద్దములు గవుద

తాటిగింజమెడ చిందము ప్రేళ్లు పగడముల్
కరము లబ్జములు కక్షములు దిరుగు
దులు కేలు తూండ్లు గుబ్బలు గిరు ల్వళు లల
ర రు వాల్ నాభి గుహ నడుము విన్ను
గీ. కటు లరులు తొడ లంట్లు మోకాళ్లు బొంగ
రములు పిక్కలు బొదులు గుల్ఫము లరడలు
ప్రపదములు కూర్మములు నఖరము లుడు లడు
గు లెడదమ్ములు వెనుపల్క వెలఁది కొప్పు. 398

## సభంగాభంగశ్లేషానుప్రాణితోపమాలంకారము

సీ. సకియవేణి ఘనాళి నొకమూలకును దెచ్చు
రమణియానము కలభముల నిమురు
యువతి వాతెఱ శోభన వసుధఁ బాలించు
నతివ పొక్కిలి సుడినంటి మించు
ననఁబోఁడి మెడ యలనవకంబు నిరసించు
నబల మై వాల్మించు నతిశయించు
వెలఁది సిబ్బెపుగుబ్బ లలరు బంతులఁ గొట్టుఁ
గొమ చెక్కు చంద్ర ఖండము హసించు
గీ. నాతిచూపులక్రియ బోటినఖములవలె
సువిదకటి పోల్కి నెలఁత యూరువుల పగిది
యన్ను వళిగతి మగువ నూగారు కరణి
ముదిత పలుమాట్కి యెలనాగ నుదురు తేవ. 399

ఆ. నెలఁత కొమిరె వయసు నెమ్మేను మోము గో
మించు మించుఁ జందు మించు మించు
మగువకేలు తుఱుము మదను మొదటియాన
వాలువాలుగు హరవాలు వాలు. 400

క. మగతేఁటి కలువవెన్నెల
నిగళం బల మెఱుఁగుశరము నీలము వలలన్
జగడించి గెలుచు చూపని
దుగి నుండెడు ననవ సంఖ్య తొయ్యలిపీసుల్. 401

## చతుష్పాద్యమకము

క. కుందరమా విలసనమున
కుందరమా చెలినఖాళి గుఱినెన్నఁగ నా
కుం దరమా యని యపు డళు
కుందరమా కొమ గళమునకుం గనుచోటన్. 402

## త్రిదళయుక్తకందము

క. నిగరాలగు మగఱాలను
నిగరాలుగఁ జేయు నౌర నెలఁత రదనముల్
పగడంబుల జగడంబులు
జగడంబు లిడు న్మిటారి చవిమోవిరుచుల్. 403

## మధ్యమ యమకము

క. మందగమన నెమ్మోమున
నందలి తిలకమున దృష్టినలకమ్ముల లీ
కందమ్ముల కుందమ్ముల
కందమ్ములఁ గేరు మీఱు గరసించ నగున్.
క. విమలరుచి రుచిరతర హీ
రమణిన్ నో రదము రదము రంజిల్లెడు సం
జ మెఱుంగుఁ దొగరుఁ జిగురున్
గొమరున కాస్పదము పదము కొమిరెకు నమరెన్. 405

## చరణాద్యంత చతురక్షర నియమ యమకము

ఆ. కప్పురాల మించు కప్పురాల దలంచు
కోపుచూపు చెలువ కోపుచూపు
కుందరాజిమిన్న కుందరాజిలుచున్న
సన్ననవ్వు కన్నె సన్ననవ్వు. 406

## చతురక్షర యమకము

ఉ ఆలపనంబు తేనె జడియాలపనంబు శశాంకబింబ మా
వాలుగదా బెడంగు జడ వాలుగదాయల వాలుఁగన్నులా
జాలపదమ్ముల గ్గెలువఁ జాలపదమ్ములు బొల్చుమేలుమే
లాలత కూనయైన నుతు లాలతకూనవెలంది మేనికిన్. 407

క. కందమ్ముల చిందమ్ముల
చందముఁగని గెలుచు చెలువజడ మెడ బెడగిం
దిందిరములఁ జెంపిరముల
యందమగుచున్ మగుచవీక్షణాధరకాంతుల్ 408

## సావయవరూపకాలంకారము

సీ. నిద్దంపు నెమ్మోము నిండుచందురునకుఁ
దెలినవ్వు వెన్నెల తెలివిగాఁగ
దిలకించు కోపుచూపుల తూపుగములకు
నెఱికప్పు ఱెప్పలు గరులుగాఁగ
బొంగారువలిగుబ్బ బొంగరములకు నా
పై మొన ల్ముకులుకుల బాగుగాఁగ
నతులితకాంతి బాహామృణాలములకుఁ
గరములు మెట్టదామరలు గాఁగ
గీ. మించుక్రొమ్మించులీను నెమ్మేనులతకు
మంచివయసు వసంతాగమంబుగాఁగఁ
దను గనినవారి చూపులు తమకు మఱల
చనినరూపున దనరె కడానిపొలఁతి. 409

## ఆదివర్ణవృత్తికందము

క. ఆమో మాకురు లానొస
లామెడ యాకుచయుగంబు నాతఱు లాయా
రామధ్యం బాకటి తటి
యామోకా ళ్లాయడుగులు నాచెలి కలరెన్. 410

## ముక్తపదగ్రస్త ద్వయఘటిత చరణసీసము

సీ. మించు లందున మించు మించువైఖరినింపు
నింపునెమ్మేని నిద్దంపు సొగసు
బువ్వులజగినవ్వు నవ్వుచొక్కపుడాలు
డాలువేలార్చు కపోలపాళి

సరసభావ మమరు మరువిల్లులకు నేర్పు
నేర్పు సోయగమున నెగడు బొమలు
గండుతేఁటులకప్పు కప్పురీతులఁజూపు
జూపుసింగారంపు చుఱుకునిగ్గు

గీ. పద్మినీవైరితోఁబోరు పడఁతిమోము
మోముగోమును శిరము కప్పురముఁబల్కు
కళుకుగననీని కనుఁగవ తళుకు గలుగు
చెలువ చెలువంబు వర్ణింప నలువ తరమె. 411

## ధ్వని

చ. వెలితిగి నవ్విన న్మొలచు వెన్నెలమిన్నక యూర్పులంట మో
మలతివడన్ గొనుం జిలుక యల్లనఁ్రవాలిన నెఱ్ఱనౌ కర
మ్ములు పలుకంగ వాడధరము న్గనుచోటను దృష్టిదాకుమై
కొల దడు గిడ్డ కందు నడు గుల్బళి పైఁదలికన్నె గాఁదగున్ 412

## కైశికీవృత్తి

ఉ. కొంచెపుఁ్రవేళ్ల సోయగము గొప్పపిఱుందును వెన్నుచెల్వమున్
మించునమించు కన్నులటు మీటిన ఖంగను గుబ్బదోయి బొ
మ్మంచు వెలందిమోవి యసియాడెడు కౌ నలతాచు నీగిఁ బొ
మ్మంచును నూగుటారు నడలందము చందనగంధి కేతగున్. 413

## లాటీరీత్యుదాహరణము

తే. తామరబిడారుకొమ్మ నెమ్మోమునకును
సారచంద్రబింబస్ఫూర్తి సాటియగునె
నాతితల మిన్న నున్నని వాతెఱకును
సారబింబ స్ఫూర్తి సాటియగునె. 414

## త్రివర్ణ నియమ యుక్త ముక్త పదగ్రస్తము

క. శ్రీసతి సన్నపునడుమున
కేసరికే సరి రదాళికి గణింపఁగ ము
క్తాసరి తాసరి ఘన మహి
మాసరి మాసరిత జఘన మహిమకు నరయఁ. 415

## లాటీరీత్యుదాహరణోపమాలంకారము

తే. పదము లంబుజభవకాంతిఁ బరిఢవిల్లు
గుబ్బ లచ్యుత దీధితి గ్రుమ్మరించు
కబరి నీలకంఠద్యుతిఁ గాంచుఁ గాన
యలరుమేల్మంగకన్న సాములు గలారె. 416

## శ్లేషరూపవైదర్భీరీతిభేదవృత్తము

ఉ. ఆజగడాలు మోముసొగ సాతెలిగన్నుల కోపుచూపు తీ
రాజిగిదీవిమోవిపలు కానునుగొప్పమెఱుంగుసోయగం
బాజవసందులే నిఱుకుఁజన్నులు సిబ్బెపుటుబ్బు గబ్బిసా
రాజవరాలికేతగు నయమ్ముగ నబ్జదళాయతేక్షణా. 417

ఉ. ఆ లలితాంగి యావెలఁది యాజిగి తానక మాపడంతి యా
బాలిక యామెఱుంగు విడిపాళెము యా చిగురాకుఁబోఁడి యా
గోల మిఠారి యాకులుకుగుబ్బెత యాకలకంఠియా
మేలిమిబొమ్మ యాకలికి మిన్న తలంపఁగ స్వామికే తగున్. 418

## అనుప్రాసద్వయమధ్యయమకవృత్తము

చ. అరికుచ తావిమోవి తొగరాతొగ రాచమొగంబు డంబునా
యరవిరి తేనెసోన పలుకా బలుకాకల చెన్ను పొన్నుతో
సరియగు మేనునైన ఘనమా ఘన మాస్థితి నొప్పుకొప్పు నా
యరివికఁ జూపు చూపు మెఱుఁగా మెఱుఁ గారయ నెన్నశక్యమే. 419

## ద్విపాదపంచమ వర్ణయమకము

క. బాలికసిబ్బెపు గుబ్బలు
తాలసమానములు కుటిలతాలసమానం
బాలేమ తళుకు కురు లా
బాలేందుఁడు ముదిత నుదురు పద్మదళాక్షా. 420

## శబ్దచిత్రము

క. కామ గుబ్బలతోఁ బోర న
గములా వృద్ధిఁగని యూరుగమనములకు లో
గి మొదట పుంభావంబై
క్షమ పొక్కిలి కోడె గతులు గలుగని కతనన్. 421

ఉ. ఎక్కడకాంతి మిన్న దన్న దన మెంత నుతించిన నంతయొప్పు నా
చొక్కపుమోము నానడుము సోయగ మాసొగసైనకొప్పు నా
చెక్కెరమోవి యామెఱుఁగుఁజన్నులు నానిడువాలుఁ గన్నులా
చక్కనిజెక్కు లాపిఱుఁదు చందము నందము దానికే తగుణ. 422

## శ్లేషయుక్తవైదర్భిరీతి

శా. ఆ లావణ్య మగణ్య మాగుణ మనన్యస్త్రైణసామాన్య మా
శీలం బప్రతిమాన్య మాపనయ మక్షీణోదయం బాకళా
జాలం బుజ్జ్వల మావచోవిభవమాశ్చర్యావహం బావయ
శ్రీలాలిత్య మనర్ఘ్య మాకులమతి క్షేమంకరం బచ్యుతా. 423

## బహువిధశబ్దచిత్రము

సీ. వనిత వేనలిఁ జూచి వనధర మవనత
గతిఁ జెంది ధరమయి కదిసి నిల్వ
గురునితంబం బొత్తుకొని పోవ ధరమయి
దొరయ గళ మెదిర్పఁ దులకురాక
తిరిగి రదమ్మయి దినుసైన కోర క
మరగతి నొందించి యంతగోక
మై యుండఁ గుచమున కోయని యట్టె పైఁ
గని పైకమై నుడి నెనయ వాణి

గీ. కినియ నది రాజదేశమునన వెలుంగ
నానన మెదురన జతమై రాది తా మె
లంగి తారా స్థితి గడు జెలంగ నఖము
గెలిచె గనుక నాకనకాంగి తలమె పొగడ. 424

## యమకానుప్రాణిత రూపకఘటిక దుర్ఘట చరణసీసము

సీ. తులకించు వాలుగన్నులు వాలుగన్నులు
నలువు నాచుగురులు నాచుగురులు
చుక్కన గోరును చుక్కన గోరునుణ
గుబ్బలు గుబ్బలు యబ్బురంపు

పల్లవములు పల్లవములు మెఱుఁగుకోపు
చూపు మెఱుఁగుకోపు చూపు చాలి
మూలరాబలరూపు మూలరా బలరూపు
మేలిమిమెయి మేలిమి మెయి నెల ను

గీ. దురు నెలనుదురు మెట్టదామరల గరము
మెట్టదామరల గరము మెఱయు నెమ్మి
నడపు నెమ్మినడుపు కడుబెడఁగగు నెల
మోము నలమోము భామాలలామ కరయ. 425

## అనేకాక్షరఘటిత దుర్ఘట యమక విఖ్యాతగీతి

ఆ. కలికి మెయి మెఱుంగు కలికిమెయి మెఱుంగు
కులుకు చూపు తేటి కులుకు చూపు
వెలఁది యలరు నవ్వు వెలఁదియలరునవ్వు
తళుకు చెక్కు పసిఁడి తళుకు జెక్కు. 426

## ప్రతీపానుప్రాణితశబ్దచిత్రరూపకోపనీత ప్రతిపద దీపితోప మాలంకార సంసృష్టి చరణసీసము

సీ. కంబుకంధర నితంబంబుతో మార్కొని
పాదము ల్మఖవర్ణ భంగ మొంది
తరళాయతాక్షిముంగురులతో డగ్గరి
యళులు సమ్ముఖ వర్ణహాని జెంది
కువలయనేత్ర చన్గవతో నెదిర్చి భూ
ధరము విముఖవర్ణ సరణిబొంది
భద్రేభయాన నున్బలుకుతో ఢీకొని
శుకమును ముఖవర్ణ వికలమంది

గీ. వహి తదీయాంగ సముచిత వర్ణ ధరభ
రమున పదములు వళు లధరము మొకము న
యి సరి దొరయ తమ్మిల నల నిగురునెలను
దగుజడత తగ్గు వడక కందు గనజేసె. 427

## త్రిప్రాసాద్యంతైక నియమ యమక కందశిత కందము

క. తాననయని చంద్రోపమి
తానన యెలుఁగెత్తి యే కతానన నిడు పం
తానన విలుతుఁడు మెచ్చఁడె
తానన నానొకతె యేకతానన యౌరే. 428

## శబ్దశక్తిమూలాలంకారధ్వని

క. తరుణీరత్నము పద్మిని
పరికింపఁగ నిసుఁడ వీవు భామినికి భవ
త్కర సంగతి చేకూరక
దొరుకునొఁకో సంతసము చతుర్ముఖ జనకా. 429

తే. భాగ్యముల యిక్క యొరుల కా పడఁతి యందు
దొరకుటలు పుణ్య మెటువంటి దొరకు దొరకు
నొక్కొ యనుచును నృపశౌరి దిక్కుఁజూచి
యక్కలికి పెక్కు గతుల బెంపెక్క బొగడి. 430

చ. ఎనయఁగ డేగ నయ్యబల యిచ్చిన వాడిన గల్వదండయుఁ
గొనియట జేరివేగఁ గయికొమ్మని యిచ్చిన యనంతరంబ నే
పనివిని వత్తు మా పయిని బక్షముతోఁ గృపయుంచు మన్న నా
వనిత వచోవిశేషముల వైఖరికి బ్రమదంబు నొందుచున్. 431

తే. తొలుతఁ దావచ్చు తెఱఁగెల్లఁ దెలుపు మనుచు
మగువ నటు బంపి తనకూర్మి మంత్రిఁ జూచి
దాను కలగన్నయట్టి యాతన్విరూప
విభ్రమంబుల వర్ణించి వేడ్కనుండ. 432

క. చనియచట సరసి చెంతను
తనరాకకు నెదురుజూచు దరుణీరత్నం
బును గని ప్రమదముఁ గూర్మియు
మనమునఁ బెనఁగొనఁగఁ గనకమాలిక బలికెన్. 433

## త్రిప్రాసకందము

క. క్షీబాళి కబరి చెందిర
శాబాళిక కేళిసీకు చక్కని బాబా
యేబాలిక తలఁపుననిడు
నీబాళికిఁ దగిన యినుని నేదెల్పెదనే. 434

ఉ. ఏమని యెంతునో చెలియ యేనిపుడా జలజాక్షువిభ్రమ
శ్రీమహితాకృతిన్ వినుతిఁ జేసి నలున్ నలకూబరు న్మరు
న్వేమఱు నెన్న నందునకు వేయవపాలికి సాటిరాదనన్
భూమిపశేఖరాత్మజులఁ బోల్పగ వచ్చునె యీడు జోడుగన్. 435

## బిబ్బోకము

ఆ. అనుచు మఱియుఁ గరతలామలకంబుగాఁ
దెలుప వినిన యంతఁ దలిరుఁ బోడి
కపుడె యతని మూర్తి యద్దంబులోఁ గానఁ
బడినయట్ల మదిని బొడమునంత. 436

క. కొమ గళ శంఖము కటి చ
క్రము జంఘాగదయు రోమరాజీ ఖడ్గం
బమితభ్రూచాపము బూ
న్కి మహాచ్యుత రూపమందెఁ జెలు లరుదందన్. 437

వ. అట్టిపట్టున

క. ఖరకరుఁ డంబరమధ్య
స్థిరుఁడై గనుపట్టె రుచిర దీధితిని వియ
ద్వరదమున కంశురజ్జువు
గరమొప్పఁగఁ గట్టుబొడ్డు ఘంటయ పోలెన్. 438

## అపూర్వప్రయోగము

ఉ. ఆరవి రశ్మిచేత విపినాంతర విహారమునందు డప్పి లో
నారమి మంత్రిఁ జూచి సఖియా శ్రమ మెల్లను దీర్పనొక్క కా
సారము లేదె యన్న గడుఁ జల్లని నిర్మలతోయ మున్నదీ
చేరువనంచు నాహరిని శీఘ్రమె దోకొని వచ్చునయ్యెడన్. 439

## ప్రాసానుప్రాసగీతి

గీ. కేళికా శారికా సురసాలసాల
పాళికా శారికాసార మౌళికాబ్జ
ధూళికా మాలికాత్త మధూళికాళి
బాలికా హేళికా ధ్వను ల్బరగుచోట. 440

## అపూర్వప్రయోగము

సీ. వలెవాటు వైచిన జిలుగు జందురుకావి
మేలిపయ్యెదకొంగు దూలియాడ
జవ్వాది మెఱుఁగిచ్చి దువ్విన వేణికా
భార మించుక వలపలికి జాఱ
నిఱిగబ్బిగుబ్బ పాలిండులపొంగున
గడుసన్నమైనట్టి కౌనుగదలఁ
దొలకరి మెఱుపనఁ దులకించు నెమ్మేని
తళుకులు డిశల బిత్తరము జిమ్మఁ
గీ. దరుణి గైదండఁ బూని జిత్రంపుఁ బనుల
పసిఁడి పాదుక దనవామ పదమునందు
నోరగాఁ ద్రొక్కి కొంతయొయ్యార మెసఁగ
నిలిచి యున్నట్టి నృపకన్య చెలువుఁ గనియె. 441

వ. కనివెండియు

## రత్నావళ్యలంకారయుక్తకేశాది మధ్యపర్యంత పాదాదిమధ్య పర్యంతావయవవర్ణనము

సీ. కంద ధమ్మిల్లనఖశ్రేణితార ల
ర్థమ్ముంగాక ఫాలపాదములు కిసము
లేణాక్షిజంఘలు తూణీర యుగళంబు
తిలసుమనాస యూరులు కదళులు
విద్రుమాధరకటి విశ్వంభరాస్థితి
కంబుకంధరవలగ్నము నభంబు
నవలతికా హస్త నాభికాసారంబు
శైలవక్షోజ రోమాళి ఖడ్గ

గీ. మసఁగ నెఱులు గోళ్లడుగులును నుదురు కను
గవయు బిక్కలు దొడలు ముక్కుధరమును బి
ఱుఁదు నడు మఱుత కేలు సౌరుఁగను పొక్కి
లారుగుబ్బలు పదియాఱు నలరె ననుచు. 442

క. కనుఁగవ విందుగ మును దనుఁ
గనుగొను శ్రీ హరిని వేడుకలు మదిఁ బొదలన్
వనిత దిలకించెఁ గేళీ
వనితలమునఁ దమిని తెప్ప ౹వాలని చూడ్కిన్. 443

## యమకత్రయఘటిత చరణసీసము-అపూర్వప్రయోగము

సీ. రేలుఁ బగళ్లుఁ దారేలు బల్ మిన్కుల
రేలు గన్గవనొప్పు లీలవానిఁ
గరి మొఱాలించి మకరి వధించుటకును
కరియైన నరిబూన్చు కరమువానిఁ
గాఱంబుదంబులు కారంబుఁ గలమై
చొకారంబు నెప్పుడుఁ గాంచువాని
మేలి మించుల కన్న మేలి మించులు గన్న
మేలి మించిన జిల్గు సాలువాని

గీ. దరము దరము దరము జిగి హారువువాని
విజయ విజయ విజయమతి వెలయువాని
సాల సాల సాలఘు దయాళయమువాని
కాండ కాండ కాండరుహ మార్తాండుగాంచె. 444

## స్తంభము

చ. నెలఁతుక వేంకటేశ్వరుని నీటు గనుంగొని నిశ్చలాంగియై
వెలసె విలాస చేష్టలను వేఁగలయంగ నటింపఁజేయు న
వ్వలపుల సూత్రధారి మరవైరి తనూరుచిఁ జూచి దానఁ జం
చలత వహింపఁగాఁ గదలజాలని జంత్రపుబొమ్మ కైవడిన్. 445

## ముక్తపదగ్రస్తఘటిత మధ్యావృత్తము

చ. దులదులమించు కన్దాగలతోఁ గల తోరపుచందుమోముతో
దుల ఫణిగాఁగ మించు జడతో జడతో రుప క్రమంబుతోఁ
దొలఁకెడు వీక్షణాంచ దళితో దళితోడు నఖప్రభాళితో
తొలగకఁ గొల్చు కోపనలతో నలతొయ్యలి చాల లోలయై. 446

## సర్వగురువచనము

వ. ఆవేళం దాశ్చర్యారూఢాత్మాంభోజాతోద్యత్కందర్పాటోపస్వాయన్నా
రాచస్తోమ శ్రేష్ఠోద్భోధాదీనాం చ ద్భోధానై పుణ్య ప్రౌఢి శ్రీ నారీరత్నం
బిట్లూహించెన్. 447

## సంశయాలంకారము

సీ. రతినాథుఁడో కాఁడు రతినాథుఁడైన న
యలరువిల్లును బువ్వుటమ్ము లేవి
నలకూబరుఁడొ కాడు నలకూబరుండైన
రహిఁ గూడి బాయని రంభయేది
చంద్రుఁడొ కాఁడల్ల చంద్రుఁడైనను మేన
ననువైన నేణలాంఛన మదేది
యింద్రనందనుఁడొ గాఁ డింద్రనందనుఁడైన
ననిమిషత్వము కన్నులందు నేది
గీ. యలరు విలుఁదీసి రంభను దొలఁగఁజేసి
కందు కడనుంచి యనిమిషగతి నడంచి
యవనికై వచ్చు నీ నల్వురందు నొకఁడు
గాక నృపుడైన నీ సోయగంబు గలదె. 448

## ప్రాసభేదము

క. అని సంశయంబుతోఁ దన
మనమునఁ జర్చింపఁ గనకమాలి కనియె నే
నినుఁగని దెల్పిన నారా
యణుఁ డితఁడే జక్క జూడవమ్మా కొమ్మా. 449

## ద్వంద్వప్రాసము

క. నవరాలఁ దెగడి సీలపు
నవరాలుచు కుఱులు దనరు జవరాలి కొలం
బు విరాలి గొలుప వచ్చెను
తావరా వియ్యంపు మోము దులకింపంగన్. 450

## మధ్యమ యమకము

క. నావిని యావనితలమున
నావనితల మిన్న గన్నులల్లార్చి హరిం
భావ నితాంతా వనతా
తావనతాంతాక్షి వీక్షణావళిఁ జూచెన్. 451

## విలాసము - అపూర్వప్రయోగము

క. ఇరుదెసల వెలఁది గిరిగొని
తరళములై వెలికి బెళికి తళతళ మనుచు
న్బెరసిన జూపుల నిందిర
హరికి నివాళి యొనరించె నత్తఱి మఱియున్. 452

## అనుభావము

క. అలసములు జంచలమ్ములు
నలఘువ్రీడా భరమ్ము లతినిశితమ్ముల్
గలితానురాగములనై
జెలఁగెన్ రమ హరిని జూచు జిగిబిగి చూపుల్. 453

## రోమాంచము

తే. పెన్నిధానంబుఁ గనుఁగొన్న పేఁదకరణి
నలరి హర్షాశ్రు జలము గన్నులను గ్రుక్కి
కళుకు నెమ్మేనఁ బులకలు గదలు కొనఁగ
విరహ పరితాప భరమున వెచ్చనూర్చి. 454

## అంత్యప్రాసము - అటతాళార్థపు జేకు

క. పలుకులఁ దేనెలు జిలుక
న్న లలితముఁగ నధరమునను జక్కెరలొలుక
న్గలికి మొగము సిరి దొలుకన్
నిలువున శృంగార రసము నిగ్గులు గులుకన్. 455

వ. అటుల నెంతైన సేపు నిలిచి మదిని ముదంబు గదుర నెదుట దానంత వడి యచ్చోట నున్న సవతులేని విలాసవతులగు యువతులు నిచ్చలపు నిచ్చ నేమందురో మున్ను నేనోచిన ఫలం బీడేరె నిప్పట్టున నుందరా దని యొకమేరగా నాంచారున్న యెడ నచ్చెలువపై చెలు వలరు ప్రేమ నచ్చోటు కదలి చెంగట నిలిచి శాత్రవ లలాట తమః ప్రభార్కప్రభా విభాసురుం డై నయచ్చెలువ మలతేఁడు గమకంబగు తమకంబున నప్పుడు. 456

## రూపకచిత్ర సీసము

సీ. పడతుక పొక్కిలి సుడియౌనసే గదా
యావర్తమాన మెం తబ్బురంబు
సకియ వక్షువగుబ్బ చక్రమౌనని గదా
యల్ల వృత్తాంత మెం తక్కజంబు
గన్నె చెక్కిలి చంద్ర ఖండమౌనని గదా
యీపల్కు జందమే యద్భుతంబు
జవ్వని నెమ్మేను చపలయౌనసె గదా
యీ మించు వైఖరి యేమి చిత్ర

గీ. మౌరచెలి ముగ్ధయగుట యీ యన్ను చెన్ను
మున్ను నాతోన గానక నెన్నెగాక
దీని యవయవములకు నెంతైన దెలియు
సాటి గలుగునె వలపని మాటలేల. 457

## అభంగశ్లేష ద్వయాను ప్రాణితాభేద రూపకాలంకారము

సీ. ఈ లేమ నెఱిగొప్పు నీలాంబు వాహంబె
యనఁ జెల్లునది ఘన మౌట కతన
యీపడంతుక బెళుకుచూపు సోగ మెఱుంగు
యనఁ జెల్లు నదియు మించౌట కతన
యీ యింతి కన్బొమ దోయి సిఁగాణి వి
ల్లన జెల్లునది ధర్మమౌట కతన
యీ నాతి చక్కని మేను బంగరు తీఁగ
యనజెల్లు మేలిమి యౌట కతన

గీ. యీనెలంతుక గళము హెచ్చైన చింవ
మన మిగులఁ జెల్లునది దరమౌట కతన
భళి భువనరూఢి మేల్త్రక్కు బాపు పేఁక
యద్దిర చౌకాటపుంబసి మవుర రేక. 458

## శ్లేషానుప్రాణితా సంబంధాతిశయో క్త్యలంకార కందము

క. లికుచ కుచ మొకమ్ము నకున్
జికురములకు సరియదంచు జెప్పంగలరా
యొకనెల యొక యబ్దము కొం
కక జతగా సోముఁడేని ఘనుఁడే యెదుటన్. 459

## యమకత్రయ గోపనోపమాన యమక యుక్తవృత్తము

చ. అళికచకుల్కుపల్కులు పికాంగనలన్ గనల న్గలంచు వ
ర్తులకుచకోపు చూపు విరితూపగలన్ బగల న్బగల్చు మేల్
చెలువపుటన్ను చన్నుగవ చెంగమఁలన్ గమల న్మలంచు ము
ద్దులకొమరంగు ముంగురులు తుమ్మెదల న్మెదల న్దలంచునే. 460

## శ్లేషానుప్రాణితోపమాలంకార విశేషఘటన చరణసీసము

సీ. రాకేందుముఖి తనూరాగస్థితి నెదిర్చి
పొగరు క్రొమ్మించులు పుట్టజనఁగఁ
దరలాక్షి నెమ్మేని తావులానఁగఁ జేరి
పువ్వులు విరియుచు పొదల కరుగ
నెలఁతమే న్నెక్కువన్ నెగడి గొల్వఁగ నెంచి
తీవియ త్రరవుల తివిరిసురుగ
నన్నులమిన్నమై మిన్నలాగఁ గడంగి
గట్టిబంగారంబుకాక కరుగ

గీ. రూఢిగా మెఱుఁగునకు మెఱుఁ గలరునకు
నలరు మంజులతకును మంజులత మేలి
మికిని మేలిమియై సరి మెఱయు దలిరు
నంధలి రువార మూను సీయతివ మేను. 461

## ఆద్యంతైకనియమ ముక్తపదగ్రస్త నిస్తులకందము

క. ఈలేమ మోవిచెలకుం
బాలే బాలేందు తీరు ఫాలపు మేలే
మేలే జిగి గుదిరికి జగ
డాలే డాలేపురుషుని డాలే గన్నుల్. 462

## ఆద్యంతైక నియమముక్త పదగ్రస్త చక్రవాళసీసము

సీ. తరము గుబ్బలు ధరాధరము గేరఁగఁ గోరు
గోరముత్యము గెల్వ బారు దీఱు
దీరుగాఁ జీమచాల్ వారించు నూగారు
గాఱుమబ్బును గెబ్బుఁ గబరిసౌరు
సౌరుచ్యమున మోవిచవి తేనె వగ నూరు
నూరు లంటుల మీఱి దారి తారుఁ
దారుణ్య మబ్జజాకారము పై దూరు
దూరునెమ్మోము చందుపలుమాఱు

గీ. మారుతేజీల నగఁ బల్కుఁ బోరువారు
వారిరుహముల ఇదములు మేరజీరు
జీరుపల్లిగి మగజా మితారి పేరు
పేరుగల కన్నె నెన్న నెవ్వారి తరము. 463

తే. మంచి గంధంబుఁ గనుట సంపంగి యగును
మేలియంశుక మానుట మేలిమియగు
రెంటగలుగు సమాఖ్యమైనంటి యుండె
గనుక కనకాంగి యనుట యీకలికి కలరు. 464

## సార్వత్రిక నియమక తత్పూర్వోపరియమక రూపనియమక ద్వయ ఘటకవృత్తము

ఉ. మించును జూపు చూపు విరి మించుఁగ నవ్వును నవ్వు యాన మ
మ్మించును నెమ్మి నెమ్మి జడ మించును దాచును దాచు గోరు రె
మ్మించును దారదార గతి మించును నంచల నంచ గుబ్బ న
మ్మించును చెండు చెండును భ్రమించు నను న్గొమ రూపు బాపురే. 465

## శబ్దభ్రమకానుప్రాణిత నియమ యమక గీతి గర్భిత చరణ దుర్ఘటసీసము

సీ. వనిత మెయిఁరకమ్ము కనకమ్ము నణఁగించుఁ
దిరుగ నదియు నాస దెగడు నాస
చంద్రముఖిగళమ్ము జలజమ్ము నణిఁగించు
మఱల నదియు గేలు మాటి కేలు
గన్నెరూపప్రభ కాళికాభ నదల్చు
మగుడ నదియుఁ గొప్పు నగుట కొప్పు
పడతి నఖముఃఖమ్ము భవిభపార విదల్చు
మఱల నదియుఁ జూపు మెఱయజూపు

గీ. రూఢి గాదనులోమ విలోమసరణి
నైన నేకసరణి నైన నఖదులైన
జంట చవుకపుపేరుల సరవితోన
గాన నీనాతి బ్రతినెన్నగాన జగతి. 466

తే. కలికి వదనాంఘ్రి రోమాళి కాంతి కలికి
తొగల చెలిగఁదుచుఁ బదాబ్జ తునక లయ్యెఁ
ద్రమ్మి విరియుచు నూబ్జ ఖండమ్ము లయ్యె
జిలువ దల వంచుకొనుచు వేజిదుప లయ్యె. 467

క. బాలాదృగీక్షణాలక
జాలాభకు నోడి దొనల శరములు దుమికెన్
మీలలుగుల మొనల బడెన్
నీలాభ్రము విషము గ్రోలె నిజముగ ననుచున్. 468

గీ. తరుణి చన్దోయి సౌరు మందరముఁ దఱము
దరము నవకమ్ము గ్రమ్ము బిత్తరము తరము
తరము కంఠమ్ము శుభవిభాకరము కరము
కరముగొను తమ్మిచే ప్రియకరము కరము. 469

క. ఆనిమ్మపండ్ల నలచుట
యానికయే బొమ్మరముల నలతాళములన్
దీని కఠిన స్తనద్వయి
కానిమ్మని నలము త్రాటగట్టుం గొట్టున్. 470

## సార్వత్రిక నియమ యమకాంత్యప్రాసభాసమానవృత్తము

ఉ. నూరును మారుకై దువ తనూరుచి దాపలుమాఱు రంభ చె
న్నూరలు మారుమోవిచవి నూరును తేనెకు మాఱు శీతభా
నూరుత గోరు మోముడుల నూరుచు తీరగు గోరుమేన దీ
నూరువుజేరచో మిగుల నూరుట నెమ్మదిఁ జేరు నద్దిరా. 471

## ఆద్యంత యమక రూప ముక్తపదగ్రస్తగీతి

తే. కాంత నగ వెంచ దిల జాల గప్పురాల
కప్పురాల సరము గేరు గలికి యూరు
మేటి చెలిమేనునగు నల మించులతల
మించులతలను దగనేలు మెలఁతకేలు. 472

## విరోధాభాసాలంకారము

సీ. అలఁగౌను కలిమి మిన్నంది మిన్నందియు
నాలోన ముష్టికి బాలుపడియె
ఘనకుచశ్రీలు దుర్గమదుర్గముల నేలి
నసుదినం బుపవాసమునకు జిక్కె
భువి కటి రమ భూరి భూరివేది గని య
నిశ మమిత క్షామదశను జెందె
గళలక్ష్మి శంఖ శంఖమ్మును మించియుఁ
దగు గొంటు పోకల దారి గాంచెఁ
గీ. గటకటా ధాత కొకయింత గరుణ లేదె
గాక యోగాము లెఱుఁగఁడెఁ గడఁగి దలఁప
నవతఁ గని సిరు ల్బూనగా నవునుగాని
సంపద వహించి లేమి భరించు టెట్లు. 473

మ. కళకు ల్జిమ్మెడుమేఁకు బంగరు సలాక స్మీలు నయ్యారె యొ
ప్పుల కుప్పా చలితోరు తత్తరపు జూపుల్ కారుక్రొమ్మించు ని
గ్గులు మాధుర్య ఘనోక్తి గప్పురపు బల్కుల్ రాలు గెమ్మోవి తే
టలు ఝల్లుల్లనకంద చక్కెరలు వేట్కన్ జిల్కు నిక్కల్కికిన్. 474

## ఉభయచిత్రోత్ప్రేక్షాలంకారము

క. సిరిమొగమునను నలువ య
క్షరావధాన జననముగ గ్లొస్థితి దలఁచన్
గురులౌత్వము లత్వంబు నొ
నరించె నన నుదురు గురు లెనయు బొమ లమరెన్.

గీ. నిక్కు నెఱిగొప్పుకందము ముక్కు చంప
కంబు నేత్రద్వయం బుత్పలంబు వదన
మంబుజంబు నితంబ బింబంబు పృథ్వి
తరమె యీలేమవృత్త తత్వము నుతింప. 476

## శబ్దచిత్రము

తే. సతికి వనజదర్పణ నలాహిత పదత్ర
యాదివర్ణముల్ గ్రహించి యబ్జసూతి
కళకు నెమ్మోము నిర్మించు కతన నూవె
నదిమొదల్ వదనాహ్వయ మద్దమయ్యె. 477

## ఉపమేయోపమానవాచక నకారాది పదగుణితాసాధ్య మత్తేభ విక్రీడితవృత్తము

మ. ననలన్ నాగము నుప్పు నీల్లనుడుగున్ వామాక్షి నూత్నాసి నె
మ్మన పున్నెన్నమునోమునౌ కళల నంటౌతమ్మి నర్మన్న గం
గన సహ్మసయు నిగ్గు నీటు మడి నూగా ర్నెన్నడ న్గలు తి
న్నన నైజాంగము నోము నా కనదురు న్నవ్యాంఘ్రి నర్మో క్తియున్. 478

## ఉపమానోపమ శబ్దైక్యాపహ్నవ రూపకాలంకారము

సీ. పరికింప జాతరూపము జాతరూపము
మొగినెల మేలిమోము నెలమేలి
మోము నాఁభ్రమరకములు భ్రమరకములు
కననంబకము లంబకములు తళుకుఁ

జెక్కుటళుకుఁ జెక్కు నక్కురములు చిగు
రులు కీరములు చిగురులు పృథుల కు
చమ్ములు పృథులకుచమ్ములు భద్రక
రోరులు భద్రకరోరులౌగి ని

గీ తంబము నితంబము నలపదములు నలప
దములు గణియింప నఖవిభదానఖవిభ
కొప్పు ఘనమును కొఱఁత లేకొప్పు ఘనము
పొలకదలిని బోడమిన బాలకొర. 479

## ఫలోత్ప్రేక్షాలంకారము

సీ. బలునీచుకంపుమేనుల దాల్చు నడి తెఱ
గంటి వంగసమునఁ గలుగు కొదవ
వడిజాలములఁ దగుల్పడి పోవు నారడి
వలవంతలను గుంది నిలుచు నింద
బవరాల మరుఁ డోరపడఁగసేయు కొఱంత
యలుఁగుల పాలుగానైన దూఱు
జీవనమున కొర్లఁ జెఱచిన యాడిక
పొరలెత్తి పోడాఁగి పోవుఱట్టు

గీ. నరుల కెంతగాలములకు నగప డసదు
మదినిఁ దలపోసి యవియెల్ల మాన్పనెంచి
పండు వెన్నెల జిగిఁ జెందు గండు మీలు
బాల తెలివాలుఁగన్నులై బరిధవిల్లె. 480

## ప్రతీపాలంకారము - అపూర్వ ప్రయోగము

సీ. రామవేనలిమాద్రి చామరస్తోమంబు
డాయునంతనె తోఁక గోయరాదె
పడఁతి యూరులు తోడఁబ్రతి నెన్ను ననఁటులఁ
గొంచకఁ జర్మ మెత్తించరాదె
వనిత చూపులకుఁ దిర్వశిక నిగ్గులు సరి
గాంచవచ్చిన నివాళించరాదె
యువిత బొమ్మలసాటి నొందు చెఱకు విండ్ల
మించి పిచ్చలుగ ఖండించరాదె

గీ. వెలఁది గుబ్బలతో డను దల యటంచు
డికొనినఁ బుట్టి చెండ్లఁ గొట్టించరాదె
యన నగణ్యైక లావణ్య యౌవనాభి
రామయై యొప్పె నాకాశరాజ పుత్రి 481

## కైశికీవృత్తి వృత్తము

చ. తళుకుఁ బదమ్ము లందపురదమ్ములు కౌను బెడంగు గబ్బిగు
బ్బల యుదుటారజంపునును బల్కులు లత్తుకమోవి చిన్నిక్రొ
న్నెల నుదు రద్దము ల్దెగడు నిద్దపుఁ జెక్కులు మోము తేట ముం
గల తలఁజుట్టి వచ్చు కనుగల్వలు చెల్వకు నొప్పు మెప్పగన్. 482

తే. నలువ తమ్ముఁడు ముక్కంటి గెలువనెంచి
కలితలమిన్న నెమ్మేనిఁ దలిరు వింట
జేరిచిన సోగ కురువేరు నారిగాఁగ
మడిమ లానిన తెగ కీలుజడ జెలంగె. 483

## ద్రాక్షాపాకము

మ. అవురా వాతెఱ తేటఖూబు పిఱుఁ దొయ్యారంపు మజ్జారె చ
న్గవ తళ్కుల్ బళిదంతకాంతు లరెరే కన్బొమ్మ లప్పప్ప క్రొ
వ్వవిలాసం బహహా తనూరుచి బలా బొమ్మంద మయ్యారె యూ
రు వికాసంబు శవాసు చెల్వమని బేర్కొ గల్గె నిక్కామినిన్. 484

## యమకగీతి

తే. తమ్ములందును గాజు ట్టద్దమ్ములందు
మెఱుఁగు గానమి యీజగ మెఱుఁగుఁగాన
నిందు నందననేల లేదిందునందుఁ
గందదమ్మల్లి మొగము చక్కందనమ్ము. 484

## కైశికీవృత్తి

ఉ. మాటల తేనెగాఱు కటి మందము చక్కనిమేను మించులో
తేటమొగంబు చందురుని తీరగు చక్కెరలప్పమోవికన్
సూటి తలంతజుట్టును మినుక్కను మాత్రమెగౌను పిక్కలన్
దాటును సోయగంబు జడ దర్పకు చూపులు జూపు లింతికిన్. 486

## ఏకార్థప్రతిపాదక పదవిముక్త ప్రాథమిక వర్ణార్థాంతర నిరూపకపదఘటితసీసము

సీ. దరకుందరదకుఁ గంఁదరము పెన్బొక్కిలి
దరము కంఠంబు కుంజరగమనకు
విధుబింబముఖికి శ్రీబింబంబు శ్రుతిరీతి
బింబంబు పెదవి రోలంబకచకుఁ
గమఠప్రపదకు గుంభములు వక్షోజముల్
భములు నఖమ్ములు పద్మపదకు
నీలకుంతలకు శైవాలమ్ము నూగారు
వాలమ్ము చూపు శంపాలతాంగి
గీ. కన్నుమిన్నకు కేసరి యసదుగౌను
సరియలరుఁగేలు నెలఁతకు సిరివెలఁదికిఁ
గోయిలల నుడి యిల కటి కొమిరెవయసు
సొగసువగలాడి కలరె నీ జగములోన. 487

## అనుమానాలంకారము

సీ. కళుకుటద్దము మోము గావచెఁ గాకున్న
జోడుపట్టుపిడి యాచుబుక మగునె
ఘనశంఖము గళంబుగావలెఁ గాకున్న
జిన్ని పూసరములా చేతలగునె
గొార్జుకేల్జూగారు గావలెఁ గాకున్నఁ
గుంభంబు లాచనుగబ్బ లగునె
కడుచివురులు వ్రేళ్లుగావలెఁ గాకున్న
నవకోరకమ్ము లానఖము లగునె
గీ. తళుకు సింగిణిబొమలు గాపెలెను గాని
చోఁ లకోరులు క్రొవ్వాఁడి చూపులగునె
యని వినుతిసేయఁ దనరె మోహన విలాస
ఖావధూర్వహయై యిందిరావధూటి. 488

## విషమాలంకారము

సీ. చక్కని నునుముక్కు సంపంగి మొగ్గపైఁ
బొదలెడి చూపుఁ దుమ్మెదులనిలిపి
తిన్ననితావి వాతెఱ దొండ పంటిపైఁ
గులికెడు బలుకు రాచిలుక నిలిపి

నిండుమెఱుంగుఁ బూనినమోముఁ దమ్మిపైఁ
బొందుగా నుదురు లేజందు నిలిపి
వెలిబర్వు చిఱునవ్వు వెన్నెల నిగ్గుపై
నురుతరాక్షి చకోరయుగము నిలిపి

గీ. నిజబలాన్యోన్యవైరంబు నిగ్రహించి
కాయజుఁడు నేర్పు చేఁ గూర్చెనో యనంగ
నిద్దపుఁ బసిండి నెత్తమ్మి మిద్దెనడుమ
మొలచిన నెలంత తలమిన్న నిలువు దనరె. 489

## ద్విరుక్తికందము

క. నకనకని నడుము నక్కలు
చకచకల వెలార్చుతొడలు జక్కనితొగలన్
వికవికనగు తెలిగన్నులు
వికచకమలవదన కొనరె వేడుక మీఱన్. 490

క. తిలకంబు ములికి నాసాం
చలకాంచన శరగృహీత శార్ఙ్గంబును బొ
మ్మలకోపులఁ బ్రేత్రెలి జ
ల్లు లనఁగఁ జెక్కులనగవు తళు కమరె రమకున్. 491

## విభావనాలంకారము — అపూర్వప్రయోగము

సీ. ఒదవుఁబోనొక చక్కిఁ గదళికాస్తంభంబు
లాపయి నిసుముదిబ్బరిదిగాదె
మొలుచుఁ బో నొకమేరఁ దళుకు దొంతరకర
ళ్లాపయి గుబ్బలు లరిదిగాదె
గలుగుఁబో నొకచెంతఁ గనకారవిందంబు
లాపయిని బిసమ్ము లరిదిగాదె
బుట్టుఁ బో నొక చోటఁ బున్నమచందురుఁ
డాపయి నిరు లుంట యరిదిగాదె

గీ. ధాత్రిఁ జిత్రతపుష్పకోదండ నేత్ర
నూతన విధాత సృజియించెనో యనంగఁ
గలికి యూరులు గటిపళల్ గబ్బిచనులు
కరములు భుజమ్ము లాస్యంబుఁ గబరియొప్పె. 492

## కైశికీవృత్తి

చ. పెలుచగుపీలు శ్రీలు గడు బేడస లాడ సలాముసేయు క
న్నులు దెగబారకెచ్చు జడ నున్దలిరాకు వెలార్చు మోవి చెం
డులవడిఁ జెండు గుబ్బల పటుత్వము నూరుల తీరుగాఁక వె
గ్గలపుబసిండిమైజిగి చొకారము నియ్యెలనాఁగ కేదగున్. 493

## యతిభేదము

క. మారనరేంద్రుఁడు నెఱినూ
గారను బెనుబాము వెడలఁగాఁ దిగి నెదుటన్
జేరుపనగు నఱపెట్టియ
సౌరునఁ బొక్కిలి దనర్చెఁ జంద్రాననకున్. 494

ఉ. ఆనునఁగొప్పుఁ దేఁకదన మాతెలిగన్నుల బెళుకు సోయగం
బానగుమోము చొక్కటము నాబిగిగుబ్బల యుబ్బు నిబ్బరం
బానులిగౌను తిన్నదన మాకటి మిక్కుట మావినూత్న పా
దానుగతాబ్జరేఖలు నయారె యొయారికి దీనికే దగున్. 495

## కైశికీవృత్తి

ఉ. సోఁకినఁ గగ్గుమేను నగు జొప్పున త్రెవ్వెడు గౌనుచంద న
జ్జాకులఁ బెట్టు నెమ్మొగమ యారె యొయారపు బెళుకు జూపు పెన్
జీఁకటి గప్పు కొప్పు తొలుచిందము చందము కంటమందమున్
వీఁకగ మచ్చరించి సరి నిక్కుచనుంగవ బొల్చె నింతికిన్. 486

## సమాసాలంకారము

సీ. పలుచని యడుగులు పద్మవైఖరిఁ జెందె
నానన మబ్జవిఖ్యాతి నలరె
బెళుకు చూపులు మహోత్పల రీతిఁ జెన్నారెఁ
బొక్కిలి సారసస్ఫూర్తిఁ దనరె

బాహువులు బిసప్రభవకాంతిఁ జెలువొందెఁ
గన్నులు రాజీవ గణన నొనరె
లేఁ గౌను బుష్కర లీలచే రాణించెఁ
గంఠంబు జలజసంగతిఁ దనర్చెఁ

గీ. గరము జిగిరూపు కమలాశి గరిమ గాంచె
నలరుమేల్మంగ గనుక తత్ఫలము బొందె
గాన బొగడఁగ నెవ్వారికైన వశమె
కంటికింపుగఁ గంటి వాల్గంటి నిపుడు. 497

## త్రిప్రాసయమకకందము

క. కుందమ్ములు పలుకుదురున
కుం దమ్ములు తెలిగఁల తళుకుం దమ్ములు మో
మందమ్ములు నడుపులు బలు
మందమ్ములు ములుకు లౌర మానిని చూపుల్. 498

## ఉభయచిత్రసీసము

సీ. పడఁతి దేహము కుసుంభము నడంచుటయ కా
దువిద వక్షోజంబు లోటుపఱచు
రమణి పల్జిగి కోరకముల రాల్చుటయ కా
దింతి సిబ్బెపుగుబ్బ లెగరఁదోలు
వెలఁది నవ్వు గుళుచ్ఛము లదల్చుటయకాదు
మదిరాక్షి పాలిండ్లు చిదిమివైచుఁ
జెలియారు శైవాలములఁ గొట్టుటయకాదు
ముదిత చన్నులు జాల మోఁదఁజేయు

గీ. నవుర మధ్యము వర్ణంబు దివియ నుత్త
రార్థకథితోక్తి కుపమలై యవియె మదిని
గోరి యెన్నెడుచోటుల కుంభ కోక
గుచ్ఛ శైలంబు లగుచు నిజేచ్ఛఁ దనరు. 499

## ఆదియమకము - అపూర్వప్రయోగము

క. నలినమ్ముల నలినమ్ములఁ
జెలికేల్ నూగారు నడుపు చెలువము నగు వె
న్నెల మించుల నెలమించుల
నెలఁత నగవు మొగము మేని నిగనిగ దెగడున్. 500

## శ్లేష పరికరాంకుర హేత్వర్థాంతరన్యాసాలంకార సంసృష్టి సీసము

సీ. ప్రతినచేఁ గృష్ణ సర్పమును బట్టి శిఖండి
మలసి తమ్ములదాటి మధుపసమితి
పడరి గొబ్బున విష్ణుపదమంటి విషదుండు
నీటమునిఁగి బైట నిలిచినాఁడు
మునుమున తారకల్ ముట్టి తమస్థితి
కడఁక సోమునిగొట్టి ఖలతముండు
నాజ్యార్ద్రితాస్ఫూర్తి నలరి చిలువ చాలు
బలిపీఠ మొనసి తప్పక భుజంగి

గీ. సంపద లొసంగి వెండి దండింపసాఁగె
సర్వమును మిథ్యగా నెంచి చక్కనివని
త బలుజడతా నబద్ధ మూర్ధన్యబుద్ధ
మగుటను మలీమసుల కెందుఁ దగవు గాదె. 501

## శ్లేషానుప్రాణి తానుమానయుక్త పరికరాలంకారము

సీ. హరిమధ్య పాలిండు లాగట్లు గాఁబోలు
గాకున్న శృంగార గరిమ దగునె
పొన్నారి కన్బొమ పూవిల్లు గాఁబోలు
గాకున్న మాధుర్యగతి గలుగునె
కొమ్మనుడి వనప్రియమ్ము గాఁబోలును
గాకున్నఁ బల్లవగ్రాహి యగునె
కమలాకరమ్ము లబ్జములు గాఁబోలును
గాకున్నఁ గంటకకాంతిఁ గనునె

గీ. పటుకళానిధి గాఁబోలు పాపమోము
గానిచోఁ గౌముదీహరికాంక్షఁ బడునె
యలరు మించులు గాఁబోలును లతకూన
చూపు లటుగానిచోఁ గశి రూపు లగునె. 502

## ఉభయ స్ఫురణము

సీ. కలికి కంఠము సౌరు కలికి చూపుల బాఋ
కంబుజాలము జాలకంబు గేరుఁ
జెలువ కౌనుహారంగు దెలిగన్నుల తెఱంగు
మృగరాజమును రాజమృగము నణఁచు
వెలఁది మొకము సొంపు వెలఁదివా తెఱకెంపు
రాజబింబము బింబరాజ మెనయుఁ
బొలఁతి నెన్నడలాగు తళుకు కీల్జడబాగు
మునునాగమును నాగమును జయించు

గీ. నాతి ముంగుఱుల కళుకు నగవు కులుకు
సారఘనమును ఘనసార సరణిమించు
ననుచుఁ దనమనమునఁ గను విన కలిదొర
కొండరాయుండు గొనియాడుచుండు నపుడు. 503

క. మును వనితలమున నిలిచిన
వనితను పొనపొనను జేరి వలపు సొలపునౕ
గని వినయము నయప్రియమును
మనసునఁ బెనఁగొనఁగఁ గనకమాలిక బలికెౕ. 504

## మధ్యమ యమక ద్వయఘటిత చరణసీసము

సీ. ఔనెలో నానాట నానాట నీవంటి
వనిత లివ్వనిత లివ్వనిని మెలఁగ
నీ పీశుప్రేమాన నేమాన నేజూచు
కలనమ్మ కలనమ్మ తెలివిగాదె
వులపు నీకును చలచ్చల దళాంచల దళా
రహిమాని రహిమాని ప్రబలమగునె
మరుఁ డేయు నిన్ను దామరలఁ దామరల పూ
వింట పూవింటను విడియఁదునె

గీ. సరవిగా రామగారామంబర వెలసిన
పనులు నీవేళ నీవేల మనమునందు
దలఁచ వింతైన వింతైన దానఁ గాను
గనుక నాయాన నాయాన వినఁగదమ్మ. 505

## త్రివర్ణ యమక వృత్తము

మ. రమణీ హీరమణీప్రభా పటలిఁ గేరంజాలు నీ దంతముల్
భ్రమదాదీ ప్రమదావళి ప్రతిభఁ బెంపంబూను నీ యానముల్
గమలా సత్కమలారుణ స్ఫురణవీఁకం గెల్చు నీహస్తముల్
సుమతీ శ్రీసుమ తీక్ష్ణగంధము వహించు స్నితనూ వాసనల్. 506

## అనుప్రాసవర్ణవృత్తి నియమవృత్తము

ఉ. కౌనహారంగు చెక్కుల చొకాటపురంగు నొయారమైన నె
మ్మేని మెఱుంగు పల్కు వడిమించు మఱుంగు మిటారి గుబ్బలుం
దానికరంగు కస్తురి పయంట చెఱంగు జెలంగ నీవు డెం
దాన వరుం గురించు టది దైవ మెఱుంగుఁ గురంగలోచనా. 507

చ. తగునె నృపాలకన్యలకు దవ్వుల నవ్వుల పువ్వులాట లీ
వగలఁ జరింప నిందుఁదగవా మగువా మగవార లుండగా
మగుడి పురంబుఁజేరఁ జనుమా వినుమా యనుమానమేల నీ
సొగసు విలాస మందమును సొంపును నింపును బెంపుమీఱఁగన్. 508

## త్రిదళయుక్త చతుర్థి ప్రాసార్ధ కందము

క. తారకముల గోరకముల
వారకముల కెల్లనెల్ల వారకము లిడుఁ
శ్రీరమణీ హీరమణీ
భారమణీ యత్వదీయ పదనఖరంబుల్. 509

## అపూర్వప్రయోగము

క. తమ్ముల ఘనవిద్రుమ జా
విడికెంపు జిగి వితమ్ముల చివు ర
త్తమ్ముల వరలాక్షా జా
తమ్ముల నిరసించు నీ పదమ్ముల కాంతుల్. 510

క. అని యీ గతిని యొక నెపం
బున నా భామినికి మదిని బుట్టిన ప్రేమం
బును భయమును నడఁగు నటం
చును బలికెడు నట్టి సఖినిఁ జూచుచు నచటన్. 511

## వృత్త కందగీత శ్లోక గోపనవచనము

వ. కొంత తడవుండి యంతట కలరవశుకీ శిఖావళ కలహంస రథాంగ భృంగ కహ్వ బలాకా కలకంఠి శారికాముఖ కలకల కలరవ నితాంత కమనీయంబై మధూక మాలూర మహీరణాసహా మండూకపర్ణి మధుశిగ్రు మాలతీ మధూళికా మన్మథ మాతులుంగ మాకంద సమ్మార్జున మాధవీ లతా కీరసహకార సహకార నారికేళ పూగ ఘనసార ఘనసారభూజమధ్య కుముదవనజాత వనజాత కుందబృందగళిత సుమధూళి సుమధూళి కలితమైన తత్సరోవర ప్రాంతంబునకుం జేరి, తారకాసుర హర గురు కింబె నసాధారణాధారణా ధారధీర పారీణ విహరణుండై నయార్ణవ ద్రుమాంతాపశక్తి హరణుండు, ప్రసృతి నయనన్గనుంగొని మోహంబున నిట్టట్టుఁ బోలేక, గుట్టువీడక నదరక, ధైర్యంబువదలకఁ దన మంత్రినిం జూచి మదినొక తంత్రంబుఁ బన్ని, నిజసైన్యంబు దోడుకరమ్మని కర మ్మనిచియుండె; నంత నారామ యారామాభిరామ సహకార కోరక ములం గోరక నమరాళినుత మరాళీ వరాః రాజరాజీవ రాజన్మానసమాన సమాన సరోవరతీరంబున నొక్క బువ్వుటీకంబున నుండి యా హరిపై మోహంబున మన్మథతాప పరిపాకభరంబున వాడుదేర గూర్చున్న సమయంబున— 512

## త్రిదళయుక్త కందము

క. అందపు జడ గందపు మెడ
మందపునడ గలిమి కలిమి మగువను నేయన్
సందువగని కందువగని
చెందు వఁగని కని మరుండు జెలఁగుచుఁ గడకన్. 513

ఉ. సొద్దెపుఁదేటి తెక్కకొన సోఁకులచే రవళించు తమ్మిపూ
ముద్దెడ మావిస ద్దఁడర మోదుగునేజయుఁ గల్వకేడెమున్
గద్దువలాను పూబొమిడికంబు దవిర్చిలుకొత్తుఁ దాల్చి తా
గద్దటి చిల్కనెక్కి పిక కాకలికాహళి మ్రోయ డాయుచున్. 514

## అపూర్వప్రయోగము

ఉ. పేర్చి కరంబు మచ్చరము బెంచటు పచ్చని వింటఁదేఁటి నా
రేర్చి రయమ్ము నన్ మెఱయ నెక్కిడియందుఁ బ్రసూన బాణముల్
గూర్చి గరిష్ఠ గరిన్ గడవ గుప్పలుగా గుఱినాతిఁజేసి పె
ల్లార్చి మెఱుంగ నాగమది గాడఁగ నేయుచునుండె నయ్యెడన్. 515

## ఆద్యంత రమణీయ దుర్ఘటానుప్రాసఘాసిత కందము

క. కలకోమల కోకిలకో
టుల కొత్తలకో చిలుకనుడుల కోపులకో
పులకో దులకో తలకో
తలకొందల కొమ్మవిరిఁ బొదల కొమ్మలకో. 516

## ఏకనియమత్ర్యక్షర యమక సంధానిత కందము

క. ఇలకోయిలకో బలుకొల
కుల కోరులకో యిగురులకోరుల వె
న్నెలకో నెలకో యళికో
పులకో పులకోత్కరంబు బొడమెన్ గొమకున్. 517

సీ. అరియయ్యె సారసాస్యకుఁ జక్రవాకంబు
పరభృతమయ్యెఁ గోపనకుఁ బికము
పుండరీకంబయ్యెఁ బొలతికి వెలిదమ్మి
గ్రహమయ్యె మహిళకుఁ దుహినకరుఁడు
పున్నాగమయ్యెఁ గర్పూరగంధికిఁ బొన్న
పగలయ్యె మగువకుఁ బ్రతిదినంబు
బర్హియయ్యెఁ బ్రవాళపదకు మయూరంబు
విషధరమయ్యెఁ దన్వికి ఘనంబు

గీ. కుముదమయ్యెను దెలిగల్వ కుందరదకు
మానసాసియయె మరాళి మంజువాణి
కంగదం బయ్యెఁ గేయూరమణి చికురకుఁ
కాని చెఱకయ్యె నించు విల్మానవతికి. 518

## విప్రలంబదాహరణ సీసము

సీ. కమలాకరాంతర భ్రమణోరు మదశిలీ
ముఖములు పటుశిలీముఖములయ్యె
మలయాచలేంద్ర కోమల శీతవిహరణ
సురుచిరాశుగము లాశుగములయ్యెఁ
గాశ్మీరసాంకవ కస్తూరికాయుక్త
చందనశరములు శరములయ్యెఁ
జారు రంభాఘనసార కాండంబులు
నవఘనసార కాండంబులయ్యె

గీ. ఫలరసములాను చిలుకలు చిలుకలయ్యె
నమిత వాలమ్ము లొలుపు వాలమ్ములయ్యె
విరహమున నేఁగు నింతికి విశ్వమంత
నతనుమార్గపంజరం బనఁగఁ బరఁగె. 519

## ఉద్దీపన విభావైకనియమ దుర్ఘటన చరణసీసము

సీ. కలహంస రత్నంబు కాదంబమయ్యెను
బొగరుమించిన శుకంబు చిలుకయయ్యె
హిమవారి యధిక శైత్యమ గుణంబయ్యెను
బగటువా కోయిల పత్రియయ్యె
విడిమించు గొరవంక విశిఖాగ్రమయ్యెను
రేకనెత్తమ్మి నాళీకమయ్యె
బలితంపు నల్లమొగులు ఖగం బయ్యెను
దళుకు నెత్తమ్మి పతంగమయ్యెఁ

గీ. దీరుగల పావురంబు లకోరియయ్యె
మ్రోల గనుపట్టు నలగోల గోలయయ్యె
విరహ పరితాపభరమున వేఁగు కొమకు
భువనమంతయు మరునంపపొదిఁగఁ దోచె. 520

గీ. తోఁచి చూపులఁ జెలులను జూచి చూచి
కమ్మ కన్నీరుఁ గొనగోరఁ జిమ్మి చిమ్మి
తలఁచి వెన్నునిఁ దనమదిఁ దలఁచి తలఁచి
నొగులు మిగులను వగలను బొగలి పొగలి. 521

## అపూర్వప్రయోగము

క. పుల్లార విందలోచనఁ
బల్లవపాణులు మనోజ్ఞభాష లలరనా
యల్లక పరితాపంబునఁ
దల్లడఁ బడఁగాంచి మఱియుఁ దలఁచుచు మదిలోన్. 522

శా. రామన్ గూడుక మేమువేడుకలు మీఱ న్మన్వనాంతాళికై
పోమో పువ్వులఁ గోయమో సరసి నంబు క్రీడఁ గావింపమో
రామోక్రమ్మరి వెన్నుఁ డిచ్చటికినై రానేల నేఁడీక్రియన్
ప్రేమంజూడఁగనేల బాలననుచున్ బ్రీతిన్ సఖీరత్నముల్. 523

క. నీవింత దాఁకనెన్నఁడు
నీవింత నెఱుఁగకుండి నేఁడిపు డకటా
నీవింత వగలఁ బొగలఁగ
నీవింతలు నృపతివిన్న నేమను మనలన్. 524

## యమకము

క. పాయము బాలికలకు వన
పాయముగాదమ్మ వలపుఁ బసచే నీకున్
నాయమ్మ యిట్టి బుద్ధులు
నాయమ్మా విన్నవారు నగరే జగతిన్. 525

## మధ్యమచరణ యమకసీసము

సీ. ఈవని నిటులుండనేటికి నేటికిఁ
గ్రమ్మరుమనుచనఁ గానవైతి
వల్ల నాజలకేళి నాడనేనాడనే
యెరుఁగించుకీలేమి యెరుగవైతి

రమ్మ నామాట గైకొమ్మనే కొమ్మ నేఁ
జెప్పిన యటులను జేయవైతి
చూడవద్దనుచు నీతోడనే తోడనేఁ
బలికినయదియును దెలియవైతి

గీ. వకట నింక నిన్ను నేర మేమైన నెంచి
బలుకు టదియెల్ల గతజలబంధనంబు
గాన నెటులైన మా నేర్పుకలిమి బలిమి
తాపమెడలింతు మిపుడింత దలఁకకమ్మ. 526

సీ. మాలతీలతికాంగి మధుపరాగంబన్న
ననుపయోగంబని యాడఁదగునె
వరపల్లవాధర వాపికావళి యన్న
నదియ వాహితమని యాడఁ దగునె
కృష్ణాహి నిభవేణి కేతకి యని నంత
నదియ యుక్తమని పోనాడఁ దగునె
కమలాస్య చంద్రఖండ మనిన యంతన
నది యేకమనుచుఁ బోనాడఁ దగునె

గీ. యన్నదఁ ణమిన్న నీకింత వెన్నునెదల
వేఱు సేయుచు మామాట మీఱితేని
దెలియ మధుపిక కేకి చంద్రులకు నీకు
వైర మొదవును నీపేరుఁ బేరుకొనిన. 527

ఉ. బోటి విచారమేల మముబోటి సఖీమణు లుండ నీకు నో
పాటలగంధి యాటలును బాటలు మాని వియోగజాతమౌ
హాటకమేల కాంతిజిత హాటక పెద్దల చాటుకన్నె వే
నాటను మారుతూపు లెదనాటను మోహము బెంపఁ జెల్లునే 528

క. ఇన్నాళ్లును విరహిణులగు
గన్నెలఁ గని నగెదు నీవు ఘనతవిరహ వా
రాన్నిధిఁ బొఱలఁగ నగరే
యన్నెలఁతలు నీకు నాయ మగునే యనుచుʼ. 529

క. అందలి సుమకుంజము దిగు
వం దవిరుల సెజ్జ నునిచి వనితలు చెలి కిం
పొందఁ నెద గందమిడు తఱిఁ
దెందెగప్పైఁ బైని పూలతేనియ గురిసెన్. 530

## ఉత్ప్రేక్షాలంకారము

చ. మెలఁత యురస్థలంబు పయిమెత్తిన గంధపుఁ బూవుఁదేనెకై
యళియొకటు వ్రాలఁ దత్పదము లందు మునింగినఁ దాపవహ్ని వె
గ్గలమున గట్టిగా నెగయ గ్రక్కున ఱెక్కలు విచ్చి యొప్పెఁ బూ
విలుతుని తూపు పిఁపునను వెళ్ళగఁ జిక్కిన పింజయో యనన్. 531

## ముద్రాలంకారయుక్త తద్గుణాలంకారము

ఏమని యెంచవచ్చుఁ బ్రసవేషు శరాసన తాపవేదనన్
వేమఱుఁ గుందుచో సఖులు వేగఁ బ్రఫుల్ల సరోజమాలికా
స్తోమము మేనఁ దాల్ప నవితోడనె కంది విచిత్రభంగియై
భామ యురోజసీమఁ గనుపట్టెను నుత్పలమాలికాకృతిన్. 532

క. వనమున నిట్టివిధంబున
వనితకు నుపచారవిధుల వలన నొకింతై
నను శమింపక విరహము
ఘనమగుటయుఁ జూచి యపుడు కాంతాజనముల్. 533

చ. తలిరుల నొత్తుచున్ మిగుల దట్టముగాఁగ పురంబొకింతమైఁ
గలయఁగఁ జల్లుచున్ మఱియుఁ గన్నుల గొజ్జఁగి నీటఁ దోయుచున్
గలికి పదంబులం గరయుగంబులఁ బుప్పొడి మెత్తుచున్ గడున్
జెలు లుపచారముల్ వరుస జేయునెడన్ మలయానిలుం డొగిన్. 534

క. వడజల్లుగ జిలుఁగుంబా
వడ జల్లగ విసరునంత వనితకు మిగులన్
వడియైన తాప మెంతే
వడియైనను నిల్వలేక వగఁ గుంద తఱిన్. 535

## ముద్రాలంకారము- త్రిపుట- మానినీవృత్తము

మానిని. నిబ్బరమైనది నెక్కొను వేదన నిల్పఁ దలంపుచు నేర్పుఁలచే
నబ్బుర మంద రయాన కొనర్చిన వన్నియు నిష్ఫల మౌచునటో
నుబ్బినకాఁకకు నోర్వక తెప్ప లటొయ్యన వ్రాల్చుచునుస్సరనన్
గబ్బిసఖులు తటకాపకి మానినిఁ గన్గొని పల్కిరి కర్ణముగాన్. 536

## ఆర్తి

ఉ. కాఁక శమింపఁ జేతుమనఁగాఁ గలకంఠరవంబు వీనులన్
సోఁకిన గుండెగాడ్పుమెయిఁజొచ్చుట గొందల మందె నంతలో
వ్రేఁకపుఁ జిల్క పల్కువడి వేఁడిమి రాయిడి నొందె మార న
ట్టాఁకలఁ జెందెనెట్లు చెలియన్ వడజేర్చెదమంచు నెంచుచున్. 537

సీ. వనితకన్గవ నొత్తి వైచిన గలువపైఁ
గరమాని రేఁజేని యురువు గందె
మగువ చేనిడి త్రోయు చిగురాని నాలుక
పొక్కుపస్వరమునఁ బొగలెఁ బికము
పడఁతి యంఘ్రులనుంచి కడకుఁ ద్రోచిన తమ్మి
విరిసోఁకి సుడివడి తిరిగెఁ బవన
మువిద చంటనుఁ జేర్చి యవలఁబో మీటిన
సుమగుచ్ఛముల వ్రాలి కమలెఁ దేఁటి

గీ. భామ బాహుల నిల్పి త్రోఁబడిన తూఁడుఁ
గమిచి రాయంచ పద్మాకరమున దుమికె
వేగఁ గపురపుహారంబు విరియబాఱె
వెలఁది నెమ్మేని విరహాగ్ని వేఁడి ననుచు. 538

## అత్యుక్త్యలంకారము

చ. కొలని కెలంకునన్ జెలులు కోమలి నిల్పిన మేనికాఁకచే
సలసలఁగాఁగె నీళ్లు జలజంబులు సుక్కెను దానఁ జిక్కితేఁ
టులు మొఱఁ బెట్టుచున్ గమలె డుక్కెబిసంబులు ప్రీలెఁ బత్రముల్
గలువలు వాఁడెఁ బుప్పొడులు కగ్గెఁ దొలంగెను జక్రవాకముల్. 539

## అనుప్రాసవచనము

వ. ఇవ్విధంబున నక్కాంతాతిలకంబు భుజంగగ్రామణి గ్రావరాడవలోకన జాత విరహభర సంచలిత మానసయై, వశక్షేక్షు కోదండ మాధురీ ధురీణత్వ సంబంధ బంధుర గంధాంధ పుష్పంధయ స్తనంధయ శింజినీ మంజు ఝుంకార ఠంకార గంభీర దర్ప కందర్ప కర విముక్తాసార సారస నారాచ ధారాక్షతలంబుల వలనను, అనుదిన విరహిణీ లోకభీకర శుక పిక శారికా నికర కలకలరవంబుల వలనను, యావలి యావలి యావలిక శిఖావళావళికి, సఖు లవలాళవళికి నల్లనల్లన నుల్లంబు డిల్ల జెడి తల్లడమంది యప్పల్లవాధరి యొల్లంబోయి బరవశత్వంబునం గుంది యున్న సమయంబున. 540

సీ. చక్రస్తని యటంచు జగడించకు శశాంక
గురుతమో వేణి యీ కుందరదన
మధురాధర యటంచు మట్టు మీఱకు తేఁటి
చంపకనాస యీ జలజవదన
బిసబాహయని మారు మసలకు రాయంచ
జలధరచికుర యీ కలువకంటి
పల్లవకరయని త్రుళ్లకు కోయిల
శ్రీరామమూర్తి యీ కీరవాణి

గీ. వదనకుంతల యాన సుస్వర సఖిత్వ
మొనసి యుండుట కతన మీకిత వౌనర్చు
ననుచు నళిచంద్ర పరభృత హంసములకు
భయము నయమును దెలియఁగఁ బలికి మఱియు. 541

## దైన్యము – చతుర్థశానుప్రాస ఘటిత చరణసీసము

సీ. అందమా లావణ్యకందమా యేచుట
చందమా పున్నమ చందమామ
వైరమా ఫలసారహారమా వాచాల
కీరమా యీదారిబీరమూనఁ

గోపమా కృతవేణికోపమా సముదితా
టోపమాఁ కేకికలాప మార్చ
సీతమా మలయాద్రి జాతమా సితమరు
జ్జాతమా నీమేలు సేఁత మాన

గీ. సదనకదనోగ్రమదన యున్మదనమదన
సదన సదనారతాతత శరశరవ్య
కరణసముచితభావనిగాఢదాహ
వతికి నతి కిలికించితవతికి నలుగి. 542

## రోషము - అపూర్వము

క. జుణుఁగకురా మదనా మా
తుణుమధ్యను సామి యేలినంతనె నీపొం
గణఁగుటకుఁ దుంటవిల్తురు
వణఁచుచుఁ బిప్పిగను నేలపాల్ సేయింతున్. 543

## తృతీయ చతుర్థ చరణాపూర్వ ప్రయోగము

క. అని చతురవచన రచనల
ననవిల్తుని నతనిబలము నగి సఖియౌ కాం
చనమాలిక నాంచారును
గని భయ మణఁగింపఁ దలచి కడుకఁ దలిర్చన్. 544

## కావ్యలింగాలంకారము

చ. మనసిజుఁ డంబకత్రియము మాటికి ముజ్జగమున్ జయింపఁగాఁ
బనిచి తదీయశేషమగు బాణయుగంబున నిన్ను నేయఁగా
ననువుఁ దలంచు నంతను నిశాధిపుఁ డొక్కటి భానుఁ డొక్కటిన్
బనివడి మొక్కఁబుచ్చి రల భావజుధాకకు నేలఁ జింతిలన్. 545

## వక్రోక్తి

సీ. వనజాయతాక్షి వీరినిఁ గూర్చి భయమేల
నంగహీనుఁ డుమరుఁ డదియుఁగాక
గొదవెన్నఁగాఁ బుట్టు గ్రుడ్డులు కీరముల్
పెంపుడుగున్నలు పికకులములు

మధుపాన విభ్రమోన్మత్తముల్ తుమ్మెదల్
కోకాళియాతి దోషాకరుండు
మిగుల నాకులతను మీఱు నమ్మాధవుం
డలసాలసుఁడు దక్షిణానిలుండు

గీ. ధాత భళి 'యధారాజా తథాప్రజా' య
టన్నది ధరిత్రి నిజముగా మున్నుఁ దెలుప
దొరను బంట్లను దగఁ గూర్చె దొరయ ననుచుఁ
జతురవాక్కులఁ బలుకుచు నతివఁ జూచి. 546

## అపూర్వప్రయోగము

ఉ. అక్కట యేలపోయితిమి యావనకేళికిఁ బోయి యున్నచోఁ
బొక్కడి వేంకటాచలవిభుం డపు డేటికి వచ్చె వచ్చెఁ బో
నిక్కలకఁతి టిచ్చవడి యెందుకు దప్పకఁ జూచె జూచినన్
జక్కెరవింటివాఁ డదియ సందుగఁ దూపుల నేయ నాయమే. 547

గీ. ఇట్టి వృత్తాంత మవనీశుఁ డెఱిఁగెనేని
మనల నేమని యెంచునో యని తలంచి
యేమి సేయంగఁ గలవార మెద్ది యుపమ
యేది తెఱఁగంచుఁ దమలోన నెంచుచుండ. 548

## శబ్దపునరుక్తి త్రిస్తబక క్రమాలంకారసీసము

సీ. గోధర గోధర గోధర ప్రౌఢిమ
బాణబాణప సుమబాణ మహిమ
నాగారి నాగారి నాగారి విస్ఫూర్తి
కృష్ణ కృష్ణాధిప కృష్ణగరిమ
హరిభవ హరిభవ హరిభవ ప్రఖ్యాతి
రాజ రాజారీతి రాజరీతి
నగవిభు నగవిభు నగవిభు స్థితిలీల
వనపతి వనపతి వనపతిగతి

గీ. ధీవిభవ దాన కవన భూతి తను బలజ
వ గతిశౌర్య సత్యావన వచననీతి
భక్తిధనచాపగాన భాభరణధృతి జ
యస్థితివిలాసముల గెల్చు నత్రిభనృపుఁడు

## గూఢషష్ఠిసీసము

సీ. బలభూతికాంతి రూపవితీర్ణ రణరూఢి
మరుదీశ్వరకుమార మణిరుచిఁ దగి
పటుమతి జవకీర్తి భాస్వదయాప్రౌఢి
కవిరాజసన్మాన గరిమగెలిచి
ధర్మగాన జయసంధాయాన గుణవృత్తి
నరరాజ రఘురామ హరిభృతి నగి
ధర్మధృతి శుచితా ధామ వాక్స్థితి రీతి
గోధర గాంగేయ గురుగఁ గని

గీ. ప్రబలు నతఁ డుతులిత తతరభస భయద
పరుషవిలయ సమయ పురహర కరధృత
డమరు ఢమఢమ రవసమసమర విజయ
పటహ నినదోగ్రుఁ డాకాశపార్థివుండు. 550

## అపూర్వప్రయోగము

సీ. ఆధరాధీశ్వరుఁ డట వధూసహితుఁడై
చల్లవేళల విలాసంబు మీఱఁ
జనుదెంచి తనకూర్మి తనయ యున్నవిధంబు
గళవళమందు దొయ్యలులఁ జూచి
యిదియేమి వృత్తాంత మెఱుఁగఁ బల్కరె నావు
దతిభీతచిత్తలై యనిరి చెలియ
లొలపక్షమింతలే కోదేవమునుపటి
వలె బాళివనకేళి సలుపఁబోవ

గీ. నచటి కొకడేగ వచ్చె నేమందఱమును
దఱిమిపట్టితి మపు డొకదండనాథుఁ
డాదటను వచ్చి తనశౌరి దనుచు నతని
కులము రూపంబు గుణమును దెలియఁబలికె. 551

సీ. ఒకదక్షి ణాక్షిసూర్యునికిఁ బొలుగ నొక్క
డాకన్ను చంద్రున కాకరముగ
నొకచేయి చక్ర మెండకు బిడారుగ నొక్క
చేసంకు వెన్నెల చికిలి గూర్ప
నొకయంఘ్రి గగనగంగకు ఖజూరికనొక్క
యడుగు వేదములకు విడిదిఁజూప
నొకపుట్టువడుగు నాజ్ఞకు తక్కువుగ న్యొక్తి
యవతార మఖిలంబు నాక్రమింప

గీ. నొకమతి సురుల రక్షింప నొక్క తలఁప
సురల శిక్షింప నొకదయ హరునిఁ బెనుప
నొక్కకృప నరునిఁ గావఁ బెల్లుల్లసిల్లి
పల్లు వాళ్లెల్లు జాగట్టు పట్టు దిట్ట. 552

క. అతఁడఁట తిరుపతికెల్లను
బలియట గరుఁడాఖ్య గోత్రపాలనుఁ డఁట నీ
క్షితి వేంకటేశ్వరుండన
నుతి కెక్కినవాఁడ టంచు మిగులఁగ నెంచున్. 553

## అపూర్వప్రయోగము

క. అవే శచటికి శేష
గ్రావనికాయుఁ డరుదేర రమ జతని గనెన్
భూవర యది మొదలీ చెలి
యీవిధమున నున్న దనుచు నెంతయు మఱియున్. 554

## దశావస్థలు—అపూర్వప్రయోగము

సీ. కనినంతఁ దలిరె రాకాచంద్రబింబాస్య
చింతించఁ దొడఁగె రాజీవనయన
కఱదలు మాని సంకల్పించెఁ గలకంఠి
యెడ విలపించె న్నుదలమిన్న

లేశంబు నిద్దురలేక యుండె లతాంగి
యంగదచే దస్సె నలరుఁబోఁడి
చక్కటిఁ బయిలోటిఁ దక్కె జక్కవచంటి
చేర నుంకించెఁ గర్పూరగంధి

గీ. మోహమున సొమ్మసిల్లె నంభోజవదన
వరుస నీ తొమ్మిది యవస్థ లరసి యిప్పు
డలరుమేలు మంగమ యని పలికినంత
మదిని వెఱఁగంది ముదమంది మమతఁ జెంది. 555

## షోడశరాజయుక్త కందము—మరుత్ అని విచిత్రప్రయోగము

క. భువి భరత భగీరథ భా
ర్గవ మాంధా త్రంబరీష రంతి శిబి సుహో
త్రవిభు దిలీప మరు ద్రా
ఘవ పృథ్వంగ శశిబిందు గయ నహుషు లనన్. 556

వ. మీఱిన యీనారాయణవనపాలకుండు మున్ను ముక్కంటిచేత విన్న వాఁడు గావునఁ దనముద్దుకూఁతురి మనోభిలాషంబునకు ననుకూల సంభ్రమాయత్తంబైన చిత్తంబునఁ దేజరిల్లి తల్లీలోద్యాన వనపద్మ సరో వరప్రాంతకేళీ సౌధాంతరంబునఁ బుత్రికారత్నంబు నుండ నియమించె నంతట. 557

### అశ్రువు

ఉ. చూచి విరాళి జాలిఁ బడుచున్ బడుచున్ వగఁ బూపపాయపున్
రాచమిటారి తాల్మి వలరాచకటారికి నగ్గమౌటచే
లోచవి జిక్కి సారసవిలోచనముల్ ముకుళించి మెల్లనే
లేచుఁ బడున్ గలంగుఁ దరళీకృత బాష్పముఖారవిందయై. 558

### మోహము

సీ. తరుణి యంతటనుండి తాపంబుచే మాట
లాడదు చెలులతో నాడఁ బోదు
గతి వేడఁ దొల్లింటిగతి వీణ మేళంబు
సేయదు ప్రేమఁ గై సేయఁ బోదు
సకియలు సంగీత సాహిత్య రీతులఁ
జదువఁగా వినదు దాఁ జదువఁ బోదు
సరస పదార్థముల్ సరవి జిహ్వను రుచిఁ
గొనదు మోదంబును గొనఁగఁ బోదు

గీ. ముకుర మంటదు గిన్నెర ముట్టఁ బోదు
బూలు దాల్పదు గంధంబుఁ బూయఁ బోదు
పీడెమును సేయ దొరలను జూడఁబోదు
విరహపరితాపభరమున వేఁగుచుండి. 559

## ముద్రాలుప్తోపమా రూపకాతిశయోక్తి హేతూపమ రూపక సందేహ సంకర యథాసంఖ్య స్మృతి మత్ప్రత్యనీకయుక్త హేత్వాలంకారము

సీ. గోపికా కోపనాటోప భాగభిరామ
గ్రీష్మర్తు మిహిరభా భీష్మధామ
యాతపోద్గారి మహాకౌస్తుభ సువక్ష
ఖల విదుంతుద శిరోదళన చక్ర
సాంకవ మృగమద పంకమేచకదేహ
ఫాలాక్ష సన్నుత పదసరోజ
యాదిమకుంభీనసానల్పతల్పక
యతులిత వజ్రహస్తానుజన్మ

గీ. యను చెలికరాక్షి వచనముఖానిలములు
గాంచి కిసలయోత్పల శుక గంధపవన
ములఁ దలచి మధు విధు మార మలయములును
దనదు గన్నులఁ గట్టిన దారినుండి. 560

## మంత్రవర్ణన వచనము

వ. ఆసమయంబున నిజకీర్తిప్రకాశకరుండైన యాకాశరాజు నిఖిలతంత్ర ప్రవీణులగు మంత్రులం బిలిపించి దొలుత బుడుతనెలఁదాలుపు ముదల పాలించిన తెలుంగెఱింగించి తమ్మికంటికిఁ గూఁతు నొసంగ సంగతంబే యని యా ధీమంతులగు మంత్రులు మంతుకెక్కఁ బలికిన నానంద తరంగితాంతరంగుడై కుల రూప గుణ విద్యా ధన బల రాజ్య తపంబులనియెడు నష్టమదంబుల నహంకరింపక, శైవ వైష్ణవ శాక్త గాణాపత్య సౌర స్కాందంబులను షడ్దర్శన సముండై మీఱి, బ్రహ్మాండ విష్ణు

బ్రహ్మ నారదీయ మార్కండేయ వామ నాగ్నేయ గారుడ భవిష్య ద్భాగవత స్కాంద మాత్స్య లైంగ కౌర్మ వాయు పాద్మ వారాహ బ్రహ్మకైవ ర్తాష్టాదశపురాణ పారీణులైన మౌహూర్తికుల రావించి తద్వధూవరుల కానుకూల్యంబుగా నుభయ బలవచ్ఛుభముహూర్తంబు నిశ్చయించి తత్కల్యాణమహోత్సవమునకు జిరతనూర శృంగారవనం బలంకారంబు గావించి దాను చిఱుత నూరక నొసంగం దలంచి చతు రంగబల సమేతుండై తద్వనప్రాంతంబున కవి బుధ గురు సేనామధ్యంబున కవి బుధ గురు తారకా నికరభాగంబున వెలుంగెడు రేవెలుంగు చందంబున నందంబుగానున్న భాస్వర కార్తస్వర గిరి పరివృఢధీరుని నిజభుజ ప్రతాప దీపిత సమర వీరోధీరుని హృదయ ముదయ దయోదయ పోషితా శేష ధీరుని శరధిశరపరిహృత శరధీరుని పాలితనిరవధీరుని సర్వగీర్వాణ క్రియమాణ స్వస్వలోక సంత్రావిధీరుని ధీరుని కింకరీకృతవానరుని రక్షిత నరుని నిరంతరగానకృద్గంధర్వ కిన్నరుని భక్షితదావవైశ్వానరుని రైపమానాభిదా నిదాన నిశాతచక్రుని నిజకీర్తి పరిపూరిత దిశాచక్రుని నూరీకృత తొండమాన్ చక్రవర్త్యాది భక్తసాత్కృత వైభవుని అతులిత ప్రాభవునిమురాసురహరుని మైత్రీకృతహరుని డాలెచ్చగంద్రగొడ్డంటబల్ చిక్కటా రెక్కటిని నుక్కడంచి మించిన మందరాగధరుని యమంద రాగంబునంగని యాసచే వెదకు దివ్యౌషధరాజంబు ముంగలం గనుపట్టిన తెఱంగున మదంగంబుఁ బావనంబుసేయ దీనులపాలిటి పెన్నిధివలె సన్నిధిం జేసితిరి కర్తు మకర్తు మన్యథాకర్తు మతిసమర్థులైన దేవర తిరువడి పాళ గొలిచిన దొరనై యోష్మాకీన వాల్లభ్య పరిలభ్య సౌఖ్యంబుఁ జెంద నుర్వర వర నైపుణ్యంబునం బుణ్యంబుగా నెలఁతమే లెదుమే లెదుగ బడనీక నొక నిమేషంబున శోభన మిషోన్మేషంబున మీనమేషంబు లెంచక జక చకితమేచక వికచక రుచి నిచయంబుఁ గమిచి బ్రచుర మగు శుచిపిచికిల ఘుమఘుమ ద్గంధ బంధురోత్తమాంగంబుఁ దదరుణ తరుణ చరణ నాళీకంబు సోఁక జాగిడక జాఁగి యర్ఘ్యపాద్యాదులం బూజించి వరభక్తిచే దేవరకు మత్పుత్రిక నాహూయ కన్యాదానంబు నిదానంబుగా నొసంగెద నితోధిక భాగ్యంబు వేఱె యే మున్నదని యాత్మ వచ్చిన్న తావకీనావతారంబులు : గణియింప నాతరంబె పాణిగ్రహణంబు నంగీకరింపవలయు భవదీయ చిత్తంబె తెఱంగై యున్న యదియోగాని

'శుభస్య శీఘ్రంబు' అన్నవిధంబున నిక్కార్యంబునకుఁ దావసంబు సేయక విచ్చేయ వలయునని సూచన యొనర్చి నచ్చిన ప్రేమ నిలిచిన నృపపుంగవునకు హృదయంగమంబుగా సమంచిత సుభాషితంబుల మంచిది మిగులసంతోష మాయెనని రామేయామేయ సౌందర్యుండగు గోవిందుండు గజారూఢుఁడై ముంగల నూదట మీటుట వ్రేయుట కీయుట కంచుపైకం బాలాపంబులను పంచమహావాద్యంబులతో నను కరించి భూరిభేరీభాంకారంబులు భోరుకలంగ సకల బిరుద ధ్వజంబులు జెలంగ వందిమాగధ కైవారంబు లుప్పతిలంగఁ దత్పురజనులు సేసలు జల్లంగఁ జందనాగరు గురు సాంబ్రాణి ధూపము లిరుగడలఁ బ్రబలంగఁ దొలంగఁ ద్రోయరాని తన నలువగునలువగల ఖలగంబులతోఁ గదలివచ్చు నప్పు నప్పుడమి ఱేఁ డీరేడులోకములు కడుపునఁగ డపున నేరేడుబండు తిరుమేనున జొక్కపుఁ జక్కెరమొక్కు తెక్కు పక్కెర పక్కి నొక్కు చక్కని మొక్కలిఁ గన్న వెన్నునిఁ గూర్చి మున్నుగాఁ దత్పద్మసరోవరంబు మహిమఁ దేటపడ విన్నపంబు సేయంగడంగె మాతాపితృ గురుదేవ వేదబ్రాహ్మణనిందకులును దేవతా బ్రాహ్మణ ద్రవ్యాపహారకులును మధుపానోన్మత్త మత్తకాశినీ మధురాధర పానం బొనర్చు దుష్కాముకులును గో బ్రాహ్మణ బాలక స్త్రీహింసకులును సాదుశీలయు యౌవనయుతైన కులసతినిం బాసి కేళినిదారోదార వ్యాపారంబున నపారంబుగా వారాంగనా సంగమం బపేక్షించు వారును లజ్జ యుజ్జగించి మగని కనుమొఱఁగి పెఱమగనిఁ దగులు మగువలును బాలకుల సొమ్ములొడుచువారును దేవాలయ మఠ ప్రాకార తటాక వన ఘాతకులును అన్నవిక్రయులును దుర్దాన ప్రతిగ్రాహకులును యెఱుఁగని ప్రాయశ్చిత్త విధు లేర్పరచువారును కొండీఁడును కొండియంబు వినునతండును గరదుండును గృహదాహకుండును తన జీవనంబుకై పరులకార్యంబుఁ జెఱచునతండును ఘనుల యందు గుణంబులు మాని యీషద్దోషంబులు బ్రకటనంబు సేయువారును పైతృకంబు విడిచిన యతండును నమ్మి గొలిచినవారిఁ గికురించి గ్రాసంబు లివ్వక వెలయు దుష్ప్రభుండును స్వామిద్రోహియును విశ్వాసఘాతుకుండును వంచకుండు లక్షణ లక్ష్యరాహిత్య కవితానిబంధన ధవులగు కుకవులును నేదొక నిమిత్తంబున నీ పద్మసరోవరంబున నిలవరంబున నొక్కపరి తానం బొనరించినఁ

దత్పాపంబుల నెల్ల బాపఁగల దిష్టముదిష్టమీ మహిమ నుతిసేయఁ గల రసజ్ఞయని వినిన నిజతీర్థ నిమజ్జనాగత సజ్జన నభోభువ ద్దరిద్రతావిద్రాణంబును సౌఖ్య సమాచక్ర సాన్విత జంతు సంతాన కలకలోన్నిద్రాణంబును తామరసిక దామ రసికాభ్యుదయా దరి ద్రాణంబును వయోరిరంసాయాత దేవకామినీ కుచకుంకుమ పంక ముద్రాణంబును సమ్మృత తపః పుల్ల హలకారుణారుణ ప్రభావిద్రావిత సమీప వనాంతరాథః కరణాంధకారంబులు సంతత వసంత శ్రీజరీగృహ్యామాణామిత సితాబ్జ ప్రకారంబును అగాధాధర ప్రదేశ పంకమాళబ్ధిక ద్విరేఫ ఝాఝాయమాన ఝుంకారంబును చక్ర చంక్రమణ వర్తులాకారంబును దురితవ్యవహారికై కాగారిక శరణ్యారణ్య నిసాధ్వసకారణ శ్రమ యుతాధ్వనీన జరీజృంభ్యమాణ నిష్టాప ముష్టింధయ సమీచీన వాచీన బాలపల్లవ మానంబును పళ్యల్లలాట జేగీయమాన నూన చరీదృశ్యమానంబును ప్రతి ఫలిత గతాగత గంధర్వ విమాన రారజ్యమానంబును యోజనాయల మానంబును చకాసత్కల్లోల హల్లీసక హల్లోహల తమ సారంబును పరివసన్మద యుక్త కోకసార సంసారంబును శేవల శేవల విభానిరస్తమ సారంబును వారి మధురతాజిత సుధాసారంబును నిరశత్కైరవ ప్రసారంబును విధుకాంత కాంత సోపాన వికాసారంబును నిరంతర పారదృశ్య విజత హృద్విసారంబును మానసరసంసారంబునునగు నాకాసారంబు దరిసి క్రిక్కిరిసిన సొంపున మెఱసి కరినిడిగ్గి హరియందు మంగళస్నానం బొనరించి చెంతనున్న నాప్త మంత్రనిం గనుంగొనిన స్వామి చిత్తంబెఱింగి తత్కృపావనుండయి యాదండనాధాధ్యంభ విష్ణుండు విష్ణువు నలంకంచనుద్యోగించి యంత. 561

క. క్రొవ్వాఁడి నఖంబులచే
దువ్వి హొయ ల్మీఱవైచు తోరపుసికమై
జవ్వాజి తావిగట్టిన
పువ్వులసరుల తీఁడు జుట్టి భుగభుగ వలువన్. 562

## ఉపమోత్ప్రేక్షసాంకర్యము

సీ. తూర్పుగుబ్బలి మీఁదఁ దోఁచిన రవి భాతి
డాలీను బురుసారుమాలుఁ గట్టి
కాటుకకొండపైఁ గప్పు లేయెండనాఁ
గటితటిఁ గాంచన పటముఁ జుట్టి

వదనసౌందర్యార్ణ వస్ఫురన్మకరలీ
　　లలి నఁగ మకరకుండలము లునిచి
కరుణారసంబు సాక్షాత్కార మయిన క
　　రణి మేన కుంకుమ రస మలంది

గీ దీక్ష జేసెను భక్తి సంరక్ష కనఁగఁ
గరము నందునఁ బూనిచి కంకణంబు
శివుఁడు జాబిల్లి రేఖఁ దాల్చిన విధాన
ఫాలమున ముంచి ముత్యాల బాసికంబు. 563

క. తొలుఁదొలుత నిలువు టద్దము
నెలకొన నిడి యెదుట వెన్నునికిఁ గస్తూరి
తిలక మళికమునఁ దీర్చె
న్నలవడ శృంగారరస మహత్వం బనఁగన్. ౨౦౪

క. ఈ రీతి మంత్రిచంద్రుఁడు
కూరిమిచే హరిని పెండ్లికొమరునిగా శృం
గారించిన నప్పట్టున
ధీరుం డాకాశరాజు తేజం బెసఁగన్. 565

సీ. రంగు మీఱిన యపరంజి గోడల చేత
　　మిన్న కుంకుమపువ్వు దిన్నియలును
జిలువమేపరి పచ్చపలకల చేతను
　　దొగసూడు జాజిగి దూలములును
విడి మగఱాల చెక్కడపు బోదెల చేత
　　బలు కప్పుఱాల కంబముల గములఁ
ద్రిమ్మి మానికపు సంతన పట్టియల చేతఁ
　　జొక్కపు ముత్తెపు సోబనములఁ

గీ. జేగల మొకమ్ము కొమ్ములఁ జేసినట్టి
బోరుతలుపుల చేతఁ గస్తూరి మఱుల
విరివి యరు గొప్ప గొప్ప యుప్పరిగ యందుఁ
బరఁగు చున్నట్టి । గా.క. చప్పరము క్రింద. 566

సీ. రవి కిరణాళి దూరఁగ నీకఁ గార్కొని
తఱుచైన యుపవన తరుల గముఁ
బూఁదేనెసోన తుంపురు జాలువాఱిన
గాల్వల నివమైన గప్పురంపు
టిసుము దిన్నెల మీఁధ నెసఁగు గొజ్జంగుల
వలనైన నాలచ్చికొలని యందుఁ
గలహంస బక చక్ర కలరావముల్ తమ
పీనుల కింపుగా విని మనమ్మ

గీ. లమ్మనమ్ములు చూపుదనమ్మ నమ్మ
కామినుల నవ్వు తేటలఁ గరఁగు గలువ
విందుజా మెట్టులను గల పెండ్లి చవిక
లోన వెన్నుని నునిచి తోడ్తోనఁ గనఁగ. 567

## ఉత్ప్రేక్షాలంకారము

క. మొదలన్ మదిగల చంద్రము
డుదయం బగువేళ నుదుట నుంచిన కావున్
గదయన హరి పేరెదపైఁ
బదలిగ శ్రీవత్స కౌస్తుభద్వయ మలరెన్. 568

వ. అని యబ్బురమంది చుట్టుల మందిగల నిలాతల ప్రతిజతనంబునఁ దన కుమారికయైన యలమేల్మంగనాంచారును తోడి తెమ్మని బువ్వారుఁ బోఁడ్లఁ బంచిన వల్లెయని వచ్చి యచ్చేడియలు తమతమ యిచ్చల మెచ్చు వెచ్చ విచ్చలవిడి నచ్చెంగటనున్న మానికపు బొమ్మ మానినిం గనుంగొని ప్రేమాని యమ్మా నీకోర్కు లీడేఱె లెమ్మని నీనెమ్మదిం దలంచిన వేంకటాచలపతి నీపతి యగుటకు నతివేగముగాఁ దోకొనివచ్చి పెండ్లిచవికలో వసియింపఁజేసి నిన్ను వెన్నునకు సాకల్యముగాఁ గల్యాణంబు సేయందలంచి మీతండ్రి దయార్ద్రహృదయుండై వృత్తి నినున్ బిలుచుక రమ్మని ప్రేమమ్మున మముం బంపెనని పలుకు నప్పట్టునఁ బట్టజాలని సంతోషంబు హల్లీసకంబు సలుప మందాక్ష

మందాక్షియై యున్న నక్కన్నియను జెంతనున్న పుప్పొడి దిన్నెను వసింపన్ జేసి సంపంగినూనె నించిన రతనంపుగిన్నియఁ గప్పూర తాంబూలంబులు వికచ ఫలంబులు శోభనాక్షతలు కుంకుమ రసంబునఁ గదంబించిన పచ్చి పసపు నలుంగు నమర్చి బంగరు పళ్లెరం బెదుటనుంచి దీపించి నుదుట నక్షతలు గీలించి కుఱంగటను నైదువలు పాటలు పాడ వేడుకమీఱ నప్పుడు. 569

మ. అలకల్ చిందులు ద్రొక్కఁ గొను వడకన్ హారాళి నర్తింపఁ జె
క్కులు పాలంబుఁ జెమర్పఁ బైఁట యెద వీడ్కోల్ జెంద బంగారుగా
జులు టోకివ్వఁగ నూర్పులెచ్చఁ దరులచ్చోనిక్కఁ దాళస్థితిన్
దఱయంబెం గనుదోయి సొక్క నొకకాంతామౌళి మంగాంబకున్. 570

క. పల్లవపాణులు కొందఱు
బళ్ళెరములఁ బూని అవలబంగరు గాజుల్
ఘల్లురన సుంకుఁ జెరిగిరి
యల్లోనేరేడటంచు నయ్యిందిరకున్. 571

చ. అటునిటు జిక్కుగొన్నకుఱు లందముగాఁ గొనగోళ్ల దువ్వి మి
క్కుటముగ నూనెఁ బో నెడను గొజ్జఁగి నీరునఁ దోఁచిరాచి యొ
క్కట నిరువాయఁగాఁ బిడిచి గొబ్బున విప్పి కదల్చి చందనం
బటకలిఁ బ్రామె నొక్క కుటిలాలక యంబరరాజు పట్టికిన్. 572

## చతుర్విధశృంగారము

సీ. జలకమార్చి మడుంగు జిలుఁగు దువ్వలువను
దడి యొత్తి చిత్రవస్త్రంబు గట్టి
ఘనసార కుంకుమ కర్దమంబొకపాటి
నెఱిపూఁత గాఁగమై నిండనలది
వలపెచ్చ మొగలితేకులు కొంత గానరాఁ
గీలు కొప్పొకవంక గీలుకొలిపి
యాపాదమస్తకం బఖిల భూషణ మణీ
హారవల్లరులచే ననువు పఱచి

గీ. కాంత లీరీతిఁ జతుర శృంగార గతులు
నలరి గై సేయ నొకవింత నెలువు గాంచి
మదన సామ్రాజ్య లక్ష్మినాఁ బొదల మిగుల
పార రుచిమించు నాంచారు సౌరుఁ జూచి. 573

## చతుర్యమకయుక్తాక్కిలివడి సీసము

సీ. దరము కంఠంబు మందరము చన్దోయి కం
దరము నాభి సుదసోదరము పలుకు
ఘనము వేనలి ఘనాఘనము నెన్నడ తటి
ద్ఘనము మేను ఖగలం ఘనము చూపు
బింబ మధర మిందు బింబము మోము త
ద్బింబము బొట్టు శ్రీబింబము చెవు
లురులు ముంగురులు చివురులు వ్రేళ్లంట్ల స
వురులు కురువు లల యలలు వళులు

గీ. జమ్మ లడుగులు చెక్కుటద్దమ్ము లతుల
తరుణ కుందము లలరు దంతముల జిగి
యిల కటీర తటంబు కోయిల స్వరంబు
గాఁగ మననాతి గమనాతిగరుచి గనియె. 574

వ. అని వినుతిసేయుచుఁ దనుఁ దోడితెచ్చు చేడియలం గూడుకొని. 575

## ఉపమాలంకారము

సీ. క్రొమ్మొగుల్ వడగండ్లు గ్రుమ్మరించినరీతి
నఱజాఱుకొప్పులో విరులు రాల
శీతాంశు ముద్దిడఁజేరు రోహిణి వలె
మొగమున ముత్తెపు ముక్కు అమరఁ
దూఁడున గెందమ్మి దోఁచిన చాడ్పున
దళుకుటారఁటి పొక్కిలి జెలంగ
జక్కవకవగూడ జెక్క లించుకవిప్పి
నగతిఁ జన్గవ మకరికలు మెఱయ

గీ. నడుపులకు మూఁగు నంచ చప్పుడు లనంగ
బవరి మొలనూలి గంటల రవళి సిగుర
దండ నెచ్చెలియిచ్చు కైదండఁ గొనుచు
వచ్చెఁ దనతండ్రి మ్రోలకు లచ్చి యంత. 576

గీ. అచటి మణిపీఠముననుశ్రీహరి వసించు
సమయమునఁ జంద్రకళ యతిసంభ్రమమునఁ
గనకభృంగారు గొని యుదకములు వోయఁ
గడిఁక బదములు గడిగి భూకాంతుఁ డపుడు. 577

గీ. అర్చనలుజేసి గంధమాల్యాదు లొసఁగి
జీరకగుడంబు హరి వలచేతఁ దాల్ప
వైఖరి నొసంగి జలముల వార్వఁజేసి
యట సుఖాసీనుఁ గావించినట్టియెడను. 578

## యమకము - అపూర్వప్రయోగము

గీ. శోభనాభీష్టదానాభీ శోభియైన
మోహనాభర భీరు మనోహరునకు
నాభినుతనాభి సారంగనాభిఁ దెచ్చి
నాభినామంబు నొక నతనాభి దీర్చె. 579

## అపూర్వప్రయోగము

గీ. ఇంతి యొర్తు సామి కెదసూటి నీటున
తేట తాళితగెభిదిర కరోప
లశకలంబు మంజులప్రభా దూర్వాద
శమునఁ దొడఁగి విదని క్రమము దోఁప 580

## ఉత్ప్రేక్షాలంకారము

చ. అలవడ స్వారివచ్చి మరుఁడాత్మను బోవుచు బైట భృత్యులన్
నిలుమన వార లచ్చటను నిల్చి తదశ్వము నీలి త్రాటిచే
నెలకొనఁ గట్టి డాలెదుట నిల్చిరొ నా హరిదాల్చు వక్షమం
దలతిరుమాల రాజిలుక తాళియుఁ గస్తురిపట్టెలుం దగెన్. 581

వ. అంత.

క. ఒకచోఁ గచ సుమవాసన
యొకచోఁ దాంబూలచంద్రయుక్త పరిమ ం
బొకచో మెయికుంకుమ స
జ్జికమగు నెత్తావి హరికిఁ జెలువం బెసగన్. 582

సీ. కలదు లేదనుకొను పలకేలఁ గిలించి
 ప్రౌఢ యొక్కతె కాంతఁ దోడి తేగ
జెలువ పావడ నొక్క చెలిగంధ గజయాన
 చిఱునవ్వు మోముపైఁ జెమటఁ దుడువఁ
గొమ్మయొక్కతె చాల గుబ్బపాల్లిండ్లపై
 నిసుమంత జాఱు పయ్యెద నమర్ప
మృగనేత్రి యొక్కతె చిగురాకుఁ బోడిమన్
 గొప్పునఁ జెదరిన కురులు గూర్ప

గీ. బిత్తరముజిమ్ము చూపుల మొత్త మంత్రము
లందు నీలాల యందెల నందమందఁ
బ్రేమయును సిగ్గు హర్షంబుఁ బెనఁగొనంగ
సరగ నాంచారు మను పెండ్లి చవికిఁ జేరె. 583

## ఉపమానాలంకారము

క. నెలవుగఁ జేరిన నచ్చెలి
కెలనన్ దమిమీఱ నిలిచి కేశవుఁ డొప్పెన్
వలరాచ యాక మామిడి
సెలగొమ్మను పండుడాయు చిలుకయుఁ బోలెన్. 584

క. అంతట భూసురకామిను
లంతంతను వివిధ భూషణాలంకృతలై
వింతలుగ మణుల నారతు
లెంతయుఁ బళ్ళెరములందు నిడికొని వేడ్కన్. 585

## సకల యమకము - అపూర్వప్రయోగము

ఉ. వాలుమెఱుంగు మేని జిగివాలు చొకాటపు నూగుటారు మేల్
వాలుగడాలు రాయనిరవాలు మిటారపుఁ బల్కు చందు సాఁ
బాలు నొస ల్ప్రసూనముల వాలు వరాళులు చూపు నెమ్మి బల్
వాలుకచంబునౌ చెలియ వాలుగ నీయురవాలు నయ్యెడన్. 586

వ. అనుచు నలిచిన మనమ్ముల. 587

గీ. వలయ నగవలయిత ధరావలయమునకుఁ
బతివి గమ్మన్న రీతి నారతులు ద్రిప్పి
భువిని నాచంద్రతారకంబుగ సుఖించి
యెపుడు మనుమనుక్రియఁ బొడవెత్తి రపుడు. 588

క. పుడిమిఁగల సాము లందఱు
వడి నితవికి సాటిఁ బోలవచ్చినవారి
న్నొడిసి పడవైతుమను క్రియ
వడి నెఱ్ఱనిపూలఁ ద్రిప్పివైచిరి మిగులన్. 589

## ముద్రాలంకారము

మత్తకోకిల. గానవైఖరినందు గొందఱు కాంత లయ్యెడఁ జేరి సో
బానయంచొక పాటఁబాడఁగ బాడినంతనె వింతయై
గానుపింపఁగఁ బూర్వశోభన గాథలెల్లను మీఱఁగా
మాని నుల్కావగూడి పాడిరి మత్తకోకిల రీతులన్. 590

క. అంతటఁ గూరిమి యల్లుని
సంతసమున డాయఁజేరి జనపాలకుడున్
గాంగాయుతుఁడై మణిపీ
ఠాంతరమున నుంచి విప్రులనుమతి జేయన్. 591

గీ. పసిడి చెఱఁగులు గల మధుపర్కమిచ్చి
సకల మణిమయ రుచిరభూషము లొసంగి
రమణ నిర్వర గోత్రనామములు జెప్పి
యనుఁగు టల్లునిఁ బ్రార్థన మాచరించి. 592

క. సుముహూర్త మనుచు సాదు
క్రమమున భూసురులు బలుకఁగా భూ విభుఁడు
రమణీయు మనమున నరలోక
క్రమమున నడుపుచును గౌతుకము మెఱయంగన్. 593

క. అభ్యంతరులగు దొరలుఁన్
సభ్యులు వినుతింపఁ బెండ్లి జగతిన్నియతిన్
'తుభ్యం ప్రజాది సత్క
ర్మభిః ప్రదదామి' యని కరమ్మునఁ గన్యన్. 594

గీ. దారఁబోసిన యన్న తదనంతరంబున
బంధుజనులు మోద భరితులగుచు
నిరుపురకును సిగ్గు తెరజాల దేయంచు
నవ్వుకొనుచుఁ దెర నొనర్చినంత. 595

క. మరుఁడా నడుమను నెలకొని
గరగిరి గరువగను దమ్మి కలువల కోరుల్
సమకూర్చి యేసె నోయన
నిరుపుర నెఱిజూపు లమరె నిరుపుర మీఁదన్. 596

శా. రాకా చంద్రముఖీజనంబులు మదిన్ రాగంబు లుప్పొంగఁగా
జోకల్గూడుక పెర్ణభేదములచే సొంపుల్ జెలంగ న్నికా
నీకోదార రవంబు మీఱ బుధులెంతే సన్నుతు ల్సేయఁ గౌ
రీ కల్యాణముఁ బాడి రప్డు గరుడాద్రి స్వామికిం బొందగన్. 597

క. చెంగటను జేరి ధవళము
రంగుగ వినుపింప నిజకరమ్ముల నలమేల్
మంగనుఁ బ్రేమన్గళమున
మంగళ సూత్రంబుఁ గట్టె మరు గురుఁడంతన్. 598

క. పుత్తడి పళ్లెరములఁ దెలి
ముత్తియపుం బ్రాలు నించి ముదమున మంత్రుల్
హత్తి యిరుగడల నుండఁగఁ
జిత్తమలర శౌరి బ్రాలు జెలితల నుంచెన్. 599

క. కొప్పున జాఱిన తలఁబ్రా
లప్పుడు సతి కొప్పె వింతయై చూపఱకున్
గప్పు మొగుల్ ముత్తెంబులు
కుప్పలుగా మేలు వాన గురిసిన భంగిన్. 600

వ. అట్టి సమయంబున

## ఉపమాలంకారము - అపూర్వప్రయోగము

క. కులుకువలి గబ్బి గుబ్బల
కలిమి చెలిన్ హరి కరమ్ముఁ గైకొను టొప్పెన్
వెలిదామర విరి మొగడలు
గలకమలిని గమిచినట్టి కలహంస బలెన్. 601

## నష్టోపమానోపమేయ యథాసంఖ్యా లంకార సీసరాజము

సీ. ఘన శుకాబ్జ మృణాళకంబు శైలకరభ
కచవచః పదభుజాగళ కుచోరు
భారీభ హరిరాజ పల్లవరాజీవ
నఖకటిగతి మధ్యముఖ కరాక్షి
శ్రీసుమావళివసు వాక్స్రీకుంద విద్రుమ
శ్రుతి తనుదృక్కాంతి మతిరదోష్ఠ
రతిశివాకూర్మి పరభృత హీరార్ధేందు
జనిగుణశమవళిస్వరహృదళిక

గీ. చంద్రికావర్త దర్పణ చంపకమణి
విషధరవకుళ హాసనాభీకపోల
నాసికాంగుళరోమ రాజీసుగంధ
యనుచు నలమేలు మంగమ యలరె నపుడు. 602

సీ. పడతితో శౌరి పుత్త్రడి పెండ్లిపీఁటపై
వసియించి వృద్ధతాపసపురంధ్రు
లిరువురు శుభవేది నిడినట్టి హవ్యవా
హంబున లాజహోమం బొనర్చి
ప్రేమానుబంధంబు పెంపునఁ గొంగు ము
ళ్లమరంగ సప్తపదములు నడచి
వనజగేహిని చేత సనికల్లు మెట్టించి
ధ్రువు నరుంధతి వేడ్కతోడఁ జూచి

గీ. వేలుపులకెల్ల వేలుపై వెలయుదాను
మామయింావేల్పు దర్శించి మధుర భక్ష్య
పానీయ భోజ్య వస్తువులతోడ
హైమభాజనముల బువ్వ మారగించె. 603

క. ఈగతి నాలుగు దినములు
సాగిన మఱునాటి రేయి శాస్త్రోక్తముగా
నాగవళి కంబవల్లియు
నే గు న్బెండ్లియుఁ జెలంగె వృషగిరి పతికిన్. 604

## శుభలక్షణ వచనము

వ. అప్పు డన్నరపతి యొుఱ పతిశయిల్లు కదలి యిల్లుగాన మరి తన కల్లుం డైన గోవిందునకుఁ దన తనయపౌత్తున నారగింపు జేయించి, తనకోర్కె సఫలం బాయెనని యెంచి యవ్విరించి జనకునకు నరణంబుగా మించులు గండపెండెరంబులు రాకట్టు మొలకట్టు లుంగరంబులు ముంగై మురారు లంగదములు చేసరులు చేకట్టులు హంపీరతాయెతులు తాళీలు కంఠ మాలికలు కంఠసరు లుత్తరిగెలు చౌకట్టు లొంటులు మురువులు తురాలు కిరీటంబులనం బరఁగు నాభరణంబులును పీతాంబరంబులు నీరాదులు బురుసాలు వన్నె మణుంగులు చందురుకావులు గంధకావులు మాదళం బులు తోఁపులు మేఘ వర్ణంబులు పచ్చపట్టులు చీనీలు శాలువలు కబ్బా యిలు నడికట్లు చౌదగులు హాసావళులు తగటిపాగలు చలి కప్పదంబులు సకలాతి గుడారములు బుర్నీసు బల్లాని తెట్టులు తిప్పనక్క గోడసరా దుల పటవిశేషంబులు పిరంగికత్తులు బంఘురగంధ సింధురసైంధవ శిబికాందోళికోష్ట్రి సందోహంబులు సోగసన్నంపు గోమ పేముటానియ బల్లిదంపుటల్లిక నాబరించు జిబునీ జిబుకుతిపేబపంతి వింతఁజూపట్టు కెంబట్టు చందవాపొందికఁ జెంది జనుల గనుబండువులగు హాయల్ బందు లును రత్నకంబళంబులు దుద్దు గంబళులు జమ్మఖానాలు జముకాళంబులు తివాసీలు పట్టుచాఁపలు పగడాల కోళ్లమంచంబులు కుంకుమ పువుపరపుఁ బఱపులేకరంగీతలాడలును సుఖవుశాప్రా కురాడంబులు పరంగిపీటలు చదరంగంబులు పగడసాలలు హాన్నంచు సురఁటులు ఛత్రచామీకర ముకుర పీటికాకరండ కర్కరికాకుళాచి కాబిరుద ధ్వజంబులు జాలవల్లికలు పింగాణిగిన్నియలు పన్నీరు చెంబులు గంధపు గ్రమాకులు జవ్వాది వంకులు కస్తూరిపీణెలు పునుఁగుజట్టంబులు కప్పురపుఁగ్రోవులు లేటి కౌదమలు పొట్టేళ్లు పంచవర్ణముల చిలుకలు గోరవంకలు మయూరం బులు పావురంబులు డేగలు పికిళులు బచ్చికోళ్లు రుద్రవీణియలు స్వర మండలంబులు తంబురలు కిన్నెరలు రావణహస్తంబులు రబాబులు మీటు సురతానులు కామాక్షులు ముఖ వీణెలు పిల్లఁగ్రోవులు దండెలు ఢక్కీలు చంద్రవలయంబులు రతనంపు తంబిగలుఁ కుందనంపుబిందియలు పైఁడికొప్పెరలు వెండికొప్పెరలు వెండిదివెగంబంబులు లుడుగరదిం డ్లును సంచపు రేకుబాగాల దంతపుబరణలును మఱియు వినోదోచితంబు

లైన వస్తువులు సిస్తుగా నొసంగిన నంతలోన నలమేలుమంగ తన తల్లి దండ్రులైన జంద్రకళకు నాకాశరాజునకు దండంబులువెట్టిన యప్పటికిఁ దగినరీతుల బుద్ధులు సమకొల్పి నవరత్నంపు టొడిబియ్యంబునించి నానావిధాంబరాభరణంబులు బసపునకుం బసగలిగి యసంఖ్యంబులగు వస్తువు లొసంగి గ్రామంబు లాలమందలు దాసీజనంబులు సమర్పించిన యాపిమ్మట దత్పరిజనంబులకు వారయాత్రికులకు విందులకు విందులిడి భూమిదొరభబూమికఁగ నిగుడి ప్రేమగనియగు లచ్చిమగని నిగనిగనిమేచ గని పొగడని యెదతెగని పొగడిక నెసఁగనిలిచి వేతొకతలఁపురానీక నీకటాక్షసుధోర్మికా నీకమ్ముకమ్ముక మేనం గ్రుమ్మరించు మనుచు భావంబున సాష్టాంగ నమస్కారంబుతోఁ దదుచిత బహుమానంబు లొసంగి దనపట్టినిఁ బట్టుగాఁ జేబట్టుమని మనవిగాం బరికించి యొప్పించి బంపి జెలువంది వంధిమాగధ కైవారంబులుమీఱ సమీరబలశాలియై యానాలోచనచేసి ఖలమదకల కేసరి తనకేసరియైన దేవేరితో బంధు యుతంబుగాఁ బరివారంబులుం దానును నిజపురంబుజేరి కొలుచువారిఁ దదా వాసంబుల కనిచి చంద్రకళతులగల చంద్రకళతో నాకాశరాజనిభ యశోవిశదుఁడగు నాకాశరాజు నందనునిభక్తి నిజనందనునిశక్తియుఁ గలిగి యాశాతటినిస్తుల ప్రశస్త యశస్తరుణీస్తనోపరిభాగాగ్రహారం బుల దాన శీధు సాగర శిక్య శీకర మద ఘర్మ మేఘాష్ట మదధారావాహం బులకుం దావలంబగు దంతావళంబుల నమరుచు నభిమానవిధూత సుయో ధనుండును నభియాతి చేతోభయదాయోధనుండును నఖిల సప్తాంగ సాధ నుండును నహీన శయనానారతారాధనుండును నక్రాంతతత్త్వబోధ నుండును నపరిమిత శ్రీధనుండునునై యలంకృతుల మెఱయు చమ త్కృతుల ముఖ్యకృతులు కృతులఁ దనుఁబొగడ సకల భోగంబు లనుభవింపుచునుండె.

నక్కడ శ్రీ వేంకటేశ్వరుం డలమేలుమంగ నాంచారుతో నపరంజి కుప్పెల నొప్పారు బికిలి పారుకుచ్చులు నింద్రగోపంబు రూపంబు జగజంబారికుచ్చులు జుట్టు సరిగపని సింగంపుఁ బ్రతిమల యల్లిక పసమించు ముసనాబును బొంకంబగు గుంకుమపువ్వునించిన పచ్చ తాప్తా పరపుగను పఱపును నిద్దంపుఁబసిమి హురుమంజిబిల్ల నేత పట్టు జూపట్టు పచ్చడంబును దళకులుగులుకు జీవదంతంపు గుత్తంపు

గొడియలును గ్రొమ్మానిపండ్లకై మలసి చుట్టు ప్రాలివ రాచిలుకల తెఱంగున బచ్చఱాల కెంపురవల చెక్కడంబు రంగారు బంగారు చిలుకల దిండ్లును జీనానూలి త్రాళ్లను నేనుఁగు కొమ్ము పోటు పెరకు గఱినరుకు లాకు జీరవెండతీటిక నులివంక యగ్గిసోఁకుడు పొక్కిడిపులుగు ముక్కునొక్కు పుప్పి చీమదిండి యేకలమ్ము సెలవు నిడుద గఱుపు లేఁతయు ముదురు సన్నము గమకంబు నీల ధవళ రక్త హరిద్వర్ణంబులు మొదలుగాఁగల దుర్గుణంబులులేక వీఁకగాఁబసపునిగ్గుచే మొదటినుండి సోయగమ్మునఁబెరిగి వెనుక నెనిమిది ముంగల తొమ్మిది నడుమ కుఱుచ గఱుపు పీరైదు నొకటిగలిగి యోరశిరంబుగా తెఱగంటి దొరవింటి తెఱగంటిన కొమ్మున బికిలిపూ పన్నాంగమును సూర్యపుటపు టొఱుగును గల యందలమ్మున నధివసించి యాత్మీయసేనా పరివృతుండై ముక్కుని తుదలఁ జుక్కబొట్టులు జెవులమూయు కుళ్ళాయిలు కటులనీలికాసెలు జొనిపిన కుఱుచ పిడెమ్ములు జంకలవ్రేలెడు తోస్తానంపుఁదిత్తులు బదంబుల బిగువారు బిల్లమెట్లు నిరుకువీఁపులు సరిదిళ్ల గడియంబులు కాయలు గాచిన నెగుభుజంబులపైఁ తడిబట్ట పొత్తులు దనరుబెత్తలు సిస్తుగా మోచి నిబ్బడుగు ముండ్లడియంగాలజుకుపు వైసరంబోరడి యడుగులో జతనము మోరడి బలిమికం బొద్దిక బొట్టడి చిట్టడిమోపన మించడుగు దువాళిసమాధాన జల్లిక యిప్పరము కిరడుపాద బెళుకడుగు లోదాటు నిల్బరము జడుకు లోజీవదానపాదొత్తుగల్లు కరెకప్పుపటము తాకుడు మైసుళుపుమారు వెంబడి మెదుగుడు సెలవుచోరుగొమ్ము మోపడుగు సీరడికండబలిమిలాగు మోపులహొయలు బిగువు మొల్లడిపదిలము హెచ్చరిక స్వామిపరాకన విని సంతసిల్లి కంసారి మునుపుసారి వెడలిన దారిని దుముగారిగా వేగంటిదునేవారి రాజసమ్మునగు మీసరమ్మునఁ దచ్చుభవాసరమ్మున వచ్చునప్పుడప్పుడవాళ్లేతెంచి సాష్టాంగదండంబు లాచరించిలేచి శంకలేక సంకలఁజేతులిడుకొని యందుఁ గొందఱుకరమ్ముల వాతెఱలు మాటుకొని తగ్గిమెల్లనె సవినయంబుగా 'నో, లోకనాయకా యీయిక్క నొక్కమొక్కలంపు బోయరాయిడి సేయుచు దేవరకు గనుంగొనువాఁడైయున్నాఁ' డనిన నవితరసాధారణ దారుణ భుజప్రతాపాటోపంబు దీపింప విజయభేరీ దంధణధ్వానంబులు దిక్కులదర రథ గజ తురగ పదాతులతోడఁ గదలి వచ్చునదియు జైత్రయాత్రా సంరం

ఘంబని విజృంభించుచుఁ బాషండహృత్పుటభేదనంబగు నిజపుటభేదనంబు
నకుఁ జేరునయ్యభ్యంతరంబున 605

# నాగదత్తోపాఖ్యానము

## ద్విరుక్తి రూపకనియమదళత్రయఘటిత చరణసీసము

సీ. రసరసాధికసంతమసమసారగవి
 హాయసపాధూన్నతి హర్మకంబు
ధరధరార్చక మహీసురసురాజకవైశ్య
 వరవరావరవర్ణ గురుతరంబు
మదమదావళబలాస్పదపదాత్యాజికో
 విదవిదాశ్వశతాంగ విలసితంబు
నవనవామోదసూనవనవనవాపుత్థకై
 రవరవాన్విత బంభరవ్రజంబు

గీ. వెలయుఁ బారావతారావ కలితలలిత
భావసంభవకేళికాప్రౌఢరూఢి
వారవారణయానాంఘ్రి వనజరణిత
వితత మణినూపురంబు తిరుపతి పురంబు. 606

వ. ఆపురవరంబున

మ. కలఁడభ్యస్త సమస్త శాస్త్రనిగమ గ్రంథార్థ సంఘర్షని
స్తుల వాచారభటీధురాధరితసింధుప్రోల్లసల్లోల ని
ర్మలకల్లోల ఘుమంఘుమారవయశోమాన్యస్వకీయప్రథా
కలనాధర్ముఁడు మాధవుం డనెడు సత్కర్ముండు ధాత్రీస్థలిన్. 607

గీ. అతఁడు బహుకాలమున నొక్క సుతుఁడు గలుగ
జాతకర్మాది శుభవిధు ల్సంఘటించి
భూరియిడి నాగదత్తుఁ డన్పేరుపెట్టి
ప్రేమఁ బోషించివడుగును బెండ్లిసేయ. 608

గీ అక్కుమారుండు వినయవిద్యాతిశయము
నెనయఁ దిరుపతిపట్టణంబునఁ జరించుఁ
దంౘ్రడికన్నను నెఱవాదితనము మంచి
తనముగ్రామణి మనము వర్తనముఁ గలిగి. 609

సీ. అపఠితాగమమనభ్యస్తశాస్త్రక్రమం
బపరిశీలితనిగమాంత మనను
భూతషడంగ విఖ్యాతియనుపలబ్ధ
సాహితీమర్మ ప్రసంగమవిది
తప్రౌఢకావ్య సందర్భ చాతుర్య బో
ధితగాన విద్యాప్రథితరహస్య
మకృతయాగాది క్రియాసత్కలాపమ
కాలోచిత పురాణ మననవరత

గీ. కీర్తనీయహరిధ్యాన గీతలెందు
మందునకునైనలేక సమస్తమెపుడు
గరతలామలకంబుగాఁ బరగె నతని
ధరణిసురుమాత్ర మాత్రుగా నెట్లు దలఁపవచ్చు. 610

వ. అంత నాగదత్తుం డప్పురి యాత్రావు తీర్థంబుచెంతఁ గొంతకాలంబున

శా. వీతాచారుఁడు దుర్మదాంధుఁడగుచున్ వేశ్యాంగనావాటులన్
ద్యూతక్రీడలఁ జౌర్యవర్తనలచే దుస్సంగదోషంబులన్
జేతోజాతవశంవదుం డయి జరించె న్లజ్జఁ బోనాడిన
ద్వ్రాతంబు న్దను జూచి రోయఁగ మహాౘ్రవాత్యస్థితి న్మీఱుచున్ 612

సీ. గుడిగుడిగుంజాలు చిడిగుడిచింకణా
బిల్లగద్దెన బొడ్డి చిల్లగోటి
చిరిసింగణాబంతి తరుముడు జెండును
వెన్నెలకుప్పలు కన్నుకట్టు
చీటికి మొటికాయ చింతాకుచుఱుదులు
బులియాటలును జిట్లబొట్లకాయ
దూరనదుంకముల్ దోపిడియాటలు
బంతియాలంకి దీపమ్మనముఁలు

గీ. పొట్టగీరనగింజలు బొంగరములు
గచ్చకాయలు దాఁగిరి మ్రుచ్చులాట
బంతిమెకమాట జిందర పరవులాట
లనెడు శైశవ దుర్వృత్తి నధిగమించి. 613

క. సటలు దడపటలు నటనలు
మటుమాయలు జాటువగల మాటలవింత
ల్గుటిలతయుఁ దెలిసిపొఱుఁడు
విటవిద్యకు బిరుమవేసి వికవిక నగుచున్ 614

క. నిరతముఁ జదరంగఁబున
గిరిజలసొగటాల నారికేళఫలములన్
సరిజేసి యొడ్డువిడుపులు
చెలఁకుఁబంఁదెమిడి గెలుపుఁ జేకొనియవలన్ 615

## స్వభావోక్త్యలంకారము

సీ. పికిలిపిట్టలును లావుకలుబిచ్చుకలును
గాఱుపుల్గుల జేరి కేరిజములఁ
గైదుల వలిచలఁగాట్లాట విడుచుచుఁ
గోడిపుంజులఁదన్నులాడనిడుచుఁ
బొట్టేళ్ల సన్నలఁబెట్టుచు గిజిగాండ్లఁ
బిలుపుదీయుచు జీనువులనుబైటఁ
బారాడఁజేయుచుఁ బారాలపల్లటీల్
గనుఁగొంచు రెయివేఁటలను దిరుగుచుఁ

గీ. దీంద్రవయసెచ్చఁ జేకత్తికాండ్రఁ గూడి
గరడిమాష్టీల జెట్లతోఁ గత్తిసాము
పెనుఁగులాట లొనర్చుచు బేరజంపు
టారజమ్మునఁ గడుగడి దేరఁ దలఁచి. 616

క. మల్లియలు సన్నజాజులు
మొల్లలు సంపెఁగలు మొగలిపూ ల్జేమంతుల్
మొల్లముగను వరుసగ రం
జిల్లెడు బువుదండఁ గోరసిగఁ జుట్టివడిన్. 617

## అపూర్వ ప్రయోగము

సీ. ముచ్చుసన్నంపు రుమాలు బిగ్గరజుట్టి
తొడిసన్నకసెం చల్లడము తమిని
దేవతాపూజార్థమై దెచ్చి దాఁచినయట్టి
గంధముఁ బదనిచ్చి కలయనలఁది
సిర్కావిదోవతి నెఱిక గన్పడుఁగట్టి
వలిపెదుప్పటి వలెవాటువైచి
నునుగోపిచందనంబున నొనర్చినయూర్ధ్వ
పుండ్రంబు పైవ్రేల్మి బొట్టమర్చి

గీ కేలనున్నట్టి పొత్తంబు వేళముగనె
నేల నిద్రమోవ నింకని నేలవైచి
బాలపైఁబ్రేమమిగుల దువాళిమీఱ
మదన పరితాపదోదూయమానుఁడగుచు. 618

## ప్రాసభేదము

ఉ. వ్రేలిమి వ్రేల్వఁదెప్పుడును వ్రేల్చుమొగంబు వధూలలామకై
చాలుగ సంధ్యవార్చఁడు త్రిసంధ్యలవార్చును వంటవార్పులా
బాలికయింట దండ్రిసలుప స్నననొల్లఁడు దేవపూజ యే
వేళల లంజతల్లి యిలువేలుపుమాత కిడు న్ప్రణామముల్ 619

చ. ఒకవెలయాలిమీఁద నిలువోపని కూరిమి గల్గియింటలో
సకలము దెచ్చియిచ్చినను జవ్వని యెవ్వని నిచ్చమెచ్చ కే
సకినెఁ తూఁగుటుయ్యెలను జక్కనిసామిగ రారయంచు మా
రకదనచాతురి న్నిలువరమ్ముగఁ గూడి చెలంగె నయ్యెడిన్. 620

## అచ్చతెనుఁగు

క. చికిచికి నఱసిన బొమలును
గొకిబికిమెడయెుఁగు మూతినొసలు పా
పక డెమ్మ దోలుటడుగులు
బికిలిన బుట్టంబుఁ గూని వీఁపఱచు నుడుల్ 621

## జాతి

సీ. పాడింటువలె సందుపట్టుఁ దప్పినమేను
గానుగతోలు వీఁకఁదగుకౌను
కోవెలతముకుపై కొడుపులగతిఁబొట్ట
టోకిచ్చువ్రేళ్లిండ్లు బోకినోరు
నంజివేసినతాటిగింజకైవడి తల
గచ్చకాయలవంటి కాయకండ్లు
వికలంపుఁ దెడ్లపోలిక డొంకుచేతులు
పందిటిగుంజల పగిదికాళ్లు

గీ. మంటితలపట్టుకుంటి రాకంటిప్రేళ్లు
నొంటిపలునఃటట తుంటలు గంటుముక్కు
వింటిరూపంబు బొగుచుట్ట విడుపుఁదిత్తి
గలిగిచెన్నొందు నవ్వేల వెలఁదితల్లి. 622

సీ. చిటిచాపక్రిందఁ జేర్చిన ముగ్గుదామర
తెల్లజిల్లెడుప్రత్తి దివ్వెతిత్తి
యొక్కంపు తోనూరు వక్కల బరణియు
గావుకరాటంబు గాటుటద్ద
మరుదైన తిపిరికిన్నెర తుమ్మపడిగంబు
వన్నెకోకల చందువా పిరంగి
పనిగింది చిటికెన పావురా ల్సొగటాలు
నుంజలు గౌరవంక పంజరంబు

గీ. గఁదవడిపువ్వు పొట్లముల్ గద్దెపీఁట
కాసెకంచెల గజ్జెలగ్గలపుటగరు
ధూపములు పుట్టములవేటి పాపబెత్త
మిడుపు విశ్వాసిగల పడకంటియందు 623

## ఉపరిసురతము

ఉ. దర్పకశాస్త్రమార్గమణితస్ఫుట గల్లచపేటమంత్రి యు
త్కూర్పరతాడనం బమిత గుంభిత కంకణ కింకిణీరవం
బర్పితచుంబనోద్యదధరామృతమీక్షణ పారవశ్యము
న్సర్పవరాఖ్యబంధగతిఁ జాతురి గల్గిన కూఁతు డాయుచున్. 624

క. రాజీవకేశనాదిమ
రాజీవాశుగమురీతి రాజిల్లక యా
రాజీవంజీవాక్షివి
టాజీవ భద్విలాస మరుటగనుదురే. 625

## జాతివార్త

సీ. ఇంతిరో మనవీట వింతగా మునుపెఱు
కెఱుకోయటంచొక యెఱుకసాని
యేతెంచె నడుగవే యోయవ్వ యొకసుద్ది
సెప్పెద బాగెపు సేయిసూపు
కొల్లాపురమ్మాన పొల్లాపులే దొండుఁ
దలఁచితి వదిగాదుదయవిటుండు
గడకేగు నిను బాసి కన్నది పెఱవాని
నిన్నుఁ జేర్చు నెఱుంగ నేరవీవు

గీ గానఁ దరకట బురకట గాదు మేట
జేరుబురకని తోడితే తారుకాణ
యొుఁడు రెఁడేధినాలలో దుండినాదు
మాటమఱువకుమని పోయె మఱచినావె. 626

మ. చెలుము ల్దప్పకమున్న గూర్మెలెదల న్జిట్టాడ కన్మున్నఁ బో
టులు బైకోకయ మున్న నెచ్చెలులు వీడ్కోల్ గాంచునఁ మున్న మా
టలు నీవే నను మున్నదఁ దొలఁగి దాఁట న్జూచు నమ్మున్నగాఁ
దొలఁగం గావలదే చెలు ల్వీటు ఁపొందుఁ ల్నీటి పైవ్రాఁతలే. 627

గీ. ఇంతినీకుఁ దెల్పు నీరసం బగునేనిఁ
దెలివి పఱతు నింకఁ గల తెఱంగు
నన్నుఁ జేరబిలిచి నమ్మింప దామర
పాకు నీటి చందమయ్యె మనసు 628

క తెల్లని వెల్లను బాలని
యుల్లంబున నుంకి గుడిని యుండియు నుడి తా
ళెల్లఁ దెగగోఁయు టెఱుఁగక
గల్లదియై కుడిచి నింటి కడయే రెండున్. 629

## అపూర్వప్రయోగము

క. తాబొమ్మకు గిలిగింతలు
నీ బోటిని బేలుపఱచి నేఁ డిదె చుట్టం
బై ఖమయించెను నన్నున్
సాబా సే బాలవాని సరసకుఁదియ కే. 630

శా. ఓరామామణి నీదుతోడి చెలు లయ్యో సర్వ సౌఖ్యంబుల
న్నీ మఱన్ని వొక జిత్తగాని వలకు న్నీ నంబవై చిక్కితే
శ్రీరామా యిని పీనుల న్గదియఁగాఁ జే దోయి గీలించి యె
వ్వారె మౌదురౌ తమ్మి చూలి యిటుగా వ్రాసె న్గలాటంబునన్. 631

గీ. నీ విలాసంబు రూపంబు నేర్పు నోర్పు
నడవిలోఁ గాయువెన్నెల లయ్యెనకట
యిట్టి మానిసి యే నిన్ను మట్టు మీఱ
నేలువాఁడు దయన్నీకు మేలువాఁడు. 632

క. నినువంటి వారి నెందఱిఁ
గను బ్రామిన వాఁడొ వీఁడు కటకట నీ చూ
పునకు నితఁడెట్టి వాఁడై
గనుపించెనొ నెట్టివేళఁ గలసితొ వీనిన్. 633

చ. అడిగినఁ దెచ్చు వాఁడొగడు నందమునన్గననన్నైన వాఁడొ మే
ల్నడవడి కాఁడొ పీటఁ దగు నాయకమై చరియించువాఁడొ చే
విడిముడిగల్గు వాఁడొ దలవెంద్రుక లందఱు రాకుమారకు
ల్మతుపులు వానఁగాఁ గురియ ముట్టవు గారణమేమి కూతురా. 634

ఉ. ఏమని నీకుఁ దోచె నిదియేమని యూరకచూచియుందు నే
నేమని యోర్చుదాన నిదియేమని మానుపనేర్తు వీఁడు ని
న్నేమని గారవించె నిదియేమని నీకు సహించె నక్కటా
కోమలి వింతగాక మనకు న్దగునే యిటువంటి చైదముల్. 635

## అపూర్వప్రయోగము

క. ఈలాగున వానితో నవు
లాటకుఁ బన్నిదమిడి సొగటా లాడఁగనో
టాలగు నీకర్దేందు ని

క. ఓరమణి నీదు పిక్కలు
దారల నగు మోవి పంచదారల నగు స్వ
ర్ద్వారల నగుఁ జెలు వమృతపు
దారల నగు నుడి నఖాళి దారల నవ్వున్. 637

## యమకరూప త్రిప్రాసకందము

క. పున్నాగము నగు నీ యూ
రున్నాగము గేరు నీదు పొక్కిలి బటువా
పున్నాగము నగు నీనడ
పున్నాగము నెనయ కధముఁ బొందితి తగవే 638

## కావ్యశ్లేష సీసము

సీ. తెలుప నీతీయవాతెఱ మణిసారంబు
రమణి నీ నెన్నొసల్ రసతిలకము
పొలఁతి నీమోము ప్రబోధ చంద్రోదయ
మతివ నీనవ్వు కావ్యప్రకాశ
మబల నీచూపు టొయ్యారంబు కౌముది
కలికి నీమే నలంకారసరణి
కొమ నీ కనుంగవ కువలయానందంబు
మగువ నీ చన్దోయి మంజరిగతి

గీ మెలఁత నీకొప్పు మేఘసందేశమయ్యొ
గలికి నినుఁ జూచి నంతనె గలుగు నతను
విద్య రసికుల కెల్ల నుర్వీస్థలమును
గాఁగ నినువంటిజాణ కీ ఖలుఁడు దగునె 639

సీ. జాజికాయయుఁ గురాసానియోమము వస
చెంగల్వమర్దు మాతంగి పచ్చ
యెన్ను లుమ్మెత్తవిత్తు లేనుఁగు మదము ప
చ్చికనుంచుపుర్వుమై చెమటమన్ను

గఁబూర గుల్లసున్నఁబుఁ గాల్మడిచేత
నూరి నీడనె దడియాటినంతఁ
బసరపుగొమ్ము మేల్బరణిలోపల నుంచి
విడి గురిగింజంత విడెములోన

గీ. నిచ్చె గాఁబోలు లేదేని యింతవాని
పైఁదమాసున నేవేళఁ బ్రక్కఁజేరి
గడియసే పెడతెగలేక కలసి మెలఁగఁ
గారణంబేమి దెల్పవే గలికి మిన్న. 640

గీ. చాఱపప్పును గసగస ల్జాజికాయ
సెనగలను ములువత్రియు మునుగపువ్వు
కొబ్బెరయు మందపాలతోఁ గూర్చి త్రావి
యుబ్బు దబ్బఱకాఁడు నీకబ్బుటగునె. 641

## అపూర్వప్రయోగము

క. చెల్లఁబో హిందోళకథ
మ్మల్లికుఁ దీయమోవి గలుగు మదిరాక్షీ మ
త్తల్లికి పాణితవాణికి
పల్లెయె యీజూటుకూటు వల పొనరింపన్. 642

## అపూర్వప్రయోగము

క. నాచిన్నిబిడ్డ విను తను
శ్రీచిన్నముగలుగు దొరను జేర్పక వృథగాఁ
జూచుచు నోచెనాకో నీ
చేచిగురా కిట్టిబెట్ట చెట్టును బట్టన్. 643

క. కుటిలుఁ దపకారి జూదరి
లొటలొటకాఁ డగడీఁడు లోభి ఖలుఁడు దు
ర్విటుఁడు బలురోగి తక్కరి
మొటిగిడి ఖాపన గరాసు ముట్టకు మబలా 644

సీ. నీవుగల్గుటకుగా దేవళ్ళ గుళ్ళఁ బ్రా
డాచార విధులెల్ల నలవరించి
నోములువే లెస్స నోఁచి వెన్నుఁడునో దయ
చేసినయ్యంతనే ఛీరజిక్కి—

తెలుపెక్కి చెక్కులు వెలు లుబ్బుఁగని గౌను
బిలసి నెన్నడ దొట్రుపాటుఁ జెంది
చను మొనల్కప్పాని మను దానిపై యాస
గలిగి వేవిళ్ళచ్చి కనుల నలఁత

గీ. బొడమి యిటుఁ దొమ్మిదినెలలు కడుపుమోచి
మంచిలగ్నంబునను నిన్నుఁ గాంచి నామ
కరణ మొనరించి సంతోషకలిత నగుచు
నేటఁబెంచిన దానిని న్నూటఁబెంచి. 645

మ కొసరు న్బల్కులు తప్పులే యడుగు లుగ్గు ల్గోరుట ల్చాచి
గు సుమాళంబులు మద్దికాయవగ పోగు ల్గాజులు న్బొద్దులున్
రసవు న్దాయెతు గజ్జెలందియలు దోరంబైన పుల్గోరు క్రొం
బసపు న్దా ల్గుబుసంబు జెన్నలరు నీ బాల్యంబుఁ జూచంతటన్. 646

## అపూర్వప్రయోగము

గీ. వయసు గనుపట్టుచో నాదు వాంఛదీరె
ననుచు నెరియెంచి నిన్ను నన్మనుప నింక
భారమని దెల్పి నేను నీ బల్కుబడిని
నమ్మి మనజాతి నడవళ్ల నాయముగను. 647

చ తెలిపినవన్నియు న్దెలిసి తేఁకువ వేకువమోము మజ్జనం
బలవునఁ జేసి గన్నుఁగవయందునఁ గాటుకరేకఁ దీర్చి మే
లలికమునందుఁ జాఁదిడీ యొయారపు గుబ్బలవాడఁ గంకుమం
బలఁది కచంబు దిద్ది అనిక న్మకము న్దరియించి వేడుకన్. 648

గీ. వేగ భుజియించి పొగఁద్రావి విడెముఁ జేసి
సఖులతోఁ బ్రొద్దుసుద్దుల జరిపి సంజ
వేళఁ బచ్చనగిల్కు పావాలు దొడిగి
బుడత కైదండఁబూని యిల్వెడలి బైట. 649

వ. నిలిచిన.

చ. కని దొర లాసఁజేసి యుడిగంబులఁ బంపిన కీలెఱింగి మో
మునఁ జిగురొత్తు లేనగవు మోసుల సమ్మతియాటఁ దెల్పి వెం
టనె యెదురేగిజూపు చికటారులఁగాను కొనర్చి వారిఁ దో
డ్కొని బువుసజ్జ నీవు తమిఁగూడక పీడఁగ నాడి యక్కటా. 650

గీ. వలపు తలకెక్కి వాని మందులకు జిక్కి
జాత మెల్లను రోయు నీ జన్మ మేల
యొక్కనికి దక్కి చౌకయైయున్న చెలిని
సూళిగేరిని వెదకినఁ జూఁపగలవె. 651

క. ఏసొమ్ము లేటివస్త్రము
లేసుఖమే భోజనంబు లీవల పేలా
వేసమ్ములు గాసములకు
నాసలు రూకలకు గావె యదియట్లుండెన్. 652

## అపూర్వప్రయోగము

క. తొఱుఁగు తమి నిన్నుఁ జెలులం
దొఱు నలరతిదేవిరూపు తుల నీరేఖం
దుర గొనులు జవ్వాడన్
దురము న్గదల వదలఁగ జనులు ధృతులు వడిన్. 653

గీ. గుడికి ముద్రవేసుకొని కులమున వన్నె
వాసిఁగాంచి మాట వాసిఁబెఱిగి
సాని మగువలందు జాణవై మగనాలి
పాటు కోర్చి తెట్లు పద్మనయన. 654

గీ. జక్కవలఁబోలు నీగుబ్బ చన్ను లేద
వీని యురమేడ యివి కొన్ని వెతలుగాక
కతలు నీబ్రతుకింక నేమిగలదు దూరి
కూళమారి విధాత చేకూర్చె నిటుల. 655

సీ గుడిపాముపలె బుసకొట్టిన న్వాకట్టు
మాట బన్నినయట్టి మంత్రవాది
దనుఁ గని పెంచు దల్లిని జోగురాలుగా
బంధుకట్టిన యట్టి పాఁపజాతి

కన్నుల జగమేలు గలికి కొమ్మను నిన్ను
మగనాలిఁగాఁ జేయు మాయలాఁడు
తరువాత నినుఁదెచ్చి దాసి జేయఁదలంచి
యదను వేచినయట్టి యాతతాయి

గీ. గుఱుతు లొకకొన్ని మఱపులు కొన్ని వెతలు
కొన్ని యాసలు కొన్ని యుంకువలు కొన్ని
వలపులు కొన్ని దనకుఁ దోడఁగుకు మదిని
గలుగఁజేసె నితండు నా కన్నులాన. 656

ఉ. ఓర్పరియందు సత్యవిభ వోజ్జ్వలు నందు రసజ్ఞ లీలలన్
నేర్పరియందు భోగముల నెక్కొను జక్కని వానియందు, బెం
పేర్పడు శూరునందు, జగదేకవదాన్యుని యందు, మిక్కిలిన్
గూర్పుదు రింతులొక్క యెడఁ గూర్తురె పిచ్చిని యేటి కూరుముల్. 657

మ. ఉఱుము ల్మంతనముల్ విచారములు నిట్టూర్పు ల్విధిం దూరుట
ల్గుఱుతు ల్బాసలు దప్పు వావులు ననుం గుల్లోపము ల్నమ్మిక
ల్మరువు ల్మోహము లొడ్డనేరములనే మంబుల్సహాయంబుగాఁ
బరుల న్జిక్కుల బెట్టు కొండు తెఱఁగు ల్బాటిల్లు నే యెల్లెడన్. 658

గీ. ఏటి వెలయాలి తనము వీఁడేటి విటుఁడు
పాత పంచాంగ మెక్కడి పాతకంబు
వెలఁది కొకపూట జాలదే బెళుకులేని
మిండగినివాని కౌఁగిట నుండు సుఖము. 659

క. ఒకని పడుకింటి పొరువున
నొకని న్మజ్జనపు టింట నొక్కని మొగసా
లకు నొకని నుంచి తగులక
నొకని కొకం డెఱుంగనీక నుండు కుమారీ. 660

క. ఇత్తెఱఁగునఁ దత్తరమున
బత్తి గలుగ బ్రోఁచు తల్లి బలికిన స్త్రీణాం
చిత్తం చలాచలంబను
నుత్తమవచనంబుఁ దలఁచి యువిద గలంగెన్. 661

## శోకరసము

క. కలఁగుచుఁ గాటుక కన్నుల
జలబిందువు లురుల నవరసాల కిసలయా
కుల కోకిల కాకలికా
కలనాకలనాద కంఠకాకు ధ్వనితోన్. 662

గీ. గోరఁ గన్నీరు మీఁటుచుఁ జీర చెఱఁగు
మొగముపైఁ జేర్చి యేడ్చుచు మగువ బిగువు
గౌఁగిటను జేర్చి లాలించి గారవించి
విటుఁడ నీతోడ నేఁ జెప్పినటుల మెలఁగు. 663

క. కాదనకుము పెరుమాళ్ల ప
సాదము బుచ్చుకొని యెండ జల్లబడిన యా
మీఁదట నీయిలు సేరుము
నీదయ నున్నార మిచట నెమ్మది ననినన్. 664

సీ. చెదరిన విరుల జాఱిసిగఁ జుట్టిన రుమాలు
బస పంటిన మిఱుంగు వల్లెవాటు
గెమ్మోవిపైఁ జిన్ని గెంపుల చిమ చిమ
ల్దిట కాక్షి బుక్కిటి తమ్మలంబు
గంకుమ జనుగుబ్బ గుమ్మెడా ల్జిటుల గం
ధవు రొమ్ము నెలవంక కవురు చంక
జూపుల నిదురకుఁ జొక్కు గన్నవల కెం
జాయలు భుజముపై సానకత్తి

గీ. వార రమణీమణీ క్షపావసర కుసుమ
కాండసంగ్రామ పరిచిత గ్లానివలన
నలయు నెమ్మేను దనర మధ్యాహ్న వేళ
వెడలెఁ బడకిల్లు భూసుర విటవరుండు. 665

క. కొంచక బిరబిర నడుచుచు
నించుక దలవాంచి వచ్చు నెడ నెడపక నే
త్రాంచలములు జలకణముల
మంచుగురిసినట్లు గురియ మార్గమునందున్. 666

## అపూర్వప్రయోగము—చతరక్షరయమకము

తే. కంతుకంబు విలాసంబు గళము దంబు
కంతుకంబు విలాసంబు గనుకుచంబు
నెఱసరిని మించు మించు కేలొరపు బొదము
నెఱసరిని బెంపు జెంపుగా నెలతనడుము. 667

గీ. హరిపదముఁ బోలు జవరాలి గౌనుకౌను
మిక్కుటద్దములను గొమ చెక్కుఁ జెక్కు
గులుకు దేటుల కింతి ముంగురులు గురులు
గరిమ నిలకన్న కన్న జఘనము ఘనము. 668

## గూఢతృతీయసీసము

సీ. జవరాలి చిఱునవ్వు చవిమోవి నెమ్మోము
చంద్రబింబస్ఫూర్తి నవధరించుఁ
దలిరాకుఁబోడి నున్బలుకులు హస్తము
ల్గళము సితాబ్జ వైఖరి ధరించు
చిలుకలకొల్కి చూపులు నెన్నడుము కుం
తలములు సిబ్రాభ్ర విభ్రమము మీఱు
గామినీమణి నాస కటి గుబ్బ చన్గవ
కనకాచలోన్నతి గరిమ మీఱు

గీ. వెలఁది మైజిగి నఖములు వ్రేళ్ళు మెఱుఁగు
రిక్కలగు నింతి పీను లాకృతియు నూరు
లు నవరంభాస్థితి జయించు వనిత నడుపు
జడయు నూగారు నాగాళి సరణిగెల్చు. 669

క. అని పొగడి గడియ కల్లల
గనియుడు గని వలపుసెకల గని కలగనిగ నె
మ్మనమునఁ గినుక న్గానక
న్గను సన్నప్రసన్నత నిడి కటకకఁ బడుచున్ 670

ఉ. తీరనికౌఁగిలింత లెడ త్రెవ్వని కోరిక లంగకంబులన్
జేరిన చెమ్మట ల్మెఱుఁగు బెట్టని కూరుము లొండొకళ్ళువే
సారని జిట్టకంబులును శయ్యసమోపరి సంగమంబులన్
నూరటలొందు నెమ్మనము లొక్కటియైనది యెంచి వెండియున్. 671

## సమసురతము

సీ. తలఁపు వెంబడిగాని వలకారి చిన్నెలు
కలకూజితము గాని పలుకుఁబడులు
పునరుక్తములుకాని పొందిక మాటలు
సొక్కించుటకుగాని చూపు వగలు
తమిసురతప్రేరణముగాని లేనవ్వు
లా చుంబితముగాని యధరములును
కౌఁగిళ్ల సడలింపుగానిమై పెనకువల్
కళరేచుటకుగాని బలుచెణకులు

గీ. గాఢ సీత్కృతి సహితంబుగాని యూర్పు
లలయిక లెఱుంగమికిగాని యారజములు
నాత్మఁ దలఁచిన లేవయ్యె నౌర నేను
నాలతాంగియుఁ గ్రీడించు వేళలందు. 672

## అపూర్వప్రయోగము

ఉ. బాలికఁ దల్లి బిల్వ నఁట బల్కకయుండిన గీలెఱింగి డా
కేలఁ గుచాంశుకాంచలము గీల్కొని మోవికి ద్రివ్వ వెన్కకున్
వ్రాలిన నాతలం పనెడి బెడ్డడిసఁ బట్టదొడంగు మారుచే
గాలపుజివ్వ బోల్చెవి చౌకామెయి యెమ్మెయి డాయ నబ్బునో. 673

వ. అనుచు ననిచిన మనంబున

క. ఇల్లాలి మేన సగమును
దల్లిపయి న్సగము గాఁగఁ దక్కిన సొ
మ్మెల్లను పోకడ బెట్టిన
నిల్లని యొకటునికి డెంద మిటునటు కలఁగన్ 674

సీ. తందనాలుబాడి యందమాయెనటన్న
వానిపై మీఁది దువ్వలువ వైచి
యెదకారితనములు నడచు గత్తెరకాండ్ర
కిచ్చకమ్ములు గాఁగ మెచ్చు లొసఁగి
పిలుపుఁ జెప్పినరాక నిలిచిన బోఁటికి
రోవట్టుగా వేడురొక్క మిచ్చి
చడిదంబుల కొకింత జడియక నొకమాట
లోననె వెయ్యాఋలైన నొసఁగి
గీ. వీటిలో మిడిమేలపు విటుని విధము
సొఁగ గొన్నాళ్ళు నిజపితృసంచితంబుఁ
బొల్లుగాఁ జల్లి యదియెల్ల సళ్ళుటయును
దల్లడిల్లుచు దుర్మార్గ తల్లజుండు. 675

అచ్చతెనుఁగు

క. బా కడిదము చేకత్తియు
బోకలు నాకులును బూని బుడత గొలువఁగా
మేకొని ఢీకెంచపయను
వాకటు చాలించి యింటి వాకిటి కవలన్. 676
క. వగదప్పి తిరిగి విఱిగిన
పగిది న్దలవాంచి యెల్లబంధులు దెగడ
న్మొగసాల వచ్చి నిలిచిన
వగసాలక జనని దొడుక వచ్చె న్వానిన్. 677
గీ. ఇంటి యిల్లాలిచేఁ దలయంటఁజేసి
మజ్జనము భోజనంబు నమర్చి పిదప
వీడియ మొసంగి సాత్విగ జాడనున్న
కొడుకు తలదువ్వుచును తల్లి నుడివె నిట్లు. 678
ఉ. గట్టులు వేదవిద్యలక గారము శాస్త్రవివాద రూఢికిన్
బుట్టినయిల్లు శీలతకు భూస్థలినట్టి గృహస్థునందు నీ
యట్టి కులైకపాంసనుఁడు నక్కట గల్గునె యాణిముత్యము
ల్పుట్టెడు దామపర్ణి మఱి బుట్టకయున్నదె యొఱగుల్లయున్. 679

ఉ. సాధుతనంబున న్మెలఁగి సజ్జనుఁ డంచును మంచివారు ని
న్నాదరణం బొనర్ప వినునట్టిది మేలు గణింపఁ జెల్లదీ
జూదరియంచు బల్కు వినుచు న్గరియించుట లెల్ల పీతమ
ర్యాదములౌ ప్రయోజనము లర్హములే మహిదేవజాతికిన్. 680

## నారికేలపాకము

శా. బంధుద్వేషదవాగ్ని గంధవహముల్ బాపావలంబాఙ్ఞతా
గ్రంధుల్ సంచిత చిత్తభూరుహకుఠారంబుల్ సుసంసారబీ
ర్ణాంధుప్రస్ఫుట పాతహేతువులు వేదాంతజ్ఞధైర్యాబ్ధిసీ
గంధేభంబులు వారకామినుల వీక్షల్ నీ వపేక్షింతువే.

సీ. ఉత్తముం డురుతత్త్వవేత్తయు నిర్జితేం
ద్రియుఁడు దుర్జన జయాధికుఁడు సర్వ
శాస్త్రార్థపారగుఁ డస్త్రశస్త్రవినోది
సకలభూతహితుండు శాంతచిత్తుఁ
డతిథిపూజాపరుం డార్తావనుఁడు దయా
శాలిసముండు సుజ్ఞాన నిష్ఠుఁ
డర్థవంతుండు సదాచార సంపన్నుఁ
డీషణత్రయదూరుఁ డింగితజ్ఞుఁ

గీ. డన్నదానచణుండు మహానుభావుఁ
డు పితృభక్తి కల్పుండు నిష్కపటగుణుఁడు
సత్యవచనుండు నిఖిల లక్షణ తనుండు
శౌరికీర్తన యుతుఁడు సజ్జనుఁడు గాని. 682

## ధ్వని

సీ. అవివేకి యున్మత్తుఁ డలసాత్ముఁ డజ్ఞాని
యపకారి దుర్మార్గుఁడ ప్రసిద్ధుఁ
డనృతవాది పరాంగనాసక్తుఁ డల్పుఁడు
నాస్తికుఁ డధముఁ డన్యాయపరుఁడు

మూఢుఁ దపూజ్యుండు ముచ్చు జూదరి పంద
జాల్ముండు మిత్రవంచకుఁడు లోభి
గర్వాంధుఁడు శఠుండు కాముకుండు దరిద్రుఁ
డు మలినుఁడు పతితుండు కుజనుండు
గీ. కొండియుఁడు హింసకుఁడు సాని దండగీఁడు
బంధుదూషణుఁ డసమర్థుఁ డంధుఁ డగుణి
తల్లిదండ్రిని విడనాడు తనయుఁ డిచట
నుండ రాదౌర హరియాజ్ఞ నో తనూజ 683

## ప్రాసభేదము

క. మిత్రుని తేజము విశ్వా
మిత్రునిశక్తి గలదంచు మెండుగ మిథ్యా
మిత్రస్తోత్రము వినను వి
ధాతృఁడు నీరీతి నీదు తలవ్రాసెనొకో. 684

## అపూర్వప్రయోగము

క. నీనారిని వీడి యుదా
సీనతచే దాసిదాసి చెడి తిరుగకుమా
నానోము ఫలమ నిను నే
నోనాడఁగ లేనురా తనూజాతవరా. 685

## ఆదియమకము—అపూర్వప్రయోగము

క. పారవారగభీర యు
దారోదారోర్జిత గుణత తతత విద్యా
మారామారాజిత గృహ
మేరా మేరాగవింత మెరమెర కొమరా. 686

క. మది రాగిలదోని ప్రే
రాదినేఁ డెంత వింతయయ్యెను బైపై
మదిరాక్షికొసఁగ నాసొ
మ్మదిరా జూచుకొని వెడలు మను నినుతనయా. 687

## ధ్వని - ప్రాసభేదము

క. లోకమునఁ దల్లిదండ్రుల
వాకొనరింపుచును పత్ని వదలక బంధుల్
లోకులు మేలని పొగడెడి
సీక్రియ సత్పుత్రకులు చరింతురు పుత్రా. 688

## సమాసగతపూర్ణార్థి

క. చల్లదనంబును వితరణ
ముల్లాసము చక్కఁదనము నుర్వీస్థలి రం
జిల్ల కళాభావుకుఁడై
హల్లక హితరీతి తనయ యలరుదువు గదా. 689

## ప్రసాదము

సీ. బ్రహ్మచారి ద్విజపటలికి నీడంబు
గృహి కుముదావళి కిందుబింబ
మఖిల వానప్రస్థ హరిణాళి కుటజంబు
యతిదేవత కి పుణ్యస్థలంబు
బాంధవగణ పాదపములకు మధువేళ
సజ్జనమణులకు సాగరంబు
మార్గణ కమల సంహతికి భానూదయం
బాశ్రితశిఖుల కబ్దాగమంబు
గీ. హరికథాదిమ నిగమాప్తి కగ్రభూమి
సకల శుభ పరంపరలకు జన్మదేశ
మమిత సత్కర్మఫలముల కాస్పదంబు
నైన నీ యిల్వరుసనెంత రాకుమార. 690

## దుష్కరప్రాసము

క. బాహ్లీక హయాధి రోహణ
యాహ్లాదకరోరు మానసాంబుజ భక్తి
ప్రహ్లాద సుస్వరజిత ఘన
నహ్లాస శరత్ప్రపూర్ణనాయని వదనా. 691

## కాంతి

సీ. తుంలేని దమయంతి గలవాని గలవాని
కొమరుని కొమరుని కొమరురూపు
మొన కిమ్మకొను నెమ్మెన నయమ్మున నయమ్మ
ననయమ్ము గను మేటి యయ్యె యొర్పు
తులకించు పసిడిమిన్నలమించు నలమించు
నలమించు నెసిక యతని యావి
రవణాలచేల చొక్కపురాల కపురాల
కపురాలమున గెల్చు కడిఁది యశముఁ
గీ. బూని నిలసిల్లు నీవంటివాని కిటుల
యింటలేనట్టి నథవడి యెట్టులొదవె
కొదలు దీరెచు నీయట్టి కొడుకు గలుగఁ
దల్లిదండ్రుల కిపుడు వీతనయ తనయ. 692
గీ గునియు జాత్సిగ చెక్కిట గోరు మోవి
కెంపు లత్తు కనుదుర గంధంపు చిటులు
వాడు పసపంటు వసువతో వచ్చినట్టి
పుత్ర యిది కాని నడతకు పులుగు గాదె. 693
శా. నామాట ల్విననేరకే నియతి నున్నన్నస్మ హవ్యంపుగా
కేమీ దానఁ బ్రయోజనంబు గలదే యేలన్నఁ బూర్వంబునన్
రామాదు ల్పితృవాక్యపాలకులుగారా వారు నీసాటి రా
రా మెం డొడ్డఁగ నేలరా తనయ రారా లేచి నా వెంబడిన్. 694
సీ. దీపితక్షాంతి ప్రదీపంబు కోపంబు
పాప సర్పాంధకూపంబు కోప
మా పూర్ణనయ కక్షాక్షేపంబు కోపంబు
బంధు సుస్నేహదీపంబు కోప
మాపాదిత ప్రభాలోపంబు కోపంబు
భయదవచోస్త్ర చాపంబు కోప
మాపదుగ్రానలాటోపంబు కోపంబు
పౌరుష్యగుణ కలాపంబు కోప

గీ. మంబర సుమాత్యబద్ధ రూపంబు కోప
మంబుజాక్ష కృపాదురాపంబు కోప
మంబికావేశహేతు ధూపంబు కోప
మగుట కోపంబు వలదు మాయన్న వినుము 695

మ. అవివేకాస్పదమౌ పరాంగనల సఖ్యంబేడ నీయాయజూ
కవిశిష్టాన్వయమేడ నిర్దయుఁడవై గారాబుటిల్లాలి శీ
లవయోవిభ్రమ ధన్య నిట్లలంచ మేలా తల్లినిం దండ్రినిన్
జివుక న్జేయుదె పుత్ర నీవెపు డుదాసీన ప్రచారంబులన్. 696

గీ. అన్న యేలయ్య నిను విన్న కన్నవారు
గానివాఁడనఁ దలవంచి యేనుమెలఁగ
నాఁడు నాటికి నీకాని నడతచేత
గులము నిల్లుని వేఱుకాఁ దలచినావు. 697

సీ. సాధువర్తన ననూచార సంతత గుణో
త్తరుఁడైన తండ్రినిఁ దలఁచవన్న
యాయజూక మహాన్వవాయవరేణ్యుఁడై
దగు మేనమామను దలఁచవన్న
సత్యవ్రతాచార నిత్యవర్తనల ను
త్తమనైన నిన్నెదఁ దలఁచవన్న
కుల రూప గుణములఁ దులలేని యౌవనో
జ్జ్వలయైన యిల్లాలిఁ దలఁచవన్న

గీ. ప్రౌఢులగు తోడివారలఁ జూడవన్న
వాడను సజ్జనశ్రేణిఁ గూడవన్న
యాడికల కోర్చు మతి విడనాడవన్న
నేఁడు మొదలుగఁ గీర్తిరా జూడవన్న. 698

## ద్రాక్షాపాకము

క. పదునాలుగేండ్ల ప్రాయపు
జదురాలి న్ముద్దరాలిఁ జక్కని యాలిన్
వదలుదురె యకట! యది నా
పొదిగింటిలో నిదురఁబోవఁ బొసఁగునె తనయా. 699

ఉ. కొమ్మను నేలుకొమ్ము కడికుందన మీవిసుమమ్ము రెమ్మ రే
గుమ్మ తుపాసిరేక నిది కోపుజగా జిగి గ్రమ్మ తెమ్మె ర
త్నమ్ము బెడంగురంగు విడిదాల్చిన పైఁడిగనమ్ముబొమ్మ శ్రీ
లమ్మరునమ్మ యిట్టి నవలానవలా నొక బాల బోలునే 700

## సుకర ప్రాసము

క. అరవిందానదీధితి
కురువింద రదాంశకంబు కుఱుఁచు గనిన బల్
గురువిందగింజ వాతెఱ
సరవి న్దగు లికుచకూచను సదల న్దగునే. 701

శా. అన్నా నిన్గని యెత్తిపెంచి యుపవీతాన్వీతుఁ గావించి యీ
కన్నెన్బెండ్లి యొనర్చి మీ రిరువురు న్గారాముచే నొప్పఁగాఁ
గన్నుల్జల్లగఁ జూతునంచు మదిఁ గాంక్షమ్మెఱ నేనుండఁగాఁ
జిన్నం బుచ్చితి విన్నినాళ్ళు నిను దుశ్శీలుండవై పుత్రకా. 702

శా. సారస్యంబునఁ దండ్రికన్న సుగుణ శ్లాఘుండవై భూమి భృ
ద్ధారాదత్త సమస్త విత్తములచేతన్ సత్కృశా విత్తముల్
జేరన్ సత్కృతిజేసి నీవలర నీక్షింనంగ మాబోటులా
వా రాసింపరె చందమామపొడుపా వారాశి చందంబునన్. 703

శా. ఏమీ పల్కవు నేను బిల్వ దయలేదే నీకు నాయయ్య ని
న్నేమంటి న్సుకుమార నాయెడను దప్పేదీ కుమారాగ్రణీ
నామీఁదన్ జలమేలరా తనయ నన్మన్నించరా పెన్నిధీ
నీ ముద్దుల్గన నోచినా గదర తండ్రీ నీతిపారంగతా. 704

మ. అనిన న్మాటకు లోఁగి నట్టులనె వాడట్టిట్ట నా కూర కుం
డినఁ దా నెంతయు సంతసించి యనుమానింపం దలంపేది పు
త్రునకుఙ ప్రీతిఁగ వానిపై మమతయెంతోకాని మైనున్న సొ
మ్మును దాఁ గోడలికిచ్చి సూను భవనంబుఙ జేరఁగాఁ బంచినన్. 705

## అపూర్వ ప్రయోగము

సీ. కొలని కెలంకునందలి గుజ్జుతేమావి
చెంగటఁ జలువ గొజ్జఁగులఁదగిన
నురపొన్న దరికి నుత్తరపుఁ గప్రపుటనం
టులపజ్జఁ బొగడలంటులనెగడిన

బెనుపల్లెలం గల సంపెంగలఘుమఘుమ
ల్గలగొని సోరణగండ్లదారి
గని వచ్చు గరువలిఁ గదలు జంత్రంపుఁ బ్రతి
మలు వాయించు మద్దెలరవళికి

గీ. దొలుత సుతి కోయిల యొసంగఁ దోడ గోర
వంక తాళము లుగ్గడింపంగ నెమలి
సకియ నటియింప మరునాట్యశాలలీల
పంతువగ బొల్చు కేళీ గృహాంతరమున. 706

చ. చికిలి కిరీటపచ్చరవ జెక్కడుపుంబని పాదపట్టెలన్
రకమగు బూదిదాల్పువిడిరాజిగి చొక్కపు టెచ్చుకోళ్లపై
సకినల పల్కగ న్విరడ సంతన గూర్చిన జంటపోగుట
ల్లికగల కీలుమంచమున వేవడి బాడబుఁ దబ్బురంబునన్. 707

చ. చెఱగులు నాల్గు సుక్కెడఁ జేసి బిగించి గడున్వెలార్చు పూ
పఱుపున బవ్వళించి దన పైదలి రాకకుఁ గల్వనేస్తి బల్
చుఱుకు హొరంగు రంగుగల సోరణగండ్లను దృష్టినిల్పి ద
త్తఱపుమవాళి చూపు బెడిదంబునఁ జూచుచునుండి యయ్యెడన్ 708

## భావశబలితము

మ. చెలిపల్కెప్పుడు విందునో నగరె నా శీలంబు గన్గొన్న గొఁ
గిలి నాకెన్నఁ డొసంగునో సకి మృదూక్తిన్ దల్లిబోధింప మ
ర్మలయ న్దోసము గాదె నే మనుదు నాత్మన్నాతప్రాల్లప్పునే
నలనా మోహినిఁ జూడకున్ననిక నాప్రాణంబు లెట్లోకదే. 709

## స్వభావోక్త్యలంకారము

సీ. మొదటను రేక యొకుదురున గనుపించి
మొఁకలై మొగ్గలై తళుకుఁ గలిగి
గఱిగట్టి పోకల కలమట్టులై బొన్న
కాయల యంతలై చాయలెసఁగి

తాళములంతలై దగనిమ్మపండుల
కొద్దులై బొంగరా లుద్దిగాంచి
తాళఫలంబుల తరములై బంగరు
కుండల జోడులై గండుమీఱి

గీ. కొండలవిధమ్ములై ఱొమ్మునిండ దొరసి
సరిగ విరివిగ నొకటొక టొరసి మించి
మొగమునకు నెగయుచున్న బిగువు గబ్బి
గుబ్బ చన్నుల చెలికౌఁగి లబ్బు టెపుడొ. 710

## ఔత్సుక్యము

సీ. తరియించు టేలాగు తలిరుటాకుఁబోడి
వెలలేని సరసోక్తి వినకయున్న
వడదేరు టేలాగు వాలుఁగన్నుల కల్కి
వలిపపయ్యెద గాడ్పు సోలయకున్న
తమి బుట్టుటేలాగు కొమిరెపాయపు టన్ను
తలమానికపు దండ గలుగకున్న
నిదురించు టేలాగు నెలఁత వేడెపు గుబ్బ
నిండుకౌఁగిట నంటి యుండకున్న

గీ. తాపమారుట యేలాగు తమ్మికంటి
గళరవమ్ములు మంజీర కలరవములు
మూల తాకమ్మ బెళుకులు మొలకనగవు
లెనయుఁ బైకొని రతి నలయించకున్న. 711

వ. అని దురంత చింతాశబళితాంతరంగుండై కులకాంత మీఁద నొలసి యొల్లని తమి నున్న సమయంబున. 712

క. సుతు చెంతకుఁ దన కోడలి
సతతము గై సేసి పిలువ చలు వలరు మరు
త్పుతదేలాలత నాలో
లత నాలతకూన తొట్రిలం బడ నగుచున్. 713

ఉ. తచ్చనలాడి బువ్వటడిదంబు గ్రమంబున సన్నలెత్తఁగా
వచ్చిన రీతినంత గడువైపున గౌఁగిటఁ గ్రుచ్చి మెల్లనే
నచ్చెలి నంచలంచ లడు గామడగా దొడి తెచ్చి బిడ్డఁడు
న్నచ్చట నిల్పియేగెను రయంబున నొక్క నెపంబు తోడుతన్. 714

ఉ. ఎప్పుడు ప్రొద్దుగ్రుంకు సతియెప్పుడు జేరఁగవచ్చు దాని సొ
మ్మెప్పుడు నాదు చే దొరకు నెప్పుడు వారలతాంగి కిత్తు న
న్నెప్పుడు గారవించు నిది యేక్రియ నోరుతునంచు నుండఁగా
నప్పుడె వచ్చె నింతి మగఁ డైన దురాత్ముని నమ్మవచ్చునే. 715

క. వెలయాలిచైవు లెంతయుఁ
దలఁపుచుఁ దద్విరహ వహ్నితాపాలసుఁడై
గలఁగు బతిన్ రతిచింతా
విలమానస యగుచుఁ జేరి వినయం బెసఁగన్. 716

## యతిభేదము—అపూర్వప్రయోగము

చ. మెలి ముకుకెంపు మేల్మిలువ మేపరి ఊపనికీలు చిల్క సూ
రెల విడిదాచు కుందనపు ఊెక్కల చక్కని చెక్కుపండు టా
కులు కొనగోటఁ జీలిచి భుగుల్కొను గప్రపు సున్నముంచి య
చ్చెలి మడు పొరనుండి తమిసిగ్గున డగ్గరి వీడె మివ్వఁగన్. 717

క. మడుపుఁ గరమ్మునఁ గైకొను
వడువునఁ జెలికేలు బట్టి వద్దికి దివియన్
బడఁతుకు యొదుగుచు మెల్లనఁ
దొడతొడ యొఱయ న్విరాళితో వసియింపన్. 718

క. అత్తఱిని నాగదత్తుఁడు
బత్తిగలుగు సతికి దనదు ప్రౌఢిమ జూపన్
జిత్తంబు గరఁగి మోహపుఁ
దత్తరపు దువాళి మీఱ దయ దైవాఱన్. 719

## నవోఢా సంగమము

సీ. సాచీకృతాననోజ్జ్వల మందహాసంబు
సకటాక్షతాటంక చకచకంబు
హుంకార కంకణ క్రేంకార నినదంబు
స్ఫురిత వక్రీకృత భ్రూయుగంబు
కరనిరుద్ధస్తనోపరిభాగ చేలంబు
హస్తి ద్వయీ కృతస్వస్తికంబు
కుంచితాంగక్రియా గుప్తనీవీ గ్రంథి
ధీరసంయుత కోమ లోరుయుగము

గీ. విలసిత స్వేద వదనాబ్జ విలసనంబు
గాఢ పులకోద్గమంబును గలుగు సతిని
దొలుత రతిఁ దేల్చె నాగదత్తుండు దనదు
విలువ జవరాలి కూటమిఁ దలఁచి తలఁచి. 720

గీ. అపుడు నిట్టూర్పు నిగుడించి యలరు సజ్జ
నవ్వ లవ్వలి మొగమున బవ్వళించి
మెల్లనే చేతిగాజులు ఘల్లు రనఁగ
గృహిణి పాదంబు లొత్త నిద్రితుఁడువోలె. 721

క. ఉండునెడ నతని మంచము
దండఁ బదప్రాంత సరణిఁ దన చెఱఁగు మహీ
మండలిఁ బఱచి శయించెను
నిండినప్రేమమునఁ దరుణి నిద్రాన్వితయై. 722

శా. అంత న్లేచి లతాంగి మై దొడవు లాద్యంతంబు సంతోషిత
స్వాంతుండై సతిసేయు భాగ్యవశతన్ జంపం ద్దలం పేది వాఁ
డెంతేనిన్ దయలేక పుచ్చుకొని తానిల్వెళ్లి యా వేళనే
చెంత న్నిల్వక వారకాంతయిలు జొచ్చె న్సిద్ధసంకల్పుఁడై. 723

గీ. చొచ్చి తన నెయ్యురాలికిఁ జూపి దాని
తల్లి పాతరలాడ సొమ్మెల్ల నొసఁగె
దలఁచుకో నేరఁడయ్యె మీఁదటి తెఱంగు
నింక నిమ్మన్న నేర సొమ్మివ్వఁ గలఁడా. 724

క. ఇచ్చిన నా సొమ్మంతయు
మచ్చికరాఁ దీసి కొన్ని మాసంబులకా
నెచ్చెలిని గన్న జంతటు
బచ్చెనమాటలను బయలుపందిలి యిడుచున్. 725

## అపూర్వప్రయోగము

సీ. పడుచులంచే వాని పాదము ల్గడిగించి
హాయలుఁ బావడఁ దడి యొత్తఁ జేసి
కైలా గొసంగి వేగంబె దోకొనిపోయి
తళుకుఁ గుంకుమ గంధ మలఁది చలువ
గట్టించి యొరయెత్తు కపురపు బాగాల
విడె మిచ్చి వరములు బడసి కన్న
లేజవరాలితో రాజసంబుగవాని
మంచంబు చెంగట మంచిచీని
గీ. చాపపై నుండి యుచితసల్లాపగరిమ
నుబుసుఁ బోకల నొకకొంత యూరడించి
వెలల బన్నెడు దనకూళ తలఁపునేఁడు
గాన లేఁడని వెఁనేస్తకానిఁ జూచి. 726

## అపూర్వప్రయోగము

క. ముంటిమొన నిల్చినటు లే
ముంటిమి నినుఁ బాసినట్టి మొద లీవరకున్
వెంటనె రాఁగంటను నినుఁ
గంట నిదానంబు గంటకాదే చెలియా. 727

## కాకావాక్షిప్తము

క. ఇచ్చునెడఁ గనలు గర్జిలు
నిచ్చియు నచ్చియును జాలు నేదెసకైనా
హెచ్చుగ నీవలె నిచ్చునె
యచ్చటి ఘనుఁ డెపుడు మాధవార్యుని తనయా? 728

## చారుతావినోక్తి

ఉ. కోపముగాని చూపు నెలకొన్న వికారము లేని రూపు సం
తాపము రాని యేపు నిరతంబును వేసట లేనిప్రాపు నె

ప్పాపమునేనిఁ బాపు కలబాగెపు నెమ్మది కోపు బూమిలో
వైపున నీకెగాక బెజవారికి లేదుగదా ఘనామరా. 729

## పంచదశవర్ణ యుక్త పాదయమకము

క. ఔరా మాధవ యజ్వకు
మారామను మదన సమర మాధుర్యుఁడవై
ధీరా విటార్య యేలితి
మారామను మదనసమర మాధుర్యుఁడవై. 730

## ఏక నియమ ద్విప్రాస లయగ్రాహి

మాఘ వనకుంద కుసుమౌఘ వలదుత్కటర
సౌఘవరణీయ జిత మాఘవచన శ్రీ
లాఘవ వచోవిభవ నాఘ వశమానస సు
మౌఘ వనజ ప్రజనిదాఘ ఘనమూర్తీ
మేఘవ దిభోత్తమ ఘటాఘవలయ ధ్వనిన
మోఘవసతీడ్య శరలాఘవ భుజాజో
రాఘవ సమానకవి లాఘవనివృత్తికర
మాఘవన పాలనవమేఘవరదానా. 731

క. మెచ్చితి నన నిక్కముగా
నుచ్చాటన జేయఁదలఁచి యున్నదియని వాఁ
డచ్చెంగటఁ దత్పుతఁ గని
పచ్చని కాసునకు వెరవుబాయక యంతన్. 732

క. ఓరమణి యిట్టులేటికి
హారమణీ భూషలిడక యసురుసు రనుచున్
దీరని చింతాభరమున
గూరెద వి త్తెఱఁగు పేరుకొనుమా తెలియన్. 733

చ. తొలురతి నీవు నన్గెలిచి తోడగు మోవికి కావిడాల్ కర
మ్ములకును బచ్చబాకడియముల్ జనుదోయికి హారము ల్కటి
స్థలికిని మేఖలంబును బదంబునకందె యొసంగి పోరుటి
మ్ముల వెనకౌట కొప్పుఖలమున్ ముడికట్టులఁ గట్టితే చెలీ. 734

ఉ. ఏటికి నన్నెదుర్కొన వదేటికి కౌఁగిఁట గ్రుచ్చి చేర విం
తేటికి విన్నవయ్యెద వదేటికి చూచెదు చిత్రచూపులన్
మాటితివెందు నీకులుకుమాటలు నీ నగుమోము తేటలో
పాటల పాటలాధర కృప న్గనుమా యనుమానమేటికిన్. 735

## మోహము

సీ. భామినీ మోముఁ దప్పక జూచు మోహంబు
నెలఁత నీమైసోక నిలుచుబాళి
బాల నీమధురోక్తు లాలించఁ గలప్రేమ
పడఁతి నీమోవి ముద్దిడు తలంపు
చెలువ నీచన్గవఁ జేపట్టు తమకంబు
కలికి నిన్గిలిగింత గొలుపు వలపు
లలన నీయూడిగంబులకుఁ బాల్పడు మేలు
వనిత నీకౌఁగిటఁ బెనఁగెడు తమి

గీ. వెలఁది నీయుపరతిమీఁద బొలుచు హాళి
కొమ్మ నిను దక్క దక్కించుకొనెడి యాస
ముమ్మరమ్ముగ నన్నేచ మోడిదగునె
చలముఁ జాలించు పరిపూర్ణ చంద్రవదన 736

## త్రిప్రాసము—అపూర్వ ప్రయోగము

క. వెడవింటి తేనినేనియుఁ
గడకంటనె నేలుకొనఁగఁగల వెలనవలా
పడకింటిలోన వింతగు
కడకంట చరింతె నన్నుఁ గాదని యవలన్. 737

సీ. మేఁత లొసంగిన బూఁతలు బూసిన
గనుక ట్టొనర్చిన గాతలిడిన
మందులు బెట్టిన సందిటికడ నీవి
కట్లు గట్టొరులకుఁ గాకయుండఁ
జెరివిన బూవులు చేనంటనిచ్చిన
వాడెలు గూర్చిన భద్రకాళి
బంపిన మోహిని నంపిన మంత్రతం
త్రముల బన్నినగావుల మరిచినను

గీ. మాయలాడివి యొకతృణప్రాయము గను
పడక లందుల గట్టికబాళి బెనచి
చెలువు నిధనంబు తల్లికిఁ జేర్చునటుల
గావు నీ నాయెడ తలంపులో వెలంది 738

## వృత్తప్రాస సంసృతి

సీ. ఇదిగదా కొన్ని పన్నిదములనే నీవు
నెత్తమ్ములాడు పొందికల కూట
మిదిగదా నీచేత హృదయంగమంబుగా
వీణానినాదంబు విన్న చవిక
యిదిగదా యానాటి కొదవిన పొలయల్క
వాదుదీర్చిన నెఱవాది చిలుక
యిదిగదా మనము సమ్మదకథాలాపముల్
మున్ను బల్కుచు నున్న వెన్నెలబయ

గీ. లిదిగదా సంభ్రమారబ్ధ మదనకదన
సమయ సంజాత సమధిక శ్రమము దీర
వేడుకల విశ్రమించిన బైఁడి మేడ
మఱువ నీతోడు దయఁజూడు మందగమన. 739

## కావ్యలింగాలంకార హేత్వలంకారద్వయ సాంకర్యము

సీ. కామినీ నీనెమ్మొగము పూర్ణచంద్రుండు
చెలువ నీ కనుబొమ ల్చెఱకువిండ్లు
చివురాకుఁ బోఁడి నీచెవులు చక్కిలములు
తొయ్యలి నీమోవి దొండపండు
తరుణి నీదంతము ల్దాడింబవిత్తులు
కలకంఠకంఠి నీపలుకు తేనె
యింతినీ నునుబుగ్గ లిప్పపూమొగ్గలు
బోటి నీ గుబ్బలు తాటిపండ్లు

గీ. బాల నీవళుల్ సైకపు పాలతెరలు
వనిత నీకటి చక్కెరనునుపు దీవి
గనుక మధురాంగి నీమేను కమ్మతావి
విటహృదాకర్షణ విధాయి విద్యయయ్యె. 740

## శ్లేషానుప్రాణిత రూపకాలంకార వ్యక్తోపమాధ్వని

సీ. పల్లపాణిధమ్మిల్ల మభ్రచ్ఛాయ
మగువ సిబ్బెంపుచన్నుఁగవ సున్న
కంజాతనేత్రి వక్త్రము మహాదర్శము
మానవతీమణి కౌను బయలు
చిన్నారికన్నియ జిగినెన్నొసలు కల
చిలుకలకొల్కి పొక్కిలి భ్రమమ్ము
జవ్వని రూపంబు చంచలాప్రాయంబు
వారణయాన నూగారు జల్లి
గీ. యైన నొకయింతి చూచిన యంతలోన
నెల్లవారల మిగుల మోహింపఁ జేయు
మహిమగల నీకు నఖిల భూమండలమున
మోహినీనామ మన్వర్థమునఁ జెలంగె. 741

ఉ. గ్రక్కున గౌఁగిలించి దెలిగన్నుల చల్లని చూపు జూచి నీ
చక్కెరమోవి తేనియ లొసంగి మనోజుని కేళిఁ దేల్చి నా
యక్కఱ బాపుమన్న వదనాబ్జమున న్నిఱునవ్వుఁ దెచ్చి యా
జక్కవ చంటి యిట్లనియె జక్కెర లొల్కెడు ముద్దుబల్కులన్ 742

సీ. చదువును గుడికొల్వు సాధనయును కడ
నోసరించిన యట్టి యునికిఁ దలఁచి
వీణాది సంగీత విద్యలొజ్జకు మళ్ల
నొప్పగించిన యట్టి యునికిఁ దలఁచి
దాసదాసీపశుతతి బరామరిసింప
కూరక యున్నట్టి యునికిఁ దలఁచి
యిల్లాలితోఁ బొందు నెడజేసి యిచట ని
న్నాఁటి యుంచిన యట్టి యునికిఁ దలఁచి
గీ. యేమి పలుక నీకు నెట్లుండునో యనె
డునికిఁ దలఁచియ గడు మనికిఁ దలఁచి
యున్నదానగాని నిన్నెఱుంగయుండఁ
గలదె చింతకొండు కారణంబు. 743

## ఇష్టనిషేధాభాస రూపాక్షేపాలంకారము

సీ. తలఁపులోఁ బాయక నిలు తనపునరుక్తి
యంత నీ సౌమ్య మనార్యవృత్తి
నినువీడి మెలఁగ లేనన సనంభావ్యంబు
భర్త వీవన నభః ప్రసవకాంక్ష
తొలుదొల్త నిందురావలె నన్న గర్వోక్తి
చనుదెంతు నేనన చపల గుణము
మరుఁ డేచునన సాక్షి బరఁగని వచనంబు
చలిగాడ్పు సెక యన జనవిరుద్ధ
గీ. మరయ నీయధీనమగు నన్నలఁచు నాక
శాధరుండన భవదుపాలంభరీతి
గనుక నే మాటలు నెఱుంగ నెనరు నిలుపు
సొగుబడి హత్తగుణవిత్త నాగదత్త. 744
గీ. ఔర యన్నిఁటఁ బ్రౌఢ వీవౌట వింత
గలుగయో నాగదత్తార్య తెలుపు మనిన
నౌర యన్నిఁట బ్రౌఢవీ వౌటవింత
గలదు మోహిని యిదని నన్గాచు టొకటి. 745

## అపూర్వప్రయోగము

గీ. సమయభేదంబు లాత్మరాగంబు గనక
చూచి యడుగని నిను మెచ్చచూచి నానె
దయకు రమ్మని చేసాఁచి పయఁట ద్రివ్వ
మోహిని తలంపులో నిను మోహరింప. 746

## వార్త

గీ. కరము గాజులు ఘల్లన కంచె లౌరయ
దత్తనిభ నాగదత్త నీదత్తరంపు
గుత్తగానితనం బెత్తు గుత్తగాను
పంజమాటలఁ గూడు నా లంజరికము. 747

మ. అవురా యెంతకు దట్టిగట్టితివి మే లాహా బళా మంచి వాఁ
డవె పో వేఱొకచోటఁ గానవె కదా టాటా ల్గుణించంగ నీ
తవళీవిద్యలు జూపనోర్చునది పీఁటన్లేదు మాబోంట్లతో
నవుగాము ల్గిన నట్టి క్షుల్లకముగా కాపోశన ప్రాయమే. 748

వ. అని మధ్యధీర పల్కిన పల్కులు తన చెవులకు ములుకులు గాఁగ బులుకు పులుకునం గనుంగొని యపుడు. 749

## గుణీభూతవ్యంగ్యము

సీ. గాజుకుప్పెల వంటి గబ్బి సిబ్బెపుటుబ్బు
చిన్ని గుబ్బలు గోరఁ జెనక వెఱచి
చీనిచక్కెరవంటి చెంగావి వాతెఱ
యింత పల్మాన సోకనీయ కళికి
జిగిమల్లె పూవంటి చిన్నారి నెమ్మేను
బిగువు గౌఁగిఁట నాని పెనఁగఁ దలఁ(
హాసతమ్మి నూల్వంటి యసదు లే గౌనుపై
నోరగాఁగఁ బరుండి యొరగఁ గొంకి.

గీ. మనసు దీరఁగ నొకనాటి యునికి లేక
మోసపోయితిఁ గసికాటు ముచ్చటలనె
నింతలో ననే నన్ను నీవింత సేయు
టెఱుఁగ నేరని కతన బూర్ణేందువదన. 750

## ధ్వని

సీ. వడగండ్ల చేత దేవరగుళ్ల నిర్మింపఁ
బట్టి కన్నుండఁ గన్నాపఁ దివియ
నిసుము నన్నము సేయ నెండమావుల నీళ్ల
గావింప నేర్పుఁ గన్నాన లాఁగ
నీట జాల్ దేలింప నీళ్ల మూటగఁ గట్ట
నెడ పులిమీస ఉయ్యేల లొనర్ప
బొమ్మల పోట్లాట పొనరింప వర్షధా
రల నెక్కి డిగఁ బగల్ రాత్రి రాత్రిఁ

గీ. బగ లౌనర్పు మాధ్వులశాస్త్రి పటిమ దొరల
తలఁపు జంగాల బూటకంబులు గకీబు
కరుణ కోమటినిజమును గలికిచెలిమి
నేను దెలియంగ గలనె యోసాని యవల. 751

సీ. పొలఁతి బూరుగమాని పొడ వడవికిఁ గాయు
వెన్నెల చెప్పుడువిద్య బిరుదు
మాష్టినిబీరంబు ముష్టి పందందంబు
పలనాటి గొల్లల పాటజాతి
దొమ్మరి పెద్దతనమ్ము జాబొమ్మ సిం
గారమ్ము బక్కయగారి బలిమి
వెలమత మానమ్ము వెట్టిజాణతనమ్ము
రాచగబ్బితనమ్ము నాచురితవు(?)

గీ. కోఁతుల శివమ్ము నాలవజాతి తపము
శ్రోత్రియుని తెలుఁగు కవిత కింశుకము తావి
జడునిచదువును బెస్తనేస్తమ్ము వలెను
జేసి తీజాడ నిఁకనేమి సేయువాఁడ. 752

గీ. రావిపువ్వును బెండులోఁజేవ పిచ్చి
గుంటు పర్వును గుజ్జుపుకొమ్ము కాకి
తెలుపు రాయంచనలుపు మించుల నిలకడ
గలుగ వెలయాలి వల పిల గలదె యనుచు. 753

గీ. ఇవ్వ గొరగాక యక్కొమ్మ బాయలేక
పణ్య వృద్ధాంగనా మహోపద్రవమున
నారివేరంబురీతి నిందందుఁ దిరిగి
గోచికాఁడయ్యె బాపన కోఁడెకాఁడు. 754

సీ. తలమాసి పువ్వొటిత్తులకు జిల్గురుమాలు
బట్టగట్టిన తల బట్టగట్టెఁ
బడవవాటున వాటుబడ్డ చన్గజనిమ్మ
కాయ గాచిన చెయి కాయగాచె
నాఁకటి పెక్కువ నతివ కౌఁగిటి నంది
చిక్కజారిన మేను చిక్కబారె
వెకలియై తిరుగ నేవేళను రతికేళి
కళలు దేరెడుమోము కళలుదేరె

గీ. నిన్నియనుగాక యూరకే యేలమాను
వారకాంతల చెంతలఁ జేరెనేని
యేడకుల మేమివర్తన మెట్టినడక
యేటి గౌరవ మేమని యెన్నగలదు. 755

గీ. తల్లిదండ్రులు వాని వర్తనము రోసి
ప్రాణములు దాఁచుకొనెడు లాభంబు గనిరి
వారి శుశ్రూషయందుఁ దద్వనిత యుండె
వాఁడు రెంటికిని జెడిన రేవణుని బోలి. 756

క. విచ్చలవిడి లంజల దిన
వెచ్చములకు జూదగాని వెచ్చములకు ని
ప్పచ్చరమై తనలాహిరి
వెచ్చములకు లేక ముచ్చు విద్యకుఁ జొచ్చెన్. 757

వ. ఇత్తెఱంగున కన్నాగదత్త నిభుండగు నాగదత్తుండు ధీరశాంతనాయకత్వం బుద్వాసనంబు జేసి గానంబు కవితయు కొక్కోకంబు జూదంబు దేశభాష లిపిజ్ఞానంబు లిపిలేఖనంబు చరాచరాన్యధాకరణంబు విలువిద్యయు సర్వ శాస్త్ర పరిజ్ఞానంబు శాకునంబు సాముద్రికంబు రత్నపరీక్ష అరదంబుఁ బఱపుటయు తురగారోహణంబు మల్లశాస్త్రంబు పాకచమత్కారంబు దోహదప్రకారంబు ధాతుగంధరసవాదంబులు కుట్టుపనుల వినోదంబు మహేంద్రజాలంబు జలాగ్నిస్తంభనంబులు మొనకట్టు వాకట్టు వయ స్తంభనంబు వశ్యాకర్షణమోహనంబులు విద్వేషణోచ్చాటన సంహరణ కాలవచనంబులు పక్షిగతిభేదంబులు యోగరాగంబు వచనసిద్ధి ఘుటికాసిద్ధి యింద్రజాలంబు అంజనంబు ధ్వనివిశేషజ్ఞానంబు వంచనంబు స్వరవంచ నంబు మతిమంత్రౌషధక్రియలు చోరత్వంబు చిత్తరువు వ్రాయుటయు లోహకారకత్వంబు కాసెపనియు కులాలకర్మంబు వడ్లంగిపనియు మేదరపనియు జోళ్ళు నిర్మించుటయు సాలెపనియు నదృశ్యకరణి దూత్యకరణి వేఁటసన్నాహంబు బేరంబు పాశుపాల్యంబు కృషియు మైరేయంబులుగూర్చు వగలు లావుక కుక్కుట మేషాదులఁబోరు హత్తిం చుటయు ననెడు చౌషష్టివిద్యల తెఱంగి దత్తరమ్ముల కొదలేక యదరు

బెవరు సోకసీక మదముమీఱ ముదముదేర నొంటికి నొంటిదప్పికి దప్పి నిదురకానిదుర చేసి తనతోవాసికి నుర్వర నెవ్వరైన నాన బూనుదురా నుదురకన్నుఁగల దొర నెదురుకాక నిఁక నీదైవానుగ్రహంబున నిజ దురాగ్రహంబునను నుగ్రారి విగ్రహంబులు విగ్రహంబున నిగ్రహంబు సేయు జాగ్రతనుం దేరి కాదంబరీపానవాదంబున మోదంబుమీఱి జూదంబున చౌర్యవినోదంబున సంసారఖేదంబు విడిచి లజ్జగడచి మట్టువీడి గుట్టుఁబోనాడి రట్టునకు లోగి పెట్టునకు నాగి పెక్కుమాట లొక్కచోట పిక్కటిల్ల తక్కువెల్లజూటువగలు మాటతెగలు చాల దెలిసి లీలమలసి వడిసుళ్లనుబడి గుళ్లను జరిఝంపుచు సిరిపెంపుచు నిజ జంజన్యమాన కైతవగాత్రుండును తంతన్యమానదురితచరిత్రుండును పాత్యమానాంబు స్వీకృతకలితముఖుండును రారజ్యమానదుష్టసఖుండును నగుచునగుచు నందునందు నందుఁజెన్నొందు వాసరమ్ములు మీసరమ్ములుగాఁ జాలి కడపట గడపంజాలక. 758

గీ. కావు ములుబంతి సికముళ్ళు గద్దగోరు
నల్లదట్టిసబిల్ల కన్నంపు కత్తి
బూది దివ్వార్పుపురు విసుమూదు గ్రోవి
తోలు నిచ్చెన మొదలు ముందుగ ధరించి. 759

### అశుభశకునములు

సీ. ఎచట కేగెదవని యెవ్వరు నడుగక
తంబళి బాపఁడు తారసిలక
తుమ్మెడు పులి నక్క తోఁడువచ్చెదనను
పలుకులు వీనుల వినక పిల్లి
యడ్డంబుగాకను గొడ్డురా లెదుటను
నిలువక జాగిలంబలుకు డిదక
పాలవెన్కకుఁ బోక పక్కిపై రొప్పక
పొనుకుఁబడిన యగ్గి బొగ్గులు దిస
గీ. మొలనరు పరపు మైలచీరలు దూది
కసవు తొండయు గుడ్డి మూగ కఱచిలువ

విధవ కుందేలు పొగ నొంటిపిచ్చుగుంటు
సూనెతలవాని యెదురుగాఁ గానఁబడక 760

## శుభశకునములు

సీ. మునుక్షేమకారి యాడిన పాలకుడినుండి
యెడమ కేతెంచినఁ గుడి భుజమద
రిన వాయసంబు దీర్చిన పైడికంటె వే
కలయ బలికిన బంగారుకలశ
మెదురైన గుడిపల్కు లెనసినఁ గాడిద
లెలుగిడ వేశ్యల నెలిమి గన్న
కలకల దక్షిణ గౌళి పల్కిన మేన
జల్లని గాడ్పు విసరినఁ గవగ

గీ. బ్రాహ్మణు లెదిర్చినను ఘంట రవళి వినిన
నైదువలు పాటఁ బాడిన నశ్వహేష
వినఁబడినఁ బండ్లు గాన వచ్చినవి మొదలు
మేలుశకునంబు లెఱిఁగి యవ్వేళలందు. 761

క. ఆయన సేయని పాతక
మే యనువున లేకఁ బురికి నెడయై జని దా
బోయల గూడుక దెఱవుల
నాయకు లేతేర తాను నడుమ నడుచుచున్. 762

గీ. ఎన్ని గోహింస లెన్ని స్త్రీహింస లెన్ని
విప్రహింసలు గురుల బాల హింస
లెన్ని గావించె నేమని యెన్నుకొనునా
పోయె నీతంబు బాపన బోయ మదిని. 763

క. ఆజాడల మెలఁగుచు నే
యేజాడల గట్టి కొట్టి యెదలఁ గిరాతుల్
జేజేయని దనుఁ గొలువఁగ
రాజుల నగరములు జొచ్చి రాయిడిఁ జేయున్. 764

## షట్పంచాశ ద్దేశ నామధేయ సీసము

సీ. మాళవ మళయాళ మత్స్య చోళ విదేహ
కురు విదర్భ పుళింద కొంకణాంగ
కర్ణాట చేది కెంకణ వత్స సింహళ
మద్ర భోట సుదేష్ణ మగధ యవన
కాశ వరాట కేకయ కుంత లావంతి
సౌరాష్ట్ర శబ రాంధ్ర చేర పాండ్య
ఘూర్జర సాళ్వ కుకురుహూణ నేపాళ
బాహ్లీక శక వంగ పౌండ్ర లాట

గీ. కోసల కరూశ పాంచాల కుత్స నిషధ
సింధు గాంధార కేరళ సింగళాట్ట
శూరసేనోత్కళ మరు కాశ్మీర బర్బ
ర కరహాటాఖ్య దేశముల్ ప్రబలి తిరిగి. 765

ఉ. కామగమైన రూపములు గాంచుక కాంచి గయా ప్రయాగ మా
యా మధురా కవేర తనయా యమునా సరయూ మలాపహా
హైమవసుంధరాచల హిమాచల రాజిత శైలతామ్ర ప
ర్ణీముఖ వాహినీ పురవనీ నగము ల్చరియించు యావలన్. 766

క. లోవాడియు వావాడియు
చేవాడియుఁ గలిగి మిగుల సీమారామా
గ్రావాగ్రహార జనపద
దేవస్థానాటవులను ద్రిమ్మరు కతనన్. 767

సీ. వలుద గుబ్బలమీఁది చలువ ముత్తెపు పేరు
లిరుకు నిల్వాల దట్టి పొరలఁ జొనిపి
సాగి మ్రొక్కటు జూపి సోగ వ్రేళ్లను మట్టి
యలు జిమ్మి యంకుల నణఁచి తిగిచి
యవలి వానికి సున్న మందిచ్చి చేదీయు
ననువున కమ్మ లల్లంత మీటి
సందడి నలజడి నంద జేయుమ్మ ని
యుంగరంబులు లాగి చెంబు విడిచి

గీ. గత్తెరల నొడ్డియాణము ల్గత్తిరించి
కుంపటిసుముల సవరంపు కుప్పెలూడ్చి
కెడల యవిజూపి మెడనూలి కీలువాపి
వరుసవారల వెతలఁ బాల్పరచి రందు. 768

క. ఇరువురు మువ్వురు నలువురు
తెరువులఁ దెరుపరులఁ దాము దెరువరు లగుచున్
చొరవగని నొంటి పాటున
మొఱపెట్టఁగఁ గొనిరి చేతి ముడుపులు కడిమిన్. 769

సీ. నిదురించు వారిలో నిదురించి నటులుండి
దొరకిన వెత్తుక జరుగువారు
మీవారు వేరె రమ్మా వెంట నన పిల్చి
పడుచుల నెగమీటి పరుచువారు
సున్నంబులోపల సొక్కుమందులు బెట్టి
కలిగిన వంకించి తలఁగు వారు
వెలయాండ్రఁ దప్పు చైవులు దార్చి బంతులు
నోటిలో నిడి దోచి దాటువారు

గీ. కొంగురాలను పెడతలఁ గొట్టి కెడపి
సొమ్ము లాగించి సందడి జుఱుఁగువారు
తారు దొంగలి దొంగలఁ దామె తటిమి
పట్టు పట్టంచు నూడని బాడువారు. 770

వ. ఇట్లు దిరిగి తిరిగి యున్మత్తుఁడైన నాగదత్తుఁడు తత్తడి కిత్తుమొత్తంబు మిణుగుర్లఁ బోలి యంబరంబుల దంబరంబులు బంగారు సొమ్ముల సింగారంబులు చూపులయేపులు పిలుపు మెలపులు నయమ్ము లభయమ్ములు క్రొవ్వుల నవ్వులు యిక్కువల మక్కువలు గచ్చులమెచ్చులు గలిగి తద్భటులంత నంతర్గతంబున. 771

క. అందులను దనివి చాలక
యందఱు నొకచోటఁ గూడి యదిరా మనకీ
సందడి జుఱుఁగుల దీరునె
తుందుడుకుల సామిసొమ్ము దోఁచక యున్నన్. 772

చ అని రథమార్గమం దరిగి యావల మావులతోటఁ బశ్చిమాం
బుధిని సినుండు గ్రుంకకయ మున్నుగ దగ్గరఁ జేరి యందఱున్
గనుకని వెన్ను బొక్కసము గ్రక్కున నడ్డము దూరి జూచి మో
చినటుల రత్నకాంచన విశేష సువస్తులు గొంచు వేల్మిడిన్. 773

## అపూర్వప్రయోగము

క. వెదల హరిభటులు పైకొని
కడువడి యాసొమ్ము తమవి కాన్కలిడు గతిన్
బడవైచి పోవఁగని వెం
బడి యార్పులఁ బొడుపొడువేని వడ నడరుటయున్. 774

## అపూర్వప్రయోగము

క. నడచినఁ బాణుం డప్పుడు
కడితల యరిగెయు ధరించి కఱివేలుపు బ
ల్లడములు దను నఱికినఁ గని
కుడియెడమలఁ దగ్గి యొడ్డుకొనుచు న్బెలుచన్. 775

## వీరరసము

ఉ. గొంతులు నొవ్వఁగాఁ బరవఁ గూఁతలు గూసిన బంటులై తిరో
వంతములేల నాయెదుట బాణులు దీరుఁడు మైలసంతలో
గంతులుసాగ వంతయును గానఁగ నయ్యెడు లెస్సఁ గోసెఁగా
మంతరసాని బొడ్డు క్షణమాత్రములో మిము గెల్వకుండినన్. 776

## అపూర్వప్రయోగము

క. ఏవాఁడు గలా డిందుల
నావడి జగమున కెదుర నగరిపుసుతుఁడై
నా వెఱపక నిలఁగలఁడే
కావున నే నిపుడ గెల్పుఁ గైకొను చరయన్ 777

## ప్రాసభేదము

క. నేతును మంత్రము లందఱ
నేతును దద్రిపుల ప్రేవు లీ రణమునకున్
నేతు బ్రియంపడు పొలుపుగ
నేత్రివిధమ్ములను మీర లెనయే తనకున్. 778

## రౌద్రరసము

క. చెఱకులఁ బన్నిదమాడిన
తెఱఁగున మీరూపు లొక్కతేప నెనసి చే
నఱకుచు బేతాళున కే
డ్తెఱ నెత్తురు సాక సాక తీరున సేతున్. 779

## భయానకము – ప్రాసభేదము

క. నాక్షత్రకాంచుఁ దంచును
చీకాకుఁగ రెండి మేల చెల్లా చెదరై
మూకి బరతేర విసరుక
ఢాకన్ ఝూటు ధడయు ధ్రుఢ దుముకు మొనలన్. 780

## అపూర్వప్రయోగము

క. మిడుగురులు రాలఁ బొడిచిన
కడువడి దప్పించి లేదుగాయని తారా
బడుగుంబాపని బాపని
యెడతెగ నియ్యకను జుట్టి యేసలవానిః. 781

క. కేడెము కత్తి తుపాకి
లొడియు విండ్లమ్ము పీటెలం గొని తొలుతన్
జోడులు దాలిచి మేనులు
జోడులు తమకన్నలేదు సూసవి కినుకన్. 782

## అపూర్వప్రయోగము

క. తనువులను చెక్కు చెమరక
యని చేసిన నాగదత్తుఁ డాసేనల బే
ర్కొని తూరుచు మార్కొని భో
రన గరిడిన్ సాముచేయు రహి నెఱ వేడ్కన్ 783

## అద్భుతరసము

క. మొన చేసిన చోటన ధుము
కును ధుముకును సేయు తటిని కొంచెపు మొనయున్
మొన ధుముకు ధుముకు మొనయును
గనుపించక జేసియఁత కాంతాళమునన్. 784

క. పద్దుఁగ వెన్నుని బలముల
కుద్దుల పేర్పడి దిటమ్ము లొద్దిక యగుటన్
గద్దింపులచేఁ జప్పుడు
విద్దెలు వినుపించు రీతి వితతము మెఱయన్. 785

## అపూర్వప్రయోగము

క. ఇదిమొన యిది నరు కిది పో
టిది మీటిది చూటిది ధను కిదె యిదె యని తా
రుదిరిపడి బంట్లు గీటుచు
సదమదముగఁ గాలుఁ గేలు జంటఁ బెనంగన్. 786

క. హరులున్ హరులును గిరులున్
గిరులును గరులున్ గరులును గిరులున్ గిరులున్
మఱియు మఱి దుర దొనర్చిన
కరణిన్ సరిఁ బోరి పోరిగరుసు దురుసునన్. 787

## నవరసోపమాన యుదవచనము

వ ఆయెడ నాయెడ వయసుచాయ బోయలు చండితనంబునఁ జండంపుచు భ్రాంతం బుద్భ్రాంతం బాప్లుతం బావిష్కృతం బాహికం బవిధం బకరం బవికరంబు విశ్రుతంబు మానుషంబు నిర్మర్యాదంబు చిత్రంబు భిన్నంబు సవ్యజానువు జానువు క్షిప్తంబు ధృతంబు గుడంబంబు లంబనంబు సవ్యబాహువు వినిబాహువు త్రిబాహువు సవ్యోత్తరం బుత్తరంబు సవ్యకరంబు తుంగబాహువు ప్రదికంబు యోధికం బాపృష్ఠత ప్రహారంబు వల్గితంబు కుంచితంబు స్వస్తికంబునను ద్వాత్రింశత్ప్రచారణ్య వ్యాపారంబుల బచారించి పరిభ్రమించి కొలిచిన బంటుంవలె చొరవ గల్పించుకొని బిరుదుమాష్టీలయునికి దండ యేమరక చోరులగతి హెచ్చరిక దప్పక లోభుల కరణిఁ గేలు సడలక వసంతము లాడెడు పెండ్లికొమరుల మాడ్కి యాస నెదురెక్కి పైన జిమ్మి కోమట్ల వహిని లెక్కపెట్టక బచ్చుల సరవి సరకుఁ గొనక నిస్పృహుల విధంబునఁ దృణీకరించి మాంత్రికుల పగిది హుంకృతులు నిగుడించి విటుల మేరభయంబులు విడిచి పీరావేశంబుల నట్టహాసంబులు సేసి రోసంబులఁ గోర

మీసంబుఁ దీఁటుచుఁ గలంగక తొలంగక తిరుగుడుఁ బడక నైదుఁబది సేయక నీరంబులు చెడక బీఱువోక యోడక యొడ్డిగిలక వేసరక వెక్కసంబు వేడుకగదుర ననమసమరంబున సవ్యమండలముగా నుండినం బుండరీకాక్షుని గింకరులు సాహంకారులై శంకింపక కుడివంక పక్క శంబుగాని మొక్కలంబున డాసి కరాచూరుల ఝాటులు ప్రేసిన బిల్లవల్లభు లత్తెఱంగునకుఁ జిత్తంబు హత్తనీక వడి దరగక పాటింపక యోలంబు జూపక నోసరిలక సడలక సందీక వేగిరపడక జిరచిరబరతెంచక చలింపక చాఁపదరుగనీక గడిదలలూని ఝళిపించియును తాలించియు మించియుఁ గమ్మియుఁ దేకువయుఁ దెలివియు మదంబును మచ్చరంబును వేరంబును వెరవును తెంపును సొంపును నింపుమీఱఁ బిఱుగులు బిడుగులు గదిసిన చందంబున ముఖచాళిబూని వారలపై ధాఱుధారలుం జూప నప్పట్టున జుట్టపిట్టలావు నెట్టెంపుఁ దాలుపు బలగంబు స్వస్తికంబున నొడ్డుకొని తమకంబులఁ గమకించుచు హుఱుమత్తున తూరి యంపరల పరంపరల వెంపరలాడిన హుసియని దొందడిని పుళిందులు కఱకుమీఱి చుఱుకు చూపులు చూచి యెందుబోయెదరు నిలునిలుడను కూతలుసేసి గడుసుగొన్న గడిదలలు బిఱిందికిఁ జొనిపి మేనులు బయలుగాఁ జూచి గోవిందుని సేవకులు చొరఁగూడక పేరములుబాఱి బారితుపాకులు సంధించిన మేనులు వంచి బొంకించి నాగదత్తుండు తనబలంబుల నెచ్చరించి పరుజులో నెడగంద్ర పిడిపట్టుగా హత్తించి పరుఁజించుపూనికకై పరుజించి తగ్గితగ్గి డగ్గరి డిగ్గనం త్రటిత నాట్యములోసేయు జగ్గునకుఁ దమ్మికంటి బలం బంటు వీడక గంటిమి గంటిమి మేలుమేలని పొగడి గదలని గుడియెడ తెగకం బొడిచి వెంబడి మొలపిడెమ్ములు ఝరన దిగిచి యత్తఱి మిడుక దఱిమిక్రుమ్మిన చెమ్మటజెందక తడబడక బుడిబుడి నడల నొడళ్లు సోఁకనీకుండ చూచి నిలుచుక కఫాలు కఫాలున చూరణిబడిబడి బెడాలున జొచ్చి బిడాబిడి సరిబిత్తరుల మిడుక దఱిమి హత్తిన కడాకిడి కరంబుల యడిదంబులు బెడిదంబులుగా నొకటొకటొరసి ఝల్లుఝల్లున మిడుగురుల రాలుచు వింజామరల క్రోవుల తేవఁ గోల మెఱుంగుల తెఱంగునఁ గోలాటమ్ములాడు బొమ్మలకైవడి మురహరునకుఁ బురవిజయేందిర రతనంపు టారతులెత్తిన జోతులరీతిఁ గన్పట్టియుండ గండుమీఱి రెండుతెగల నంబులఁ జలంబుల ద్వంద్వయుద్ధంబునకు సన్నద్ధులై యంతటంతట నందందు

నక్కడక్కడ నాడాడ జోడులుగూడి పాచికల చొప్పున జంటకరుల్లపోలిక పాములదారి తాళపుఁజిప్పలభంగి శస్త్రాశస్త్రి కుంతాకుంతి దండాదండి ఖడ్గాఖడ్గి గదాగది బాహాబాహి ముష్టాముష్టి కచాకచి యోహరిసాహరిం బెనంగుచు మేకులు వంచుచుఁ దటాలున నేదుఁబందుల చాయ్పున నెఱకలు నిక్కఁబొడువ నొడళ్లు ఝాడించుచు సరుచు కొసరుచుఁ దిట్టుచుఁ గొట్టుచుఁ బాయుచు డాయుచు జడియుచు నొడియుచుఁ గదలుచుఁ బొదలుచు మిడుకుచు మెడుకుచు వ్రేయుచు రోయుచు విసరుచుఁ గసరుచుఁ జిమ్ముచు రెమ్ముచుఁ బొడుచుచు విడుచుచు నఱుకుచు బెరుకుచు నాఁబోతుల కుమ్ములాట మర్యాదను బెబ్బులులు తారసించిన వరుసను లులాయంబులు తలపడిన వడువునను తగరులు సన్నలదారొ్కన్నవీఁక తులువల పోట్లాట మాడ్కి రక్కాముపుంజులు కఱచి కాట్లజుట్టులు గఱచుక నారెలుడుస్సి పాఱువరుస వ్రేటులు వ్రేసిన మెరవడిని చలముఁ గలిగిన పికిలిపిట్టల కిరకిర పెక్కులొక్కని మలపము లిడుచుఁ గిలకొట్టుచు ఱెక్కలార్చుచు లవిటీలఁ ద్రిప్పుచుఁ బించములు సేయుచుఁ దల లాడింపుచుఁ గటుకు గటుక్కునఁ బల్లుపోఁక బిరబిరం జుట్టుకొని వెలియైన తావులు ముడిగిన సరసుక కఱచినకాటులు విడక కాళ్ళుపట్టక పడి యెగరోజు సవతునను పిచ్చుకలు కాట్లాడి పట్టుపట్టెడి జోడున నొండొరువుల తనువులు జర్ఝరి తంబులై చిఱిగి తరుణమున నరుణమున జొత్తిల్లి జొత్తుపాపల వగను పూఁచిన మోదుగులాగున రౌద్రరసము వెల్లిబర్విన యందఁబునమించుచు మఱియుఁ బెక్కువిన్నాణంబులు సేయుచుఁ బక్కటెమ్ములు వమ్ముగా మోకాళ్ల నూకుచు తలతలం దాకుచు కేలుకేలునఁజుట్టి యందుకొనుచు రొమ్మురొమ్మునఁ గదియించుచు భుజము భుజమున నొత్తుచు నడుగడుగున దాటింపుచు బీతిజోదులను బడాయింపుచు మదులనెదుగ రోసమ్ములఁ బెంపుచు బెదరి బెదరి కాంచుచు నలసి సొలసి యలఁతజెంది చింతజెంది బడలికనొంది పదమించి సేదగాంచి దిటముడిఁగి రుటమడిఁగి లావులు సడలుచుఁ గొంతకొంత యడలుచు మిడిగ్రుడ్లు బిరబిర ద్రిప్పుచు చక్రమ్ముల నీటున జిరజిరఁ దిరిగి దగల నెగరొప్పుచుఁ జమురు సడలిన దీపంబులకరణి తాల్చిన ప్రత్తివత్తుల రూపున నలచిన నిమ్మపండ్లనూటి మథించిన రసము విధానము దారుచు చూరుచు మెడలు నలసియు తొడలు బడసియు మూపులు బగిలియు వీఁపులు నొగిలియు ముక్కులు చదిసియు

చెక్కులు గదిసియు ప్రక్కలు ప్రీలియు డొక్కలు చీలియు భీభత్సాద్భుత రసంబులు బెనంగొనఁ బరస్పర విజయేచ్ఛలఁ జిక్కుదీసినటుల దాయాదుల పాళ్ళు బంచిన యుపమను రాలు ప్రీలిన హావణిక సంజవేళ జక్కవలు కవ లెడబాసిన చందంబున తెరప్రతిమలతులను కాంతలు పొలయల్కల మాఱుమెగంబులు బెట్టిన సొగసున నిరువా గిరువాగై జోడుపట్లు వీడిన జాడ తోడనె నిజబలంబులఁ బద్మాక్షుండు జిఱునగవు మొగమునఁ జెంగలింప శాంతస్వాంతంబుతో దయ దైవాఱఁ గనుంగొని కాయంబుల గాయంబులు మాయంజేసి దొమ్మి కయ్యమునకు సెలవిచ్చిన మోహరమ్మగు ననిమొనలో నావేళ దననేగుఁ బెండ్లి శృంగారరసంబు సంబరాల దినుసున దిక్కులు బిక్కటిల్ల నుల్లరపు బిరుదధ్వజ పటపటల పటపటాత్కారంబులు స్యందనఘటిత ఘంటికాఘణఘణాత్కారంబులు మావంతుల హుంకారంబులు రథికుల సింహనాదంబులు మదావళుల ఘీంకారంబులు వాజిహేషాచమత్కారంబులు రాహుత్తుల ఝూత్కారంబులు వీరభట హంకారపూర్వక కహకహారభటీవారంబులు దండిచారుల కలకలారావంబులు క్రెక్కల క్రైవారంబులు సింజనుల టంకారంబులు నిస్సాణంబుల ధణంధణాలు ధమామీల దిందిమ్ములు విజయశంఖంబుల ఘుమంఘుమలు ఫిరంగుం ధింధిమ్ములు జబరుజంగుల ఖంగురింగులు గుంటిక్రోవుల డబ్బుడబ్బులు తుపాకీల ఫెళఫెళలు బాణముల చరచరలు లకోరీల రింగురింగులు పెట్లగ్రోవుల వరుసల ఖంగు పెఠీల్ ఢిమిరింగుకఠీల్ ధమీల్ ఢాంగుఖణీల్ గుభుల్ చఠాల్ ఢాంఢంకరణశబ్దంబు లబ్దంబుల గర్జల దర్జించి యెక్కమొగి భూనభోంతరంబు భోరుకలంగ నక్కోలాహలంబు విని మునుపనిచేసిన వీరుల వీరరసంబుగని యిఁక నిల్వరాదని యందు నాగదత్తుండు ముఁదుగాఁ గొందఱు పుళిందులుదక్కఁ దక్కిన బోయలు మంఁభయమంది భయానక కరుణారసంబులు కళవళమంద నదరిబెదరి ఉన్నెదరి యళికి బిట్టుళికి తలఁకి దెసచెడి కలగుండుబడి హల్లకల్లోలమై అతలకుతలమై యట్టిట్టై యుఱ్ఱూత లూఁగి హఠాత్పలాయనంబుగా నెక్కడ నున్నవా రక్కడ నుంచి కలవస్తువులు డించి లక్షోపలక్షలు కోటానకోట్లు తండోపతండంబులు పుంఖానుపుంఖంబులు శాఖోపశాఖలు నేలయీనిననటుల ముస్నిరు వెల్లివిరిసిన వైఖరి, పుట్టు యిసుళ్ల కరణి కాకులజోక కొండ ముచ్చులచాగున గాడ్పుచేఁ బోవు చొక్కాకులరేక బుట్టివాయి వెడలు

పులుగుల మట్టున చట్టంబులనెగయు నాకాశబాణంబుల దురుసున నిచ్చ
పిచ్చల పిచ్చుమొగ్గ విరాలిమొగ్గగా కంచుమించై చింపరవందరై చీకాకై
తారుమారై పంచబంగాళమై చెల్లాచెదరై గజిబిజియై బెండాబెడగై కకా
వికలై పటాపంచలై యథాయథలై జలకట్టిల తండంబులై గొడ్డిదాటులై
జిరుకు బందమీఁది పోకలై జల్లించి యొకఁడుపోయిన త్రోవ నొకఁడు
బోక నొకనివెంట నొకఁడంటక నొక్కనిపల్కు నొక్కఁడువినక నొకని
మొగం బొకఁడు సూడక గొందఱు పిలపిలంబారి యీబారి దప్పిన బలు
సాకుఁ దిని బ్రదుక వచ్చుననుచుఁ దిరిగి చూడక కాలికొద్ది వడిఁ జూపు
వారును గొందఱు బిరబిర బోలేక పొట్టి పొట్టల బరువున బుసకొట్టుచు
నడుగులు దడబడ బోరగిలఁబడి యతని భక్తుల సూటి పొర్లు దండంబుల
వగలఁ బొర్లిపొర్లి పోవువారును కొందఱు దులదుల బరతెంచి దడదడ
గుండెలు దల్లడములంద గన్నులఁజీకట్లు గ్రమ్మఁదెరవులు గానక నిండు
చెఱువులు జొచ్చి యఱ్ఱుల బంటి నీళ్లలో నిలిచి తెలివిదప్పి దప్పియమ
వారును కొందఱు దుడిదుడిబోయి పదము పదమున దాఁకి మ్రొగ్గి దిగ్గన
లేచి కాట్రేడా యీతూకు దరిఁజేర్చితేని నీ పొలముచుట్టు గ్రొవ్విన మెక
బుల కఱకుట్లు తోరణంబులు గట్టించి జాతరలు సేయించెదమని వేడు
కొనువారును కొందఱు బుడిబుడి జనిదూపను జాలిబట్టి తెప్పిరిలి తను
యాకిరాంధ్ర సూడఁ గలిగినఁజాలు కంబమురాయా నీకుగల పణ్యారములు
సాగింతు మనుచు జగ్గుజగ్గున పరువులెత్తి తొడలు వడంక తొట్రిలి మొగ్గి
తగ్గుచు దగ్గుచు గేకరించి నాలుకలఁ దడిలేక నుమియకు లోఁజిక్కి గుఱ్ఱు
గుఱ్ఱున మూల్గుచు నీల్గుచుఁ బోవువారును కొందఱు గునగుననేఁగి చేరువఁ
బుట్టలఁ జేరువారును కొందఱు నోటిబీగముల దాసల్ల పెల్లున నోరులఁ
బూరులు గఱచువారును కొందఱు తిరునాళ్ల ప్రజనిజముననో వేంకటేశా
శరణు శరణు కావు కావుమని గోవిందలిడు వారును కొందఱు బిరబిర
గట్టులెక్కువారును కొందఱు దొందుమేనల నిటునటు కదలలేక జీని
పందుల పొందికను రక్తార్ద్ర వస్త్రంబులతో బ్రాణాచరంబులు మెళకువ
నొదిగి తలక్రిందఁ జేతులిడికొని 'యోవడ్డికాసులస్వామి యీమాఱుగాచిన
బిడ్డలంగని మీపేరుఁ బెట్టెద' మని మ్రొక్కుచుఁ గన్నులు మోడ్చుకొని
యుండువారును కొందఱు దొమ్మరుల గుఱుతన నహహాయని బడితీఁగెల
వెంబడి నెగఁబ్రాకువారును కొందఱు బెరుకు బాపనపిసాసి బోయల

నమ్మించి తోడుకవచ్చి లచ్చి మగనితోఁ బోరువెట్టుకొని యందఱఁ జంప నెసురుఁ బెట్టెనని మోమోటము లేక చుల్లరపు వాకు వాకుల దెప్పిచెప్పి శరబడులం జేరువారును కొందఱా నాగదత్తునిం గనుంగొని "యోరి పాలుబోయీ నీ గొనం బోరబోయె బెండు మునుఁగుట గుండు దేలుట కప్పకాటు బాపనపోటు గలదా నీవు చింబోతు గంభీరంబున గూబజం కెనలు సేయుచు నిన్నాళ్లవలె నిన్నాళ్లలో తెరవాటు గొట్టి పొట్టసాకుచు కక్షావ మేరనీవలె దిరుగక పరసుబుద్ధి పొడమి కొఱవిఁదల రాచుకొనుచు వైపున నగ్గితో మిడుత యొరసిన బద్ధతి గొరుతో దోమ ఢీకొను త్రోవ సింగం బుతో జాగిలంబు గవయుజాడ బెబ్బులితోఁ సీఁగపులి యెదిరించిన పొలపునఁ దమ్మికంటి బలంబుతోఁ గంటుబలాదూరని యెంచక బలాదూరనిన నీనడుమంత్రపు దొరతనము నీబంటునెఱతనము హాస్యరసం బున కాస్పదంబయ్యె నీవే గెలుము పెగ్గెలు మునుపుగ వదలుము యింక నిను గొల్చిన వడిగలతనంబు దక్క" దని మిడిసిపడు మీను కరణి నీటనుంచి విడిచిన సొరకాయ యెగసిన నిక్కన బిగిసి మిట్టిపడి కేర డంబులు బల్కు గారుడంబులు సాలించి మెల్లమెల్లనే యవ్వలికి వచ్చి యడిదంబులు విడిచి గరుడ గంబంబుల డంబున గండారంబుల బొమ్మల రహిని మౌనుల రేవను చక్కఁగా మేనులు నిసుమంత గదలనీక నిలుచు వారును కొందఱు వంకసిగలాడ మొలఁజుట్టిన దట్టులు పీడ బిళ్ల మెట్లవాళ్లు తునకలై చీరాడసొక్కు పీడెంబు చొంగలు సెలవులపైఁ జిందులాడ మిడిగదలికను కన్నెలేళ్లవలెఁ జెంగు చెంగున దాఁటి తమపరువులంటు వాలఁగలరేయని కిలార్చి 'కొలిచిన కొలువులు పీట బోనిమ్మిపాటి గీములం జేరిన మేరలు దక్కు'నని గ్రక్కున నూడనిబా డువాడనునై తనబలంబు చదరంగ బలమువంటి హరి చతురంగ బలం బున కూరకయెదారనం బెగ్గడిలనెగ్గి వేఁటకాండ్రు చోపుడువెట్టఁ బొదలు వెల్వడి పిట్టలెగిరిపోవు చాడ్పున గట్టుల గుట్టల చెఱువుల కురువుల డొంకల వంకల నీరంబులఁ దీరంబులఁ గోనలఁ గానలఁ గలసినయందు కాపెంత వంతఁ జెందక బలవంతుండై నాగదత్తుండు దన పొత్తున హత్తి సావాసంబుచేసి సాహసంబుగఁ గొలుచు బోయజాతంపు పెద్దవాండ్రతో 'మీరు కంటిరో కానలేదో పెక్కండ్రు జాతిబోయ 'లీయెడ నీలాగాయె నైన నేమాయె నామాయలింక నూడుం డీనూడు మీకు దిరుగ మీకొప్పని

వారి క్రొవ్వని సణఁగింతు మీరున్నఁ జాలు' నననిన నామేటితో వార
'తోరప్పు రవ్వ నీయుప్పు దిన్నవారము గావున తారు నీ తోటివారము
యెందుకా కరుమపుసాకిరి లేకున్న నిమవంటి జన్నిగట్టులు సాకిరియని
సెప్పనేల నీనేల నీనేల చెఱువుతెగి వెల్లువఁ బోయెడి నీళ్లకిగట్టఁ గూడునా
పోయిన ప్రాణంబులు మగుడునా యిత్తడి పుత్తడివలె యొఱకు వచ్చునా
సామిదోగులై పాటిపోయెడి వారు తిరుగ రానేర్తురా హరిదళంబు హరి
దళంబు చాయ చూతంతేయాతంతే' యని ఫురికొని పలుకు పలుకుల
కతండు నిచ్చమెచ్చి యాపరి యందఱ మొక్కలిదుమై వెంటనే గుంపులు
ర్దలు తుటుములు మూకలుగా డాకలు మీఱ నాలుగు కోపులతో నీనిన
పులుల బాళిని యాతలు గ్రమ్మిన లీలను పొంగుబారిన చాయను వలలు
వేసిన పొందిగను సుడిగాలి వీఁచుదెప్పరంబున కొంగలకు దూఱుబైరి
డేగలగతిని కణితిరీగఁలు ముసురుకొను భాతిన చుల్లరంబుల మొత్తం
బున సివంగులు చుట్టుకొను హరువున సరవత్తుల వేగమున రంజకంబు
దినుసున సురటి దిప్పినట్లు తోఁకచిమ్మునాఁగ నెదిర్చిన పగర గుండెలు
చిద్రుపలుగ విదిర్చవలె నిలనద్రువ ననుచుఁ దమతమ ముస్తీదులతో
సిస్తుగా దోస్తిని చుట్టుముట్టి కోపాటోపంబున— 788

## ప్రాసభేదము—అపూర్వ ప్రయోగము

క. మీసలు మెలిబెట్టుచుఁ గడు
రోసమ్ములు గ్రమ్ముకొనఁ బురోభాగములం
దాశ లద్రువ కేకలిడుచును
దూసినకత్తులను ద్రిప్పుడులు గుడుసువడన్. 789

ఉ. వ్రేసినలేదు బంతి యని వ్రేటునవెంబడి జొచ్చి బిత్తరిన్
డాసి బెళాన లాగెను తటాలున వ్రేసి గుణంబు రాటమున్
సీసము కత్తి చొంగణ నృసింహము కొక్కెన కెల్లి బెట్టు య
భ్యాసి విధంబు జూపుచుఁ గిలార్చుచు మేల్జగజెట్లకైవడిన్. 790

ఆ. వె. వింగళించి యాటవెలఁది చందంబున
కోపులందు మీఱి యేపుతోన
మిత్రగణము లతి విచిత్రంబైకొన
దైవగణము లెదురఁ దారసించె. 791

## బీభత్సరసము

ఉ. తారసమైన యంత బెడిదంబుగలో వెలిదప్పి తెప్పునన్
మోరలు బోరలల్ల చనుముక్కులు ముక్కులు చెక్కి కేలివాల్
దారులు దప్పనీకనని దారు లెఱింగి తమున్ బిరా దునే
దారులు మెచ్చ శాత్రవవిదారులునై జయమంది యున్నెడన్. 792

క. తప్పినవారలు పాఱుడు
దప్పినవారలును గ్రోలి తల్లడ పడుచున్
దప్పటడుగు లిడు చప్పుడు
తప్పట బాగెము లటంచు దలఁపుచు మదులన్. 793

గీ. సేకరించుక తక్కిన మూకనెల్ల
మాయలెడపగల చుక్క బోయమిన్న
కొదమ సింగమ నాయక గూటికురుజ
ముచ్చుదొర కోలు సన్నాసి చిచ్చుపిడుగ. 794

క. అని యేసబాసఁ బిలుచుచు
ననికిన్ మరల బురికొల్పిన బలమ్ములు సౌ
జనమించుక నెనరించుక
గనఁ గొంచములంచు నెంచకయె పికిలితమిన్. 795

## ద్విరుక్తకందము

క. తొకతొకల నుడికి మిడుకుచుఁ
దికతికలై యొండొకళ్లు దెగుకత్తులబల్
చకచకలు నెసక మెసఁగన్
గకవికలుగ హరిబలంబు కళవళమందన్. 796

మ. శరధిధ్వాన సమానమై హలహల చ్ఛబ్దంబు రోధోంతరం
బరికట్టం గరిగట్టి దిట్టలయి బోయల్ దాయలై పాయక
ప్పురవీధిన్ బరవీరుల న్గదమ గుంపుల్ గూడి కైజీతముల్
దఱుమ న్బర్విడి స్వామిపుష్కరిణితీర్థంబందువేఁగ్రుంకినన్. 797

గీ. అందుఁబడి వారి మేనులయందుఁ గలుగు
బోయనేతల పాపము ల్పోయెఁగనుక
విధుని పదమున కరిగిన విధుని దూత
మానవులు దెచ్చి రతుల విమానచయము 798

క. ఆదివ్యవిమానంబుల
గైదండలు దేవకన్యకామణు లొసఁగన్
మోదమునఁ బారిజాతపుఁ
బూవండలు దాల్చి హరినిఁ బొందిరి వారల్. 799

గీ. ప్రాణభయమున నంతటి పాపకర్ము
లతులగుహ పుష్కరణిఁ గ్రుంకి హరిఁ గలసిరి
కావలెనటంచుఁ గ్రుంకెడు ఘనులకెపుడు
భ్రాంతమే కామితార్థ వైభవము గనుట. 800

వ. అయ్యవసరంబున—

## సవ్యాపసవ్య సప్తధా వృత్త్యష్టదిక్పాల తద్వాహన మత్తేభపంచపాది అపూర్వప్రయోగము

మ హరికీలిన్ శుచి వాసవుల్ రవిజుఁ గాలాగ్నిద్యువుల్ కర్బురున్
నరఖాదార్కి శిఖీంద్రు లవ్వరుణుకే నక్రవ్యభుగ్దండి బ
ర్హిరగారుల్ వలికాప్పదైత్యే యమ వహ్నిస్వర్పతుల్ యక్షరై
వరపాబ్ధీశ నిశాట సౌరి జం భూవజ్రుల్ భవుంగూడి గో
హరి సారంగ సునక్ర మానవలు లా యా విద్విరూపాఢులై. 801

## త్రివిధదళయుక్త ప్రాసనీసావకలి ప్రాసనంసృష్టి సీసము—అపూర్వప్రయోగము

సీ. చలువ పుట్టువు తేని గెలువ పట్టగుమేని
చిలువగట్టునఁ బూని నిలుచువాని
నలువ యోపికనేని నిలువ రూపగరాని
నలువగు రూపూని యలరువాని

కొలువ పోరిడు మోని చెలువలరు కడాని
చెలువ పేరెదవాని వెలయువాని
కలువగొంగకు లేని బులువగంగను జీని
వలువరింగులు పైని గలుగువాని

గీ. మొనయు వలి పిల్ల లావులా వుల్లమునకు గాని
బొల్లి నెమ్మోము దనరారు పుల్లుతేని
పల్లటీలను పె ల్లుల్లసిల్లువాని
దాని వరదానిగని వేఱె తలఁపు మాని. 802

## అద్భుతోపమ—ప్రాసభేదము

క. చీఁకటి వెన్నెల యెండయు
నేకముహూర్తమునఁ గలసి యిల వెలసెననన్
శ్రీకాంతయుఁ గౌస్తుభమణి
యాకడ శ్రీవత్సమలరె హరినీయెదపై. 803

క. ప్రాలంబక భాగ్రీవా
రోలంబకటాక్షయుక్సరోజ గృహేశా
సాలంబకా సురాంతక
యాలంబక హేమవై జయంతీధామా. 804

## శృంఖలిత వచనరగడ

శ్రీవిహార హారకీర్తి కీర్తి తాబ్జతాబ్జ పుణ్య
పుణ్యకాంతి కాంతి ధామ గోత్ర గోత్ర భూమ
భూమ హారి హారి చక్ర చక్రరాజ రాజరాజ
రాజరాజ రాజకంజ కంజపాన పాన వీన
వీనకాండ కాండభాగ భాగమంద మందరాగ
రాగధారి ధారిదాన దానలోక లోకపాల. 805

## ఆది ద్విప్రాసదళమధ్య త్రిప్రాస నియమాంత్య ద్విప్రాసదళ చరణాక్కిలివడి సీసము

సీ. పురహూతాదిక సురాసుర దురాసదధరా
ధర వరామిత భరా భరణ దారి
మదవదాకృతి ముదాస్పద మదావళ రదా
గ్రగద గదా భుజవదా వదజనౌఘ

ఖల పలాశన బలాతుల బలాహకకులా
ఖిల పలాయన కలా నిల నిభాస్త్ర
భయరయానమదయాన్వయ నియామక జయా
లయ దయారస మయా శయ విలాస

గీ. హేమభూమ సముజ్జ్వల క్షేమధామ
దీన మానస కృష్ణాభి మానదాన
నక్ర విక్రమ హర కరావక్ర చక్ర
పావనావన వేంకటగ్రావ దేవ. 806

## భుజంగప్రయాత స్రగ్విణీవృత్త గర్భిత దండకరూప చిత్రసీసము—యెత్తుగీతిద్వ్యక్షరి

సీ. పూతనాదాసుర భ్రాతృ సంత్రాణ సూ
ర్యప్రకాశాకృతీయప్రమేయ
శేషతల్పాకర స్ఫిత శంభారి గాం
భీర్యవార్ధీ స్థితాభీమవంద్య
దంతి రక్షావరాద్వైత మార్గ ప్రభా
వాత్త చిత్తాధి కాయద్రఢైర్య
కంజనేత్రాశరఖ్యాత జీమూత సం
కాశవర్ణాతిగా కంబుకంఠ

గీ. మున్ను ముని మననమ్మున నెమ్మి నోమి
నెమ్మ నమ్మన నిన్నునే నమ్మినాను
నేమమున నేమమున నెన్ను నీమనమున
మేన నున్నని నెమ్మేని మీనుమిన్న. 807
(పై పద్యమునందలి గర్భితవృత్తములు)

## గర్భితభుజంగప్రయాతము

సురభ్రాతృ సంత్రాణ సూర్యప్రకాశా
కరస్ఫిత శంభారి గాంభీర్య వార్ధీ
వరాద్వైతమార్గ ప్రభావాత్త చిత్తా
శరఖ్యాత జీమూత సంకాశవర్ణా.

## గర్భితస్రగ్విణీవృత్తము

ప్రాతృసంత్రాణ సూర్యప్రకాశాకృతీ
స్ఫీత శంఖారి గాంభీర్య వార్ధి స్థితా
ద్వైతమార్గ ప్రభావాత్త చిత్తాధికా
ఖ్యాతజీమూత సంకాశ వర్ణాతిగా.

బహువిధ చిత్రకంకణ బంధద్విగుణిత సీసచరణ చతుష్టయ గర్భిత ద్విపదం కందద్వయ సమవృత్త చౌపద యుగ శాటవెలంది తేటగీతి మదన విలసిత తురంగవృత్త బహువిధ తాళవృత్తాష్టక ధవళ శోభాన గానారాత్రిక గాన జంపె త్రిపుటార్ధచంద్రిక సువ్వాల లాలిపదేలా మంజరి సమతా డిండిమ తాళవృత్త మణిగణనికర తురగవల్గనరగడో దాహరణ సంబుద్ధి కళికోత్కళికార్ధాహిరీ రాగదళ ముఖారి రాగాట తాళదళ కాంభోదిరాగ రూపకతాళదళ కాంభోదిరాగ సమపద కన్నడ రాగ సాంగత్య కొరవంజిదళ రేవగుప్తిరాగ సమపద సావేరి రాగైక తాళదళ బిలహరిరాగాటతాళసమపద పుష్పమాలికా బంధ గోమూత్రికాబంధ శార్ఙ్గబంధ షోడశదళ పద్మబంధ పాదుకాబంధ నవరంగబంధ ఖడ్గబంధ గచ్ఛబంధ ఛత్రబంధ చామరబంధ గదాబంధ చక్రబంధ శకటబంధ నాగబంధ రథబంధ వీణాబంధ శంఖబంధ మృదంగబంధ పాదభ్రమకబంధ పాదార్ధ భ్రమక వింశతిబంధ భేద కందానుష్టుప్ శ్లోకాంతర్గత చతుర్భద్ర నవరంగ సర్వతోభద్రాందోళికా బంధ యుక్తానులోమ విలోమకంద భాషాశ్లేషకంద కందాటవెలంది గర్భితాంత్య తేటగీతియుక్త చౌషష్టి భేద చిత్రసీసము.

సీ. సారాగ్ర్యసారస సమనేత్రయుగళ నా
　　　రదరుచికాంతి నర ఘనపనిత
సారాగధీర విశదఫేన తురగ భై
　　　రవభవ జైత్రభర శుభకరణ
సారాతిహార విసరచారణహరిసా
　　　రసహిత చంద్రశరజజయనుత
వారాశినారదవర పూజితపద గౌ
　　　రవకటి ఖడ్గ గరళగళ సఖ

గీ. హరినగనిలయ గిరిధర యసురదశన
మణిమయమకుట సురమణి మధువిశరణ
కరివరదకు వరరుచిరతరవసన న
రహరి లసితదర నిగమ విహరణహరి. 808

(పై పద్యమునందలి గర్భితములు)

## 1. ద్విపద

సారాగ్ర్యసార సమనేత్రయుగళ
నారదరుచికాంతి నరఘనపనిత
సారాగధీరవి శదవినీతురగ
భైరవభవజైత్ర భరశుభకరణ
సారాతిహార విసరణ చారణహరి
సారసహితచంద్ర శరజజయనత
వారాశినారద వరపూజితపద
క్రౌరటకటిఖడ్గ గరళగళసఖ

## 2. ప్రథమ కందము

సారససమనేత్రయుగళ
నారదరుచికాంతినరఘనపనిత సారా
ధీరవిశద వీనతురగ
భైరవభవజైత్రభర శుభకరుణసారా.

## 3. ద్వితీయకందము

హార విసరచారణ హరి
సారసహితచంద్రశరజ జయనుతవారా
నారదవరపూజితపద
గౌరవకటి ఖడ్గగరళగళసఖ సారా.

## 4. సమవృత్తము

సారాసారస సమనేత్రయుగళ । సారాధీరవిశదపీనతురగ
సారాహార విసరచారణహరి । వారా నారదవరపూజితపద

## 5. ప్రథమ మహానవమి చౌపది

సారాగ్ర్యసారస సమనేత్రయుగళ
నారదరుచికాంతినరఘనపనిత
సారాగధీరవిశదపీనతురగ
భైరవభవజైత్ర భవశుభకరణ.

## 6. ద్వితీయ మహానవమి చౌపది

సారాతిహార విసరచారణ హరి
సారసహితచంద్రశరజ జయనుత
వారాశి నాక్షదవర పూజితపద
గౌరవకటి ఖడ్గగరళ గళసఖ.

## 7. ఆటవెలఁది

నారదరుచికాంతి నరఘనపనితసా
భైరవభవజైత్ర భరశుభకర
సారసహితచంద్ర శరజజయనుతవా
గౌరవకటిఖడ్గగరళగళసఖ.

## 8. తేటగీతి

సారససమనేత్రయుగళ నారదరుచి
ధీరవిశదపీనతురగభైరవభవ
హారవిసరచారణహరిసారసహిత
నారదవరపూజితపద గౌరవకటి.

## 9. మదనవిలసిత వృత్తము

నరఘనపనితా
భరశుభకరణా
శరజజయనుతా
గరళగళసఖా.

## 10. తురంగవృత్తము

తానాతానన. సారస సమనేత్రయుగళ నారదరుచికాంతి నరఘనపనిత
ధీరవిశదపీనతురగ భైరవభవజైత్ర భరశుభకర
హారవిసరచారణహరి సారసహితచంద్ర శరజజయనుత
నారదవరపూజితపద గౌరవకటి ఖడ్గ గరళసఖ.

## 11. బహువిధతాళవృత్తము

తానాతందనతానా. నారదరుచి ధీరవిశద
భైరవ భవహారవిసర
చారణహరి సారసహిత
నారదవరగౌరవకటి.

## 12. అష్టకము

సారస సమనేత్రయుగళ । నారదరుచిరఘనపనితా
ధీరవిశద పీనతురగ । భైరవభవభరశుభా
హారవిసరచారణహరి । సారసహితజయనుతా
నారదవరపూజితపద । గౌరవకటిఖడ్గసా.

## 13. ధవళము

సారససమనేత్రయుగళ
నారద నరఘన పనిత
ధీరవిశద పీనతురగ
భైరవభవ శుభకరణ.

## 14. శోభాన

సారససమనేత్రయుగళ
ధీరవిశద పీనతురగ
హారవిసర చారణహరి
నారదవరపూజితపద.

## 15. హారతి అనఁగా నారాత్రికము

సారాగ్ర్యసారస సమనేత్రయుగళఘన
భైరవభవజైత్రభర శుభకర
సారాతిహార విసరచారణ హరిజయ
గౌరవకటి ఖడ్గ గరళ గళసఖ.

## 16. జంపె

సారాగ్ర్యసారస సమనేత్ర నరనుత
గౌరవకటి ఖడ్గ గరళ గళసఖ

## 17. త్రిపుట రేకులు

హారవిసరచారణ హరిసారసహిత చంద్ర జయనుత
నారదవర పూజితపద గౌరకకటి
నారద రుచికాంతి నరఘన సారస సమనేత్రయుగళ
ధీరవిశద పీన తురగ భైరవభవ.

## 18. అర్ధ చంద్రికలు

కరి వరదకు వర । హరినగ నిలయ

## 19. సువ్వాల

సారససమనేత్రయుగళ
నారద రుచి నరఘన
ధీరవిశద పీనతురగ
భైరవభవ

## 20. లాలి

సారససమనేత్ర నారదరుచి
భైరవభవ జైత్రభర శుభకరణ

## 21. ఏల

ధీరవిశద పీన తురగ । సారసమనేత్రయుగళ
హార విసరచారణ హరి । సారసహిత నారదవరపూజితపద

## 22. మంజరి

నారదరుచి కాంతినరఘన పనిత
పీనతురగ హార విసర శుభకర
సారస సమనేత్ర చంద్ర జయనత
శరజవారాశి విశద పూజితపద
మధువిశరణ మణిమయ మకుట హరి
కరివరద హరినగ నిలయనిగమ.

## 23. సమతాడిండిమతాళవృత్తము

తక్కతోంగ ధిక్కతోంగ ధిమితతోంగ ధిమితతా
తనన తనన తనన తనన తనన తనన తననా॥

సారససమనేత్ర యుగళ నారదరుచి నరఘనా
ధీరవిశద వీనతురగ భైరవ భవ భర శుభా
హారవిసరచారణహరి సారసహిత జయనుతా
నారదవర పూజితపద గౌరవకటి ఖడ్గగా
హరిన గనిల యగిరి ధరయ సురదశనమ, ణిమయమా.

## 24. మణిగణనికరము

నరఘననుతభవ భరశుభకరణా
హరిజయనుత వరగరళ గళసఖా
సురమణిమధు విహహరినగ నిలయా
కరివరదకువర నరహరి నిగమా.

## 25. తురగవల్గనరగడ

హారవిసర చారణహరి సారసహిత చంద్రశరజ
నారదవర పూజిత పద గౌరవకటి గరళ గళస
ధీరవిశద వీనతురగ భైరవ భవభర శుభకర
సారస సమనేత్ర యుగళ నారదరుచి నరఘననుత.

## 26. ఉదాహరణ సంబుద్ధికళికార్థము

గౌరవకటి గరళ గళస హారవిసర చారణహరి
సారసహిత చంద్రశరజ నారదవర పూజితపద
భైరవభవ భర శుభకర సారస సమనేత్ర యుగళ
నారద రుచి నరఘననుత ధీరవిశద వీనతురగ.

## 27. ఉత్కళికార్థము

హరినగనిలయ గిరిధరయ । సురదశన మణిమయ మకుట
సురమణి కరివరదకువర । నరహరి లసిత దరనిగమ.

## 28. ఆహిరీరాగదరువు

సారాగ్ర్యసారస సమనేత్ర యుగళ
సారాగధీర విశద వీనతురగ

## 29. ముఖారిరాగదరువు—అటతాళము

సారాగ్ర్యసారస సమనేత్రయుగళ
భైరవ భవజైత్ర భరశుభకరణా.

**30.** ఎఱుకల కాంభోదిరాగదరువు-రూపకతాళము
సారాతిహార విసర చారణహరి
వారాశి నారదవర పూజిత పద.

**31.** కాంబోదిరాగ సమపద దరువు
సారస సమనేత్రయుగళ
నారదరుచి కాంతిసరఘనపనిత
సారాగధీర విశద వీనతురగ
భైరవ భవజైత్రభర శుభ కరణ.

**32.** కన్నడరాగ సాంగత్యదరువు పదము
సారాగ్ర్యసారస సమనేత్ర యుగళ
నారదరుచి కాంతి సరఘన పనిత
సారాగధీర విశద వీనతురగ
భైరవ భవజైత్ర భరశుభకరణ.

**33.** కొరవంజిదళ రేవగుప్తి రాగ సమపద దరువు
సారాతి హార విసర చారణహరి
సారసహిత చంద్ర శరజ జయనుత
వారాశి నారదవర పూజితపద
గౌరవకటి ఖడ్గ గరళగళ సఖ.

**34.** సావేరి రాగైక తాళదరువు
హరినగనిలయ గిరిధర
యసుర దళన మణిమయ మకుట
సురమణిమధు విశరణ
కరివరద కువరలసితవర.

**35.** బిలహరిరాగట తాళ సమపద దరువు
సారాగధీర విశదవీన తురగ
నారదరుచి కాంతి నరఘన పనిత.

**36.** వింశతిబంధకందము
సారవరహార వారా
సారహరినరహరి హర శరకర సారా
గౌరధర ధీరచారా
సారహరీ సురహరి నరసరసారభరా.

## 37. అనుష్టుప్శ్లోకము

సారాసారరసారాసా
రాగ హార రహాగరా
సహాయసా సాయహాసా
రరసామమసారర.

## 38. అందోళికాబంధ యుక్తానులోమ విలోమకందము

మారామా సాదయభర
భారశరాసాజలజ సువదన నిజరసా
సారజనినదవసుజలజ
సారాశరభార భయద సామారామా.

## 39. భాషాశ్లేషకందము

క. మేలా నాయక బలిరా
యేలా చలమానగాన దేరాలివల
న్నీలాగీ తీరగునా
వేలము దయ కావగదర వేంకటరమణా.

## 40. ఎత్తుగీతియందలి కందము

హరినగనిలయ గిరిధరయ
సురదళన మణిమయ మకుట సురమణి మధువి
శరణ కరివరద కువరరు
చిరతర వసన నరహరి లసిత దరనిగమా.

## 41. ఎత్తుగీతియందలి ఆటవెలది

హరి నగనిలయ గిరిధరయసుర దళన
మణిమయమకుట సురమణి మధువిశ
రణకరి వరద కువర రుచితరవస
న నరహరిలసిత దరనిగమ విహ.

( శ్రీ పూండ్ల రామకృష్ణయ్యగారి జ్ఞాపిక - పైపద్యమునందలి గర్భితమును, బంధభేదములును జేరి చౌషష్టి భేదములని యెఱుంగునది. మఱియు అనుష్టుప్ శ్లోకమునకు అనులోమ విలోమకందమునకు రెండు వర్ణములును భాషాశ్లేషకందమునకు నాఱువర్ణములును నీసీసములోనివి కావని యెఱుంగునది).

ఆది చతుశ్చరణ గర్భిత మత్తేభ విక్రీడితావృత్త తదంతర్గత షడక్షర సమవృత్తోత్తరగీతి గర్భిత కందవిభాసమాన సీసము

సీ. సవినయాచార విచార తత్పర మహా
వేదాంత విద్వందితాది దేవ
సుజనవర్యామిత శోభనైక ఘటనా
చాతుర్య లీలాస్పదాతతాత్మ
భవన చారిప్రతి పారికాంక్షి హృద
యాబ్జాతద్విరేఫాకృతీతగాత్ర
భువనరాశీశ్వర పుత్రికాభినుత
సద్వస్తు ప్రదానోత్సవాత్యుదార
గీ. గురుతర దయాసముజ్జ్వలయ దీరికర
దారితారిహస్తివరద వారిరుహన
యనవసుఘటి తాంబరధర ఘననిభతను
విభ ఫణిగిరివాసా నిత్యశుభవిలాస. 809

## 1. గర్భితమత్తేభవిక్రీడితవృత్తము

మ. వినయాచార విచార తత్పరమహా వేదాంతవిద్వందితా
జనవర్యామిత శోభనైక ఘటనా చాతుర్య లీలాస్పదా
వనచారి ప్రతిపారికాంక్షి హృదయాబ్జాతద్విరేఫాకృతీ
వనరాశీశ్వర పుత్రికాభినుత సద్వస్తు ప్రదానోత్సవా

## 2. గర్భితషడక్షరసమవృత్తము

వినయాచారవి । జనవర్యామిత
వనచారిప్రతి । వనరాశీశ్వర

## 3. గర్భితకందము

గురుతరదయా సముజ్జ్వల
యరిదరకరదారితారి హస్తివ రదవా
రిరుహనయన సుఘటితాం
బరధర ఘననిభతనువిభ ఫణిగిరివాసా.

## ఆది చతుశ్చరణ గర్భిత మత్తేభ విక్రీడిత వృత్తోత్తర గీతి గర్భితకంద విభాసమాన సీసము

సీ. మహితనానాముని మండలీ విరచితా
హీనాతివేల్లత్స్తవానుషంగ
వితతజన్యాంగణ విక్రమక్రమలస
త్క్ష్వేడ సంహారకానుభావ
వినత బర్హిర్ముఖ విస్ఫురన్మకుటర
త్నశ్రేణి రాజత్పదాభిరామ
విగతవిశ్రాణన విస్మయ స్మయదివౌ
కశ్శాఖిజైవాతృకాది దాన

గీ. నిరుపమకృపాపయోంబుధి నిరతశుభద
ధీరచరిత నిర్మలతర దేహరుచిజి
త సజల జలదాయురగేంద్ర ధరణిధరవ
రయురు సుగుణనిధీ పక్షిరాజవాహ. 810

## 1. గర్భిత మత్తేభవిక్రీడిత వృత్తము

మ. హిత నానాముని మండలీవిరచితా హీనాతివేల్లత్స్తవా
తతజన్యాంగణ విక్రమక్రమలస త్క్ష్వేడ సంహారకా
నతబర్హిర్ముఖ విస్ఫురన్మకుటరత్నశ్రేణి రాజత్పదా
గతవిశ్రాణన విస్మయ స్మయదివౌకశ్శాఖిజైవాతృకా.

## 2. గర్భితకందము

క. నిరుపమకృపాపయోంబుధి
నిరత శుభద ధీరచరిత నిర్మలతరదే
హరుచిజిత సజలజలదా
యురగేంద్ర ధరణిధరవరయురు సుగుణనిధీ.

## అత్యేతోత్యత్వతురంగ వృత్తఘటిత చతుశ్చరణ సీసము అపూర్వప్రయోగము

సీ. పద్మసంభవ శక్రపర్వత వరధర్మ
ధర వచనస్తవ్యనరసహచర
సిరికిని క్షితికిని విరివిని జిగినించి
సిరిగిరి నిలిచితి చిద్ధితినిధి

బుధులును గురులును పుణ్యులు మునులును
నుతులుంచు మురువుకు శ్రుతులు గుఱుతు
లుగ జగత్త్రయి ధగద్ధగల గత్ఖగవర
ధ్వజమరుద్ధతిఖల ధ్వజినిమ్రగ్గ
గీ. నమరు మరుఁగన్న జియ్య దృప్తమరుజియ్య
జియ్య విశదాంతరీపని కాయ్య భుజగ
శయ్యాపావళీసమిద్ధాయ్య సమితి
శాయ్యనర్ఘ్యగుణాక్షయ్య చక్రనయ్య.

## చిత్రసీసము

సీ. నీరజదేహకాంతి రజనీకర వక్త్ర
జలధిశయన రవి శశినయనయు
గా రజనీచరవార దళారిక
రాఫణిపతికు ధరవర నిలయ
గరుడ తురంగ చంక్రమణ కౌతుకచిత్త
వారిజోదరనర వాసవనుత
మహిమ యలర్మేలుమంగా హృదంబుజ
భృంగాయనాథాంతరంగ కుపర
గీ. పారికాంక్షికరక్ష పంకేరుహాక్ష
చారుకౌస్తుభవక్ష జన్యారిశిక్ష
పుర హరణ సఖయమరకింపురుష గరుడ
సిద్ధసాధ్య విద్యాధరసేవితపద. 812

## ఏకగణయుక్తైక నియమానుప్రాస షట్కఘటిత చరణాక్కిలి వడి సీసము

సీ. తులలేని యలమేని శలవోని వలతేని
సొలపాని కలనూని నిలఁగలాఁడ
అరిదాపు తరిరూపు కరిదాపు దరిజూపు
నరివైపు నెఱిప్రాపు కరమువాఁడ
పొగరొందు తొగవిందు సిగబొందు తగఁజెందు
మగపొందు సొగసొందు మగువతోఁడ
యలమించు నలమించు తలమించు తలమంచు
నలయించు చలమంచు వలపుతేఢ

గీ. పాపరాపగ జిగిబిగి పక్కి జక్కి
నెక్కు నెక్కువశేవ సొంపెక్కు దేవ
గిబ్బ గుబ్బలి నడుదిబ్బ నుబ్బు కబ్బి
తమ్మిముద్దియ గద్దియ తాతతాత. 813

## ముక్తపదగ్రస్తవిశేషాక్కలి వడిసీసము

సీ. ఘనకీర్తి జితశరద్ఘనసారఘనసార
సారకుమార కాసారసార
సారభట్యుద్ధతా శరవారవార
వారణార్తి ప్రతీకారకార
కారారిదళిత శేఖరధీర ఖరదీర
ధీర భక్త శుభదోదారదార
దారదాతిక్రూర దవచార దవచార
చారచరాపదుద్ధారధార

గీ. ధారణీధార ధారరాడ్ధైర్యహార
హారనుతిపారపారమ్యదారితార
తారకాకారకారణాత్మకవిహార
హారమతదూర మారశృంగారగార. 814

## యతిభేదవిభక్తియుక్త సీసద్వయావలికడి సీసము

సీ. అబ్ధి కన్యాతి భోగైక పారంగత
మాంసాశనేశ సంహారతేజ
రమ్యతరాది నారాయణ విగ్రహ
హరి వైణవకలాలాప నినద
హేవాక పాండురద్వీపమధ్యశయాన
ఋషికులవినుత వర్ధిష్ణుమహిమ
తజ్ఞత్వరహితాస్మదహన కారణనామ
నాస్తివాదజనచేతోబ్జదూర

గీ. యిరువు గనుపట్టు చలువతెమ్మెర రతీఋ
దాడితత్తడి సాడి కడంగరియ్య
హయసఖ యలరుమేలు మంగమ్మతోడ
హెచ్చు సొన్నంపువల్వ ధరించుమేటి. 815

## సంస్కృత విభక్త్యంతసీసము

సీ. తావక నగజల స్నాత పాపహరాయ
యతిమాత్ర సాధన జ్ఞానదాయ
యాపద్దశాప్తి వేదండ భీదళనాయ
రాజిత శ్రీవత్స లక్షణాయ
వాఙ్మదు భవగీతలగ్న చేతస్కాయ
ముచికుంద ముఖభక్త పూజితాయ
తతవీచిమాలి బంధాగ్ర నాశీకాయ
పార్వతీ ప్రాణేశ వర్ణితాయ

గీ. జలజ వాస్త్రవ్యకలశీ కుచప్రియాయ
పరశురామ విపాటనభంజనాయ
సవన ధారీశరీరాయ శంఖచక్ర
హస్త పద్మయుగ్మాయ తుభ్యం నమోస్తు. 816

## చతుర్విధ కందము

1. వనజాయతాక్ష వాసవ
వినుతా యురగేంద్రశయన విశ్రుతచరితా
వినతా సుతాశ్వశరజిత
వనధీ తిరువేంకటేశ వారణవరదా. 817

2. ఉరగేంద్రశయన విశ్రుత
చరితా వినతా సుతాశ్వశరనిధి వనధీ
తిరువేంకటేశ వారణ
వరదా వనజాయతాక్ష వాసవ వినుతా.

3. వినతా సుతాశ్వశరజిత
వనధీ తిరువేంకటేశ వారణవరదా
వనజాయతాక్ష వాసవ
వినుతా యురగేంద్రశయన విశ్రుత చరితా

4. తిరువేంకటేశవారణ
వరదా వనజాయతాక్ష వాసవవినుతా
యురగేంద్రశయన విశ్రుత
చరితా వినతా సుతాశ్వశరజిత వనధీ.

## నవాక్షర సమవృత్త కందద్వయ మణిగణనికరగర్భిత సజరసివృత్త పంచవిధవృత్తము

### సరసిజవృత్తము

శ్రీలోలా చంద్రాలయ చేలాశ్రిత । సురచయ తనుజిత సజలఘనా
వ్యాలగ్రావావాల దయాఘా । హతదితి సుతపతిహరి సమగమనా
బాలార్కాభాశైల దపాలా । ప్రతతభువనచయభరణ నరసఖా
జాలోద్వేలా ఖేలనశైలీ । సతతము గొలుతుము సరవి మనుపుమీ.

(ఈ వృత్తమున నేకతాళి యర్ధచంద్రిక లెనిమిది తేకులు సరిగాఁ బొందుపఱచి యున్నవిగాన సరిచూచుకొనునది. (పూ.రా.) )

### 1. గర్భిత నవాక్షరపాద సమవృత్తము

శ్రీలోలా చంద్రాలయ చేలా । వ్యాళగ్రావావాల దయాఘా
బాలార్కాభా శైలదపాలా । జాలోద్వేలా ఖేలనశైలీ.

### 2. గర్భిత ప్రథమకందము

శ్రీలోలా చంద్రాలయ । చేలాశ్రితసురచయ తనుజితసజలఘనా
వ్యాలగ్రావావాల ద । యాఘా హతదితి సురపతి హరిసమగమనా.

### 3. గర్భిత ద్వితీయకందము

బాలార్కాభా శైలద । పాలా ప్రతత భువనచయ భరణ నరసఖా
జాలోద్వేలాఖేలన । శైలీ సతతము గొలుతుము సరవి మనుపుమీ.

### 4. గర్భితమణిగణనికరవృత్తము

శ్రితసురచయ తనుజిత సజలఘనా
హతదితి సుతపతి హరిసమగమనా
ప్రతత భువనచయ భరణ నరసఖా
సతతము గొలుతుము సరవి మనుపుమీ.

### ఏకసమాససీసము – అపూర్వప్రయోగము

సీ. కలిగెఁ గానిపు డబ్జదళ గళ న్మకరంద
ఝుల తుండిల మిళింద కుల నినాద
డిండిమ మండలీ ధిమిధిమి నిర్ఘోష
విలసిత శోణకువలయ ముకుళ

కైతవదిన దీపికాశ్రేణి కాద్యుతి
జాతవాతాహత చరితతుంగ
రంగత్తరంగ స్ఫురచ్చామరాదిమ
మంగళ బిరుదాంక మహిమకలిత

గీ. వర్ణనీయాపగాఢ్య సాత్వ ప్రభావ
ధుర్యగంగాగ్రజన్మ హేతు ప్రశస్త
హలకులిశ మత్స్య పద్మాంకుశాత పత్ర
భవ్య మహనీయ తావక పాదసేవ. 819

## అనోష్ఠ్య

సీ. కోరకైదువ గుంపు గురికాని దాఁగిలి
మూతలాటల కన్ను చేత మాటి
వారణేంద్రునిపైని నేరము ఘటియించి
చిఱునవ్వు మోడిచేఁ జెక్కుఁ గొట్టి
దంష్ట్రిని బొలయల్కదారిజూపుచుఁ దనుఁ
బేరుకోవలదని నోరుమూసి
విమలకులాచలేంద్రము నెన్నక యఘన
స్థితి జెదరంగ గద్దించి చూచి

గీ. కీర్తికాంతవిధాన నీ క్షితివధూటి
వలచి నీబాహు సంకేత తలముఁ జేరె
నిసువు వలిపగరాపేరి సేలదారి
నడియు దిరి మేడ నడయాడు కొడిమెలాఁడ. 820

## ద్విపద మత్తకోకిల కందగర్భిత సీసము

సీ. సారసోద్భవ శర్వ సన్నుత సారవా
రణ రక్షణావసు రమ్యనేత్ర
ధారుణీ తనయాది ధర్మవిధారి దా
రుణ శిక్షణాతత రూపసార
హారమానసయుక్త హారివిహార నీ
రజ వీక్షణా నిధిరాజదాన
పారికాంక్షిక సత్కృపారస భారపా
ర సులక్షణాపటు రమ్యకృతిస

గీ. సవితృబింబ వసతి సౌర సమాదక
విజయ భూతరాజ విదితధీర
వేదవేద్యయ భవ వేదాంత తత్వజ్ఞ
యసురనాశ వేంకటాచలేశ.

## 1. గర్భితద్విపదము

సారసోద్భవ శర్వ సన్నుతసార
వారణ రక్షణా వసురమ్య నేత్ర
ధారుణీ తనయాది ధర్మవిదారి
దారుణ శిక్షణాతతరూపసార
హారమానసయుక్త హారివిహార
నీరజవీక్షణా నిధిరాజదాన
పారికాంక్షిక సత్కృపారసభార
పారసులక్షణా పటురమ్యకృతిస.

## 2. గర్భిత మత్తకోకిలము

సారసోద్భవ శర్వసన్నుత సారవారణ రక్షణా
ధారుణీ తనయాది ధర్మవిదారిదారుణ శిక్షణా
హారమానసయుక్త హారి విహారనీరజ వీక్షణా
పారికాంక్షిక సత్కృపారసభార పారసులక్షణా.

## 3. గర్భితకందము

వసురమ్యనేత్ర తతరూ
పసార నిధిరాజ దానపటు రమ్యకృతీ
ససవితృ బింబవసతి సౌ
రసమాదర విజయభూత రాజవినుత ధీ.

## శ్లోకగర్భిత చంపకమాలికా వృత్తము

చ. నరసఖ నారశాయి నరనాథ నతామర నారదస్తుతా
దరకర ధారదేహ ధరధారి ధరాధిపదారితా శరా
హరిబలహారి కంఠహర హారిహతాహిత హార హృద్భవా
స్థిరతర సీరపాణి శివ శీలజితాసుర సింధుబంధనా. 822

## 1. గర్భితశ్లోకము

శ్లో॥ నరనాథనతామర నారదసన్నుతా
ధరధారి ధరాధిప దారితా శరా
హరహారి హతాహిత హారహృద్భిదా
శివశీలజితాసుర సింధుబంధనా.

## 2. గర్భితగీతి

నారదస్తుత నరనాథ నారశాయి
దారితాశర ధరధారి ధారదేహ
హారహృద్భిదహర హారిహారికంఠ
సింధుబంధన శివశీల సీరపాణి.

### అసంగత్యలంకారసీసము

సీ. స్తంభంబు లొదవెను దైత్యదేహంబులఁ
ప్రళయము ల్పొడమెఁ దత్పట్టణములఁ
రోమాంచములు మించె భీమవిక్రములెదఁ
బ్రభవిల్లె చెమటలు పందలందు
మొక్కలిదొరల మోముల వివర్ణతఁ దోఁచెఁ
బగటువాతెగలఁ గంపములు గలిగె
గడిమన్నెచెలుల కన్గవల నశ్రువు లూటె
శరుల సూక్తులను వైస్వర్యమబ్బె
గీ. వింత యిదిగాదె నినుఁ జూచి విజయలక్ష్మి
పొందుగను సాత్వికోదయమందు నంత
కంటి విన్కలిదంట పేరింటి గంటి
నడుమ నెలకొన్న వేంకటనాథ శౌరి.

### కార్యకారణ విపర్యయ రూపాతిశయోక్త్యలంకారైకావళి సంసృష్టిసీసము

సీ. భవదీయ బలరజఃపాళి సంధ్యకుమున్నె
తాఁగ్రుంకు దనుజప్రతాపహేళి
యాహేళి యస్తాగమందుఁ గ్రుంకకమున్నె
నలరుఁ దద్రిపు దుర్యశోంధకార

మాయాంధకారౌఘ మాక్రమించకమున్నె
బొడముఁ దావక కీర్తి పూర్ణచంద్రుఁ
డాచంద్రుఁ డుదయాద్రి నవతరించకమున్నె
కొమరొందు సజ్జనకుముద నికహ
గీ. మహహ హిమధర బహుకటక కుహర విహర
మాణ సురసరి దురతర మధురనినద
దళన చణజయదరరవకలిత హృదయ
మానిత శుభాకృతి విలాస శ్రీనివాస. 824

## కందద్వయగర్భిత భాస్కరవిలసితవృత్తము ముద్రాలంకారము

పంకజదళ నిభలోచన శంకాభావ మునిహృదయ సతతవిహారా
కుంకుమమృగమద సాంకవ పంకోరస్థలకృతపద వననిధి కన్యా
లంకృత మణిగణభూషణయం కీకృత మృదుగతి మరుదసితశరీరా
వేంకటగిరివర రుచ్యకలంకా భాస్కరవిలసిత లగదరిహస్తా. 825

### 1. గర్భితప్రథమకందము

పంకజ దళనిభలోచన
శంకాభావముని హృదయ సతత విహారా
కుంకుమ మృగమద సాంకవ
పంకోరస్థలకృతి పదవననిధి కన్యా.

### 2. గర్భితద్వితీయకందము

లంకృత మణిగణభూషణ
యంకీకృత మృదుగతి మరుదసిత శరీరా
వేంకటగిరివర రుచ్యక
లంకాభాస్కరవిలసితలగదరిహస్తా.

## ప్రమితాక్షరవృత్త కందగర్భిత నాగబంధయుక్తి చంపకమాలికావృత్తము

చ. ఘనఖగరాజమాన హయగాయగదస్థిరనాగ భోగహా
జనజగతీతలేనవర సారకనన్నిజ భోగమోదనా
నననగవాహలూన భయ న్యాయగ తీవ్రత రాగదీనపా
యన యగధీరమానజయదా యరిగర్వహరాగ వాతిగా. 826

## గర్భితప్రమితాక్షరవృత్తము

1. ఖగరాజ మానహయ గాయగదా
జగతీ తలేన వరసారకన
న్నగవాహలూన భయన్యాయగతీ
యగధీరమాన జయ దాయరిగా.

## గర్భితకందము

2. ఖగరాజమాన హయగా
యగద స్థిరనాగభోగహాజనజగతీ
నరవాహలూనభయన్యా
యగ తీవ్రతరాగ దీన పాయనయగధీ.

## గోమూత్రికాబంధ చతుష్కందము

1. వరణాగత జనకాతర
వరదానవ కృష్ణ ఘనసుభతనూ వివరా
వరభోగరాజ భీకా
సురవార వినయ కృతఘన సువ్రతకవిరా.

2. వరభోగరాజభీకా
సురవార వినయ కృతఘన సువ్రతకవిరా
శరణాగత జనకాతర
వరదానవ కృష్ణఘనసుభతనూ వివరా.

3 నవకృష్ణఘనసుభత
వివరావర భోగరాజ భీకాసురవా
రవినయకృతఘన సువ్రత
కవిరాశరణాగత జనకాతర వరదా.

4. రవినయ కృతఘన సువ్రత
కవిరాశరణాగత జనకాతరవరదా
నవకృష్ణఘన సుభతనూ
వివరావర భోగరాజ భీకాసురవా. 827

## ధ్వని

క. దీనులయెడ ముంగిళ్ల ని
దానమవై యన్యదేవత లొసంగఁగ లే

రేనాట నెంచి చూచిన
యానన దరహస వేంకటాచలవాసా. 828

## వ్యతిరేకమాలికాలంకారసీసము

సీ. తెల్లనై తళతళ ల్లలునందమె గాని
చల్లనగాదు వజ్రంపుఁ బలక
చల్లనై వెలిమిన్న లుల్లసిల్లునె కాని
వాసన నీదు ముక్తాసరంబు
వాసనమించు చల్వయుఁ జూపునేకాని
యలరునె తియ్యనై మలయజంబు
తియ్యఁదనము చల్వ తెలినిగ్గుతావి జెం
దునెకాని యంతటఁ దనరునె సుధ

గీ. చలువ వెలయించు దివ్యవాసనలు నించుఁ
దియ్యఁదన ముంచు జగముల తెలివిగాంచు
నవుర భవదీయ మహనీయ ధవళకీర్తి
శేషశైలనివాస లక్ష్మీనివాస. 829

## కటారికాబంధకందము

క. సారతరశూరబుధమం
దారాహారాభిరామ దాక్షిణ్యనిధీ
ధీరాగ్రేసరరిపు సం
హారా భీమప్రతాప యసురవిరోధీ. 830

## మంజరీగీతి గర్భిత చరణవహామహానాగబంధ సీసము_అపూర్వప్రయోగము

సీ సురభిభావగరాగ సూరాగణితధామ
వర్ణితశాశ్వతైశ్వర్యధామ
వర్ధిత దానవ వారపారావార
మధ్యమస్థామహామత్తవార
నమ్రతామరజాత నవ్యభవ్యయుతాసి
రక్షిత తాపసరత్నవర్య
వర్ణిరూపారూఢ వాసవాదరలాప
హారగౌరద్యుతి సారహార

గీ. వరమురజ దమితనుతహ సరసహాస
రాస లీలాభిలాష వరతమపార్థ
భద్రవస్ఫురవారణాపారభయద
ఫణివరాచల పాలప్రభాతిరమ్య. 831

### గర్భితమంజరి

సురభిభావరాగ సూరాగధామ
వర్ధిత దానవవార పారావార

### గర్భిత ఆటవెలఁది

సురభి భావరాగ సూరాగణితధామ
నమ్రతారజాత నవ్యభవ్య
వర్యవర్ణిరూఢ వాసవాదర లాప
హీరగౌరసార హారమురజ.

## దశావతారగర్భిత గుణిత వర్ణాచలజిహ్వాకోష్ఠ్య వర్ణ భుజంగ ప్రయాత వృత్తగర్భిత నిరోష్ఠ్యాచల జిహ్వాస్రగ్విణీ వృత్త గర్భితౌ ష్ఠ్యాచలజిహ్వా నిరోష్ఠ్యాచల జిహ్వా సంకీర్ణ వర్ణ

### సమగణ దండకము

జయ హరిగిరిపా భవాకారబోద్ధాగమోద్ధారణా భానుభృద్ధుర్యభి న్నేత రాత్మీయ దంష్ట్రాధృతక్ష్మాతలా భీమరూపా భుజంగేంద్ర వాసస్థ దైతేయ రాణ్మస్త విన్యస్త పాదాంబుజా భూరిరాజన్యమార్జ త్కుఠారప్రభా దేవ చూడాతి భాస్వద్ధనుర్భంగ బాహాబలా భైరవాంగప్రలంబా శిరచ్ఛేద నో దారసీరాయుధా భోగ మోఘీకృత త్రైపుస్త్రైణ పాతివ్రతీభూమ భౌమ ప్రసూవైరి సంహారి గంధర్వ రూపాధికా భంజితస్థైర్య కంసాహి భర్మాంబరశ్రోణిభాగా పయోముగ్విభా భావ్య భాభాగ్వి భావావయో భావయుగ్లోపవామా విభావ్యా భయోగ్యోపమా కుంభి పాపాప భీమా వయో గోపవాగ్భామ వాగ్భూమ భూమీశరశ్చంద్ర చంద్రాళి సచ్చారదా నారదా దిత్యరాద్ధంతి సంతాన ధాత్రీజతారాద్రి తారాశతారేశ శారాచ్ఛ నీరేజరాజిద్ధరాధార శక్రానిలార్కా శరాధీశ నీరేశ గంధాంతరాట్కిన్న రేశత్రినేత్రాది దిఙ్నాథ చంచత్కిరీటాగ్ర నిర్యత్న రత్నచ్ఛటా సాంద్ర నిర్యద్రజస్సార నీరేజితేడ్యాంఘ్రి నీరేజి నానారతాశ్రాంత నృత్యత్కటాక్షాంచలా నారదారాధ నానారతాహ్లాదితా నీరదాళీలస న్నీల

తేజఃశ్రితా సారదైత్యచ్ఛిదా చండ చక్రాంచితా శ్రీరసాలంకృతా శేషశైల
స్థితా భర్గవాగ్దేవతా వల్లభస్తవ్య నైపుణ్య పుణ్యాభిదా భక్తపారంపరీ
భూరివాంఛాఫలా పాదిపాదాంబుజా త్వం సమస్తాపరాధం సహస్వాద్యమే
భూయసీం దేహిభక్తిం భవత్పాదయోః స్థైర్య యుక్తాం విభూతిం నమస్తే
నమస్తే నమస్తే హరే. 832

## గర్భితాచలజిహ్వకోష్ఠ్యవర్ణ భుజంగప్రయాత వృత్తము

పయోముగ్విభా భవ్య భాభాగ్ని భావా
వయోభావయుగ్గోప వామా విభావ్యా
భయోగ్యోపమాకుంభి పాపాపభీమా
వయో గోపవాగ్భామ వాగ్భూమభూమీ.

## గర్భిత నిరోష్ఠ్యాచలజ్జిహ్వ స్రగ్విణీవృత్తము

నారదా రాధనా నారతాహ్లాదితా
నీరదాళీల సన్నీల తేజః శ్రితా
సారదైత్యచ్ఛిదా చండ చక్రాంచితా
శ్రీరసాలంకృతా శేషశైలస్థితా.

## హరిహరాభేద వర్ణన శ్లేషయుక్త కావ్యలింగసీసము

సీ. రమణీయ కమల ధారణముచే రాణించి
యల వినాయక సేవ నతిశయించి
హృదయంబు శోభిల్ల శ్రీని వేడుకనాని
యబ్జశేఖరమున నందమంది
యచలశరాసన మమర సంతోషించి
కలధౌతమయవాస మలరఁ గాంచి
గంధగజాసురక్షణ దాన గతిమించి
పంచాననస్ఫూర్తిఁ బరిఢవిల్లి

గీ. హరుఁడు మీరను భేదమే సరణిలేక
పూని లోకంబులకు నీశుఁడైన తండ్రి
కంటివిన్కాలి దంట పేరింటిగుంటి
నడుమ నెలకొన్న వేంకటనాథ శరణు. 833

## దశాద్యేకపర్యంత పదార్థసీసము

సీ. శ్రీమీన కమఠపోత్రి నృసింహ కుబ్జ భా
ర్గవరామ బలబుద్ధ కల్కులు నహి
మకర కుజ బుధ గురు కవి రవిజ తమః
కేతు లింద్రానలార్కి నృహిగుణిక
శివ సఖేశ్వరులు వసిష్ఠకౌశిక జమ
దగ్ని కశ్యప భరద్వాజ గౌత
మాత్రులు మధునిదాఘాభ్ర శరద్ధిమ
శిశిరాగమము లిలా కుశ శుచి హరి

గీ. ఖములు ధర్మార్థ కామ మోక్షములు విధి వి
ధు భవులు క్షరాక్షరము లాద్యుఁడును తుదయు
సత్తసత్తును వెలిలోను సగుణ నిర్గు
ణంబు లంతయు నీవెకా యంబుజాక్ష.

## లయగ్రాహి నిండు ఝంపె

పంకజ తనూజహరి శంకర ముఖామరవి
శంకట నవీన నుతి సంకలితపాదా
లంకరణ జహ్నుతన యంకముని మానస వ
శంకర రణాంగణ నిరంకుశ పలాశా
తంకద ఖగేశ బిరుదాంక కమలాకుచ వి
టంకయుత సంకుమద కుంకుమ రసశ్రీ
పంకిల భుజాంతర మనోంకణమునందుఁ గల
సంకటముఁ బాపఁగదె వేంకటగిరీశా. 835

## చతురక్షరాద్యంతైక నియమ యమకము

క. ధారాధర రుచివంశా
ధారాధరవైనతేయ ధారాధరరా
ధారాధరతా నిబిడసు
ధారాధర వచన సేవ్యధారాధరదా. 836

## దుష్కరప్రాసము

శా. కుద్రద్విట్ప్రతిమల్లకర్బురవర క్రూరాసు హృత్సాయకా
గృధ్రాద్యండజరాట్ప్రడీనగమన క్రీడా ప్రియంభావుకా
లోద్రత్విట్ఛిభ కౌస్తుభాభరణ వల్గుమ్లక్షవక్షస్థలా
సద్రాధిన్యసనోత్కటార్జున పటీస్ఫాయత్కిరీటాంచలా. 837

క. ఇందీవర తను విజితస
దిందీవర రాజరాజహితనుత వితతా
నందనిలయ కనకమాయ
నందనిలయ మధ్యవాసనరవరవరదా 838

## పంచచామరము - అపూర్వప్రయోగము

కబంధరాశిధైర్యశౌర్య ఖండితాశరస్ఫుర
త్కబంధ గోత్రశత్రుపుత్ర గర్వహృద్భుజాప్రష
త్కబంధకృత్త్వలేంద్ర జిద్విదాముదావహానుజా
కబంధ గంధ సింధురప్రకాండ సింహకాండపా. 839

## ద్విప్రాసము

క. విభవ రమణీయహాటక
విభవ సనకటీర శశి రవి భవన్నయనా
విభవావన మహి మహిమా
విభవా రచితస్తుతాంఘ్రివిభవ విలాస్తా. 840

## కవిరాజ విరాజితము

త్రిభువనపావన సన్మునిభావన దీనజనావన ధీరగుణా
యభయ సుధీవన మాధవజీవనదాభమనోవన జాప్తఘృణా
యిభవిభు భావనటద్భయలావన హేత్వను భావ నగోద్ధరణా
శుభజిత యావనయాశుగ దావన శోషితజీవనాదగణా. 841

## గోమూత్రికాబంధ విశేషయుక్త చక్రవాళ చంపకవృత్తము

హరిహరి భోగిభోగి శయనాశయనారజ చక్రచక్ర భృ
ద్ధర ధరధామధామ శరదాశరదారిత తారతారకా
ధరధరధారిధారి వరదా వరదానవదానదాన శే
ఖరఖరమారమారజనకాజనకావని ధీహరీహరీ. 842

## దుష్కరప్రాసము

క. దేధ్మాయిమానధరధర
సిధ్మల కమలాకుచాగ్రశీలిత కరపా
పేధ్మహుతాశనవసలీ
లాధ్మాతపయోదదేహ హరిగిరిదేహా. 843

క. హల్లక చరిష్ణు బంభర
మల్లకవిత దృగ్విలాస మంజులకమలా
ఫుల్ల కమలాంఘ్రిలాక్షా
యల్లకయుత హృదయవేంకటాచలనిలయా. 844

## పాదాద్యంతాక్షర కావ్యకర్తృనామగుప్త పూర్వకవిగుప్తసీసము

సీ. వెంటాడి యసురుల విదళించు దేవ వేం
కటరాజితాఖిదగ్రావతిలక
పెకైకనవేల్పుల సొక్కించు నెఱజూట
శయబలాతి శయాస్త్ర శంభుచాప
విబుధసుధాహృతి విశ్రుత నిజవీతి
లావణ్యకారణ లలిత తిలక
సకలభక్తవ్రాత సారసోదితరవి
మునిజనానందకృన్ముఖ్యచరిత
గీ. వ్యాసనిగమోక్త దశశతాహ్వయధురీణ
సమరభుజ్మాని కీర్తన సారరాగ
పువ్వుదీపించు విల్గల ప్రౌఢతాత
రావణాహిత దయమమ్ము బ్రబలఁగనుము. 845

## సర్వత్రయమకము

మ. వలనాంచద్ద్విజ రాజగోత్రనియతి న్వ్యాపించు సత్కీర్తియున్
కలనాదద్విజరాజగోత్ర విహృతి న్గన్పట్టు విఖ్యాతియున్
జ్వలనాభద్విజ రాజగోత్ర వినుతి న్వర్తిల్లు కారుణ్యమున్
గల నిన్ను న్భజియింతు మెప్పుడు భుజంగక్ష్మాధరాధీశ్వరా. 847

## భుజంగప్రయాతగర్భిత స్రగ్విణీవృత్తము

పావనాత్మాశి సంపత్ప్రదానాశ్రయా
దేవతానాథ సందీప్త పూజోద్భయా
భావనామేయ సద్భవ్యరూపోదయా
సేవకవ్రాత దాక్షిణ్య శీలాజయా. 847

## గర్భితభుజంగప్రయాతవృత్తము

జయాపావనాత్మాశి సంపత్ప్రదానా
శ్రయాదేవతానాథసందీప్త పూజో
ద్భయాభావనామేయ సద్భవ్యరూపో
దయాసేవకవ్రాతదాక్షిణ్యశీలా.

## మణిగణనికరవృత్త గర్భితకందము

క. ధరణిధర భరణతతకర
సరసాశరవర విదళన చణనిశితశరా
పురహరనుత నిజభుజబల
గరిమాఖరకరనిభ విభ గరుడగిరిపతీ. 848

## గర్భిత మణిగణనికరవృత్తము

ధరణిధరభర ణతత కరసరసా
శరవర విదళన చణనిశితశరా
పురహరనుత నిజభుజబలగరిమా
ఖరకరనిభవిభ గరుడగిరిపతీ.

## పాదభ్రమకకందము

క. మానుత ఘనౌఘ తనుమా
యానత సుజనావభావనాజసుతనయా
దీనఖదపాదఖనదీ
యానవిమదజయవిభావియజదమవినయా. 849

## పాదగోపనకందము

క. వెలలి యుదార మధుర దయ
నిలుపు గుహన్ దత్తినలరు నీవిడు భక్తిన్
గలిని ఘనదేహ శౌరీ
వెలిదామరయలుఁగు దనరు ఽఖగనిన హరీ.
(పైకందమునఁ బ్రథమాక్షరము మొదలుగ నక్షరము విడిచి యక్షరము మూఁడవపాదాంతము వఱకుఁ జదివినఁ జతుర్థపాదమేర్పడును)

## పుష్పమాలికాబంధ, గోమూత్రికాబంధ, గుచ్ఛబంధ హాలబంధ, ఛత్రబంధ పంచకనిరోష్ఠ్య కందము

క. శ్రీనకనకనయనధన
జ్ఞానకనధ్యాన సానసనకనదీనా
ధ్యాన జనన నగ నటన
స్థాన జనస్థాన హీన జనఘన హననా. 851

## చతుర్దశ గర్భిత ద్వాదశదళపద్మబంధ, పాదుకా బంధద్వయ మణిగణప్రవాళానుష్టుప్ శ్లోకము

రావదేప్రోవమాధారా । రాధామాహాత్మ్యసాగరా
రాగసాహిత్యవాజీరా । రాజీవాకారదేవరా । 852

## శంఖబంధకందము

క. మరకత మణిమయ మహిమత
కర మలరుతను కళకలిమికలికి సతమ్మౌ
యురమును భుజగవరధరా
ధరమును నమరు హరి మదనదమననుత పదా 853

## రథబంధకందము

క. శ్రీ మీవేంట న్గూడుక
రా మకరిని లెక్కడంచి రమ్యగజేశ
గ్రామణి గావన్ లేదా
నీమాయాలీల నూవె నీలనగపతీ. 854

## ఖడ్గబంధ కందము

క. సారసజాతస్తుతజయ
దారిద్ర్యాధీశదాసధరఃసరదమర
జ్యారజ్యాదసదాశర
వారావార శయచక్రః దన విలాసా. 855

## పట్టిసబంధోత్సాహవృత్తము

తారకారసారకీర్తిధారకారమారతా
తారకాచలేశసన్నుత ప్రసిద్ధి రాజితా
తారకాత్మ రావణాది దండనోగ్రధీరతా
తారకాసురాదివంద్య దంతి రక్షణోన్నతా. 856

## మురజబంధ విద్యున్మాలావృత్తము

వీరోదారా వేదారాధ్యా । నారోదారానాదారాగా
గారోదానాకాదాధారా । వీరోదారా వేదాధామా. 857

## త్రిశూలబంధ పంచచామరము

సతీపతీ రసారసాను సారకా ఘనాయతా
నతాయనాఘ కారకా ఘనాయతానదాన సూ
తతాజయాజ తాతసూనదామ ధారతారకా
రతారధామ దాసదాజరాధి రాజదాసదా 858

## ఛత్రబంధ కందము

క. సారకరధీర వరదా
తారాపీనపనపీన తతతరిపరిప
ఝారూఢాగోరాధీ
ధీరాగోపతి దరవర ధీరాకరసా. 859

## అనుపాత్త వాచక సాధర్మ్యోపమానలుప్త గుణితయుక్త దశావతార మత్తేభవిక్రీడితవృత్తము

మ కగరూపోన్నత కామఠోద్ధకిటిరేఖాకీర్తితోగ్రాంగ కు
బ్జగకూద్వాహన్నృకేసరి ప్రభవర క్షః క్రైటభార్యాగ్రకో
పగుణోద్యజ్జినకౌశలార్యమణికం పర్యంక కర్ణాహిపా
నగభిద్వహ్నియమా శరాంబుప మరున్నాదేశముఖ్యార్చితా. 860

## చక్రబంధ శార్దూలవృత్తము

శా. సత్యాకల్పకపుష్పటాశరభిదా చారావిశంక్రమా
మత్యావిష్కృత బంధురాదరణ భూమాజంతు కూట్రాశ్రితా
దిత్యావేంధన ధర్మసారరత మూర్తీముత్కరాద్రిక్షమా
మాత్యుల్లాసపదా మహావిదితధామా సాధుతారక్షమా. 861

## నాగబంధచంపకమాలికావృత్తము

చ. కరివరదానశూరసుర గౌరవసజ్జిత పాదసారసా
ధరధరధారిసూరి నర తారకనిత్యనశోకదాసఖా
స్వరమదకౌశలారహర సారకుభృద్వర ధీరమౌనిభా
సురశుకగీతమార్గనిభ శోభనరమ్య శరీరసంభృతా. 862

## పుష్పమాలికాబంధయుక్త, కందమదన విలసిత శ్లోక గర్భిత స్రగ్ధరావృత్తము

శ్రీరామేరానురాగ స్థిరతరమురళీస్మేరసారస్వరశ్రీ
తారాదారాధరాస్యాదర భరహరణాదానితానిత్యనిష్ఠా
తారాపారాబ్జరా వాదరభరణరతాద్రౌపదీపస్వపక్షా
సారాచారాభిరామాశరవరశరణా చారుకారుణ్యరుచ్యా 863

### గర్భితకందము

శ్రీరామే రారాగా
తారాదారాధరాస్య దరభరహరణా
దారాపారారావా
సారాచారాభిరామ శరవరశరణా.

### గర్భిత మదన విలసిత వృత్తము

స్థిరతరమురళీ
దరభరహరణా
దరభరణరతా
శరవరశరణా.

### గర్భితశ్లోకము

స్థిరతరమురళీ స్మేరసారస్వరశ్రీ
దరభరహరణా దానితానిత్యనిష్ఠా
దరభరణరతా ద్రౌపదీపస్వపక్షా
శరవరశరణా చారుకారుణ్యరుచ్యా.

### దుష్కరప్రాస కందములు

క. దంష్ట్రి శరీరమాధవ
దంష్ట్రిభినవదంత చణవదన బింబఖరా
దంష్ట్రాశుగదళితాసుర
దంష్ట్రినగాధ్యక్ష వికచతామరసాక్షా. 864

క. వ్యజ్రాభరణధరరమా
సజ్రాయత సదయహృదయ సన్మునిచేతో
మజ్రాశయకుత్సితమత
భజ్రాకృతికృష్ణ రజ్జు పద్మదళాక్షా. 865

క. ధృతనక్తంచర దరకర
దృఢగోవర్ధనగిరి పరిబృఢదృఢవక్షో
ధృతసింధూద్భవ చరణా
గ్రగతౌకమానాభ్రగంగ గరుడతురంగా 866

క. అర్థేధర వరదాయక
తర్ధరదూషణముఖారిదళన పటీయో
వర్ధరసాయకధారా
మూర్ఖజనాత్యంతదూర ముదిరశరీరా. 867

## దుష్కరప్రాస శార్దూలవృత్తము

శా. సేర్ష్యాదిత్యవిరోధినాథదళనా హీనాహిచంచద్భుజా
వార్ష్యాధ్యక్షవరప్రదాన చతురా వామార్ధజానిస్తుతా
సార్ష్యాంచ ద్వ్యధుతుల్యమౌక్తిక విరాజత్కర్ణభూషాననా
తార్ష్యాశ్వోత్తమ వేంకటేశ్వరరమా దాంపత్యనిత్యోదయా. 868

## మాలినీ వృత్తము

వరశుభద రాసా వల్లవీ హారిరాసా
సురుచిరదరహాసాసోల్లసచ్చంద్రహాసా
గరుడ తురగలాసా కంధిజాహృద్విలాసా
తిరుమలగిరివాసా దీపితస్వర్ణవాసా 869

## విద్యున్మాలావృత్తగర్భిత స్రగ్ధరాష్టదళపద్మబంధము

స్ర. రామారక్షోదలప్రాగ్ర్యదరకదననత్రాసపధ్యారమారా
రామారథ్యోపసత్రా ప్రకటగుణ సముద్రాపవిత్రాసమారా
రామా సత్రావిపద్రారవినిభకర చక్రాశరణ్యాగమారా
రామాగణ్యారశక్రారథిఖగవరా ప్రాలదక్షోరమారా. 870

## గర్భితవిద్యున్మాలావృత్తము

రామారక్షోరామారథ్యా
రామాసత్రారామాగణ్యా
రామారక్షోరామాగణ్యా
రామాసత్రా రామారాధ్యా.

## చౌపదములు

మునుల మనోంబుజముల నెఱదీవి
దనరు గుణమణులఁ దగు బలుఠీవి
మినుకు విరులలో మెలఁగెడుతావి
చెనఁటుల నని గెల్చిన మాయావీ.
డినమును వనిలోఁ దిరిగెడుజాళి
యెనయఁ జెంచెతల యెదల విరాళి
జెనచి యలుక లిడి వే బతిమాలి
తనియ నేలి దయఁ దగు వనమాలీ
వహిఁ గను బృందావనమున జాడ
విహరింపుచు వేవెలఁదులతోడ
రహికెక్కిన యల రాసక్రీడ
విహితముగాఁ దగవేడ్కఁగలాడ
డిసమొలలుగ వ్రేతెలవనభూమి
దొసఁగిడి వలువలు దోఁచుక నోమి
పొసఁగ నెక్కి సురపొన్నను నోమి
ముసిముసినగుమొగమునఁ దగు సామీ. 871

## తురగవల్గనరగడ

1. రామరామవారిచారి రామరామసదవతార
ధామధామజైత్రచిత్ర ధామధామ విదళితార
2. మారమార రక్షణక్ష మారమారమణ్యధీశ
సారసారవాహిశోభి సారసారహితసదేశ
3. కాండకాండ జఠరపిఠర కాండకాండనతసముద్ర
దండదండనప్ర దీప్ర దండదండ చక్రభద్ర
4. రాజరాజమానదాన రాజరాజదాస్యమాన్య
రాజరాజ మానదాన రాజరాజతావదాన్య
5. తారతారకాజిభోజి తారతారకీర్తిదీప
ఘోరఘోరకేళిహేళి వారఘోరకప్రతాప

6. రాగరాగ సరళమురళ రాగరాగ హృద్వికాస
నాగనాగవాహనేహ నాగనాగతను విలాస
7. గోపగోపసేవ్య భవ్య గోపగోప సదవభావ
గోపగోపనోపతాప గోపగోపద ప్రభావ
8 జాలజాల సాలసాల జాలజాల కవనఖేం
నీలనీల మణ్యగణ్య నీలనీల యుగహిశైల. 872

క. తుద కనుపడని మొగలిపూ
పొదిపాపనిజోడు వేల్పుబుడుత పగరతే
రదిమెదిరిన మూకలడఁచ
మదిగల యునికిఁ దగు ముదురుమాయల మనికిన్. 873

## త్రిమూర్త్యాత్మక త్ర్యర్థికందము

క. స్థిరసత్యాసక్తాశయ
నరకచ్ఛేదనధురీణ నగరాజకరా
సరసాదరకమలోదయ
హరిహయతనయాయజాహ్వయాపరమాత్మా 874

## చతుర్దశయమక చూర్ణిక

శ్రీహరే, సకలలోకశరణ్య కారుణ్యసింధో, దీనబంధో, భక్తాగమ సందోహవసంతం భవంతం, కృష్ణాధిమాన సంరక్షణం సర్వశుభలక్షణం, కృష్ణాతి రామణీయకవిగ్రహం దైత్య నిగ్రహం, కృష్ణానుసారిణం మిత్ర విందామనోహారిణం, కృష్ణావతార మోహిత వల్లవీజనం శృంగారభాజనం, గోపజనక నాభీపంకేరుహం గోవర్ధనావహం, గోపకల్లోలమాలికాడోలికా ఘనవిహారం నిర్వికారం, గోపసోదరం వేణుగీతి సాదరం, గోపవేషధారిణ కుమతవిదారణం, అబ్జసంకాశవదనం అంభోధిసదనం. అబ్జదళనోత్కంఠం అద్యుషితవైకుంఠం, అబ్జసఖచంద్రనేత్రం హైమనేత్రం, అబ్జప్రముఖదిక్పాల కస్తూయమాన విజయవిలాసం భాసమాన దరహాసం, నాళీకబాణజనకం నాసాజితకనకం, నాళీకనిస్తుల కౌస్తుభ మణిరమణీయక్రోడం పురాతన క్రోడంనాళీకవచన గోచరం నతఖేచరం, నాళీకదళిత సంక్రందన నందనం నిఖిలావయవలిప్త హరిచందనం, పుష్కరచరపాపత్యమాన బిరుదాంకం

నిష్కళంకం, పుష్కర ధరప్రతిమానతనూవిలసనం ఆరచిత చాణూర
నిరసనం, పుష్కరగంగాది సకలతీర్థ వితతిప్రతివర్ష సేవ్యమాన కౌమార
సరసీతట నివాసినం శబరతరుణీ విలాసినం, పుష్కరసమానచరణం
కుచేలశరణం, తారకావీననేత్రస్థ భీష్మసూజనన దేశపాదాంగుష్ఠనఖరం
ఖండితఖరం, తారకాధీశోద్భవ కారణహృదయం సదయహృదయం,
తారకమంత్రసారం ధర్మాధారం, తారకాసురారాతి సేవితం తపోధన
కదంబ సంభావితం, ధనంజయమపినమతాందదానం జగన్నిదానం ధనం
జయతేజో మయస్వరూపం అప్రతిమప్రతాపం, ధనంజయప్రముఖ పురా
తన సుకవికావ్యావలోకన ప్రౌఢిమ దస్మదీయ వాక్యసరణి పవిత్రీకరణ
పారీణశుభచరిత్రం, మణిగణ దేదీప్యమాన ఫణి ఫణాయ తాతపత్రం ధనం
జయ సారథిం బాణాగ్ర కీలికీలాలేహ్యమానవారిధిం, పుండరీక ప్రభృతి
పరమభాగవత జేగీయమానానంతలీలా వితానం సేవకనితాంత సంతానం,
పుండరీకామరహార సఖం అవ్యయసుఖం, పుండరీక నామకరికరోపమాన
చతుర్భుజం రక్షితవజ్రం, పుండరీక విశాలేక్షణం కాళీయశిక్షణం, భద్ర
కుంభినీ ప్రముఖస్త్రైణ భోగానుసంధాను భోగాభిరామం మురవిరామం,
భద్రకుంభీనసాధిపశై వేశానం భుజంగపుంగవ శయానం, భద్రకుంభి
చిరత్న రత్నసందానిత గోపుర ప్రాకారమంటపాలంక్రియమాణ నిజదివ్య
ప్రాసాదమధ్య మధ్యాసీనం పాలితానేక హరిసేనం, భద్రకుంభీంద్రావ
నం చరితబృందావనం, చంద్రకాంతదరభాసురకరం ప్రపన్న క్షేమం
కరం, చంద్రకాంతఖచితవీథి రారజ్య మానకాంచనరథసంచారం నవనీత
చోరం, చంద్రకాంత విభాసమాన బర్హావతంసం దండిత కంసం, చంద్రకాంత
మనోనాథం నీలాసనాథం, కవిరాజమస్తన్యస్తైకపాదం శీతల తులసీదళ
మాలికామోదం, కవిరాజర్షి నూయమాన త్రిలోకవిద్రావణ రావణబల
ఘనాఘన సంఘ విధ్వంస నాశుగదాసుగధారాహిండిత చండకోదండం
కబంధ బాహుకదళికా ఖండన వేదండం, కవిరాజనోనూయమానావార్య
శౌర్యం కోటికందర్ప, సౌందర్యం కవిరాజవిరాజిత ముఖవృత్తనిబంధన
ప్రబంధరాజవిలాసం గోపికావిరచితదాసం, కమలాసనాథ బాహాంతరాళం
సత్యామానసమరాళం, కమలాసనాత్మన శాబకవిలోల లోచనోజ్జ్వల కలా
గణేయ మహిళాసహస్ర పరివృతం యశోదోపలాలితం, కమలాసనర్తు
మార్తాండ సాహాయదాయి బాహారథాంగం గరుడలింగం, కమలాసనాది

నిర్మాణచణ ప్రభావం మహానుభావం కలాపాలికా విజ్ఞాన శాలినం, వన మాలినం కలాపాశీకాదంబినీ నీలకచకలాపం భంజితశివచాపం, కలాపాళికా ఘటిత భవ్యకావ్యరసానుభవ శోభినం రాధాధర సుధారస ధారాలోభినం, కళాపాళికాలంకృత సకలాంగం నిర్భిన్న కపటకనక సారంగం, హృదయ విలసదలమేల్మంగం కరుణాతరంగితాపాంగం, సనకసనందనాది ముని జనాంతరంగం వనజసారంగం, ఆనందనిలయ మానందనిలయ వాస్తవ్యం శివాస్తవ్యం, దివ్యం, శ్రీ వేంకటేశ మతి విశంకట ప్రకాశం సకల దేవ తాధీశం అమీవయం భజామః. 875

## ప్రాకృత శౌరసేని మాగధ పైశాచి చూళికా అపభ్రంశ సంస్కృత ఆంధ్ర అష్టభాషాసీసము

సీ. ణాయమాణస్సిణీళో యదమ్మిల్ల పజ్జణ్ణ యవిజ్జులా సరిసపాయ
ఛాయ. (నాకమనస్వి నీలోకధమిల్ల పర్జన్యక విద్యుతి సదృశపాద)
పురవదేవ్వవిదాణ గరువమరట్టదుఃఖట్టజాద విజేయ కళనసీహ
ఛాయ. (పూర్వదేవ వితాన గర్వమదోద్ధతగజ జాత విజవన కలన సింహ)
చళన శాళశనిళంతళ భత్త చిందిత పళశమస్తనకేళిపాళియాద
ఛాయ (చరణ సారస నిరంతర భక్త చింతిత ఫలసమర్ధనకేళి పారిజాత)
మతనసూతనధేరతిత శవల్లహముహగ నఃజ్జగల్లానగు నదురీన
ఛాయ. (మదన సూదన ధాత్రుత్రిదశ వల్లభముఖ గణనియ కల్యాణగుణధురీణ)

గీ. కందకచళా చలఖ్కణపంధుళాళి
ఛాయ. (గంధ గజరాజరక్షణ బంధురారి)
మహాయముఖధి కరీ హేదు మహాపడుర్ఘు
ఛాయ (మగువ ముఖాశ్చర్య హేతు సమ సమూహా)
ఆజవంజవ జలధి మగ్నాత్ర తరణి
మట్బు పూవుట్టువు బిడారు మగువతేంద. 876

శీర్షిక-(ఆది పాదైకైక చరణానులోమ ప్రతిలోమోష్ఠ్యాచలజిహ్వాకా గోపన గోమూత్రికాబంధ తత్పాదార్ధ భ్రమక గోమూత్రికాంధ పతకబంధ పాదు కాబంధ నవరంగ సమపంచాక్షర ఖండ చతుష్టయాత్మయ దళోపరి నిరోష్ఠ్య పూర్వోవిధ నియమ ద్విచరణ దళోపరి పూర్వోక్తానులోమ విలోమ నియమ నాతిక్రమ్య దళాద్యక్షర నియమపాదద్వయోపరి చరణ ద్వయ ప్రత్యేకానులోమ నియమోపరి దళచతుష్క ప్రత్యేక పాద

ద్వయ క్రమక గోమూత్రికాబంధ తత్పాద గుప్త గోమూత్రికాబంధ షట్త్రింశచ్చక్రబంధుర ద్వాదశదళస్ఫుట సర్వలఘు ద్విరగగతిరగడము).

1 భవిభువిభ భవభవభ భవభవభ భవిభువిభ
విభవవివి విభవభవి విభవభవి వివిభవివి
2 జయనయజ జలజలజ జలజలజ జయనయజ
నయనయన నలదళన నలదళన నయనయన
3 వసువసువ వనదనవ వనదనవ వసువసువ
వసనసవ వలదలవ వలదలవ వసనసవ
4 మహిమహిమ మదనదమ మదనదమ మహిమహిమ
వహనహవ వరదరవ వరదరవ వహనహవ
5 సరసరస జయదజయ జయదజయ సరసరస
పరవరప వశితశివ వశితశివ పరవవరప
6 పవనవప భసలసభ భసలసభ పవనవప
కవనవక కరకరక కరకరక కవనవక
7 కదనదక ఘనఘనఘ ఘనఘనఘ కదనదక
పదకదప వసుదసువ వసుదసువ పదకదప
8 నమనమన నవకవన నవకవన నమనమన
యమనమయ హరియరిహ హరియరిహ యమనమయ
9 జలజనయ నపవిజయ సరసయశ గరదలహ
హలదరగ శయసరస యజవిపన యనజలజ
10 పరహజని యమజనవ భరకరభ దరసురవ
వరసురద భరకరభ వనజమయ నిజహరప
11 కరకరక భరవసన ఘనజసుత తరవరన
నరవరత తసుజనఘ నసవరభ కరకరక
12 పరవిరస హరవరద భవననగ గరిహరద
దరిహరిగ గననవభ దరవరహ సరవిరప

## ఏక ద్వి త్రి చతుః పంచ షట్సప్తాష్టాక్షర క్రమపాద నియమ సీసము

సీ. రారార రారర రూరూర రేరార
రేరారరీరర రూరదార
భాభీరు భీభర భారభేరీరేభి
భూరిభాభాభీ భూభూ భరాభ

నలినీ నివనైక లలనాకళానూన
లాలనలోలా కళంకలీల
దరదారి దర ధర కరదదాదోదర
దార కాదర కరోదారవరద

గీ. గోపబాలక పాలక పాపలోప
సాలక విలాస వేంకటశైలవాస
భవ్యభావ భవాకారదివ్యరూప
రాధికాస్ఫుటదిక్కరి కాధరాంగ. 878

## స్రగ్విణీవృత్త మంజరి ముక్తపదగ్రస్త ద్విపద చండక వృత్తి దండక గర్భిత దుర్భర ద్విప్రాసత్రిస్త బకాంత్యనియమ సమధికపద చిత్రాస్పద చిత్రచరణ భాసమానసీసము

సీ. వారణావారణా వక్రసన్నక్రస
త్పాదనాపాదనాగ్రారధార
కారవాధార వాగ్వారణాకారణా
ర్తావనాధావనాయాసవాస
సారహంకార హంసారధామారధా
మానసాభ్యాసనా చాపచాప
మారసంహారసంభావ్యభానవ్యభా
గాగమాంతాగ మాంతాలవాల

గీ. పారదాపారతారాబ్జ తారతార
శారదా శారదాభ్రకర్పూర పూర
హారనీహార నిర్భరఖ్యాతిరీతి
దీనపాదీన పాదీన దేవదేవ. 879

## గర్భితస్రగ్విణీవృత్తము

వారణావారణా వక్రసన్నక్ర స
త్కార వాధారవాగ్వారణాకారణా
సారహంకార హంసారధామారధా
మారసంహార సంభావ్య భానవ్యభా.

### మంజరి

వక్రసన్నక్రసత్పాదనాపాద
కారవాధారవాధారణాకార

### ముక్తపదగ్రస్త ద్విపదము

సారహంకార సంసారధామార
మార సంహారసంభావ్యభానవ్య.

### నమస్కారశబ్దలక్షిత కందద్వయగర్భిత వచనము

వ. శ్రీవైకుంఠమందలి వాసుదేవునకు మ్రొక్కు, యామోదస్థలమందలి సంకర్షణునకుఁ జేమొగువు, ప్రమోదస్థలమందలి ప్రద్యుమ్నున కేడికోళ్లు, సమ్మోదమందలి యనిరుద్ధునకు సలయు, సత్యలోకమందలి విష్ణున కేకిసలు, సూర్యమండల మందలి పద్మాక్షునకు జోడీలు, క్షీరాబ్ధియందలి శేషశయనునకుఁ జెంగనాలు, శ్వేతదీపమందలి తారకస్వామికి కన్నుల మ్రొక్కు, బదరీవనమందలి నారాయణునకు జోతలు, నైమిశారణ్యమందలి హరికి జోహారు, హరిక్షేత్రమందలి సాలగ్రావస్వామికి సురతానిసలాము, అయోధ్యయందలి రఘూద్వహునకు దోయిలి, మధురనున్న బాలకృష్ణునకు సాఁగిలి, మాయాస్థలమందలి మధుసూదనునకుఁ గోశిగి, కాశీక్షేత్ర మందలి భోగిశయానునకు నివాళి, యవంతియందలి యవనీపతికి మేలు, ద్వారవతియందలి యాదవేంద్రునకుఁ గొలువు, వ్రజస్థానమందలి గోపీజన ప్రియునకు గొబ్బళ్ళు, బృందావనమందలి నందసూనునకుఁ బొగడ్తలు, కాళీహ్రదమందలి గోవిందునకు గొండీలు, గోవర్ధనమందలి గోపవేషునకుఁ డెంకనాలు, భక్తలోచనమందలి భవఘ్నస్వామికిఁ గొడీలు, గోమత పర్వతమందలి శౌరికి మోడ్పుఁగేలు, హరిద్వారమందలి జగత్పతికిఁ జేవిప్పు, యాగయందలి మాధవునకు సాంగుబలా, గయయందలి గదాధరునకు మోడ్పు, గంగాసాగరసంగమస్థలమందలి విష్ణువునకుఁ గైమాపు చిత్రకూటమందలి రాఘవునకుఁ గిడిగిళ్ళు, నందిగ్రామమందలి రాక్షసఘ్ను నకు జేజే, ప్రభాస్థలివిశ్వరూపున కల్లోనేరదల్లో, శ్రీకూర్మమందలికూర్మ మూర్తి కెరగుట, నీలాచలమందలి పురుషోత్తమునకుఁ జేసాపు, సింహాచల మందలి మహాసింహునకుఁ జిన్నిపువ్వు, తులసీవనమందలి గదాధరునకుఁ

గోణిగి, కృశశౌవమందలి పాపహరునకుఁ దెలియుట, శ్వేతగిరియందలి సింహాలోచనునకు వెన్నెల. ధర్మపురియందలి యోగానందునకుఁ గొల్వు మ్రొక్కు, శ్రీకాకుళమందలి తెలుఁగురాయనికి దండము, అహోబిల గరుడాద్రియందలి హిరణ్యాసురమర్దనునకు నమస్కారంబు, పాండురంగమందలి విఠలునకు సాష్టాంగంబు, యాదవపర్వతమందలి నారాయణునకు నమస్కృతి, ఘటికాచలమందలి నృసింహునకు నమోనమో, వారణగిరియందలి వరదునకుఁ బ్రణుతి, కాంచియందలి కమలలోచనునకు వందనంబు, యదోక్తస్థలమందలి యథోక్తకారునకుఁ బ్రణామంబు, పరమస్థలియందలి పరమేశ్వరునకు ముకుళితహస్తంబు పాండుభూస్థలి పాండవదూతకుఁ బ్రణిపాతంబు విక్రమస్థలిఁ ద్రివిక్రమునకుఁ బుష్పాంజలి కామాశియందలి నృసింహునకు సన్నుతి, అష్టభుజస్థలమందలి యష్టభుజున కానతి, ప్రవాళస్థలమందలి ప్రవాళవర్ణునకు వినుతి, దీపాభస్థలమందలి దీపాభున కంజలి, గృధ్రస్థలమందలి విజయరాఘవునకు శిరోనమ్రత వీక్షారణ్యమందలి శయానవీరరాఘవునకు శరణు, తోతాద్రియందలి తుంగశయానునకు నమోవాకంబు, గజస్థలమందలి గజార్తిఘ్నునకు శరణార్తి, బలిపురమందలి మహాబలునకు ఆరాధనంబు భక్తసారమందలి మహాజగత్పతికిఁ బూజ యింద్రస్థలమందలి దేవదేవునకు కైంకర్యంబు, గోపపురమందలి గోపపతికి సపర్య, అంతర్వేదివాసుండగు నారసింహునకు నమస్కారంబు, భద్రాచలమందలి కోదండరామునకు భద్రంబు, శోభనాద్రివాసుఁడగు సుబ్బరాయనికి క్షేమంబు, మంగళగిరి నరహరికి నిత్యసేవనంబు, శ్రీముష్ణమందలి యాదివరాహస్వామికి శుశ్రూష, మహితస్థలమందలి పద్మలోచనునకుఁ బరిచర్య, శ్రీరంగమందలి రంగస్వామికి నమస్య, శ్రీరామస్థలమందలి జానకీప్రియునకు నర్హణంబు, శ్రీనివాస స్థలమందలి పుణ్యమూర్తి కభిస్తుతి, స్వర్ణమందిరమందలి స్వర్ణస్వామికి సంస్తుతి, వ్యాఘ్రపురమందలి మహాబాహునకు స్తవంబు, యాకాశనగరమందలి హరికి స్తోత్రంబు, యుత్పలావతకమందలి శౌరికి వినుతి, మణికూటమందలి మణిప్రభున కభివాదనంబు, విష్ణుపురమందలి మహావిష్ణునకు దాస్యంబు, భక్తస్థానమందలి భక్తిప్రదునకు దిగ్విజయంబు, శ్వేతహ్రదమందలి శాంతమూర్తికి విజయంబు, అగ్నిపురమందలి మురద్విషునకు మంగళంబు, భార్గవస్థానమందలి భర్గునకుఁ గళ్యాణంబు, వైకుంఠమందలి మాధవునకు శుభంబు,

పురుషోత్తమమందలి భక్తిసఖునకు భవ్యంబు, చక్రతీర్థమందలి సుదర్శనునకుఁ గుశలంబు, కుంభకోణమందలి శార్ఙ్గపాణికి క్షేమంబు, భూతస్థానమందలి శార్ఙ్గస్వామికి శోభనంబు, కపిస్థలమందలి గజేంద్రవరదునకు నిత్యోత్సవంబు, చిత్రకూటమందలి గోవిందునకు సేమంబు, ఉత్తమ స్థలమందలి యుత్తమస్వామికి భద్రంబు, శ్వేతగ్రామమందలి పద్మలోచనునకు బరిణామంబు, పార్థస్థలమందలి పరబ్రహ్మునకు సేవ, కృష్ణకోట యందలి మధుద్విషున కభివృద్ధి, నందిపురియందలి మహానందున కీడితంబు, వృద్ధపురియందలి వృషాద్రిశయునకుఁ బనితనంబు, సంగమగ్రామమందలి సంగమస్వామికి రీతంబు, శరణ్యమందలి శరణ్యునకు జయ జయ, సింహక్షేత్రమందలి మహాసింహునకు సమ్మానంబు, మణిమంటప మందలి మల్లారి స్వామికి బహుకరణంబు, నిబడ మందలి నిబిడాకారునకు దక్షైదము, ధానుష్కమందలి జగదీశ్వరునకు లెంకల మయ్యెదము, మాహురమందలి కాలమేఘునకు బంటుల మయ్యెదము, మధురయందలి సుందరరాజస్వామికి భక్తిచేసెదము, వృషభాద్రి యందలి యళఘరికి దాసానుదాసుల మయ్యెదము: వరగుణస్థ, మందలి నాథస్వామినిఁ బ్రార్థించెదము, కురకయందలి రమాసఖుని భజించెదము గోష్ఠీ పురమందలి గోష్ఠపతి నుపాసించెదము, దర్భ సంస్తరణమందలి శయానస్వామి నాశ్రయించెదము, ధ్వని మంగళక స్థలమందలి శౌరినిఁ గీర్తించెదము, భ్రమరస్థలమందలి బలాఢ్యునిఁ గొల్చెదము. కురంగ స్థలమందలి పూర్ణస్వామి మమ్ము రక్షించుఁగాత, వటస్థలమందలి విష్ణుండు మదీప్సితంబు లొసంగుఁ గాత, క్షుద్రనది యందలి యచ్యుతుండు మా దృశుల దయాదృష్టి వీక్షించుగాఁత, అనంతశయనమందలి పద్మనాభుండు మత్తనువులు పావనత్వ మొంద సమకూర్చుఁ గాత, వేంకటశైలంబున శ్రీనివాసస్వామివై నూటయెనిమిది దివ్యతిరుపతుల యందు నిన్నిరూపుల వెలయుచున్న నీకు ననంతనమస్కారంబు లని పొగడి

కరిమేష మహిషనృమకర
హరిణహయ వృషగతి యుతులు హరికయమనరా
ద్వరుణక ధన్యులు నగు తో
మరిదండ్యుదశిగుణికేతు మద్గతి శూలుల్

నిజాంఘ్రి సేవకు లగుట నాదేవతలమీఁద న్నాదరమేదురంబైన తన వచనంబు వారల కంధంబుగా

యమరప కుశలమె యనల శు
భమె శమన సుఖంబె నిరృతి భద్రమె వరిణా
మమె జలపతి మంగళమె ప
వమాన భవ్యమె కుబేర స్వాగతమె హరా

యని కటాక్షమ్ముల నాలోకించి తదావాసమ్ముల కనిచి వారివారి కవ్వారిగా సేవయు సంపద లొసంగి రమాసంగి యంత నందలంబుడిగ్గి గరిమందిరంబైన యానందమందిరంబుఁ బ్రవేశించి క్రొమ్ముత్యాలజాల మేలితమ్మి కెంపుమానికపు జగడంపు బోగడల నిగుడి విడంబించు పగడంపుఁ బట్టెల నిచ్చలపు పచ్చల గచ్చున హెచ్చుకట్టాణి ముత్తియంపుఁ జేరుల యోరలఁ జాచిన కప్పురాలదిండు తండంబుల దంబైన పిల్లికన్నులఁ బోలిన రతనంపు పీఁట నడుచక్కిఁ జెక్కిన చుక్కకెంపుటోవరాల నిగనిగల దెగడు నాలకడుపున బొడము పసుపువన్నియ చెన్నగుచున్న నెలజాల రవల రవణంపు తూఁగుటుయ్యేల నలరు టలరుపై నెలకొన్న యన్నుఁదల మిన్నతోఁ గూడ నధివసించి కస్తూరి గంబూర చాఁదు జవ్వాది యగరు పన్నీరు తట్టుపునుంగు శ్రీగంధంబు లనియెడు యష్టగంధంబు లలందిన దివ్యమంగళ విగ్రహుం డాభోగభోగంబు లనుభవించి ప్రతిదినహేవాక మహోత్సవ సముత్సుకుండై సకలలోకపాలనపరాయణుం డగుచు వెలయు శ్రీవేంకటేశ్వరు కరుణాకటాక్ష వీక్షణంబుల సకల కల్యాణ సమేతంబగు భక్త జనవ్రాతం బిట్లని స్తుతియించె.

(పైవచనమున గర్భిత కందద్వయము గనుపడుచున్నది. పూ. రా.)

## పంచరత్నములు

సీ. శ్రీమించు బంగరు చిఱుగజ్జె లడుగులు
  వరదకరము కటివామ పాణి
పీతాంబరమ్మును పిడెము పొక్కిటి తమ్మి
  విశ్వంబులిరు బొజ్జ వెడఁదయుర్థమ్ము

చెంగట నలమేలుమంగ శ్రీవత్సంబు
            శంఖచక్రాంక హస్తద్వయంబు
భుజకీర్తులును గళంబున తులసీదళ
            మాలిక వీనుల మకరకుండ

గీ. లములు నునుమోవి చెక్కులు కొమరుముక్కు
తీరు దయలీను కన్నులు తేటయగు మొ
గము కిరీటంబుగల మిమ్ము గంటి మిపుడు
జలజహితధామ వేంకట శైలధామ. 881

సీ. తోమని పళ్యాలతోడ చేటెడు బియ్య
            ము పసాదము మెసంగు ముదుగుఁ దలఁచి
యెద్దెల బెదరించి యొడ్డికాసులతోన
            కానుక ల్గొనెడి యాగడముఁ దలఁచి
శ్రీవైష్ణవాగ్రణి సేయు కుళమునకు
            మనుమోయు నంబేదతనముఁ దలఁచి
తనయంత కులకాంత నెనసియు వేఱొక్క
            మగనాలిఁ గైకొన్న యగడుఁ దలఁచి

గీ తాళనే యలమేల్మంగతాయి యిన్ని
దలఁచియే కాదె యనఁటి బొందెలను నీకు
బుద్ధి జెప్పించె బెండ్లిలోఁ బద్దుమీఱి
జలజహితధామ వేంకటశైల ధామ. 882

సీ మునుపుగా నెంగిలిఁ దినిపించు శబరికిఁ
            దండ్రివై నేరము ల్దలఁచి మనుప
నెన్నలొసంగిన యెఱుకలగమికాని
            కేమొదువేఁ గోర్కెలెల్ల నొసఁగఁ
బడి తరంబులు కొంచపఱచి సొమ్ములు నాచు
            పాదుషా నీసరి పాలివాఁడె
చూఱగా సీమంత పారుపత్యము సేయు
            వాఁడు నీకును జెలికాఁడె తలఁప

గీ. వారియేలిక పీవొ నీవంటి వేల్పు
వేఱొకఁడొ తెల్పవే కొల్పు వెదకవలయుఁ
దప్పులెన్నక రక్షించుదాత నొకని
జలజహితధామ వేంకటశైలధామ. ౮౮౩

సీ. అతులితోన్నత తిరుపతి పరిపాలన
విభవోన్నతుండవై వెలసి కాక
యేరిని నేరుపు నేరంబు లెంచక
నుభయలోకసుఖంబు లొసఁగి గాక
మహిమ యలర్మేలుమంగ యిల్లాలుగా
మును నోచు పుణ్యావాసనుగాక
చేఁదోడువాఁదోడునై దయ నెవరు బి
ల్చినతోడ మాటలాడననె గాక

గీ. దేవుఁడ నటన్న నూఱక తీఱునెట్లు
చెల్లఁబో నీకు నొకనికిఁ జెల్లుఁగాక
తండ్రి పీవలమేల్మంగ తల్లి మాకు
జలజహితధామ వేంకటశైలధామ. 884

సీ. ఆగమాంతార్థ రహస్యమావాలంబు
ప్రణవంబు కూఁకటి బలిమివేరు
పెనుమొదల్ భువన మోహనమైన కాయంబు
కరచతుష్టయము శాఖాచయంబు
వనమాలికయుఁ బల్లవశ్రేణి కౌస్తుభ
ము సుమంబు వినువాఁక పువ్వుదేనె
పయినల్లు లేఁత తీవియ యలమేల్మంగ
భక్తులఁ బ్రోచుట ఫలముగాఁగఁ

గీ. గలుగు నీపేరవెలసిన కల్పకంబు
నా మనంబను నందనారామసీమ
పాదుకొనుగాక సకలవైభవ సమృద్ధి
జలజహిత ధామ వేంకట శైలధామ. 885

## ఫలశ్రుతి

క. ఇది వేంకటేశు పేరిట
నొదవించు విలాస మెవ్వరొక దినమేనిన్
చదివిన వ్రాసిన వినినను
మదికోర్కులు సంఘటించు మనుజులకెల్లన్. ౮౮౬

చ. గణపవరాన్వయంబు నిధి కైరవబాంధవుఁ డప్పనార్యు ల
క్షణకవి వేంకటార్యమణి సంతతశోభన కీర్తి సంతతుల్
గణనకు నెక్క వేంకట నగప్రభు పేర నొనర్చె సత్కవి
ప్రణుత విలాసరాజము ధరన్ దగనా విధు తారకంబుగన్.

—: సంపూర్ణము :—

